చందా సం॥ కు రూ. 3. విడిసంచిక అ. ౮.



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక

రెండు నెలల కొకసారి ప్రకటింపబడును.

**(Journal of the Telugu Academy.)**

సంపుటము ౧౨. { రుధిరోద్గారిసంవత్సరము. చైత్ర వైశాఖమాసములు. } సంచిక ౧.

## ప్రధానవ్యాసములు.



చెన్నపురి. ౧౯—౨౩.

# విషయసూచిక.

---

విషయములు. పుటలు.

# పరిషత్పత్త్రిక.

సంపుటము ౧౨. | రుధిరోద్గారినామసంవత్సరము చైత్రవైశాఖమాసములు. | సంచిక ౧.

## విజ్ఞాపనము

పరిషత్పత్త్రికకుఁ బదునొకండువత్సరములు గడచినవి. పండ్రెండవసంవత్సరము ప్రారంభమైనది. అనేకకారణములచే ననేకులు చెప్పుకొనుచున్నట్లు ఈపత్త్రిక సకాలమునకు వెడలుటలోఁ బ్రతిబంధకములు దేశకాలవిశేషములచే గలుగుచున్నవి. పరిషత్పత్త్రికాపాఠకుల కొందఱయాదరముచే నింతవఱకు జరపుకొనివచ్చుచున్నారము. ఎంతటివారు పూనికొనినను దటస్థులగుచున్నారని [illegible]కొనుచున్నట్టులు భాషాభిమానులగు పాఠకుల యనాదరము దీని యాపదలన్నిటికిఁ గారణములలో నొకటి యని చెప్పకతప్పదు. వారువారు పంపవలసిన ధనము [illegible] గోరినను బంపరు. వ్రాసిన యుత్తరములకుఁ బ్రత్యుత్తరములు నొసఁగరు. మీరు సొమ్మీయకున్న మీపేరు తొలఁగింతు మన్నను మిన్నకుందురు. [illegible]గాని మాకుఁ బంపుఁడు, పంపవల దని యొక్కముక్క వ్రాసిన నెంతయో సంతోషము నొందుదుము. కోమటులు పాలకడవ సామ్యముగా నున్నది. అనుకొనిన రీతిగాఁ బత్త్రికను వృద్ధిచేయుటకుఁ బాఠకమహాశయుల ప్రోత్సాహము చాలఁ దక్కువగానున్నది. సరస్వతి లక్ష్మివంటి ధనికురాలు కాదు. మీరీయవలసిన సొమ్ము మీయొద్దఁ బెట్టుకొనిన నెన్నినాళ్లు గడపికొనును; మీరు నమ్మకమైనవారే, మీయొద్ద సొమ్మే దాఁచుకొన్నట్లే కాని కాలక్షేపమునకుఁ గొంచెము కొంత యైనఁ బంపరాదా. మే మెంత యీయవలసియున్న దని దె

జాబు వ్రాసి కనుఁగొనరాదా. జాబునకు బదులు వ్రాయరాదా. ఈవిజ్ఞాపనము చదివిన పిమ్మటనైన మీమీ పైకమును దయచేసి పత్రికకుఁ బ్రోత్సాహము కలిగింపుఁడు. ఈపత్రిక నందుకొని సొమ్ము పంపనిపాఠకులకు ముందు పత్రిక పంపఁబడదు. మీరుమీరు పంపవలసిన మొత్తములను సూచించెదము. దయయుంచి వానిని శీఘ్రముగాఁ బంపినచోఁ బత్రికను స్వల్పకాలములోనే సకాలమున వెలువడునట్లు చేసెదము. పాఠకుల కుత్సాహము లేకున్నఁ బత్రికలు వెడలి యేమిచేయఁగలవు. ఈవిషయమునే సభ్యులు కూడఁ దమపరముగాఁ గొంత అర్థముచేసికొనుటకై కోరుచున్నారము.

ఈసంపుటములో నార్యభాషావిభాగము, నారసింహపురాణము ముగించుటకు యత్నించెదము. ఎవ్వరియొద్దనైన హరిభట్టు నారసింహపురాణ మున్నచో సంప్రతించుకొనుట కొక్కసారి పంపినయెడల ముద్రితప్రతితోఁగూడ వారి మాతృక వారికిఁ బంపెదము.

భాషాభిమాను లగుపుస్తకభాండాగారాధిపతులు మాయొద్ద దొరకుగ్రంథముల నొక్కొక్కప్రతిని దమభాండాగారమునకుఁ దెప్పించుకొని సాయపడుదురని మఱిమఱి కోరుచున్నాము.

పరిషత్పత్రిక వెనుకటిసంపుటములు 2, 7, 8, 9, 10, 11-లు సంపూర్ణముగాఁ గొన్నిప్రతులు మాత్రమే కలవు. ఆలసించిన నవియుఁ బాఠకులకు దొరకవు. త్వరలో వానిని రప్పించుకొనుటకు యత్నింపకున్నఁ దక్కినసంపుటములవలెనే యసంపూర్ణములగును. ఉన్నవఱకైన సంగ్రహించికొని యుంచుట లోకోపకారకము గదా! ప॥ అ॥

శ్రీరస్తు.

# హైందవధర్మశాస్త్రములు.

మహాశయులారా!

శ్రీపరమేశ్వరేచ్ఛాప్రభూతం బగునీప్రపంచమందు ధర్మార్థకామమోక్ష రూపచతుర్వర్గఫలప్రాప్తి కాశ్రయం బగుమనుష్యజాతి భూతసర్గంబునకెల్ల నుత్తమంబని యార్యులు వచింతురు. దేవతలకుఁ గర్మాచరణము లేక కేవలఫలానుభవ మాత్ర ముండుట పురాణప్రసిద్ధ మగుటంజేసి వారి కీచతుర్వర్గముతోఁ బనిలేదు. పశుపక్ష్యాదులకు జ్ఞానరాహిత్యమునను నవయవసామగ్రీవైకల్యమునను వానికిఁగూడఁ జతుర్వర్గసాధనము సమకూరదు. అన్నిటికి సమర్థ మగునది యొక్క మనుష్యజాతి మాత్రమే యని విశద మగుచున్నది. ప్రప్రథమమున మనుజులు గూడఁ బశుపక్ష్యాదులుంబలె ధర్మాచరణము లేక యథేచ్ఛముగఁ బ్రవర్తించియుఁ గాలక్రమమునఁ దమకు భగవత్ప్రసాదితం బగుజ్ఞానంబు బలిమిచేఁ దమప్రపంచయాత్ర కనువగు కొన్నినిబంధనముల నేర్పాటుచేసికొని, వానిని గ్రంథరూపమున వెలయించి రనియు, నవియే యిపు డున్నమనధర్మాదిశాస్త్రము లనియుఁ జరిత్రములు చెప్పుచున్నవి. వేదములం దీధర్మాదిశాస్త్రములకు మూలసూత్రంబు లగపడుచున్నవి. వేదములం దున్నమూలసూత్రముల ననుసరించియే మహర్షులు తమతమకాలములం దుండుజనుల యిష్టానిష్టముల ననుసరించి వేర్వేఱ ధర్మశాస్త్రము, అర్థశాస్త్రము, కామశాస్త్రము, మోక్ష (వేదాంత) శాస్త్రము ననుశాస్త్రముల విపులముగ రచించిరి. చతుర్వర్గమున నర్థకామములు రెండు నీజన్మంబున నుపకరించును. మోక్షము శరీరావసానమున, ననుభవింపఁబడును. ధర్మ మన్ననో యిపుడు నపుడుఁ గూడ నుపకరించుటయె కాక మిగిలినమూఁడిటికిఁ దానే కారణము కూడ నయి యున్నది. ధర్మరహితున కర్థకామము లుండవు. దైవికముగ నున్నను రాణింపవు.

అధర్మపరునకు మోక్ష మతిదూరము, ధర్మాత్మున కనపేక్షితము లయ్యు నర్థకామములును మోక్షము నవశ్యంభావు లని యార్యు లందురు. కాన ధర్మ మన్నింటికి నుత్తమోత్తమము. ఈయూహాముతోడనే మహర్షులు ధర్మశాస్త్రము

లనుపేరు గలగ్రంథములందు విపులముగఁ బురుషార్థచతుష్టయము నుపవర్ణించి యుండిరి. కొందఱు మహారాజులు ధర్మమును నాల్గుపాదములతో నడిపించి రని పురాణములందు వినఁబడుచున్నయది. అందు నాల్గుపాదము లనఁ బురుషార్థ చతుష్టయ మనినయర్థము సమంజసముగాఁ దోఁచుచున్నయది.

ప్రకృతకాలమున రాజకీయనిబంధనము లగుధర్మశాస్త్రములందుఁ గేవ లము నర్థకామముల సంబంధించిన విషయములు మాత్ర మగపడుచున్నవి గాని యితరవిషయము లగపడవు కావుననే వానియందు జనానురాగము భయము నను స్వార్థపరత్వముచేతనే కలుగుచున్నది కాని స్వేచ్ఛాప్రవృత్తము గాలేదు. హైందవధర్మశాస్త్రములం దన్ననో భయము గాని కేవలసుఖాపేక్ష గాని జనా కర్షణహేతువులు గానేరవు. కావుననే చిరకాలమునుండియు మనధర్మనిబంధన ముల యధికారము రాజకీయముగఁ గాకున్నను నవ్యాహతముగఁ గొందఱువు హానీయుల హృదయసీమలం దాంతరాత్మికముగ రాజిల్లుచున్నది. ఇంతటియుత్కృ ష్టము లగుమనధర్మశాస్త్రములం దనేకుల కాదర ముండకుండుటకుఁ గాలవైపరీ త్యము వక్క వేఱొండు కారణ మగపడ దనుట వింత కానేరదు.

ప్రకృతమున ధర్మశాస్త్రముల నాదరించుమహానుభావు లైన నెంతవఱకు వాని నాచరణమున వినియోగించుచున్నారో చూచెదము గాక. మనధర్మశాస్త్ర మునందుఁ జతుర్వర్గము నిమిడియున్న దనిచెప్పియుంటిని ఎచ్చట నో కోటి కొకరు మోక్షకాంక్షు లుందురు. అర్థకామముల ననుభవించువారు ప్రకృత రాజకీయనిబంధనముల నాలోచింతురు గాని మనప్రాచీనపుస్తకముల మదిలో నైనఁ దిలకింపరు. కొందఱు మాత్ర మర్థకామములకు సంబంధము లేనట్టియు నించుక మోక్షమునకు సంబంధించినదియు నగుశుష్కధర్మమునం దాచరణము నగపఱుచుచున్నారు.

ఈలేశ మైనను దైవదోషమున మనయాంధ్రదేశమున లేదు. ఇపు డాచరించుచున్న ధర్మ మెల్లవర్ణాశ్రమాచారములకు సంబంధించిన కర్మరూపమై యున్నది. కర్మభూమి యగుమనయార్యావర్తదేశమున నీపాటిదైన ధర్మము మిగిలియుండుట ముదావహమే.

ఈకర్మములలో నైతేము గొన్ని పారలౌకికములు గొన్ని యైహికములు నై యున్నవి. వానిలోఁ బారలౌకికములు యాగాదులు చాలవఱకు కస్తమిం చిన వని చెప్పవచ్చును. ఇఁకఁ గొన్నిమాత్ర ముపనయనాదులు మిగిలి యు న్నవి. ఉపనయనాదులు గూడ నదృష్టఫలకము లనియే మనలో ననేకులు

తలంచుచున్నారు. కొందఱు ఫలవిషయమున నిదమిత్థ మనునిర్ణయము లేక యున్నారు ఇట్టితఱి నీభాగముగూడ నంతరించిన దని చెప్పవలసినదే కదా? ఏల యుక్తమోత్తమము లనుచు నశేషజనము వర్ణించుచున్నను వాని నాచరింప కున్నారు? ధర్మార్థకామమోక్షముల వలనఁ బారలౌకికసుఖముకంటె నైహికసుఖమే యధికముగ, లభించు ననునభిప్రాయమును గనుఁగొనకపోవుటవలన!——

ఇఁకఁ బ్రసక్తానుప్రసక్తముగఁ బురుషార్థములవలన నైహికసుఖ మెంతకఁ దో విచారింతము. అర్థకామములను, శాస్త్రానుసారమున సేవింపకున్న వాని యప్రాప్తియో లేక విపరీతఫలప్రాప్తియో జనించునుగదా!

ఇంతియె కాక వాని నశాస్త్రీయముగ సేవించువానికి జననిందయు రాజదండము నవశ్యంభావులే. నరకము లప్రత్యక్షములు గాన వానిచింత మనకు వలదు. మోక్ష మనఁగా దుఃఖహేతువుల నెల్లఁ బరిత్యజించి కేవలానందము ననుభవించుటయే యని పరమార్థముగదా? ఆనందమును వీడి దుఃఖ మనుభవించువాఁడు నుండునా?

మోక్షము పారలౌకిక మనుట ప్రసిద్ధమే కాని యైహికానంద మఖండమైనచో నది బ్రహ్మానందమునకు నాతిభిన్నము కాకపోదు. ఇట్లు పురుషార్థముల నెల్ల నైహికముగ సమన్వయించుట గ్రంథవిస్తర మగును గాన నుపనయనాది సంస్కారముల కైహికప్రత్యక్షఫలప్రదత్వమును జూపి విరమించెద.

ప్రాతఃప్రబోధము:——మనధర్మశాస్త్రములందు బ్రాహ్మముహూర్తమున నిద్రనుండి మేల్కొనవలయు నని యొకనియమము గలదు. బ్రాహ్మముహూర్త మనఁగా సూర్యోదయమునకు ముందు నాలుగుగడియలకాలము. దానియందు మేల్కొనుట సర్వవర్ణములవారికిని సర్వాశ్రమములవారికి నత్యంతహితకరమును నత్యావశ్యకము నని ధర్మశాస్త్రములు వక్కాణించుచున్నవి.

శ్లో. "బ్రాహ్మే ముహూర్త ఉత్థాయ ధర్మార్థౌ చానుచింతయేత్।
కాయక్లేశాంశ్చ తన్మూలాన్ వేదతత్త్వార్థమేవచ॥　　(మనువు.)

శ్లో. "కాయక్లేశం తదుద్భూతం ధ్యాయీత మనసేశ్వరమ్। (పరాశరుఁడు.)

శ్లో. "బ్రాహ్మేముహూర్త ఉత్థాయ మానసే మతిమాన్ నృప।
విబుధ్య చింతయే ద్ధర్మ మర్థం చాప్యవిరోధినమ్॥ (విష్ణుపురాణము.)

పైరీతిని మన్వాదులే కాక గౌతమాపస్తంబాదులును బ్రహ్మముహూర్తమున లేవవలయు నని వక్కాణించియున్నారు. వీ రిట్లు బోధించుట కేమి

హేతువో విచారింతము. మను పరాశర విష్ణుపురాణముల వచనములందుఁ గేవలము లేచుటయే కాక ధర్మార్థచింతన మాచరింపవలయు నని కలదు. కావున నెల్లరు నట్లాచరింపవలసినదే. లోకము మూఁడుపాళ్లధర్మపరము ననర్థకము నగుటచే నీశాస్త్రమును నిరాకరించినది. కాని వారిసూక్తుల నేరును బాగుగ విమర్శింపలేదు. పైవాక్యములందుఁ గాయక్లేశ మొనరింపవలయు ననునొకయుక్తి ముక్తాఫలము గలదు. దానిని వా రెందు కుపదేశించిరో చూడుఁడు.

వారివాక్యములం దారోగ్యరక్షణము ముఖ్యముగా నుపదేశింపఁబడినది. "శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్" శరీరమున్న నెల్లధర్మములు సాధింపనగును. అది నష్టమైనను వ్యాధిదుష్టమైనను నేపనియు సాగదు. కావునఁ బ్రథమమునఁ బ్రాతఃకాలమున లేచి శరీరవ్యాయామ మొనరించిన భుజించినపదార్థరసము మథితమై సార మగురక్తము నాడికలమూలమున శరీరమెల్లఁ బ్రవహించి జీవితమును బోషించును. దాని నుపేక్షించినయెడ నన్నరస మొకప్పుడు రక్తరూపము నొందక వ్యాధి నాపాదించును. కావుననే ధర్మశాస్త్రకారు లంతనిర్బంధము చేసియున్నారు. ఈవిషయమున నాయుర్వేదాచార్యుఁ డగువాగ్భటుఁ డెట్లు చెప్పెనో చూడుఁడు.

శ్లో. "బ్రాహ్మేముహూర్త ఉత్తిష్ఠేత్ స్వస్థో రక్షార్థమాయుషః।
శరీరచింతాం నిర్వర్త్య కృతశౌచవిధి స్తతః॥ (అష్టాంగహృదయమ్.)

ఆయూరక్షణము గోరువాఁడు బ్రాహ్మముహూర్తమున లేచి శరీరచింత నెఱవేర్చి శౌచాదుల నిర్వర్తింపవలయు నని వాగ్భటుఁ డుద్ఘటముగ ఘోషించుచున్నాఁడు.

పైధర్మశాస్త్రకారుల వచనముల నధర్మపరులై యంగీకరింప కున్నను దమ శరీరము నైన రక్షించుకొనవలదా? ఆయువు నశించినపిదపఁ జేయుపని యేమి? ఈవిషయమునే ఆంగ్లవైద్యులు గూడ ప్రాతర్యాత్ర (morning walk) అను పేరిట నారోగ్యరక్షణమున కొకచికిత్సను బ్రబోధించుచున్నారు.

ప్రాతస్స్నానము:—కల్యకృత్యములందు స్నాన మొకటి ముఖ్యమైనది. స్నానము చేయక యేధర్మకార్యమును జేయరాదు. ప్రతికర్మకును మొదట "స్నాత్వా, ఆచమ్య" అనుపదము లుండును. కాని మనవారు కర్మ లెట్లు బహిష్కరించిరో యట్లే స్నానమును విసర్జించుచున్నారు. ఇది మిగుల నన్యాయ మగునది. పద్మపురాణమునందు—

శ్లో. నైర్మల్యం భావశుద్ధిశ్చ వినా స్నానం నజాయతే।
తస్మాన్మనోవిశుద్ధ్యర్థం స్నాన మాదౌ విధీయతే॥

అనియు మఱియు నితరధర్మనిబంధనములందు

శ్లో. "తతో నదీం సమాగమ్య గంగాధ్యానపురస్సరమ్।
నాభిదఘ్నజలే స్థిత్వా త్రివారం స్నానమాచరేత్
నిరుద్ధకర్ణనాసస్తు త్రివారం మజ్జనం చరేత్
త్రిరాచమ్య సమాప్లుత్య శిఖాంబద్ధ్వా సమాచమేత్॥
ప్రాణానాయమ్య సంకల్ప్య త్రివారం మజ్జయేత్పునః।

అనియుఁ జెప్పఁబడియున్నది. పై ధార్మికు లిట్లు నిర్ణయించుటకు హేతువు కేవల మైహికమైన యారోగ్యమును గోరియే యని విశద మగుచున్నది. ఏల యన, నీటియందుఁ బ్రాణశక్తి యమితముగ నున్నది; విద్యుచ్ఛక్తి యున్నది.

కావున స్నానముచే నాయువు వృద్ధిపొందును. వేదమునందు "ఆప యావీ చిస్వీత, ఆపోవై భేషజం, భేషజమేవా స్మైకరోతి సర్వమాయురేవ" అని కలదు. ఈయర్థమునే యాయుర్వేదాచార్యు లిట్లు వివరించిరి.

శ్లో. "దీపనం వృష్య.మాయుష్యం స్నాన మూర్జో బలప్రదమ్
కండూమలశ్రమస్వేదతంద్రాతృడ్దాహపామజిత్" (వాగ్భటుఁడు.)

శ్లో. "స్నానం సర్వాంగశుద్ధి ర్మలినశుచికరం దేహకాంతింకరోతి
కండూఘ్నం స్వేదహారి శ్రమకరణహరం పైత్యదాహాదిమేహాః.
దీప్తాగ్ని ర్ధాతువృద్ధి స్సౌఖకర మమలం స్తంభకృత్పావనంచ
నానారోగోపశాంతి ర్హితకరణకరం చిత్తశుద్ధింకరోతి॥ (చరకుఁడు.)

శ్లో. "అస్నాతస్య శరీరస్య వహ్ని స్సర్వాంగగోచరః
స్నానేనైకత్వమాపన్న స్తస్మా త్స్నానం సమాచరేత్॥

అనఁగా స్నానమువలన శారీరికమానసిక సర్వేంద్రియదార్ఢ్యమును సర్వవ్యాధిప్రశాంతియు లభించును. ఇంతియకాక రాత్రి నిద్రాకాలమందు రక్తప్రవాహముతోఁ గూడ శరీర మంతటను వ్యాపించిన వహ్నిరూప పిత్తము స్నానమువలన స్వస్థానమందుఁ బిండీకృతమై భుక్తపదార్థములను బచించును. దీనివలన నేరోగములును దరికి రాఁజాలవు. ఇట్టిప్రాతస్స్నానమును విడుచుట యక్రమమే కదా?

దివాస్వాపము:—పగలు నిద్రపోరాదని ధర్మశాస్త్రములం దెల్ల వినఁబడుటయే కాక యాబాలగోపాలమునకును గూడ బాగుగఁ దెలిసినవిషయమే.

కాని యాచరణమునందు మాత్ర మెవరో కాని యుంపలేదనుట యు వాస్తవము. పగటినిద్రవలన మనకు ధర్మలోపమే కాక యారోగ్యమున కత్యంతము హానికల దని నుడివినపు డెందఱునములు విహ్వాలము లగునో? పగలు నిద్రించుట సౌకు మార్య మనియు నైశ్వర్యలక్షణ మనియు సుఖకర మని యు నెంచువా రెందఱో యుందురు. వార లీక్రిందివాక్యములు గమనింతురు గాక!

సూ. వికృతిర్హి దివాస్వప్నో నామ, తత్రస్వపతా మధర్మ స్సర్వదోషప్ర కోపశ్చ, తత్ప్రకోపాచ్చ కాసశ్వాసప్రతిశ్యాయశిరోగౌరవాంగమర్దారోచకజ్వ రాగ్నిదౌర్బల్యాని భవన్తి. (సుశ్రుతుఁడు.)

దీనిలోఁ జెప్పఁబడిన యొడలినొప్పులు, తలబరువు, రొంప మొదలగు వ్యాధులు తఱచుగ నెల్లరకు ననుభూయమానములే యైనను దివాస్వాపమును మాత్రము వీఁడజాల కున్నారము. ఇది కడు శోచ్యము?

జాతకర్మ.—ఇఁకఁ బైని ద్విజత్వాపాదకము లగుసంస్కారవిశేషములఁ గూర్చి కొంత ముచ్చటించుకొందము. సంస్కారముల కెల్ల గర్భాధానసంస్కా రము ముఖ్య మనుతలంపున నదియే ధర్మశాస్త్రములందును జ్యోతిశ్శాస్త్రమం దును నాయుర్వేదమందును మొదటఁ జెప్పఁబడినది. అయినను నొండొకకా రణమున జాతకర్మాదిగ నే నిపుడు విమర్శించుచున్నాఁడను. దానికి విజ్ఞులు మన్నిం తురుగాక! "జాతమాత్రస్య యత్క్రియతే కర్మ తజ్జాతకర్మ" శిశువు జనించిన వెంటనే చేయుకర్మ గావున జాతకర్మ నాఁబడును. ఈకర్మముచే సంస్కరింపఁబడని శిశువు నకు ద్విజత్వము సిద్ధింప దని మాత్రమే ధర్మశాస్త్రములందుఁ జెప్పఁబడినది. కాని యిందలి హోమాదులుమాత్రము కేవల మాయురక్షణమునకుమాత్రమే యుపయోగించునవి. జాతకర్మ సంకల్పముగూడ "అస్యకుమారస్య గర్భాం బుపానజనితదోష నిబర్హణాయు ర్మేధాభివృద్ధి బీజగర్భసముద్భ వైనోనిబర్హణ ద్వారా" అని యారోగ్యరక్షణమునే బోధించుచున్నది. దీని కనుకూలముగఁ బ్రధానక్రియలు రెండు గలవు. ఏవన: మధుసర్పిః ప్రాశనము, ఫలీకరణహో మము, ననునవి. మొదటిదానివలన గర్భాంబుపానమువలనఁ గలిగినకఫోద్రే కము నశించును. రెండవదానివలనఁ గ్రిమికీటకాదులు నశించుటయే గాక చర్మ శుద్ధియు శిరశ్శుద్ధియుఁ గల్గును. దీని నాయుర్వేదాచార్యు లిట్లుపదేశించిరి. "తిలాతసీసర్షపకణాంశ్చ ప్రకిరేత్, అధిష్ఠానే చాగ్నింప్రజ్వాలయేత్, వ్రణితో పాసనం చావేక్షేత." (సుశ్రుతుఁడు.)

# హైందవధర్మశాస్త్రములు.

'ద్వాభ్యాం దర్భేణ నిష్పర్క్యం బద్ధసువర్ణేన ఘృతయుక్తం మధు కుమారం సకృ త్ప్రాశయిత్వా" (సింగాభట్టీయధర్మశాస్త్రము.)

"తస్మాత్ ప్రథమే హ్ని మధుసర్పిరనంతామిశ్రం మంత్రపూతం త్రికాలం పాయయేత్" (సుశ్రుతుఁడు.)

ఈప్రకరణమునఁ జరకాచార్యుఁడు మిగుల విస్తరముగఁ జెప్పినాఁడు. ఇప్పటికిని బల్లెటూళ్లయందు శిశువునకు నీరార్చిన వెంటనే సాంబ్రాణి, యల్లిపొట్టు, భూతులసి, తవుడు, ఆవాలు, నూనెలను గలిపి ధూపము వేయుట యాచారముగ నున్నది. కాని జాతకర్మసంస్కారము మాత్ర మంతరించి యుపనయన కాలమందే చేయఁబడుచున్నది. ధర్మశాస్త్రములం దాయుర్వేదానుసారముగనే నాభినాళచ్ఛేదముతోఁగూడనే జాతకర్మ చేయవలయు నని చెప్పఁబడినది. కాని మనవారు గతజలసేతుబంధనముం బోలెఁ గాలము నతిక్రమించి సంస్కరించుట నిష్ఫలమే యనక తీఱదు.

నామకరణము:—వర్ణక్రమము ననుసరించి శర్మ వర్మ గుప్త దాసాఖ్యపదాంతములు గా నామముల నొనర్పవలయు నని ధర్మశాస్త్రకర్త లెల్లరుఁ జెప్పియున్నారు. అట్లొనర్చిన "ఏవంకృతే శుచి తత్కులం భవతి" కులము పవిత్రమగు నని శంఖలిఖితులు ఫలమును జూపిరి. కాని యంతమాత్రమే కాక యీపదములకు నాకాలపు వర్ణవ్యవస్థకును సంబంధ మధికముగఁ గలదు. శర్మ యన సుఖము. శర్మపదము బ్రాహ్మణుని పేరిచివర నతికించిన నాబ్రాహ్మణుఁడు సుఖకర్త యని కాని సుఖభోక్త యని కాని యర్థ మగును. కాని మొదటియర్థమే వాస్తవ మనఁదగును. పుట్టిన దాదిగ నడవులందే నివసించుచు నాకలములు దినుచు నిరాహారు లయ్యుఁ దపము లొనర్చి విద్యల నార్జించి బుద్ధిబలమునను దపోబలమునను దేశమున కనర్థములు రాకుండఁ గాపాడుట బ్రాహ్మణుని విధి యయి యున్నది. ఆకలము దినువనవాసికి సుఖవార్త దూరమే కావున రెండవయర్థము పొసఁగదు. కావుననే బ్రాహ్మణులను పూర్వు లంతగా గౌరవించెడువారు. ఇప్పుడు బ్రాహ్మణుల కెట్లాశర్మపద ముపచరించునో విమర్శింపుఁడు. ఇఁక వర్మ మనఁగాఁ గవచము. అనఁగా మనయొడలిని గవచ మెట్లు రక్షించుచున్నదో యట్లు రాజు జనులఁ బాలించువాఁడు. దానిచే వర్మపద మన్వర్థముగ నుండెడిది. క్షత్రపదము నట్లే క్షతాత్ - త్రాయతే, క్షత్త్రః - దెబ్బ తగులకుండఁ గాపాడువాఁడు. రాజన్యుల కీపద మెంతయుచితమో యోచింపవలయు.

గుప్త=రక్షింపఁబడువాఁడు. ఇది వైశ్యనామము. వైశ్యుఁడు సార్థవాహుఁడై దేశాంతరములతోఁ గ్రయవిక్రయవ్యాపారము జరపుచుండ వానివ్యవహారమునకు హాని రాకుండఁ గాపాడుట రాజు చేయుపని. రాజుచేఁ గాపాడఁబడువాఁడు గావున వైశ్యుండు గుప్తుఁడు నాఁబడును. ఇట్లే శూద్రునకు దాసుఁ డని పేరుకలదు, వానివృత్తి శుశ్రూష సేయుట-అనఁగాఁ గేవల మింటి పని సేయుటయే కాదు, రాజు చెప్పునేఁతలకు లోఁపడి యోధుఁడై దేశమును గాపాడుటయే శూద్రుని ప్రధానవృత్తి యని చరిత్రములు వాకొనుచున్నవి. ఆర్యులారా! ఇంతసార్థకము లై మనోహరము లైనబిరుదుల విసర్జించు టేటి న్యాయమో తిలకింపుఁడు. ఇంతియకాక యేనాఁడు చాతుర్వర్ణ్యము తన విహితనామములను దదనుగుణము లైనవృత్తులను విడనాడెనో నాఁటినుండియే మనయార్థికదుస్థితి సంభవించిన దనుట సాహస మగునా?

ఉపనయనము:—ఉపయన మనఁగా విద్యాభ్యాసారంభకాల మని ఫలితార్థము. ఈకర్మము బాలుఁడు గురువు చెప్పినవిషయమును గ్రహించి దానిని జ్ఞప్తియం దుంచుకొనుపాటి శక్తి గలుగు వయస్సునఁ జేయవలయును. ఈవిషయమునే సుశ్రుతుఁ డిట్లు పలికెను. "శక్తిమంతం చైనం జ్ఞాత్వా యథావర్ణం విద్యాం గ్రాహయేత్." ఈతలంపుననే వర్ణక్రమము ననుసరించి కాలనియమ మేర్పఱుపఁబడినది దీనియందు బాలునకు భిక్షాశనము, గురుశుశ్రూషణము, ఆశ్రమవాసము, విద్యాభ్యాసమును విధింపఁబడును. ఉపనీతుఁడై యథాశాస్త్రముగ విద్యాభ్యాస మొనర్చిన బాలునికి శరీరదార్ఢ్యము ధైర్యము సుఖానపేక్ష బుద్ధికుశలత కష్టసహత్వమును నలవడును. కావున నీకర్మవిశేషము కేవల ద్విజత్వాపాదకమే కాక భావిసంసారభరణోపదేశకము గూడ నగును. కాఁబట్టియే యిది మిగుల ముఖ్యకర్మగా నెల్లరచే నంగీకరింపఁబడినది. అయినను మన యిప్పటివారు మాత్ర మీకర్మమును గేవలము నాటకమురీతిని నిష్ఫలముగ నాచరించుచు దానివలని ఫలము నావంతయు నంద లేకుండుట కడుంగడు శోచనీయముగ నున్నయది.

వివాహము-గర్భాధానము:—ఏకర్మముల నెట్లు సన్న్యసించినను వివాహగర్భాధానముల విసర్జించినవారు మాత్ర మగపడ లేదు. కాని వీనియందుఁ గూడఁ గొంత శాస్త్రాతిక్రమణము గలదు. అది వయోనియమమును బాటింప మియే. పురుషుఁడు విద్యార్జనమును ముగించునటకు ముప్పది లేక యిరువది

యెనిమి దేండ్లవయ స్సగును. అపుడు వివాహము చేసికొనవలయును. ఈసం దర్భమున ధర్మశాస్త్రకారులు—

శ్లో. “త్రింశద్వర్షో వహేత్కన్యాం హృద్యాం ద్వాదశవార్షికీమ్
త్ర్యష్టవర్షో ష్టవర్షాంవా ధర్మేసీదతి సత్వరః॥

“పత్న్యధర్మార్థకామ్యప్రజాః ప్రాప్స్యతీతి” అని వక్కాణించియున్నారు. ఆయుర్వేదాచార్యులుగూడ నిట్లే—

సూ॥ అథాస్మై పంచవింశతివర్షాయ ద్వాదశవర్షవతీం పత్నీ ముద్వహేత్. (సుశ్రుతుఁడు.) చెప్పియున్నారు, కాని మనబహుశ్రుతులు మాత్రము పైని యమముల నుల్లంఘించి బొమ్మలపెండ్లి కావించుచున్నారు. గర్భాధానమును గూడ యుక్తకాలము రాకపూర్వమే ఋతుస్నాత కాకపూర్వమే లేకవ్యాధిచే బాల్యమున ఋతుదర్శన మైనంతమాత్రముననో జరుపుచున్నారు. దీనివలన నెంతహాని కలదో విచారింపుఁడు.

శ్లో. “ఊనషోడశవర్షాయా మప్రాప్తః పంచవింశతిమ్।
యద్యాధత్తేపుమాన్ గర్భం కుక్షిస్థ స్సవిపద్యతే।
జాతోవా నచిరం జీవే జ్జీవేద్వా దుర్బలేంద్రియః।
తస్మా దత్యంతబాలాయాం గర్భాధానం నకారయేత్. (వాగ్భటుఁడు.)

ఈయర్థ మనర్థకముగాక లోకమం దెల్లెడల ననుభూయమానార్థమే. పాశ్చాత్యవైద్యులు గూడ నీవిషయమునే ఘంటానాదముగ వక్కాణించుచు న్నారు. ఈవిషయముననే రజస్వలానంతరవివాహ సంస్కార ముదయించి నది. ఇట్టి ముఖ్యవిషయముననే మనము శాస్త్రముల నుల్లంఘించి నిర్మర్యా దగాఁ బ్రవర్తించుటయుఁ బ్రోత్సహించుటయుఁ దగ వగునా?

పుంసవనము:—ఇయ్యది మిగుల విచిత్ర మగునదియు నావశ్యకమగు నదియు నగు కర్మవిశేషము. ఇందలి విచిత్ర మేమన; గర్భస్థశిశువు పురుషుఁడు గావలయు నన్నను, స్త్రీ గావలయు నన్నను, దానికిఁ దగినక్రియలఁ బ్రయో గించుటయు, దానివలన నిష్టఫలము నందుటయును—పుంసవనపదమును, సింగా భట్టీయ మిట్లు వివరించినది. “అంతర్వత్నీ కర్మణా నేన సూతే పుమాంస మితి వనమ్ రూఢిమత్” అని. పుంపద ముపలక్షణముగ స్త్రీ పుంససాధారణవాచి యని యెఱుంగునది. ఈకర్మము చాల ముఖ్యమైన దని ధర్మశాస్త్రకారులు, చెప్పుటయే గాక యాయుర్వేదాచార్యులు గూడ నిట్లు నుడివియున్నారు.

శ్లో॥ అవ్యక్తః ప్రథమే మాసి సప్తాహాత్కలలీభవేత్
గర్భః పుంసవనాన్యత్ర పూర్వం వ్యక్తే ప్రయోజయేత్॥
బలీ పురుషకారోహి దైవమ ప్యతివర్తతే. (వాగ్భటుఁడు.)

దైవముకంటెఁ గూడఁ బురుషప్రయత్నము బలవత్తరము గావున గర్భము వ్యక్తపడకముందే తప్పక పుంసవనము జరిగింపవలయు నని దీనితాత్పర్యము. క్రియావిషయమును, ధర్మశాస్త్రకారులు పండ్లతోఁగూడిన మఱ్ఱికొమ్మను దెచ్చి యారసమును గర్భిణిచే నాసాద్వారమున గర్భపర్యంతముఁ బీల్పింపవలె నని చెప్పిరి. ఆయుర్వేదాచార్యులు వటశాఖయే గాక, లక్ష్మణపంజి, సహదేవి, విశ్వదేవి, శ్వేతబృహతీమూలముల రసమును గూడ నస్యము చేయవచ్చు నని చెప్పిరి. ఇట్లు ధర్మశాస్త్రాయుర్వేదముల ననుసరించి తదుక్తవిధుల నాచరించిన నిప్పు డెగపడుచున్న దత్తపుత్రులసంఖ్య తగ్గియుండునేమో.

సీమంతము:—పుంసవనము మనము జేరిగింపకున్నను సీమంత మనునొక కర్మమును మాత్రము జరుపుచున్నారము. ఈసంస్కారమునందు గర్భిణికి నఱచేయిమొదలు బాహుమూలమువఱకు గాజులు తొడిగించుటయే మనయాచారము. దక్షిణదేశమునం దింతియకాక నెత్తినిండ గంపెఁడుపూవుల బరువెక్కించుటకూడ నక్కడి కొందఱి యాచారము. కాని యీసంస్కారప్రయోజన మెవ్వరునుఁ దెలియకున్నారు. "కేశరచనావిశేషస్య ఉన్నయనం ఉత్తోలన మత్రేతి సీమంతోన్నయనమ్" (ప్రయోగపద్ధతి.)

"స్త్రీణాం కేశమధ్యరేఖావిశేష స్సీమంతః స ఉన్నీయతేఽ స్మిన్కర్మణీతి సీమంతోన్నయనమ్ (సింగాభట్టీయము)

కేవలము గాజులు తొడుగుట పూలుముడుచుటలే కాక యేదుపంది ముల్లు మేడిపుల్ల దర్భపుంజము నొకటిగాఁ జేర్చిన కుంచికతో నాభిమొదలు, పాపటవఱకు రాచి యాకుంచికను శిరస్సునందే యుంచి కట్టుట సీమంత మని శాస్త్రములు చెప్పుచున్నవి. ఆకుంచికయందు విద్యుచ్ఛక్తి కల దనియు నది నాభిని (గర్భోపరిబహిఃప్రదేశము) స్పృశించినపు డాశక్తి గర్భమునందుఁ బ్రవేశించి పిదపఁ దలలో నాకుంచిక యున్నంతకాలము గర్భమున కేయాపదలు రాకుండఁ గాపాడు ననియు నూహింప నగును. ఇంతియకాక శిరోజముల రెండుపాయలుగా విభజించి నడునెత్తి నౌషధప్రయోగము సేయుట స్వాస్థ్యరక్షణమున కవసర మని ప్రాతస్స్నానప్రకరణమున నుదాహరింపఁబడిన "కేశాన్

కృత్వా ద్విధాద్విజ'' అనువచనమువలనను దెలియనగును. కావున సీమంతము గర్భస్థశిశుసంరక్షణార్థమై యేర్పడిన దనుట స్పష్టము.

ఈపుంసవనసీమంతము లెప్పు డెప్పుడు జరప వలయు నని శంక యుదయించును. ధర్మశాస్త్రకారులలోఁ గొందఱు ౨-వ మాసమందు గర్భమునకవయవోత్పత్తి కాకపూర్వమే పుంసవనమును ౩-వ మాసమున సీమంతమును దప్పక సేయవలయు నందురు. కొందఱు విహితకాల మననుకూలమైనచో నెప్పుడైనఁ (దొమ్మిదవనెలమించకుండఁ) జేయవలయు నని చెప్పుదురు.

మఱియు నీరెండుసంస్కారములును గర్భిణిని సంబంధించినవే కాని గర్భము ననుబంధించినవి కావు గావునఁ బ్రథమగర్భసమయమున సంస్కరించినఁ జాలు నని కొందఱును, ఈకర్మలు గర్భసంస్కారములే కావునఁ బ్రతిగర్భమును సంస్కరింపవలయు నని కొందఱును జెప్పుచున్నారు. ఇం దేపక్ష మాదరణీయమో చెప్పఁజాలను గాని పుంసవనము గర్భస్థపిండమున కంగప్రత్యంగము లేర్పడకముందే జరిపినఁ బిండము మనసంస్కారానుగుణముగ స్త్రీగఁ గాని పురుషుఁడుగఁ గాని మాఱుట కుద్దేశింపఁబడినది కావునను సీమంతము కేవలము గర్భరక్షణమునకై యుపయోగించునది కావునను నాలవమాసమున గర్భమునకుఁ బురుషావయవములు గాని స్త్ర్యవయవములు గాని జనించినపిదప నాశిశువును మనయిచ్ఛ వచ్చినరీతిని మార్చుట కనువుపడదు గావునను, నీసంస్కారములు వరుసగ ౨-వ ౩-వ, మాసములందే జరపితీఱవలయు ననియు, నొక్కగర్భమును సంస్కరించుటచే నౌషధబలము సర్వగర్భములను సంస్కరింపఁజాలదు గావునఁ బ్రతిగర్భమును సంస్కరింపవలయు ననియుఁ జెప్పుపక్షమే సమంజస మని నాయభిప్రాయము. ఇఁక నీవ్యాసము నుపసంహరించుటకు ముందుగ నీకర్మలలోఁ గ్రియలతోపాటుగ మంత్రముల నుచ్చరింప నేల యని కొందఱు శంకింతురు గాన నాకుఁ దోఁచినరీతిని గొంత ముచ్చటించెదను. మంత్రములను ధర్మశాస్త్రకారులే కాక యాయుర్వేదాచార్యులు గూడ నాదరించియున్నారు. వేదములయందుఁ గొన్నిభాగములు కేవలమంత్రములే. మంత్రశాస్త్ర మను పేర నసంఖ్యము లగుగ్రంథము లున్నవి. తేళ్లకుఁ, బాములకుఁ, బిచాచములకు నివి యవి యన నేల కష్టసుఖముల కెల్ల మంత్రము లున్నవిగదా? వీని కే శక్తి కలదో విచారింతము.

ఓంకారరూప మగుధ్వనివలనఁ బ్ర... ము ద్భవించిన దని తాత్త్వికుల మతము. వేదమం దీయర్థము గలదు. సామగానమువలన వర్షములు కురియు నని

మనగ్రంథములందుఁ గలదు. ఇంతియ కాక సర్వరోగములును గానమువలనఁ జెక్కఁబడు నని యమెరికావైద్యులు వ్రాయుచున్నారు. కావున నక్షరాత్మక మగుధ్వని యందుఁ గూడ నట్టిశక్తు లున్నవనియు నక్షరముల సంగ్రథనావిశేష మున నిష్టఫలము లభించుట యాశ్చర్యము గాదనియు నాసంఘటనావిశేషమే మంత్రములు గావున వానిని మనము విడువక మిగుల నాదరింపవలయు ననియు నాయభిప్రాయము.

పైని జెప్పినరీతి ననంతఫలదము లనిస్థూలదృష్టికే గోచర మగుచున్న ధర్మశాస్త్రగ్రంథముల మహత్త్వము వర్ణింప నెవారితరము. అయినను జాపలమున నాకుఁ దోఁచినరీతిని గొన్నితప్పులను గొన్నియొప్పులను గుదిగూర్చి వ్రాసితిని. నన్ను మన్నించి మనధర్మశాస్త్రములందు నే నూహించినంతమాత్రమేని ఫల మున్నయెడ వాని నాదరించి తదుక్తకర్మల నాచరింప వేఁడెద. మొదటఁ దెలిపిన రీతిని బురుషార్థచతుష్టయసంపాదనోపాయము లగుమనధర్మనిబంధనము లీశ్వ రానుగ్రహమున నెప్పుడేని బూర్వోన్నత్యమును దిరిగి పొందుఁగాక!

కట్టి సాంబమూర్తిశాస్త్రి.

ఈ రీతి వితర్కరజ్జువులఁ బెనఁగి గతాగతకారియైన యుయ్యేల వంటి వాఁడ నైతిఁ జుఁడీ యని తెలుపువాఁడుం బోలెఁ బరేంగితజ్ఞు లగుశాంతనవాది మహావీరులకుఁ జెప్పినవిధమును దోఁపించు నిప్పద్యము ముక్తపదగ్రస్తవైఖరి నర్జునుని తడఁబాటును జాటుచు నెట్టిమనోహరమును సార్థకమును నగుయమకముతోఁ గూర్పఁబడినదో పరికింపుఁడు! ఇట్టిచోటుల నుండు శబ్దాలంకారము లెనింద్యములు గాక హృదయంగమము లగుచున్నవి.

రసము, భావము, సందర్భము చెడకుండ ననురూపములును, మనోహరములును, నగుశబ్దాలంకారములతోఁ గవితాకన్యకను గైసేసినవాఁ డాంధ్రకవులలో నెల్ల సాహిత్యరసపోషణసంవిధానచక్రవర్తి యగుమననవీనగుణసనాథుఁ డొక్కఁడే! ఎఱ్ఱాప్రెగ్గడయు శబ్దాలంకారముల నుపయోగించినాఁడు. ఇరువురు కవుల పద్యములం గనుఁడు. సోమన:—

క. "అరవిందనయన శరముల, సరవిం దనయునువుసూపఁ జాపము గుడుసై
పరివేషముగల చంద్రుని,సరివేషముఁ దాల్చె మొగము జగము నుతింపన్."

క. "అమరారిచెవులముందఱఁ, గొమరారి వెలుంగు నమృతకుండలముల న
త్తిమిరారిద్వయ మన నె,త్తి మురారికిఁ జూపియపుడు తెలియఁగఁ బలుకున్"

క. "తనయునికిం బదిలము నా,తనయునికిం గలుగ దతనితనయుని కైనన్
వనజోదర యాదరమునఁ, గనుఁగొని ప్రాగ్జ్యోతిషంబుఁ గరుణింపఁదగున్"

(ఇవియే కాక యిట్టిపద్యము లాతనిగ్రంథమున నింకను గలవు ఆయా ఘట్టములఁ జూచువారికి నాయాస్థలంబుల నవి యుచితములే యని తోఁపక మానవు.) ఎఱ్ఱన:—

క. "వినతాతనయుఁడు మున్నుగ,ననుపమ తేజుఁడయి తోఁచు హరితాన యనన్
వినతాతనయుఁడుమున్నుగ,ననుపమ తేజుఁడయితోఁచెహరియుదయాద్రిన్"

క. "క్షణమాత్రము చిత్రరణ,క్షణము ననుభవించి పిదపఁ గాశ్యునిఁ గమలే
క్షణుఁడు శిరశ్ఛేదవిచ,క్షణుఁ డయి వీరజనయోగ్యగతులకు ననిచెన్."

క. "నెల లన్నియు నిండఁగ న,న్నెలఁతకు నుదయించె నిండునెల పున్నమకున్
నెలకొని యుదయించుపగిది,నెలమి కొడుకు సకలకువలయోచ్ఛాపరుఁడై."

తిక్కనసోమయాజియు శబ్దాలంకారములఁ బ్రయోగించియున్నాఁడు.

క. "మాసినచందముఁ దనుఁగని, రోసినడెందంబు గలతరుణిచేఁ గడుబి
ట్టేసిన మదనునిచే ధృతి, వాసిన బెగడొందు సింహబలుఁ డట్టియెడన్.
(విరా. ద్వి. 32.)

క. "చరువులు నమ్మునిచెప్పిన, తరువులు పీడ్వడియె సుతకుఁ దల్లికి నట్ల
య్యెరువురు నుపయోగింపఁగ, గరువులు తత్తత్ప్రకార కలితము లయ్యెన్" అను.

III ఆక్షే. ప్రాసముపైననే దృష్టి యుంచి పాం ...ము చూప నెంచిన వానికి రసముపైఁ గన్నుండదు తానూ వ్రాయుమాట లనర్థకము లని తలంపఁడు. సోమునియం దీదుర్గుణము ప్రబలిన దనుటకు మఱి యొండు రెండు నిదర్శనములు చూపెదను.

క. "ఫాల్గునమాసము మొదలుగ, ఫల్గునసఖుఁ డతులతరతపశ్చరణమునన్
వల్గదరివర్గహాయఖుర, ఫల్గువు గానీక మనసు పదిలము చేసెన్."

"ఎట్లయిన నుపక్రమించిన 'ల్గ' ప్రాసమును బూర్తిచేయవలయును. కావున నే నిష్ప్రయోజనముగ మూఁడవపాదమున నంత 'పొడవు' సమాసము వేయవలసివచ్చినది. లేకున్న 'ఫల్గువు' అనుపదమే చాంచల్యమును దెలుపుచుండ 'వల్గదరివర్గహాయఖుర' అను వాక్యన్యాసమున కేమిఫలము?"

ప్రత్యు: 'ఫల్గు'వునకుఁ జాంచల్య మనునర్థము లేదు; ఫల్గు వనఁగా 'అసార' మని యర్థము ('అసారం ఫల్గు' అని అమరము.) లేని యర్థముం గల్పించి సకలభాషాభూషణునియెడ దుర్గుణము నారోపించినారు.

'వల్గదరివర్గఫల్గువు'—వల్గత్ = పరువెత్తుచున్న, అరివర్గ=కామక్రోధాదుల నియెడు, హాయఖుర = గుఱ్ఱపుడెక్కల (త్రొక్కుడు) చేత, ఫల్గువు = అసారమైనది అనియర్థము.

కామక్రోధాద్యరిషడ్వర్గము విజృంభింపకుండ మనసును సారవంతముఁ జేయవలయు నను నుత్కృష్టనీతిని బోధించుచున్న దీపద్యము.

'ల్గ' కారప్రాసముకొఱకు సర్వజ్ఞకవి నిరర్థకపదన్యాస మొనర్పఁడు. ఇక్కవిసింహునకు నిట్టిప్రాసమును బూర్తిసేయుట యొకదొడ్డకార్యము గాదు. చూడుఁడు:—

శా. నాల్గుం జెల్లెడి బ్రహ్మచారి గృహి వానప్రస్థ యత్యాశ్రమం
బు ల్గైవల్యవివక్షు లంతిమపదంబుం జేరువా రిటివీ
రల్గం జూచిన నంతకుండుఁ జెడు మీరా యొర్చువా రిమ్మెయిన్
మే ల్గీ డాడక వీరిఁ జేరి మనుఁడీ మీమీశుభప్రాప్తికిన్.

దీర్ఘసమాసములం దిచ్చలేక యలఁతిపలుకులం గూర్చువాఁడైన యెట్టిన ప్రయోగముం గనుఁడు.

ఉ. "శ్రీస్తనకుంకుమద్రవనిషిక్తభుజాంతరభాగవిస్ఫుర
త్కౌస్తుభరత్నసూత్నరుచిగర్వితనాభిసరోజసౌరభ
ప్రస్తుతమత్తభృంగరవరాగరసోల్బణభోగిభోగత
ల్పాస్తరణుం దలంచుసుకృతాత్ము లపాస్తసమస్తకిల్బిషుల్." (నృసిం. 2.)

'ల్గ' కొఱకు సోముఁడు 'వల్గదరివర్గహయఖుర' అనునంత 'పొడవు' సమాసమునే వేసినాఁడు గాని 'స్త' కొఱకు నెట్టిన యెంతపొడుపుసమాసమును వ్రాసినాఁడో కనుఁడు!

యతిప్రాసాదినియమబద్ధము లగుపద్యములు రచించునప్పుడు మహాకవులొక్కొకచో రసము, నర్థముఁ జెడకుండఁ గొన్నిపదములఁ బెంపుసేయుటయుఁ గలదు.

క. "అనుటయు లెస్సగఁ దలఁచితి,విను మొకకీటంబునకును వేదవ్యాసం
బున లోకహిత మొనర్చిన,మునికి నయిన సత్కథనము మునినుతచరితా!"
(అను. 4. ఆ. 314.)

కవిబ్రహ్మ యగుతిక్కనసోమయాజి వ్యాసుఁడనుటకు నెట్లు పాదమును బొడిగించినాఁడో! మఱియు,

క. "ఏణాక్షి నపుడు వెడసిం,గాణిం గొని యలరుఁదూపుగమిఁ జక్కొరయే
ఖాణముగాఁ గలిగినకం,ఖాణపుదొర పింజపింజ గాడఁగ నేసెన్." (విజ. ప్ర.)

'కంతుఁ' డనుట కెంత పెంచినాఁడో రసపత్తరప్రబంధకర్త చేమకూర కవిరాజు! ఇట్టి ప్రయోగములు సంస్కృతాంధ్రగ్రంథముల వేనవేలు గలవు. ఈ విధ మగునింకొకప్రాసము గలపద్దెముపై వారియాక్షేపము.

క. "ప్రాగ్జ్యోతిషంబుఁ గదిసి స,దృగ్జ్యాటంకృతులు లేక దితిజులమీఁదన్
దృగ్జ్యోత్స్న జేవురింపఁగ, దిగ్జ్యాగగనాంతరంబు దివురఁగ నార్చెన్."

b. (ఆక్షేపము) 'ప్రాగ్జ్యోతిషంబు'అని యుపక్రమించినాఁడు. కావున నిఁక మూఁడు 'గ్జ్యా'లు సంపాదించి వ్రాయకున్న సర్వజ్ఞత్వమునకు లోపము గలుగు నని సోముఁడు తలంచినాఁడు. పద్యము ముగిసినఁ జాలు నని వ్రాసినాఁడు. కావుననే యౌచిత్యవిమర్శనము వెనుకఁబడినది. చూడుఁడు నరకాసురుని జంపవచ్చి సింహనాద మొనర్చి యుద్ధసన్నద్ధుఁడగు శ్రీకృష్ణుని మహాక్రూర మగుచూపును జ్యోత్స్నతోఁ బోల్చుటకన్న వేఱ యనుచితము కలదా? ప్రాసలుబ్ధు లైనవారిగతి యంతయు నింతే."

ప్రత్యుక్తి: సింహనాద మొనర్చుటచేఁ గ్రూరమైన చూపును దృగ్జ్యోత్స్నతోఁ బోల్చినట్లు వీ రర్థము చేసికొన్నారు గాఁబోలు: శ్రీకృష్ణుఁ డంతకు మున్న చట సింహనాద మొనర్పలేదు. ఈపద్యమున నట్టియర్థమును లేదు. పద్యభావ మెట్లన,

"మురాది రాక్షసులను జంపినపిమ్మట శ్రీకృష్ణుఁడు 'ప్రాగ్జ్యోతిష' నగరమును గదిసెను. (ఒక'జ్యా'యైనది.) అచ్చట సద్యజ్జ్యాటంకృతులు లేకపోయినవి. (రెండు'జ్యా'లయినవి) తాను సమరమునకు వచ్చినట్లు శత్రువులకుఁ దెలియు పొంటె 'భక్తత్రాణపరాయణమై' యెప్పుడును వెన్నెలవలెఁ జల్లనై యుండు చూపు, (దృగ్జ్యోత్స్న—దీనితో మూఁడు'జ్యా'లు!) ఆసమయమున జేవురించునట్లు' దిగ్గగనాంతరము దివురఁగ సింహనాద మొనర్చెను. (అనంటిపండొలిచినట్లు నాలవ'జ్యా'కూడఁ బూర్తియైనది!) అంతియకాని ముందే సింహనాద మొనర్చినట్లు గ్రంథమున లేదు. చూడుఁ డీక్రింది యెట్టాప్రెగ్గడప్రయోగమును!

వ. అయ్యుగ్రపశువుల కభిముఖుండై ....యవ్వీరుండు (కృష్ణుఁడు) ఘోరంబుగా నదల్చి

క. నావిడికిటికిడిఁదిపిడుగు, నాపగిదియ దీనఁ దగిలి యంతకుఁ డైనన్
బోపు సెడకుండఁ బోవునె, యీపాపాత్మకుల మిమ్ము నేల సహింతున్

మ. అని యావిష్కృతతీవ్రముష్టియగుచున్ హాసోజ్జ్వలాస్యంబునన్
కనలుప్పొంగఁగ - - - - - - - " ఎఱ్ఱనహరివం.

ఇచ్చట 'హాసోజ్జ్వలాస్యము' కనలినది. అచ్చట 'దృగ్జ్యోత్స్న' జేవురించినది. పరీక్షించుచో నెఱ్ఱన ప్రయోగమైన సందేహముఁ గల్గించునేమో కాని సోమునిది కలిగించుటలేదు!

IV (a.) ఆక్షే—"ఒక్కొకపుటకుఁ దక్కువలేని వచనములనీతికించి తనకుఁ గలతిక్క నంతయుఁ బూర్తిగ విడిపించినాఁడు" అని శర్మగా రాక్షేపించిరి.

ప్రత్యు—సోమునివచనములు తత్తదుచితస్థలముల నెక్కొల్పఁబడియున్నవి. యుద్ధము, అరణ్యము మొదలగు వర్ణనములం దక్క నితరస్థలంబుల నాతఁడు పెద్ద వచనముల నుపయోగింపలేదు. ఆయావర్ణనముల ననుసరించి యాతఁ డావచనముల నాయాగతులను వ్రాసియున్నాఁడు. ఎఱ్ఱనయుఁ బెద్దపెద్దవచనముల వ్రాసియున్నాఁడు. హరివంశనృసింహపురాణములం గనుఁడు.

(b) "ఎఱ్ఱన గ్రహచారము చాలక, ఒండురెండుచోట్ల నుభయప్రాసముల నొండురెండు చేర్పఁగా, సోముఁడును 'తేలునకుఁ బాదుపత్తె మిచ్చినఁ

దెల్లవాఱుదాఁకఁ గుట్టె' నన్నట్లు తనవచనములలో నెల్లఁ బ్రాసము లోకపరస్పరాస్పదముఁ దూర్చియుంచెను." అని తీవ్రముగ వ్రాసినారు.

సోమునివచనములవంటివి నన్నయతిక్కనలగ్రంథములయందును గలవు. అందలి కొన్ని యిందే ముందు గానవగును. సోమునిఁజూచియే యెఱ్ఱన వ్రాసికొనె ననఁదగును.

(c) "తనవచనములలోఁ గొన్నివిచిత్రమార్గములను సోముఁ డవలంబించి నాఁడు. అని యేవియున సమానార్థకము లగుమాటల ననేకములఁ గూర్చి వ్రాయుట మొదలగునవి. చూడుఁడు!

"చలంబుగొని పోరి పోరిలోఁ దునుకలయ్యును, దుముురయ్యును నింతింతలయ్యును నిసుమంత లయ్యును జిఱునిగ్గయ్యును జిదురుపలయ్యును మంచయ్యును మడిమంచయ్యును రూపుసెడినం దిరుగుడువడి వాహిని చిక్కువడి చిందఱవందరై మడిసి మల్లామట్టియై యేపుదెగి యెప్పురుసుపట్టయి యనువు దప్పి యదవదయై యంతంత నిలిచి యవురుసవురై పాఱలేక పలపలనై వెఱఁగువడి వెల్లవెల్లనై చిడుముడిపడి చెల్లాచెదరై పొడవడంగి ప్రోవున నొక్కండై పోవిడిచి పోయినపోకై పోయినం గని." - - - - -

ఇంచుమించుగ నిందలివాక్యము లెల్ల నేకార్థకములు, వినుటకు విచిత్రముగ నుండుట యొకటియ కాక వీనివలన నేమిప్రయోజనము? ఇట్టి వొకటిరెండు వాడిన లోకోక్తి యనవచ్చును గాని యున్నవియు లేనివియు నొకపరశ్శతము గూర్చిన నేమిప్రాఁతరోఁతకాక?"

ప్రత్యు:—ఇది యుద్రేకించి మిన్నుముట్టిన వీరరసమును వర్ణింపఘట్టము. శ్రీకృష్ణునిచే నిహతంబయి క్రమక్రమముగఁ బొడ వడంగి కదనరంగమును దుదకు శూన్యముగ నొనర్చిన నరకసైన్యము స్థితిగతులను దెలుపుచున్నది. దీనిం జదువునప్పుడు యుద్ధరంగము పాఠకులకుఁ గన్నులయెదుటఁ గనఁబడుచున్న ట్లుండును. తిక్కనసోమయాజియు యుద్ధపర్వముల నిట్లే పలువిధములగురచనలను గావించియున్నాఁడు. ఈవచనము సోమనాథకవీంద్రునివచనరచనాసామర్థ్య మనన్యసాధ్య మని చాటుచున్నది. సోమనాథుని నెఱ్ఱనమహాకవియు ననుకరించి యుండెను. శ్రీనాథుఁ డీసోమునివచనము మెచ్చుకొని పద్యముసే వ్రాసిపెట్టెను. ఇట్లే పలువురు సర్వజ్ఞుని యీకల్పన ననుకరించియుండిరి. చూడుఁడు! 'నన్నయతిక్కనలకుంబోలెఁ బిచ్చిపిచ్చియలంకారములయందాశలేని యెఱ్ఱన;

“వ. - - - - - - పోటువడియును, ప్రేటువడియును, ద్రొక్కువడియును, జిక్కువడియును, వలిగులినై, లావుచెడి, చేవదఱిఁగి, కడంకలు గుడుసువడి, కడిమిపెంపు వోనాడి - - - - - -” హరివం. పూ. 6 ఆ. అని వ్రాసియుండెను. మఱియు శ్రీనాథుఁడు.

సీ. అనువుదప్పిరి నొచ్చి రలసి రాపదనొంది రదవదలైరి చీకాకుపడిరి,
అంగలార్చిరి విచ్చి రాఱడిఁబొందిరి బ్రమసిరి పాఱిరి పల్లటిలిరి
బెగ్గడిల్లిరి పికాసికలైరి సొలసిరి కులకులఁగూసిరి కుతిలపడిరి
గగ్గులకాడైరి కలఁగి రోటాడిరి వెలవెల్లనైరి నివ్వెఱఁగుపడిరి
యుపురుసవురైరి గుజగుజయైరి డస్సి, రొల్లఁబోయిరి వెగ్గిరి తల్లడిలిరి
సిగ్గుపడి రొచ్చవడిరి యిస్సియిస్సియైరి, తారకునిచేతమునులుఁబృందారకులును.”
కూర 3. ఆ. 10.

సారంగు తమ్మయ్య వైజయంతీవిలాసములోని.

“శా. ఆవిప్రోత్తము వజ్రపంజరనిభం బై నిశ్చలం బైన స
ద్భావం బంగనసాహచర్యగుణసంపర్కంబునన్ లోహమై
గ్రావం బై దృఢదారువై తరుణవృక్షం బై ఫలప్రాయమై
పూవై తన్మకరందమై కరఁగెఁ బో పో నీళ్లకుం బల్చనై.”

అని విప్రనారాయణుని స్థితిని బైపద్య మెట్లు హృదయంగమముగ వర్ణించినదో నరకుని సైన్యముగతిని పైసోముని వచనమును నట్లే వర్ణించినది.

టిక్కనసోమయాజి యీదృశము లగుపోకలఁ బోవుటయుఁ, బిచ్చిపిచ్చి యలంకారములపై నాశగలిగియుండుటయు నీ క్రిందివచనములం జూచినఁ దెలియవచ్చును. గ్రంథవిస్తరభీతిని పద్యములసంఖ్యయు వానిమొదళ్లును నిచ్చుచున్నాను.

భీష్మపర్వ. తృతీ. 239 వ. - - - “ముందటికాళ్లు దునిసిన మ్రొగ్గతిలం బడుటయు - - - - - - -”

“ - - - కేతనంబులఁ గూల్చియు, ఘోటకంబులప్రాణంబులఁ బీల్చియు, సారథుల రూపుమాపియు, నరదంబులు పఱియలువాపియు - - - ఇట్లే - - - - - - ” ద్రోణప. 1 ఆ. 308.

“ - - - కరుల నుచ్చిపోవుచుఁ దేరులవిఱుచుచు - - - (ఇదిమొదలు) - - - చిక్కువడియును సుడివడియును, గలంగియుఁ దొలంగియు, వెఱచఱచియు విచ్చిపఱచియు - - - (వఱకు) ద్రోణ. ద్వి. 1.౪

ఇట్టివచనములు గాక తిక్కన యించుమించుగ నేకార్థకముల నిట్లు పద్యమున వ్రాసెను.

సీ. సూతులఁ దెగటార్చి కేతనంబుల వీటతాటంబుసేసి రథ్యములఁ గూల్చి
- - - - - - (పద్యమంతయుఁజూడుఁడు.) కర్ణ. ప్రథ. 140 వ.

(d) (తిక్కనగ్రంథములో నింకను నానావిధము లగువచనలు గలవు)

ఆక్షే. "విసుటయకాక వీనివలన నేమిప్రయోజనము?"

యుద్ధములు నానావిధములు. వానిని గవులు నానావిధముల వర్ణింతురు. "శ్రీరాముఁడు రావణునిఁ బరిమార్చె నన్నఁజాలదా? యుద్ధకాండమున నంత వర్ణన మేల? పాండవులు దుర్యోధనాదులఁ జంపిరన్నఁ జాలదా? యుద్ధమున కైదుపర్వము లేల? వానివలన నేమిప్రయోజనము?" అనుట యెట్టిదో యిదియు నట్టిదే యగును.

(c) ఆక్షే. "సోమునివర్ణనము, 'వాక్యసంయోజనము మొదలగువిషయములయం దౌచిత్యవిచారము చేసినచో సోమునియెడ ననౌచిత్యమున కుదాహరణము లనేకములు గనవచ్చును." అని శర్మగారు వ్రాసిరి. వీరు వ్రాసిన యనౌచిత్యములం గనుఁడు.

(a) "నరకాసురుఁడు దేవతలనెల్లఁ బాఱఁదోలి స్వర్గమునఁ బ్రవేశింపఁగా నందు 'కాశ్మీరనికరంబు కహ్లారపుష్పోపహారంబు లేని గృహాంగణములు' గాన వచ్చినవఁట. సరియే కాని స్వర్గమునకుఁ గాశ్మీరమునకు నాకాలమున నేమి వ్యాపారము నడచుచుండెనా యీలోకపుఁ జందన మాలోకమునఁ గానవచ్చుటకు?"

ప్రత్యు. కవి యీ పద్యమును శబ్దార్థాలంకారములతో వ్రాసియున్నాఁడు. లేఖకప్రమాదమున నీపాదమును నాలవపాదమును నియమరహితముగఁ గన్పట్టుచున్నవి. వివాదమున నున్న యిప్పాదమును మాత్రము ప్రస్తుతము 'కాశ్మీరనీరంబుఁ గల్హారపుష్పోపహారంబు లేని సౌధాంగణములు, అనిసవరించుకొందము. శర్మగారు 'కాశ్మీర' మనఁగాఁ జందనమని యర్థము వ్రాసిరి. దానికిఁ జందన మను నర్థము లేదు. (కాశ్మీరనీరము = కుంకుమపన్నీరము.) భూలోకమున నున్నవారి కాలోకమున నున్నవారితో యుద్ధవ్యాపారము జరిగినట్టు లంగీకరించినమనము తక్కినవ్యాపారములు జరిగినట్లేల యొప్పికొనరాదు?

(b) "నరకాసురుఁ డూర్వశిని బిలిపించినకథ సంస్కృతమున లేదు. దీని నెఱ్ఱనయో మఱియెవరో కల్పించియుండఁగా (సోముఁడు దీనిని దీసికొనెను.)"

ప్రత్యు. ఇక్కథ సంస్కృతమునఁ గలదు. వారికి లభించినప్రతులయందు లేదేమో!

'ఆంధ్రపరిశోధకమహామండలి(వారు) సంపాదించిన సంస్కృతహరివంశపుఁ బ్రతియందును, బొబ్బిలినగరపుఁ బ్రతులయందును, చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారపుఁ గాకితపువ్రాఁతప్రతియందును నున్నది. అందలిశ్లోకములఁ గొన్నిటి నుదాహరించెద.

శ్లో. - - - జయ మాఘోషయామాస నరకో దానవోత్తమః
అమరావతీం తదా దైత్యః ప్రవిశ్యచ మహాసురః
ఊర్వశీం చ సమాహూయ వచనం చేద మబ్రవీత్.
భజ మా మిహ వామోరు! నిర్జితః శక్రఆహవే
అహ మిన్ద్రో యమో రాజా వరుణో యాదసాంపతిః
- - - - - - - "

"ఊర్వశీ, బుష యో యది తే రాజః! యక్ష్యన్తి క్రతుభి స్సదా
తదా భజామి దైత్యేన్ద్ర! నాత్ర కార్యా విచారణా."

సం. హరివం. ఉ. భా. 127 అధ్యా.

సోమన యెఱ్ఱనలప్రతులలో సయితే మీఘట్ట మున్నది గావున దీనిం గూర్చి యొకఁ డొక్కని దానింజూచి వ్రాసికొనునంతయక్కఱ యుండదు.

(c) ఆక్షే. ఊర్వశిని జూచి నరకాసురుఁడు తటాలునఁ గాళిదాసుని రఘువంశములోని వర్ణనలఁదలఁచుకొని 'గేదఁగిరేకు నఖంబునఁ జీఱుట' మొదలగు శృంగారచేష్టలను జేయుచున్నాఁడు. సమయమునకు సరిగ స్వర్గలోకమున గేదఁగిరేకు దొరకుట చిత్రము!"

ప్రత్యు. నరకుఁడు కాళిదాసుకంటెఁ గొన్నివేలసంవత్సరములు ముందున్నవాఁడు. కావున నతఁడు రఘువంశమును జదివియుండుట యసంభవము. వీరిదృష్టికి సోముఁడే నరకాసురుఁడు. కానిండు. 'గేదఁగిఱేకు నఖంబునఁ జీఱుట' యనునిర్భాగ్యలక్షణము గలయారాజున కిందుమతీదేవి లభింపనియట్లే యట్టిపనినే చేసిన నరకునకు నూర్వశియుఁ దక్కలేదని చూపుటకే సోముఁడు కాళిదాసుప్రయోగమునే యచితత్వముకొఱకు ననుకరించి చూపినాఁడు.

స్వర్గలోకమున గేదఁగిరేకు దొరకుట చిత్రముకాదు. చూడుఁడు.

స్వర్గమునఁ బారిజాతకుసుమములే కాని మల్లెలు, మొల్లలు, జాజులు, గేదఁగులు మొదలగుపుష్పములు లేవని తలఁపరాదు. ఆలోకమున కంతకును

నందనవనములోని దేవతరువుల యైదింటివిత్తనములే కావు. ఇతరవృక్షము లున్నట్లు ప్రమాణము లనేకములు గలవు. ప్రస్తావమున నున్నది 'గేదఁగి' గావున దానియునికిం గూర్చిన యుదాహరణములలో నొండు రెండు మాత్ర మాంధ్రగ్రంథములనుండియే చూపెదను:—

(1) కవిరాజమనోరంజనము, తృతీయాశ్వాసము.

తే. గీ. కువలయాక్షులు కేతకీకుసుమగర్భ, దళముపై నవ్యహిమజలమిళితమైన
హరిణమదపంకమున వ్రాసిరపుడ లేఖ్య, తనువిశేషుఁ బ్రసూనేషువినుతవేషు."

చ. వలపలిచేతఁ బూశరము, వామకరంబునఁ బచ్చవిల్లు కో
పులను వసంతకైరవవిభుల్, వెనుకన్ బలయానిలుండు, ముం
గల వరశారికాశుకపికభ్రమరాళి వెలుంగఁ గాఁ జెలుల్
వలపులరాజువైభవము వ్రాసిరి గేదఁగిపువ్వుఱేకునన్.

(2) పారిజాతాపహరణము, చతుర్థాశ్వాసము:—

"రగడ - - - గుమగుమని వాసనల గేదఁగి గొమ్మకొమ్మకునందె. - - -"

(ఒకవేళ నరకుఁడు చీఱినరేకు దీనిదేయేమో!)

(పైవి రెండును స్వర్గలోకమునందలివే!) మఱియు స్వర్గకైలాసవైకుంఠాదులను వర్ణించుపురాణములలోని ఘట్టములను జూచిన నం దెన్నియో యితర వృక్షములు గానవచ్చును.

ఉత్తరహరివంశములోని యూర్వశీనరకాసురసంభాషణము కొంతవఱకు బాగుగ నున్నదని వ్రాసి పిమ్మట నిట్లు వ్రాసినారు. (గ్రంథమంతయు వ్రాయక ముఖ్యవాక్యముల నుదాహరించెదను.)

ఆక్షే. (b) "శంభుదాసుఁ డూర్వశీనరకాసురుల సంభాషణమును రెండు పద్యములలో నెంతయు గంభీరముగ, మధురముగ ముగించినాఁడు ఇఁక సోమనాథుఁ డన్ననో యీవిషయమునకై యిరువదియైదు పద్యములను వ్రాసి వారిని నీచాతినీచపాత్రములుగాఁ దోఁపఁజేసినాఁడు, నరకాసురుఁ డెంత నీచుఁ డగు కిరాతస్వభావుఁ డగురాక్షసుఁ డని యొకవేళఁ దలంచినను, ఊర్వశి యెంతసిగ్గు మాలిన ముసలిసాని యని యనుకొన్నను, వారిద్దఱకు నిట్టిరసాభాస మగుసల్లాపము నిండుసభలో నడచియుండదు. ఒకవేళ నడిచియుండవచ్చునుబో, కవి దాని నిట్లు వ్రాయుట ప్రమాదము. ఇందుఁ గలమిండఱికము, లంజెతనము మొదలగు పదములఁ దలఁచుకొన్న నెవ్వరికి రోఁతజనింపదు? సోముఁ డుత్తమ

పాత్రములయం దెంతయో నీచస్వభావమును జూపినాఁడు. సోముని నరకుఁడు సిగ్గుమాలినవాఁడు; సౌమనస్యము లేనివాఁడు."

ప్రత్యు. ఇందు "ఊర్వశీనరకాసురు లుత్తమపాత్రములా? నరకుని యప్పటి సభ యెట్టిది? నరకుని నీచుఁ డగు రాక్షసునిఁగాను, ఊర్వశిని ముసలిసానిగాను దలంచునప్పుడు వారిసంభాషణ మెట్లుండును? కవి యాసంభాషణము వ్రాయుట ప్రమాదమా? సోముని గ్రంథమునందలి పదములకును, నెఱ్ఱన దానియందలి వానికిని భేదముగలదా?" అనువిషయముల నాలోచింపవలసియుండును.

ఊర్వశీనరకాసురు లుత్తమపాత్రములా?

ఊర్వశి పొత్తులతొయ్యలి; నరకుఁడు రక్కసిరాయఁడు. ఇట్టి పాత్రములను విమర్శించునప్పుడు సీతారాములవంటి పాత్రములను మనమున నిడుకొనరాదు. నరకపాత్రమును బరిశీలించునప్పుడు రావణాదులను జ్ఞప్తికిఁ దెచ్చుకొనవలయును. ఇప్పట్టున వాఁడు రావణాదులకంటె నెన్నియో మడుంగులు సరసుఁడుగఁ దోఁచుచున్నాఁడు. వాఁడు సలిపినసంభాషణ మెంతదీర్ఘముగ నున్న నేమి? వాఁడు మోటుమాట రానీయలేదు; మొఱకుఁదనముఁ జూపలేదు. వాఁడు రాక్షసరాజు. వానికడ రాచఠీవి మెండుగ నున్నది; రాజపౌరుషము నిండుగ నున్నది. వానియందు వలపులేమి ననేకమార్గములచేఁ దప్పించుకొనఁ జూచిన నేరుపుఁగత్తె యగునూర్వశి తుదకు మాయనవ్వు నవ్వుచు, "యాగభాగముల కధికారివి గానినీమగతన మేటికి?" అని యెత్తిపోడువఁగానే యంపతాఁకుఁ గన్నమృగరాజువోలె హుంకరించుచు వాఁడు,

చ. "అవు నిదివోలు! వాసవుఁడు నంతకుఁడు న్వరుణుండుఁ బార్వతీ
ధవసఖుఁడుం బ్రతాపమునఁ దత్పదమేలుదు రన్న నిట్టినే
న విహితయాగభాగము లహంకృతిమైఁ గొనకున్న నూర్వశీ!
కవకవనవ్వ రే త్రిదశకాంతలు? - - - - - - "

అనిపలుకుచు (దానివీడ్కోలిపి) లేచి వెడలిపోయెను. వానికి నూర్వశీసౌందర్యమునకంటె రాజపౌరుషమే ప్రధానము. కావుననే మనసాహిత్యరసపోషణసంవిధానచక్రవర్తి,

మ. "ఒకనాఁ డూర్వశి మాటపొందు నరకుండూహించి---మీకెల్ల నే
లికనై యుండెద యాగభాగములు పాలింపన్ విభుం డయ్యెనః."

అని 'యజ్ఞభాగమాటపొందు' (యాగభాగాధికారము) నూహింపఁ జేసె నే కాని దాని 'పొందుమాట' వానిం దలపెట్టనీయలేదు.

నరకునియప్పటిసభయెట్టిది:—ఇంద్రాదిదిక్పాలురు పరాజితులై దేవసైన్యములతోఁ గాందిశీకులైరి. బృహస్పత్యాది దేవగురువులు, మునీంద్రులు, మొదలగువా రంతకుమున్నె పలాయనమంత్రముం బఠించిరి. సుధర్మాస్థానమున నొకదేవకింకరుఁడుగాని, ద్వారపాలకుఁడు గాని లేరు. ఇఁక నాసభను నిండించినవా రెవ్వరు? నరకుఁడు సురపుంగవుగద్దియ నధిరోహించినాఁడు. రాక్షససేనానాయకులు పార్శ్వపీఠముల నలంకరించినారు! మిగిలినరాక్షసవృద్ధులు మొదలగువారు తక్కినయాసనములను గైసేసినారు. రక్కసిలెంకలు నిలువంబడి కొలుచుచున్నారు. దేవదాసీజనము తాలవృంతములఁ గైకొని వీచుచున్నది. సేవకులగు గంధర్వులు పాడుచుండిరి. ఇదెట్టిసభయో యోజింపుఁడు. శర్మగారి యభిప్రాయమునుబట్టి యీసంభాషణము మఱియొకచో ననుచితమైన నగునేమో కాని యీసభకు నుచితముగానే యుండును.

కవి యీసంభాషణము వ్రాయుట ప్రమాదమా?:—లోకములో నుత్తమమధ్యమనీచాదిపాత్రము లనేకస్వభావములు గలవి యుండును. ఆయాపాత్రములకుఁ దగినసంభాషణముల నసభ్యములు గానివానిని మహాకవులు వ్రాయుదురు. ఇం దసభ్యము లగుమోటుమాట లెవ్వియును లేవు గావునఁ గవిప్రమాదపడె ననుటకు వలనుపడదు.

సోముని యీవ్రాఁతయే ప్రమాదమేని ద్రౌపదీవస్త్రాపహరణకథను వ్రాసిన వ్యాసునిది యత్యంతప్రమాద మనవచ్చును. ఎట్లన,

ద్రౌపది యుత్తమక్షత్రియకాంత; అగ్నియందుఁ బుట్టినపవిత్రురాలు. జగదేకవీరు లగుపాండవులభార్య. ధృతరాష్ట్రుని సభ నరకునిసభవంటిది గాదు. అందున్నవారు రాజులు, రాజబంధువులు, శస్త్రగురువులు—ఇంకను బలువురు. ధృతరాష్ట్రుఁడు గ్రుడ్డివాఁడు గాని తక్కినవారికిఁ గన్నులున్నవి. అట్టినిండుసభలో నందఱియెదుట, భర్తలు చూచుచుండ, మహాసాధ్వియు, ఋతుమతియు, నేకవస్త్రయు నగుద్రోవదిబట్టను విప్పించినకథను వ్రాసినాఁడు వ్యాసుఁడు! కర్ణుఁ డాయిల్లాలి ననరానిమాట లాడినాఁడు! ఇట్లు వ్రాయుట వ్యాసునితప్పు! తెలిఁగించుట నన్నయది! తిక్కనయు నీకథ నచ్చటచ్చటఁ దడవినాఁడు! వీరందఱును బ్రమాదపంకమునఁ బడినా రనవలసివచ్చునే!

ఎఱ్ఱనసోమనలపదములకుఁ గలభేద మేమి?

ఎఱ్ఱన నరకాసురుఁ డూర్వశిని సభలోనికి రావించి యిట్లు పలుకుచున్నాఁడు—

"మ. వరుణుం దోలితి నర్థపుం జదిపితి న్వైవస్వతుం గెల్చితిన్
హరిఁ బోఁజోపితి నేన యీశ్వరుఁడ సర్వామర్త్యసిద్ధోరగా
సురగంధర్వవియచ్చరాదులకు; మెచ్చు ల్మీఱ నీవింక స
న్నరవిందానన! సత్కరింపుము మనోజానీకసంక్రీడలన్."

"ఇంద్రాదిదిక్పతులతో యుద్ధముచేసి వచ్చితిని గావున నీతో—యుద్ధము సేయ మనసుగలదు." అని యెఱ్ఱననరకుని యభిప్రాయము. 'నిండుసభ' లో నొకయాఁడుదానిని గ్రామ్యధర్మమును బోధించుయుద్ధమున సత్కరింపు మనివేఁడిన యెఱ్ఱననరకుఁడు సోమునినరకునికంటె సిగ్గుమాలినవాఁ డనియు, సౌమనస్యము లేనివాఁడనియు, నీచపాత్రమనియుఁ జెప్పుటకు సంశయము లేదు.

సభకు నూర్వశిని రప్పించి సోమునినరకుఁ డిట్లనుచున్నాఁడు—

నాకపురంబులో మెఱసి నందనకేళిఁ జరించి దివ్యకాం
తాకరతాళవృంతసముదాయసమీరము సోఁక రాజ్యముం
గైకొని నేఁడు దిగ్విజయగౌరవధన్యుఁడ నైననాసభన్
నీకనుదోయివెన్నెలలు నిండక కోర్కులు నాకు నిండునే?"

(ఆహా! ఎంతమార్దవముతో నొప్పుచున్న దీపద్యము! పారిజాతకుసుమసౌరభములం గొనితెచ్చి పాఠకుల కిచ్చుచున్నదే!)

యుద్ధముచేసలసివచ్చినవాఁడు గావున (సోముని) నరకాసురుఁడు దివ్యకాంతాకరతాలవృంతసముదాయసమీరపుఁజల్లఁదనము చాలక యూర్వశికనుదోయివెన్నెలలశైత్యము నపేక్షించుచున్నాఁడు. ఇందు భావ మెంతయో మృదువుగను. గంభీరముగను, మనోహరముగను లలితము లగుపదములచేఁ జిత్రింపఁబడినది. ఉభయకవులపద్యములతారతమ్యమును బాఠకులు పరీక్షింతురుగాక!

తరువాతిపద్యములలోఁ గనఁబడు సోమునిపదములైన 'లంజెతనము, మిండజేకము' అనునవి రోఁతజనింపఁజేయుచున్నవో, ఎఱ్ఱనప్రయోగించిన "మనోజానీకసంక్రీడలన్" అనునది యేవపుట్టించుచున్నదో విచారింతము.

లంజె, మిండ, ఈపదములు సామాన్యములు. 'లఞ్జికా, మిణ్డః, అను సంస్కృతపదముల వికృతులు (తెలుఁగుపదములు.) 'కులట, విటుఁడు' అనునవి మనకురోఁత జనింపఁజేయుటలేదు.

# సౌమ్యమండలము.

సూర్యావబద్ధమహాగోళములయం దెల్ల భూమండల మొకటియె ప్రాణులు వసించుచున్న గోళ మనియుఁ దక్కిన వన్నియు నిర్జీవము లనియుఁ బూర్వులు తలంచు టెల్ల భౌమమండలపరీక్షతో నంత మయ్యెను. భూసామ్యము గలిగియుండు టూహించియే కాఁబోలు హైందవపండితులు దానిని భౌమగ్రహ మనిరి. కుజుఁడనునామము నంతియ చెప్పుచున్నది. అంగారకలోకము భూలోకము వెలుపటిది. సమీపమున నున్నది. ఈవలివైపునఁ గూడ లోకములు గలవు. అవి శుక్రలోకమును బుధలోకమును. అంగారకలోకము వాసయోగ్యమై ప్రస్తుతము కాకున్న నొకకాలమునందైన మహాప్రాణికలకలముల నిండియుండవలయు ననియు, నిప్పుడైనను మానవతుల్యు లందు వసించి యుండవచ్చు ననియు నిశ్చయించినటులె భూమికిని సూర్యునకు నడుమ నున్నభార్గవసౌమ్యప్రపంచములును మానవసదృశప్రాణులకు నిరవు లౌనో యని పండితు లెందఱో యచ్చటిపరిస్థితు లన్వేషించిరి. అందు బుధునిపరిస్థితులఁ గొంచెము నేర్చికొందము.

ఆచర్చల ముందుగ నాసేతుశీతాచలపర్యంతహైందవప్రపంచమందుఁ జిరపరంపరాగతమై కావ్యనాటకముల కెన్నిటికో యాధారమైన బుధావతారచరిత్రముల మున్ముందు విమర్శించుకొనవలయును. దానినిబట్టి బుధుఁడు గురునకుఁ గళత్రజాతుఁ డని పిల్లలకు సైతము తెలియును. ఇట్టికథలు పురాణములం దెన్నియో కాననగును. పురాణప్రసిద్ధుఁ డగుబుధుఁడు ఖగోళగ్రహ మగుబుధుఁడు పరస్పరభిన్నవిషయము లని కొంద ఱభిప్రాయపడినఁ బడవచ్చును. ఆవిధముననే చంద్రునివిషయమునను జెప్పవచ్చును. మనదేశమునందే కాక యితరదేశములందు సైతము, దేవనామములు గ్రహములకు నుపగ్రహములకు నుంచునాచారము కలదు. దానిం బట్టి యాగ్రహములు నాదేవతలు నేకవిషయికము లని చెప్పుటకు వలనుపడకున్నను బహుకాలం బైన వెనుకఁ జరిత్రాభావమునం దట్టిభ్రమ కలిగి దేశదేశముల వ్యాపింపవచ్చును. ఆవిధముననే పాండవరాజుల వంశకర్తలైనసోమసౌమ్యులును ఖగోళస్థ సోమసౌమ్యులును నామమాత్రసామ్యము గలవారు గావచ్చును.

కాని, గణితవేత్తలును, జ్యోతిష్కులును, బూర్వకాలమునుండియు సోమసౌమ్యులఁ దండ్రిబిడ్డలుగ నెంచుచున్నట్లు సంస్కృతమున నాంధ్రమునఁ గలగ్రంథసమాజముల స్పష్టముగఁ గానవచ్చును. ఇట్టియభిప్రాయము పైని జెప్పినవిధమున బొరపాటు కావచ్చును. లేదా, నిజమైన జ్యోతిషవిషయమునే యంతరార్థము గా నిమిడ్చి చెప్పినపురాణగాథ కావలయును. ఈమతము నవలంబించినచోఁ బాండవులవంశకర్తలు మిథ్యాపురుషులు కావలయును. అప్పుడు తత్సోమసౌమ్యులు భూమినవతరించిన గ్రహాంశము లని మఱియొకవాదముఁ గల్పింపవలయును. చివర కిదియె పలువురు యుక్త మందురని తోఁచుచున్నది. ఏలయన, వ్యాసమహర్షియు మహాభారతమునం దొకా[1]నొకచోఁ జంద్రమండలమునందు సముద్రములు ద్వీపములును ఖండములు నుండు నని తలంచినట్లు సూచన లున్నందున నాతఁ డాకాశమునుండి చంద్రుఁడు భూమికి దిగివచ్చె నని కాని బుధుఁడు దిగవచ్చె నని కాని చెప్పఁ డని నిశ్చయము చేయఁదగును. ఇంతకు నిట్టివిషయము లిదమిత్థ మని చెప్ప నెవ్వరుం జాలరు.

జ్యోతిషవిషయము లంతరార్థములు గా నిమిడ్చి చెప్పిన గాథలు నాబోటి వాని కందని వేదసూక్తులలోని వటుండ సామాన్యగ్రంథములయందే పెక్కులుండుటవలన నిదియు నట్టి దేదియొ కాఁగూడదా యనుసంశయము కలుగును. మఱియు నిట్టికథలయందుఁ బ్రధానాంశము మాత్రమె గ్రహింపనగు ననియు నందలి సూక్ష్మవిషయములు కథాచమత్కృతి పోషణమునకు మాత్రమే వినియోగము లగు ననియును దలంపవలయును. రాహుకేతుచరిత్రములును ధ్రువోపాఖ్యానమును బఠించినచో నీవాక్యములు సుగమము లగును.

దీనిని దృక్పథమున నుంచికొని బుధజన్మప్రకారమునకుఁ దగు నర్థము నెట్లులైన సాధింపఁగలమా యని ప్రయత్నింపవయును. ఆచరిత్ర మంతయు గురుని యింట నడచినది. చంద్రుఁ డందు వసించి యుండెను. చంద్రునకుఁ దారకు సమాగమ మయ్యెను. అచ్చట గ్రహయుద్ధము వట్టెను. బృహస్పతి బుధుని యందముఁజూచి వానిఁ గొని పోఁజూచెను. చంద్రుఁడునుసమానాధికారముఁ జూపెను. తుదకు బుధుఁడు చంద్రపుత్త్రుఁ డని నిశ్చయింపఁబడెను. ఇవియాకథ యందలి ముఖ్యభాగములు. ఈసందర్భము లన్నియు జ్యోతిషపరముగ నిస్సందేహముగ నన్వయింపవచ్చును. గ్రహము లన్నియు ధనుర్దినములలో నొకదాని యందుఁ గొంచె మించుమించుగ యోగతారయందుఁ జేరియున్నచోఁ పైనిఁ

---

[1] "యత్ర రోహాణకద్వీపో దృశ్యతే చంద్రమండలే" —భారతము.

జెప్పినకథ యెంతయు సార్థకమై దానిని గల్పించినవారల కవితానిమగ్నచిత్తతకు లక్ష్యము కాఁగలదు.

నిజముగ నట్టిగ్రహసమాగమములు తఱచు కలుగుచునె యుండును. కాని బుధుఁడు కనఁబడఁడు. ఎప్పుడుఁ గనఁబడని గ్రహము కనఁబడుటవలననే కథయుఁ గల్పింపగారణ మయ్యెను. గ్రహసమాగమములు తఱచు కలుగుచున్నచో ధనుర్దినములయందుఁ గలుగుచున్నవా? యట్టిది చరిత్రాత్మకముగ మనకుఁ దెలిసినంతవఱకు మొట్టమొదట నెప్పుడు సంభవించిన దని విచారింపఁగఁ జీనాదేశమునం దొకానొక చక్రవర్తి గ్రహము లన్నియు మీనమునందుఁ జేరినసమయము మొదలునూతనశక మొకటిఁ బ్రవర్తింపఁజేసినట్లును దత్సమయము క్రీస్తుపూర్వము 2441 సంవత్సరమున ఫిబ్రవరితొమ్మిదవనాఁ డైనట్లును దెలియుచున్నది. ఈచెప్పినదినమున గ్రహము లన్నియు రేవతియం దున్నటు లీపట్టికవలన స్పష్టము కాఁగలదు.[1]

| | | విషువాంశలు. | | |
|---|---|---|---|---|
| బుధుఁడు | భా:— | 344 | 56 | 16. |
| గురుఁడు | | 347 | 2 | 12. |
| చంద్రుఁడు | | 353 | 18 | 21. |
| శని | | 354 | 39 | 47. |
| కుజుఁడు | | 357 | 45 | 11, |

రేవతీనక్షత్రము 346 భాగల 42 కళలకుఁ బ్రారంభ మగుననఁ బైగ్రహములన్నియు నించుమించుగ రేవతియం దున్నట్లును, స్పష్టమగును. చాక్షుషపరీక్షకు బుధుఁడు నందె యున్నటు లగును. అందు బుధుఁడు గురుని వెనుక నుండుట గురుఁడు బుధుని దీసికొనిపోయినాఁ డనియుఁ, గుజసహితములై యగ్రగాము లైనచంద్రశనులును గురుఁడును, మహాసంగ్రామసంరంభమున నున్నటులను, జెప్పుట యెంతమాత్రము నసమంజసము కాదు. పైఁజూపిన గ్రహయుద్ధమున, రవిశుక్రులు మాత్రము కానరాగు. శుక్రుఁడు ధనుర్లగ్నాంతభాగమున నుండును. రవి కుంభమున నుండవచ్చును. పురాణప్రసిద్ధకథఁ బట్టియు శుక్రుఁ డం దుండ నవసరము కానఁబడదు. ఇఁక బుధజన్మసంశయసందర్భమున, బుధుఁడు ప్రకాశత్వమున గురునివలె నున్నను బ్రత్యేకపరీక్షచే బుధునకుఁ గురునకుఁ గలసామ్యముకన్నఁ జంద్రునకు బుధునకుఁ గలసామ్యము

[1] Chambers' Astronomy, Chapter, 2.

లెక్కువ యగుటవలనఁ గుజుఁడు భూపుత్త్రుఁ డైనటులె బుధుఁడు చంద్రపుత్త్రుఁ డని నిశ్చయ మయ్యె నని స్పష్టమయ్యె ననునభిప్రాయము సిద్ధించెను. ఈశోధన కుఁ దగినయంత్రము లప్పటివారి కమరినవా యనునది తక్క నింకొకయనుపపత్తి యీవాదమునకుఁ బట్టదు.

సూర్యుఁ డధిపతిగాఁ గలప్రపంచములం దెల్ల బుధగ్రహము సూర్యుని కతిసమీపమున నున్నది. తక్కినగ్రహము లన్నిటివలెనె యదియు సూర్యప్ర దక్షిణములు గావించుచున్నను, దానిమార్గము సూర్యునినుండి స్వల్పదూరము ననె యుండుట వలనను, సూర్యునికాంతి విస్తార మగుటవలన నది గణితజ్ఞు లం తగ శోధింపలేదు. కావుననేబుధునిగుఱించి విశేషముగ నెవ్వరికిని దెలి యదు.

పాశ్చాత్యనాగరికతకు మార్గదర్శకు లైనగ్రీసుదేశవాసులును, దఱువాత వాసిగాంచిన యిటలీవారు నీగ్రహమునుగుఱించి భిన్నాభిప్రాయములఁ గలిగి యుండిరి. గ్రీసుదేశమువారీబుధుని దేవదూత యని పూజించిరి. వాక్చమత్కా రమునందును, నిత్యసంతోషమునందును, సరససల్లాపములందును, బుధునిఁ గారకత్వము గల్పించిరి. వర్తకవ్యాపారముల కధికార మిచ్చిరి. ఇటలీదేశ వాసులు బుధారాధనఁ జాలకాల మైనతరువాత నారంభించిరి గ్రీసుదేశవర్త కులు ఇటలీవర్తకులయందు స్నేహముఁ జూపింపవలయు నని యీదేవతాప్రతిష్ఠ గావించి రని చరిత్రకారులు వచించుచున్నారు. ఈకాలమున ముఖ్యముగా ధాన్యవర్తకమునకు బుధుఁ డధిపతి యయ్యెను. క్రమక్రమముగా వర్తకమునందలి మోసము లన్నిటికి బుధునిఁబ్రార్థించినఁ బాపవిమోచన మగు నని తలఁప మొద లిడిరి. దీనికిఁ దోడుగ బుధుఁ డెన్నఁడో కాని కానిపింపకుండుటయు, నటులఁ గన్పిం చునపుడైన సూర్యుని వెనుకనుండి యిటునటు తొంగిచూచునటులఁ గొంచెము తోఁచి యదృశ్య మగుచుండుటయు నీక్షించి వారు బుధుని దొంగల కధిపతిగ గావించిరి. ఈవిధముగాఁ గడకు బుధుఁడు చౌర్యకారకుఁ డయ్యెను. హైందవ జ్యోతిష్కులును బుధుని జాతకస్కంధమున మిగుల బ్రధానగ్రహముగ భావిం చిరి కాని మిగులఁ జపలునిఁ గావించిరి. సహవాసమున నాతనికిఁ గ్రూరత్వ సౌమ్య త్వములు కలుగు ననుచున్నారు. బుధుఁడు పురుషగ్రహములందు బురుషుఁడు! స్త్రీగ్రహములందు స్త్రీగ్రహము. కాని పురుషస్వభావమె ప్రధానముగ నతని యందు సూచించుట యాతనికి మాతుల, భృత్య, యంత్ర తంత్రాధికారము లారోపించుట వలన గ్రహింప వలయును. మఱియు, జ్ఞాన వైరాగ్య వేదాంత

గణితశిల్పరత్నపరీక్షాది సామర్థ్యములును జ్యోతిషప్రవేశమును బుధబలమును బట్టి జాతకవిదులు నిశ్చయింతురన హైందవపండితులు బుధు నెంతముఖ్యగ్రహ మని యోజింతురో స్పష్టమగును. "బృహత్పారాశరి" యనుజాతకగ్రంథము నందు గ్రహములయంశలు ప్రపంచోద్ధారణనిమిత్తము భూమి నవతరించె నని చెప్పుచు[1] బుధాంశ వలనబౌద్ధావతార మయ్యె నని వ్రాయఁబడియున్నది. పాశ్చాత్య దేశజులు బుధుని జోరుల దైవముంజేసిరి; ప్రాచ్యులు లోకోద్ధారణశీలుఁ డగు నవతారపురుషునకు జన్మకారణము గావించిరి. ఇట్టిభావములఁ గల్పించుట యాయా దేశముల[2] వారి కాబుధుని గుఱించి కలిగిన యభిప్రాయములవలననె యని పైనవివరించినబుధునికిఁ గలకారకత్వములఁబట్టి సులభముగఁ దెలియును.

బుధుఁడు గ్రహములలో నెల్లఁ జిన్న. దాని వ్యాసము దగ్గఱదగ్గఱగా మూఁడువేలమైళ్లు. కావున నది చంద్రునికి మూడింత లుండును. గ్రహము లన్నిటివలె నిదియు, సూర్యునిచుట్టుఁ దిరుగుచుఁ, దనయక్షమున సైతము తిరుగుచున్నది. చాలకాలమువఱకు, బుధగ్రహము సైత మొకదినములో నాత్మప్రదక్షిణము గావించు నని యభిప్రాయపడిరి. అటు లగుటవలన బుధ లోకమునందు సైతము రాతిరియుం బవలుఁ గలసి యిరువదినాలుగుగంట లై యుండును. అచ్చటఁ గూడ రేఁ బవళ్లు బ్రవర్తించు చుండవలయును. కాని యిటీవల, దుర్భిణీయంత్రములు వాడిబారినకొలఁదిఁ బూర్వాభిప్రాయము లసత్యము లని తెలియుచు వచ్చెను. మొదటనుండియు బుధునిసూర్యసమీపస్థితివలనఁ దిన్నగ శోధించుట కనువు గాకుండెను. బుధునియక్షము సూర్యునివైపున కెంత యొఱగి యున్నదో దానియందు ద్రవస్థలవిభాగము లెటులున్నవో యగమ్యముగ నుండెను. ఒకటిమాత్రము నిజ మనవలయును. సూర్యునిఁ జుట్టినడచు గోళము లన్నియు వేధించినంతవఱకు పదార్థసామ్యము సూచించుచుండుట వలన బుధునియందు సైత మాపదార్థజాల మె కనవచ్చు నను నూహఁ జేయుచుండిరి. ఈసందర్భమునందుఁ గిరణశోధని యను యంత్రము మిగుల సహకారి యయ్యెను. ఆయంత్రమందు బుధగ్రహ తేజముఁ బరీక్షించినపుడు కనవచ్చురంగు పట్టికఁ బట్టియు, దానియందు లోపించిన భాగములఁ బట్టియు గ్రహము నావరించికొని వాయు వున్నటులును, మేఘములు దదాకాశవీధి సంతతాచ్ఛాదనము గావించుచున్నట్లునుఁ దెలిసెను. అంతేకాక, భూమి నంటియున్న గాలికన్న బుధలోక

[1] ధర్మసంస్థాపనార్థాయ గ్రహాజ్జాతాః శుభాః క్రమాత్॥ రామోఽవతారః సూర్యస్య చంద్రస్యయదునాయకః। నృసింహో భూమిపుత్రస్య బుద్ధ స్సోమసుతస్యచ॥.

మందలి వాతావరణ మెక్కువ లోఁతుగలిగి యుండు ననియు నూహచేయుచు న్నారు. మఱికొందఱు బుధవాతావరణము స్వల్ప మనుచున్నారు. కొంద ఱందు గాలి లేనేలే దనుచున్నారు. అందు గాలి యెంతమాత్రము లేదని స్పష్టముగఁ దెలియువఱకు నున్న దనియే భావింపవలయును.

బుధుఁడు సూర్యుని చుట్టుఁ దిరుగుత్రోవ మిగుల విషమమగు నాయత వృత్తము. ఆయాయతవృత్తమునం దొకవ్యాసము బహుస్వల్పముగు. దానికి లంబముగు నున్నది. బహుదీర్ఘము నై యుండు నని తెలియునది. వ్యాసద్వయ సంపాతమునుండి, సూర్యుని దగ్గఱకు దీర్ఘతరవ్యాసమునందుఁ గొలిచిన దూరము తద్వ్యాసార్ధకమునం దైదవభాగ మగుచున్నది. ఇదియె కక్ష్యావైషమ్యము. గ్రహకక్ష్యలం దెల్ల బుధకక్ష్యకుఁ గలవైషమ్యమె గొప్పది. ఈకక్ష్యావైషమ్యము వలన బుధుఁ డొకానొకప్పుడు సూర్యున కతిసమీపముననను మఱియొకప్పు డతి దూరముననను బోవుచుండును. ఈ సమీపదూరస్థితులె యుచ్చనీచస్థితులు. బుధునిపట్ల నుచ్చమునం దున్నసూర్యునివలనఁ గలుగుచున్న వేఁడిమియు వెలు తురును నీచమునందు కన్న రెండింత లగుచున్నవి. ఈగ్రహముచ్చమం దున్న పుడు భూమియం దున్నయెండవేఁడికన్న నచ్చటఁ బదిరెట్లుష్ణము గ నుండ వలయును.

ఇఁక నాలోకమునందు దినరాత్రివిభాగ మెటులున్నదో విచారింపవల వలయును. భూమి తనయక్షమునఁ దిరుగుటవలన గోళమునం దొకసగ మొక మాఱును, రెండవసగము మఱియొకమాఱును సూర్యునివైపునకు వచ్చుటవలన వెలుతురును జీఁకటియుఁ గలుగు నని యందఱకుఁ దెలియును. ఆవిధముగనే బుధుఁడును దనయక్షమునఁ దిరుగుకాల మాగోళమున కహోరాత్రిప్రమాణ మగును. చంద్రుఁడు భూమిచుట్టు నొకమాసమున నడచుచు, నంతలోనే దన యక్షమున నొకమాఱు దిరుగు ననియు నందువలన భూమియందలివారలకుఁ జంద్రమండలమందలి యొకసగము మాత్రమె కనఁబడుచుండు ననియు నందు రాత్రి పదునైదుదినములుఁ బగలు పదునైదునగుననియు నామండలముఁ గూర్చి చదువునపుడు తెలిసికొని యుందురు. ఆవిధముగనె బుధుఁడును, దనయక్ష మున నెనుబదియెన్మిదిదినముల కొకమారు ప్రదక్షిణసమాప్తిఁ గావించుచుం డును. కావున బుధలోకమునందు పగలు నలువదినాలుగుదినములును రాత్రి నలువదినాలుగు దినములునై యుండును. చంద్రలోకమునం దన్ననో బదునైదు దినములు పగలుఁ బదునైదుదినములు రాత్రియు నౌ నని తెలిసియే యున్నది

కదా! చంద్రునకును బుధునకుఁ గలసామ్యములలో నిది ప్రబలమైనది. ఇట్టి దీర్ఘదినవిభాగములవలన జంద్రునియం దెట్టియిక్కట్టులు సంభవించుచున్నవో యిచ్చటఁగూడ నట్టివె సంభవింపవలయును. దానికిఁ దోడుగఁ జంద్రుని యందలి యెండకన్న బుధునియందలియెండ యైదుమొదలు పదింతలవఱకు నుండునని బుధకక్ష్యావైషమ్యములంబట్టి చెప్పవలయును. కావున రెండులోకములందును, దీర్ఘకాలమేకముగ వెలుఁగుచున్నయెండ లుండుట సిద్ధించుచున్నది. అందును జంద్రునికన్న బుధునియందె యుష్ణాధిక్య మనుమేయింప వీలుపడుచున్నది.

దినరాత్రిప్రమాణము ప్రత్యేకముగ నలువదినాలుగుభూదినము లయిలచో ఋతువ్యవస్థ యెటులున్నదో పరిశీలింపవలయును. ఋతువ్యవస్థను బట్టియె జంతువులయు వృక్షములయుఁ బరిణామవికారములు గలుగుచున్నవి. ఈఋతుభేదము లనునవి, గోళాక్షము సూర్యునివైపున కెంత యొఱఁగినదో దానినిబట్టి సంభవించుచుండును. దినరాత్రులప్రమాణభేదములును దానివలననె కలుగును. భూమ్యక్షమునకు గ్రాంతివృత్తమునకును మధ్య నఱువదియాఱున్నర యంశ లుండును. అనఁగా విషువద్వృత్తక్రాంతివృత్తములయంతర మిఱువదిమూఁడున్నర యంశ లగును. దీనిఁబట్టియె యయనభేదము, ఋతుభేదము, భూమండలమునఁ గలుగుచున్నవి. బుధగోళమునందును, దానివిషువద్వృత్తక్రాంతివృత్తములయంతరముంబట్టి ఋతుభేదములు కలుగును. కాని నవీనశోధనలంబట్టి యీయంతర మేడంశ లని తెలిసెను. గోళమునందు సర్వభాగములందును సంవత్సరముపొడవునను దినరాత్రులప్రమాణములు సమానములు. ఋతుభేదములు గానరావు. సంతతవసంతకాల మాలోకమున వసించియుండును.

సంతతవసంతకాల మాలోకమున వసించియుండు నన్నంత, నెండలు మార్దవముగ నుండు ననియు, తరులతాగుల్మప్రకరము చిగురులతోఁ బూవులతో నిండియుండు ననియుఁ దలంపరాదు. దినరాత్రిప్రమాణములు సమానములుమాత్ర మగును. బుధుఁడు సూర్యునిచుట్టు నెనుబదిదినముల కొకమాఱు నడచుటవలన బుధసంవత్సర మెనుబదియెనిమిదిదినములు. అందుసగము రాత్రియు సగము పగలు నగును. ఈరాత్రియుఁ బగలుఁ గడచునంతలో సూర్యుని వేఁడిమి కక్ష్యావైషమ్యమునుబట్టి మాఱుచుండును. ఈమార్గమునఁ బోవునపుడు చంద్రునియందుఁ గళలు గానిపించునటులె బుధునియందును గళలు కనబడును. ముందుముందు శుక్రునిగుఱించి పఠించునప్పు డీవిషయము బాగుగఁ

తెలిపెదముగాక. మఱియు, బుధుఁడు సూర్యునిఁ జుట్టివచ్చుకాలములోనె తనయక్షము చుట్టుఁ దిరుగును గావున, సూర్యునివైపున కెల్లపు డొకభాగమె కనఁబడుచుండును. అందుఁ గక్ష్యాయానము సమగతి కాకపోవుటయు, నక్ష వేగము నిత్య మగుటయుఁ జంద్రునియం దున్న పార్శ్వచలనమువలెనె బుధుని యందును బార్శ్వచలనము స్పష్ట మగును. ఈపార్శ్వచలనము మధ్యస్థితి కీవలావల, నిరువదినాలుగంశలవఱకుఁ గలదు. ఈసందర్భమునందును, జంద్ర బుధులకు సామ్యము బాగుగఁ జెప్పవచ్చును.

ఈవిధముగ, బుధమండలమునందుఁ, జంద్రమండలసామ్యము సూపట్టి నను, మఱికొన్ని విషయములయందు భేదము లుండవచ్చును. వానిఁబట్టి, సౌమ్యలోకము మానవస్వరూపసాదృశ్యము గలప్రాణిలోకమునకు యోగ్య మైనది కావచ్చును. గాలియు నీరును, దగిన సూర్యరశ్మియు, ధాతూపధాతు సంపదయు, నుచిత సమ్మేళనమువలనఁ బ్రాణివర్గసంజనకంబు లగును.

చంద్రుఁడు భూమివైపున కెల్లప్పు డొకభాగమె కనఁబడఁదిరుగునటులు బుధుఁడును సూర్యునివైపున కెల్లపు డొకభాగమె యుండురీతి నడచునటులు కానిపించినను, బుధుమండలమందుమాత్రము గోళమందలి యన్నిభాగముల కొకప్పుడు కాకపోయిన నింకొకమాఱు సూర్యరశ్మి తగులుచుండును. ఆరశ్మి వలన విషువత్ప్రాంతప్రదేశములు తద్దేశపార్శ్వములం దేడుభాగల పర్యంత ముగ్రముగ నుండినను దక్షిణగోళము నందు మాత్ర మంతవేఁడి యుండదు. దీనికిఁ దోడుగఁ గక్ష్యావైషమ్యకారణముంబట్టి ప్రస్తుత మింగ్లాండు దేశమందలి శీతోష్ణవిభాగములకు సాటియైన ఋతుభేదాభాస మచ్చటఁ గలుగవచ్చును. కావున బుధలోకమందుఁ జాలభాగము వేఁడి మానవమాత్రు లైనను సహింప ననువుగ నుండవచ్చును. గోళమధ్యమందు మాత్రము మహామరుప్రదేశములు వ్యాపించి రాళ్లు పగులునంతటివేఁడిమితోఁ దహతహ లాడుచుండవచ్చును.

మఱియు నెండవేఁడిమి హెచ్చుగ నున్నను గాలియొక్క స్వభావమును బట్టియొకానొకప్పు డదిసహింపవచ్చును. కొంద ఱనునటులు బుధమండలమున స్వల్ప వాతావరణమాత్రము కల దనుకొందము. దీనివలన లాభనష్టములు విచారించుటకు భూమండలసాదృశ్యము లాధారములు చేసికొని చూడ హిమా లయపర్వతాగ్రమందలి పరిస్థితు లచ్చటఁ గలవేమొ యని యనుమానింపఁ దగును. హిమాలయపర్వతములందు సూర్యాంతరతిగ్మమువలన నీరు స్వేచ్ఛగ మఱిఁగి పోఁగలదు. కాని యచ్చట వాతావరణ మతిశీతముగ నుండు నని

తెలియును. దీనికిఁ గారణము గాలి పలుచనగనుండి, సూర్యకిరణములకుఁ దోఁడెక్కుకొనుటయే. మానవునకు వసనం బెటులో భూమ్యాదిగోళములకు వాతావరణ మట్టి దని చెప్పవచ్చును. దుకూలము లుష్ణము నాఁపను, శీతలము వారింప నెట్లు సమర్థములు గావో యటులె, పలుచనిగాలియు నెండవేఁడిమి వారింపఁజాలదు. రాత్రులందు భూతలమునుండి మహాకాశమునకుఁ బ్రవహా[1]వినమునఁ బ్రసరించి పోవు వేఁడిమి నాఁపఁజాలదు. కావున రాత్రులందు మితిమీఱిన శీతలమును బవళ్లయందు దుస్సహతాపమును బుధలోకమునందుఁ బ్రసరించుచుండవలయును.

అటులున్నను, దల్లోకమున మేఘాచ్ఛాదనములు తఱచు గనఁబడుచున్నందున నచ్చట నీరు కల దని నిశ్చయింపవలయును. ఈమేఘములు కొంతవఱకుబుధమండలమును సూర్యరశ్మి నుండి కాపాడుటకును, దీర్ఘరాత్రులయందు బుధతలము శీతలమున గజగజలాడకుండఁ గావను వినియోగించుచుండును. ఎటులైనను, విషువత్ప్రాంత దేశములు పెద్దయెడారులై, సర్వకాలములందుఁ దెకదెకలాడుచు, నచ్చటి లోకులఁ 'జేరవలదు చేరరావల' దని నిత్యము భర్జించుచుండు ప్రాకృతికరక్షకయోధులటులు, నుత్తరగోళార్ధవాసులు దాక్షిణాత్యులను, దాక్షిణాత్యు లుత్తరవాసులను గలసికొనకుండఁ జూచుఁగాక. అయినను సాహసశీలురును, మేధావంతులునైన సౌమ్యప్రజ లుష్ణమండలము లెచ్చటనైన గోసుగ సన్నగించి యమెరికాఖండపశ్చిమోత్తరకోణము నాశియాఖండపూర్వోత్తరకోణమును, పరస్పరకరచాలనోత్సవోన్ముఖము లైనటు లున్నతెఱంగు సమీపింపవేని లాఘవమున నేచీఁకటిచాఁటునో యొకదాఁటు దాఁటకపోవరు. దీనికిఁ దోడుగ నచట గురుత్వాకర్షణ భూమ్యాకర్షణమునందు నాలవపాలగుటచే, వాస్తువిద్యాప్రవీణులకు సులభప్రచారము లగును గానఁ బెద్దవంతెనలో సురంగములో నిర్మించి వారిలోకమున కుపకారములు గావించుకొనుచుందురు. బుధలోకము చంద్రలోకమంత గొడ్డునేల కాదు కాని, జీవనమున కతికష్టభూమి యని మాత్రము స్పష్ట మగుచున్నది కదా.

ఘేరం వేంకటాచలపతి.

[1] Radiation. [2] Mechanical Engineering.
దానికే కళా'విద్యయనియుఁ బేరుకలదు.

# నూతన గ్రంథములు.

ఈ క్రింది గ్రంథములు మా కార్యస్థానమునకుఁ దత్కర్తలచేతఁ దత్తదధికారులచేతఁ బంపఁబడినవి.

1. పద్మపురాణము, రాజా మల్లారెడ్డికృతము శ్రీ రాజా రాజేశ్వర రావు బహదర్ గారు, దోమకొండ సంస్థానము - అమూల్యము.

2. జీవన్మృత రహస్యము (నవల) కాకినాడ ఆంధ్రప్రచారిణీగ్రంథ నిలయమువారు, రూ. 1-8-0.

3. ఆంధ్రనైషధసారము, అత్తలూరి సూర్యనారాయణగారు, ఈమని గుంటూరుజిల్లా, రూ. 0-12-0.

4. నారాయణాచల మాహాత్మ్యము, అల్లమరాజు రంగశాయికవి - శ్రీ చెలికాని లచ్చారావుగారు చిత్రాడ, రూ. 0-12-0,

5. ప్రాచీన విద్యాపీఠములు, చిలుకూరి నారాయణరావుగారు ఎం.ఏ., రాజమహేంద్రవరము, రూ. 1-14-0.

6. ప్రాచీనాంధ్రనౌకా జీవనచరిత్రము, భావరాజు వేంకటకృష్ణారావు గారు, బి.ఏ. బి.ఎల్., రాజమహేంద్రవరము, రూ. 1-0-0.

7. శివపురాణము వచనము - వేంకటపార్వతీశ్వర కవులు - ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయము (కాకినాడ) రెండుభాగములు, 1-కి రూ. 1-8-0.

8. ఆంధ్రపరిశోధక మహామండలి సంచిక - శ్రీ చెలికాని లచ్చారావు గారు చిత్రాడ, గోదావరిజిల్లా, రూ. 1-8-0.

9. తంజావూరు సరస్వతీపుస్తకభాండాగారము (1922-23) నివేదిక.

10. శ్రవణ బెల్గోళ శాసనములు, మైసూరు గవర్నమెంటువారు.

11. శ్రీరామాస్తోత్ర నక్షత్రమాల, బల్లూరి కృష్ణప్పగారు, అలూరు అ. ౨.

పక్రమమీనధామగృహపాలనిజధ్వజినీమహాపుర
శ్చక్రము నిర్గళజ్జ్వలనశోషితనక్రము నాత్మచక్రముల్. ౧౯౨

క. తలఁచిన నిలిచె సుదర్శన, మలఘుసుదర్శనము సజ్జనానందంబుం
దలకొలుప నరిప్రభయము,[1] నెలకొలుపఁగ నృహరికేల నిర్భరలీలన్. ౧౯౩

వ. ఇట్లు శరభనృసింహులు సంహారరుద్రాకారులై జగదుపప్లవకారణం బగు మహారణంబునకు నుపక్రమించి శూలచక్రంబు లెత్తుటయు మొగులుమొత్తంబులు నెత్తురులు గురిసె ధరణి విరిసె గిరులు వడంకె సముద్రంబు లివురం బాఱె మహాకూర్మంబు బిలంబుఁ దూఱె నరనాగసురాసురగరుడగంధర్వసిద్ధసాధ్యు [2]లసాధ్యం బగుమనస్తాపంబునం దపించిరి భూతప్రపంచంబు కుంచితసంచారం బయ్యె నంత. ౧౯౪

బ్రహ్మ హరిహరులయుద్ధము మాన్పవచ్చి స్తుతించుట.

సీ. హస్తాబ్జమునసున్న యక్షమాలిక వ్రేవ వైచి మ్రోలను నున్న వాణి మఱచి
హరిపాదతీర్థపూరాభిపూరిత మైన పద్మరాగపుగిండి పగుల నడిచి
నలువంక మొగములఁ దలచూపు చెమటల మంచు నేత్రంబులముంచుకొనఁగఁ
గీలుగంటూడిన లోలజటాచ్ఛటావళి యొకకేలనె బలిమిఁ దుఱిమి [కుసు
కోపమో కాక యావేశగుణమొ కాక, గ్రహముసోఁకెనో కాకయీద్రుహిణుఁ డన
నను చు జనములు బెగడంగ నంచ తేజి, రౌతు కాల్నడ వచ్చె నుదఘ్బాతభీతి[3]

క. సమరము సేయుచు ఘూర్ణిలు, నమరేంద్రుల నడుమ నిలిచి యాగమసూక్త
క్రమమున నుతియించు వచో, రమణీరమణుండు చతురరచనారభటిన్.

సీ. జయ పుండరీకాక్ష జయ ప్రమథాధ్యక్ష జయ రమాతరుణీశ జయ యుమేశ
జయ యోగిగణసాధ్య జయ సజ్జనారాధ్య జయ చైత్రగుణజాల జయ సుశీల
జయ భక్తమందార జయధవళాకార జయ కవిస్తుతిపాత్ర జయ పవిత్ర
జయ సముజ్జ్వలవేష జయ తిరస్కృతదోష జయ మేఘసంకాశజయమహేశ
జయ సువర్ణపటావృతస్థపుటజఘన, జయ మృగాదనచర్మసంఛాదనఘన
జయ గదాపాంచజన్యాసిచక్రహస్త, జయ త్రిశూలాదిశస్త్రరాజప్రశస్త.

చ. జయ ఫణిరాజతల్ప జయ సర్వజగన్నుత కౌస్తుభాంకితా
జయ నరసింహరూప జయ శాశ్వత వార్ధితనూభవాధిపా
జయ రజతాద్రిగేహ జయశంబరశాత్రవభూతిభూషితా
జయ శరభావతార జయ శంకర శైలసుతామనోహరా. ౧౯౫

[1] గరిప్రభయము. మూ; [2] లసాధ్యంబులగు. మూ. [3] నుదఘ్బాతభూతి. మూ.

సీ. వెడఁదయురంబున నెడమభాగంబునఁ జలువపుట్టిండ్లకొమ్మలు చెలంగ
మడుఁగుఁబొన్నను గేళికడియంబునై గాడ్పు ప్రత్తిలక్కయునైన ప్రాణిదనరఁ
బ్రబలనాభీజటాపటలాంచలంబులఁ గమలంబులొక రెండు కాంతిమీఱ[లఁగఁ
నొఱపైన సాంబ్రాణియునుముద్దుగొడుకునై యనురాగమునవినాయకులుమె
బంచజనసింహశరభరూపములుదాల్చి, ప్రాణమునుమేనుఁబోలెనున్నట్టిమీకు
వందనంబును నతి నమోవాక మంజ, లియును గావింతు నాదిమలేఖులార.

వ. అని యిట్లు నృసింహశరభరూపంబులు ధరియించిన కాంచనాంబరపంచవద
నులకు విరించి వందనంబు లందంద కావించి వెండియు నిట్లనియె. ౨౦౦

గీ. ప్రజలఁ బ్రోచుపనికి బద్ధకంకణు లైన, యఖిలమయులు మీర లాగ్రహమున
మేరమీఱి పోరు కారణంబునఁ దమ్మి, యాకుమీఁదినీర మయ్యె జగము.

శా. భూమీకంటకు లైనదైత్యవరులం బోనీక శౌర్యక్రియా
సామగ్రి న్మలుచూపువారిశిరము ల్చక్కాడి యుక్కెక్కి యు
ద్దామఖ్యాతిఁ జెలంగుట ల్విడిచి భూతశ్రేణి భీతిల్లఁగా
నీ మేరిద్దఱుఁ బోరుట ల్తగునె లక్ష్మీశా యుమావల్లభా. ౨౦౨

క. మీరిరువురు భువనావన, కారణములు మీర లిట్లు గదిసి పెనఁగిన
న్నేరుచునె సర్వకర్మ, ప్రారంభము చక్క నిలువఁ బ్రకృతిస్థంబై. ౨౦౩

గీ. ఈతమోవికార మేటికి మీకు మీ, నామపఠనమాత్ర నరులకెల్లఁ
జిక్కువడిన మనసుచీఁకట్లు వాయంగఁ, దెలిసికొనుఁడు మీప్రదీప్తమహిమ.

క. ఎదిరినపగ మీలోపల, ముదిరినయది లేదు లోకములు గూఁకలిడం
గదనము సేయఁగఁ దగునే, మదనజనక మదనదమన మానుఁడు గినుకల్

సీ. కైటభమధుశిరఃఖండనావక్రంబు చక్రంబు తేజ మసహ్యతరము
లోలకాలానలాభీలాననం బైన శూలంబు జనమునశ్యాలగదము
గావున నివి రెండుఁ గదనజయాకాంక్ష మీరు ప్రయోగింప మేర లణఁగు
నావిన్నపము విని నన్నుఁ జాల మన్నించి యుపసంహరింపుఁ డీయుగ్రసాధ
నముల నని నల్వ ప్రార్థింప నలిననేత్ర, ఫాలనేత్రులు తమపూఁచిపట్టియున్న
యాయుధంబులు క్రమ్మఱునట్లు సేయ, భూతజాలంబు సంతోషమునఁ జెలంగె

వ. ఇట్లుపసంహృతాయుధం బై యాయోధద్వయంబు. ౨౦౭

క. కర్పూరదీపకళికల, నేర్పునఁ దమయంత నుడిగి నిర్మలకాంతుల్
దర్పింప శాంతిమయమ్ము, ద్దర్పణమై నిలిచె భువనతాపము నుడిగెన్ ౨౦౮

సీ. వైజయంతీలతోజ్జ్వలభుజామధ్యంబు విధిశిరోమాలికావేల్లితంబు
హరిచందనామందతరసౌరభమయంబు సూనాస్త్రతనుభూతిసురభితంబు
దివ్యతీర్థాఘమందిరపదాంభోజంబు మందాకినీవృతమకుటతటము
చక్రప్రముఖదివ్యశస్త్రాస్త్రకలితంబు శూలాదిసాధనశోభితంబు
నీలనీలంబు మృదుఫేనజాలనిభము, గరుడవాహంబు వృషభప్రకాండరథము
నైనరూపంబుహరియునుహరుఁడుఁదాల్చి,నిల్చిపొల్చిరిబహురామణీయకముల.

సీ. ఆమ్నాయసూక్తి హృద్యముగాఁగఁ గీర్తించె సనకాదియోగీంద్రసంచయంబు
శబ్దానుశాసనసౌభాగ్యమధురంబుగాఁ గాద్రవేయపుంగవుఁడు పొగడెఁ
బరమమంత్రరహస్యపరిపాటి వాటిల్ల సైద్ధలోకంబు ప్రశంసచేసె
సంగీతమాధురీసాధురీతి సెలంగఁ గిన్నరగంధర్వులు న్నుతించి
రఖిలభువననివాసు లాయాయితెఱఁగు, లేర్పడ భజించి రాకంసదర్పహరుని
సర్పహారుని స్ఫారప్రచార ముడిగి, రాజబింబాభిరాములై తేజరిల్ల. ౨౧౦

మాలిని. హరిదిభకటదానాయత్తమత్తాలిపంక్తుల్
మరులుకొనుచు వెంట న్నాటికి న్నాటికి న్నా
సురకరపరిముక్తాక్షుద్రనిర్ణిద్రపుష్పో
త్కరము ముసురు వట్టెన్ గంధపాణింధమంబై. ౨౧౧

క. సింధునినదగాంభీర్య ధు,రంధరములు త్రిదివసౌధరంధ్రగతంబుల్
బంధురములు సురదుందుభి, ధింధిమములు చెలఁగె సకలదిక్కులయందున్.

వ. ఆసమయంబున వాసవాలయవధూనాట్యవైదగ్ధ్యంబులు విదగ్ధనయన రంజ
కంబులై చెలంగె భృంగీశ్వరుం డావతంగధ్వజపుంగవధ్వజుల నిజమనోవృ
త్తంబు తనచిత్తంబున నెఱింగి నాట్యరంగంబున నిలిచి మృదంగతాళవీణా
వేణునినాదంబులు క్రందుకొనఁ బతాకత్రిపతాకాదు లైనయసంయుతచతు
ర్వింశతిహస్తంబుల నంజలికపోతస్వస్తికప్రధానంబులై సంయుతంబులైన త్ర
యోదశకరంబులును జతురశ్రరేచితార్ధరేచి తాభిధానంబు లైతనరు త్రిం
శద్గాత్రో ....పాణితలంబులఁ బ్రయుక్తంబులైన ముద్రావిశేషంబుల భావార్థా
భినయంబు చూప నంగప్రత్యంగోపాంగరూపంబు లగునవయవంబులచేతఁ
దంతన్యమానం బై మార్గకుండలిదేశ్యోద్ధతబహురూపవిలాసంబు లనంబ
రఁగు షడ్విధంబులం బ్రవృత్తంబులై తత్కృతంబు లైనచౌకంబును మొగ
చాళియు నిస్సరణంబును నటనంబును భావంబునుజవుకునుదలారంబును మం
డలంబును నాయుధచారులును దిశయు నపదిశయుఁ దట్టుమానంబును దల

చంచును జచ్చ్ళికెయుఁ జిత్రతాళంబును సల్లు కత్రంబును నురుపును దువా
ళంబును బుష్పాంజలి మొద లయిన నటనపటిమంబులు తాళలయంబు లను
సరించి రూపక వార్తిక చిత్రక మానంబులం బ్రవర్తించు చంచుపుట చాచ
పుటాది తాళభంగులెఱింగి యంగహారకరణస్థానకవృత్తిమండల సంయుక్తం
బుగఁ దాండవం బఖండపాండిత్యంబునఁ బ్రకటించుటయు నన్నిటలన
యనహాటకపటులు హాటికం బగునమ్మహాపారిషదునిం బారితోషికప్రదా
నంబున సన్మానించి రంత విరించి యప్పరమపురుషులం గూర్చి యిట్లనియె.

సీ. ఇది హేమమయపీఠ మే మున్ను గల్పించి పాటించి దాఁచితిఁ బాటవమున
నని బహుయోజనాయతము మాణిక్యసింహాంచితంబును నసర్ఘ్యంబు నైన
గద్దియ యొకటి వేగంబ యాకర్షింప నది భానుబింబసహస్రతుల్య
మగుచు నిల్చుటయు నాహర్యక్షుపీఠిపై నజుఁడు నిల్పఁగ హరిహరులు నిలిచి
నీలమునువజ్రఫలకంబుఁబోలియుత్ప, లంబుఁగుముదంబుననఁదగిలచ్చితోడి
యురమునగరాజపుత్రిక కునికి యైన, యెడమవంకయుఁ గలిగి శ్రీనిరవుకొనిరి.

గీ. అట్టివేళ నలువ యానందజలరాశి, నోలలాడుచున్నయుల్ల మలర
లోకనాథు లట్టు లేకాసనస్థులై, తేజరిల్లఁ గని నుతించె మఱియు. ౨౧౫

మ. ఘనసంసారసముద్రవారినిజదుష్కర్మాగతానేకరో
గనిపీతాంగవిలాసు లై ధనసుహృత్కాంతావియోగార్తి సం
జనితం బైనమనోవ్యథం గుదియు తుచ్ఛస్వాంతు లెల్లన్ జనా
ర్దన నీపాదపయోజపత్రజలధారల్ గ్రోల రేకాలమున్. ౨౧౬

క. ఉపవాసక్రతుదానము, లపరిమితము లాచరించు నైనం గానీ
త్రిపురాంతకసఖ నీయెడ, నపరాధము దలఁచెనేని యతియును యతియే.

క. నీనామస్మరణంబును, నీనామజపంబుఁ జేయు నిశ్చలహృదయుల్
శ్రీనాయక యపవర్గత, మానాయకు లగుదు రమరమానితు లగుచున్.

క. [1]బుజవైచిత్రి వసురేంద్రుని, భుజమధ్యము చించి భువనమునఁ గలబాధల్
గజరాజవరద నీయు, క్కుజపునదటు నుదుటు మున్ను గని మది మెత్తున్.

క. దానవు నెపమునఁ బొడమిన, నీనిర్భర తేజ మిట్లు నిఖిలము నొంచెం
గాని జగన్నాయక నీ, మానస మీజగముమీఁద మచ్చరపడునే. ౨౨౦

వ. అని హంసవాహనుం డాహరిం బ్రశంసించి హరున కభిముఖుండై యి ట్లని
నియె. ౨౨౧

[1] భుజ. మూ.

చ. పురమథనం బొనర్చితివి పొంగువిషానల మారగించి ని
ర్జరులకు మేలుఁ జేసితివి చంగునఁ బైఁబడు బెబ్బులిన్ భయం
కరకరశూలఘాతములఁ గాలుని ప్రోలికి నంచి మించి తీ
శ్వర భవదద్భుతోద్ధతి ప్రశంసయొనర్పఁగ నాకు శక్యమే. ౨౨౨

క. భవదాకారము లింగ, వ్యపహృతిపై నావహించి యాగమసరణిం
దవిలి భజియించు శైవులు, కవయుదు రతిధన్యముక్తికన్యావిటులన్ ౨౨౩

సీ. చక్కాడితివో లేదో సంవర్తమున జగజ్జాలంబు శూలంబు కేలఁ గ్రాల
ముక్కుచెక్కితో లేదో ముక్కలంబుననట్టుద్రొక్కిమృత్యువునెత్తితోడుపుఁగత్తి
వ్రక్కలించితో లేదో వారణాసురగాత్రగోత్రంబు నఖరాగ్రదాత్రలతలఁ
జెక్కవ్రేసితో లేదో జక్కవచెలికానిఁ బట్టి గీపెట్టి లోఁదట్టువాఱ
మఱియు నీవొన[1]ర్చమానుషక్రమములు, లెక్కసేయువారు లేరు నిజము
గజముఖప్రసూతి గలవేల్ప నా యల్ప, జల్పసరణి నీప్రశంస కురునె. ౨౨౪

## అవతారద్వయోపసంహారము.

వ. అని పంకజాసనుం డాసారాకారసుధాధారం బగువాక్యప్రకారంబున సారె
సారెం బొగడిన నగుమొగంబు లోలయ నాజగద్రక్షకు లిద్దఱు నావేల్పుఁ
బెద్ద పెట్టినగద్దియపై నతనికోరిక లీరికలెత్త నీరంబు నీరంబును దుగ్ధంబు
దుగ్ధంబును బారదంబు పారదంబునుం గలసినకరణి నేకీభవించి రాహరిహర
రూపం బాపద్మసంభవునకు వరప్రదానలాభంబై శోభిల్లె నాక్షణంబ. ౨౨౫

గీ. బీజ మొకటె రెండుభూజంబు లుదయించు, నోజ నట్టిదివ్య తేజమునను
హరియుహరుఁడుసంగతాంగులైయుదయింప,వదనవలయమమరెవనజజునకు

సీ. మందారదామంబు సిందుఖండంబును మౌళిభాగంబునఁ గీలితముగ
మణికుండలమ్మును ఫణికుండలమ్మును గండమండలముల మెండుకొనఁగఁ
జక్రాంకశూలాంకశయముల మాణిక్యకంకణభుజగకంకణము లమరఁ
గనకకౌశేయంబు గజరాజచర్మంబు మునుకొని కటిభాగములఘటిల్ల
రమయునుమయును నుభయపార్శ్వములనలరఁ
బులుఁగుఱేఁడును నందియుఁ గొలిచి మెలఁగ
వైష్ణవశ్రేష్ఠులును శైవవరులుఁబొగడ
హరిహరస్ఫూర్తి యేకదేహమున నిలిచె. ౨౨౬

వ. ఇట్లు నారాయణస్థాణువు లొక్కతనువునం గ్రిక్కిఱిసిన నెలవు హరిహరాభి
ధానం బగుమహాతీర్థప్రధానం బయ్యె నందు. ౨౨౭

[1] నీవొనర్చు. మూ.

సీ. తానంబు లొనరించు ధన్యుఁ డాకాశగంగానదీకల్లోలఘటల నీఁదు
దానంబు గావించుధర్మతత్పరుఁ డర్థపతినిధానములకుఁ బ్రభుతఁ గాంచు
రోగంబుగలవారిఁ బ్రోచుపుణ్యాధికుం డేబాధయును లేక యెసఁగు దివిని
నుపవాసజపతపోహోమంబు లొనరించు కృతిఁ గీర్తనము సేయుఁ గిన్నరాళికుఁ
హరిహరారాధనము నన్వహమునుజలుపు, నిష్ఠనిను బాడు[1] వారలనిలయముల
జాల వశవర్తి యై యుండు సకలలోక, గర్భపరిపూర్ణకీర్తి సందర్భుఁ డగుచు.

వ. అని రోమహర్షణుం డమ్మహర్షులకు నరసింహశరభసమరవ్యాజంబున హరి
హరతేజోవిశేషం బశేషంబును వర్ణించి వెండియు నిట్లనియె ౨౩౦

క. శరభనృసింహులచరితము, నిరుపమసద్భక్తి వినిన నిర్మలమతులై
నరులు సుఖింతురు సుస్థిం, బరమైశ్వర్యానుభావభావితు లగుచున్. ౨౩౧

క. హావళిచినయాభళవసు, ధావల్లభమంత్రివర్య ధైర్యాహార్యా
ధీవిభవతోషితార్యా, పావననేత్రాబ్జయుగ కృపారసధుర్యా. ౨౩౨

ఉ. దానవిలాసకంధర ప్రధానయుగంధర హారకంధరా
మానవతీమనోభవ సమగ్రరమాభవ జిష్ణువైభవా
మానవిధానుయోధన సముంచితబోధన సద్యశోధనా
మానసవైరిభీషణ తమఃపరిశోషణ బంధుపోషణా. ౨౩౩

తోటకవృత్తము. దినకృద్ద్యుతివత్పరిదీప్తివిభా, వనరాశినివాసనివాసమనా
వినయోజ్జ్వలభూషణవీర్యనిధీ, ధనరాశివితీర్ణకథాచతురా.

గద్యము. ఇది శ్రీహనుమత్కటాక్షలబ్ధవరప్రసాద సహజసారస్వత చంద్రనామాంక భారద్వాజసగోత్రపవిత్ర రామవిద్వన్మణికుమా రాష్టఘంటావధాన పరమేశ్వర హరిభట్టారక ప్రణీతం బైననరసింహపురాణోక్తం బగునుత్తరభాగంబునందుఁ బ్రహ్లాదప్రతిష్ఠాపనంబును రాక్షసులతపోమహత్త్వంబును వారలకు హరుండు ప్రత్యక్షం బగుటయు నారదాగమనంబును నందికేశ్వరనారదసంవాదంబును శరభావిర్భావంబును శరభనృసింహులయుద్ధంబును బితామహసమాగమనంబును బ్రహ్మస్తవంబును నవతారద్వయోపసంహారంబును హరిహరక్షేత్రమహత్త్వంబు ననంబరఁగు ప్రథమాశ్వాసము.

[1] నునువాడు. మూ.

# నరసింహపురా

## ఉత్తరభాగము

### ద్వితీయాశ్వాసము.

---

క. శ్రీరమణీహృద్రంజన, నారాయణచరణయుగళనీరజసేవా
పారాయణ పరితోషిత, నారీనివహాంతరంగ నరసయరంగా. ౧

వ. ఆకర్ణింపు మట్లు శౌనకాదిమునివరులు రోమహర్షుని వలన శరభావతారవృ
త్తాంతం బెఱింగి సంతసించి మఱియు ని ట్లనిరి. ౨

క. నరసింహదత్తరాజ్య, స్థిరుఁ డై ప్రహ్లాదుఁ డేమి చేసెనొ తుదఁ ద
చ్చరితంబు వినఁగవలయును, బరిపూర్ణవచోవిశేషపరమార్థజ్ఞా. ౩

వ. అని పలికిన మునివరులకు రోమహర్షణుండు సంతుష్టహృదయుం డై యి
ట్లనియె నట్లు ప్రహ్లాదుండు నరసింహరూపంబు ధరించిన లక్ష్మీవల్లభుని వర
ప్రసాదలబ్ధం బగురాజ్యంబు నిష్కంటకంబుగఁ బాలనంబుసేయుచు. ౪

సీ. కండక్రొవ్వున రేసి కలహింపఁబూనిన సకలశాత్రవకోటిఁ జక్కఁ జేసి
న్యాయంబువిడిచియన్యాయమార్గంబునఁజనఁబూనుక్రూరులఁజదియమోది
పరకామినీధనాపహరణోద్యుక్తులౌ చక్రాంకసమయదూషకులఁ దునిమి
శ్వాపదధ్వంసి యై సారంగశశశల్యరురుముఖ్యములకు నారోగ్య మొసఁగి
జవ్వనపువింతసంభృతోత్సాహుఁ డయ్యుఁ, గామరోషాదిరిపులచేఁ గట్టువడక
సవ్యధర్మప్రతిష్ఠాపనంబుచేత, నొసఁగెఁ బ్రహ్లాదుఁ డానందరసము రసకు. ౫

క. తమనోరికల్లు గొని వై, రముసం గారించు దైత్యరాజు మఱచి యా
గములఁ బురోడాశము లా, యమరేంద్రాదులు భుజింతు రతనిముఖములకా.

సీ. కలుషసంఘాతంబు గడికండములుచేసి దోషంబులకుఁ జేటుఁ ద్రోవఁ జూపి
యేనస్సమూహంబు లీనంబుగావించి వృజిననిర్బంధంబు వీడఁదన్ని
యంహోనికాయోగ్రరంహంబు బిట్టాఁగి దురితంబు లింతింత దుమురు చేసి
దుష్కృతశతముల ధూళిలో మ్రగ్గించి పాపరూపము పటాపంచ[1], చేసి
ధరణిధేనువు నాల్గుపాదములనిలిచి, తుష్టిఁబురుషార్థమయపయోవృష్టిఁగురియ
నేలె రాజ్యంబు దానవాధీశసూతి, నాలుగంచుల నవయావనంబునందు. ౭

[1] పటాపంచు, మూ.

సీ. పౌలోమిపాలిండ్లపంచఁ జెక్కిలి చేర్చి సుఖియించె బలపాకసుఖవిరోధి
జముఁడు నారకలోకసౌఖ్యోపదేష్ట యై వర్తించె నతిభద్రవర్తనముల
వరుణుండు గావించె సురతరుప్రసవనిర్గళదచ్ఛమధుపానకౌతుకంబు
వెలిఁ బాఱవైచిన వివిధనిధానంబు లర్థాధిపతి తెచ్చె నాలయమున
కాచరించిరి నిర్విఘ్నమగుతపంబు, మునులు కాలంబు దప్పక చినికె మొగులు
నారసాతలధరణీసురాలయములు, పూర్వగతి నిల్చెఁ జాంచల్యమును[1] దొలంగి.

సీ. అశ్రులు హోమధూమావృతాక్షులయందె మద మత్యుదగ్రద్విరదములందె
వర్ణసాంకర్యంబు వ్రాయుచిత్తరువందె దృఢబంధకలన సత్కృతులయందె
చిరవక్రగతి వధూచికురవల్లరులందె కంపంబు కేతనాగ్రములయందె
తొట్రుకొంట గవాక్షధూపధూమములందె జాడ్యంబు కేలిహంసగతియందె
యధికమగు లేమి లేములయందె యతను,వృత్తివర్తనములయందె వెలయుఁగాని
లేదు ప్రహ్లాదుఁ డేలెడు మేదినీత, లాంతరాళంబునందు నొక్కింత యైన. ౯

సీ. ఇభగండదానవాహినులు ఘోట్టాణాశ్వఖురపుటరజముచేఁ గ్రుక్కఁబాఱ
నామతీర్థపువేళ నారదముని తనపదములు మధువైరియెదుట నాడువ
శరలూనశత్రుశీర్షములు గన్గొని రాహువక్త్రంబు లని వివస్వంతుఁ డులుకఁ
గీర్తిచంద్రుఁడు పరిస్ఫూర్తిమన్మూర్తి యై భువనజీవంజీవములఁ బొదల్ప
వాసవపురి వితానవిన్యాసముగను, నేల పాదాంగుళీరవినీలముగను
నల్లబలియిక్కబొక్కసమిల్లుగాఁగ, వెలసెఁ బ్రహ్లాదుఁ డాహ్లాదకలితుఁ డగుచు.

ఉ. ఖేచరవైరినందనునికీర్తి దిశావళిఁ బిక్కటిల్లఁగాఁ
జూచి చకోరరాజి నలుచుట్టులుఁ ద్రిమ్మరుఁ జంద్రికామతిన్
వాచవి నంచపిండు గఱవం దమకించు మృణాలవల్లరీ
వీచిక లంచు నిట్టిశుభవిభ్రమశోభితుఁ డెందుఁ గల్గునే. ౧౧

క. ముసలహతి నసుహృదిభకట, విసర మసురపతి వగుల్ప వెడలినముక్తా
మసృణరజోమండలిసాం, పెసఁగుం దత్కీర్తిమూర్తి హేలావహ మై. ౧౨

క. మరుదశనభువన మేలెన్, హరిహయపుర మేలె ధరణి యంతయు నేలెం
దరతమభావజ్ఞుం డై, హిరణ్యకశిపూద్భవుం డహీనప్రౌఢిన్. ౧౩

సీ. ఏ వేళఁ జూచినా యింద్రాదిదేవతాలబ్ధోపదానలీలావిభూతి
యేప్రొద్దు చూచినా హితపురోహితముఖోదితతత్త్వవాక్యసంగతమనీష

---

1 జాంచల్యమున.

శబ్దమునకు, అశ్వినీదేవతలకుఁ బేరైన "నాసత్య" శబ్దమునకు, ఇంద్రశబ్దమునకు జెండవెస్థలో రాక్షసుఁ డనువిపరీతార్థ మెట్లు వచ్చినదో శబ్దశాస్త్రవేత్త (Philologists) లెవ్వరును జెప్పఁజాల రైరి. అపాన్నపాత్, గంధర్వ, యమ ప్రభృతి దేవతానామములు జెండుభాషలో నున్నవి. హిందువులు తప్ప నిత రార్యశాఖలవా రీదేవతానామముల నెఱుంగరు. ఇవిగాక యింకఁ బెక్కుశబ్ద ములు సంస్కృతమునకు జెండుభాషకుఁ బోదుపుగా నున్నవి. అవి యీ దిగువ వ్రాసిన పట్టికలోఁ జూపింపఁబడును.

| సంస్కృతము. | జెండు. | సంస్కృతము. | జెండు. |
|---|---|---|---|
| అశ్వతర - - | అస్తర్ | నౌస్ | నావి |
| అద్వేష - | అద్వేష | తక్షన్ - - | తస్‌హాన్ |
| అనృత - - | అనరత | క్రవిస్ (flish) | కృవిద్రు |
| | | | bloody spean |
| అనర్థ - - | అనరేథ | అసి | అసి |
| అనార్య - | అనైర్య | మజ్జా - | మంగా |
| శ్యేన - - | శేన | మధు - - | మధు |
| కశ్యప - - | కశ్యప | తన్ (to stretch) | తన్ |
| మత్స్య - - | మస్య | వయామి - | ఉఫ్‌యేమి |
| సేతు - - | హేతు | పిష్ - - | పిష్ |
| సోమ - - | హోమ | విష - - | విష |
| సేన - - | హేన | కలమ - - | ఖలమ్ |
| సూను - - | హూను | ఉర్వరా - - | ఉర్వర |
| మాతా - - | మాత | అజ్ర - - | అజ్ర |
| పితా - - | పిత | రథ - - | రథ |
| | దుగ్ధర్ | | |
| భ్రాతృ - | భ్రాతర్ | చక్ర - - | ఛఖ్ర |
| శ్వసుర - | హ్వసుర | ధాన (corn) - | దాన |
| జామాతర్ | జామాతర్ | యవ - - | యవ |
| స్నుషా - | సుహ్నర్ | సమా (year) | హామా |
| పతి - | పైతి | ద్రు (tree) - | ద్రు (spear) |
| పశు - | పసు | శరద్ - | సరధ |
| పాయు (annus) | పాయు | హిమ | హిమ |

| సంస్కృతము. | జండు. | సంస్కృతము. | జండు. |
|---|---|---|---|
| ఉక్షన్ - - | ఉఖ్ష్న్ | అశ్మన్ - - | అస్మన్ |
| గో - - - | గయో | ఇషు - - | ఇషు |
| వత్స - - | వత్స | హారిత - - | జరిత |
| వృషన్ - - | అర్షాన్ | హిరణ్య - | జరణ్య |
| సూకర - - | హు | రజత - - | ఇరజత |
| శ్వన్ - - | స్పన్ | అయస్ (steel) | అయస్ |
| అశ్వ - - | అస్ప | జని (wife) - | జని |
| పుత్ర - - | పుద్ర | శిరస్ - - | సర |
| క్రిమి - - | కెరిమ | పార్ష్ణి - - | పష్న |
| అహి - - | అఝి | బాహు - - | బాజు |
| వి (bird) - | వి | భ్రు (brow) - | బ్రువత్ |
| దక్షిణ (Right) | దస్హిన | అక్షి - - | అషి |
| జాను - - | ఝను | అశ్రు - - | అస్రు |
| కక్ష - - - | కస్హ | యకృత్ - | యకర |
| శ్రోణి - - | స్రయోని | విద్ - - | విద్య |
| దంత - - | దంతన్ | జ్ఞాన - - | జన్ |
| పత్నీ - - | పద్నీ | బుధ్ - - | బుద్ |
| వృక - - | వ్హ్రక | భాగ - - | బాఘ |
| ధామన్ - - | దామన్ | హృదయ - | జరధ్య |
| ద్వార - - | ద్వార | | |
| పథన్ - - | పథ్ | | |

జండు సంస్కృతభాషలు కొంచెము హెచ్చుతగ్గుగాఁ గవలపిల్లలవలె నున్నను దత్లక్షణములలో భిన్నముగా నున్నవి. గ్రీకు, Latin, శ్లావోనిక్, ట్యూటోనిక్, కెల్టిక్ భాషల శబ్దములతో సదృశమయిన శబ్దములు సంస్కృత భాషలో ననేకము లున్నట్లు పైపట్టికవలన స్పష్ట మగుచున్నది. కాని జండు భాషలో నొకపద మయిన నాభాషాపదములకు సదృశ మయినది కానరాదు. జండుభాష యల్పమయి యుండుటయే దీనికిఁ బ్రధానహేతు వని శబ్దశాస్త్రజ్ఞు లభిప్రాయపడుచున్నారు. ఈభాష యింతచిన్నదిగా నున్నను, పశ్చిమోత్తరముగాఁ బోయిన యార్యశాఖవారి భాషలలోనున్న శబ్దములు కొన్ని దీనిలోఁ గాన

వచ్చుచున్నవి. అవి సంస్కృతములో లేవు. చిరకాలము వృద్ధినొందుట వలనఁ బుట్టినదియు వ్యాకరణముచే విధింపఁబడినదియు నగు నుచ్చారణము (Pronunciation) నంగభూతము లగునీభాషల కన్నిటికి సమానముగా నుండుట వలన నార్యభాషాకుటుంబమున కంతకుఁ గలిగిన సాంద్ర మగుసంబంధ మీ రీతిగాఁ గనఁబఱుపఁబడినది.

పదాంతమందుఁ జేర్పఁబడు ప్రత్యయము లగు సం - క, జండు - క, గ్రీకు-కొ, గోథిక్ - హా-Latin క్వొ - కెల్టిక్ చ - మొదలగునవి - కాలక్రమమున నీభాష లన్నియు నెట్లు పెరిఁగినవో యావిధమును దెలుపుచున్నవి. సముద్రోదకమును గాని భూమిని గాని "కదలఁగొట్టుట" అను నర్థమిచ్చునదియు నార్యభాషల కన్నిటికి సామాన్యముగా నున్నదియునగు "అర్" ధాతువు కృషితో సంబంధించిన పనులను దెలియఁజేయుటకు దక్షిణోత్తరశాఖవారి వాడుకలో నిల్చిపోయినది. కాని పూర్వదక్షిణశాఖవారీధాతువునకు బదులుగా "కృష - విలేఖనే" అను ధాతువును వాడుక చేసిరి. ఈధాతువునుండి కృషి, కృషీవల, కర్షక మొదలగు శబ్దములు పుట్టినవి. ఈధాతువునుండి పుట్టిన కృష్టి, చర్షణి అనుశబ్దములు మొదట దున్నుకొనువాఁ డని యర్థము గలవి యయినను, ఆర్యశబ్దమువలె వేదభాషలో సామాన్యముగా మనుష్యవాచకము లయ్యెను. ఆర్యభాష లన్నింటికిఁ బొదుపుగా నున్నదుహితృశబ్దము తొలిని పాలుపితుకునది యని యర్థమిచ్చు నది. ఇది "దుహ్ ప్రపూరణే" అను నదాదిధాతువునుండి పుట్టినది. పశ్చిమోత్తర శాఖవారు "పాలుపిదుకుట" యను నర్థమందు దుహ్‌ధాతువును విడిచి దానికి బదులుగా మృజ్ ధాతువు నుపయోగించిన ట్లీక్రింద వ్రాసిన శబ్దములవలనఁ గాన వచ్చుచున్నది.

గ్రీకు ఎమల్గో. Latin మల్గియో. జర్మన్ మిల్చ్, శ్లవోనిక్ మ్లుజా, ఐరిష్ బ్లిజిమ్.

ఆర్యభాషలలో స్వర్ణవాచకము లగు శబ్దము లన్నియు నొకధాతువు నుండి పుట్టినవి. జండు సంస్కృతభాషలలో నాధాతూత్పన్నము లగుశబ్దములు కూడ నొక్కటియే. సం. హిరణ్య - జండు - జరణ్య. వెండిని జెప్పుశబ్దములు కూడ నేకధాతూత్పన్నములే. సం॥ రజత, జండు - ఇరేజిత. పూర్వదక్షిణశాఖ వారి భాషలలో సారాయి (Wine) ని దెల్పుమాట లేదు. పశ్చిమోత్తర శాఖ వారి భాషలలో సోమలతకుఁ బేరు లేదు.

ఇట్లీ యార్యభాషల కన్నింటికిఁ బరస్పరసంబంధము పరస్పరసాదృశ్యము మనము కనుఁగొనఁగలిగినను వీనికన్నింటికి మొదటిది యగుమాతృభాషనుండి యీభాష లెపు డుత్పన్నము లయినవో మన యార్యులందఱు సంఘీభావమును విడిచి యెపుడు పైకిఁ జెదరిపోయిరో యాకాలమును శబ్దశాస్త్రసహాయముచేఁ గనుఁగొనుట మిక్కిలి దుష్కరము. సంస్కృతము ప్రాకృతభాషలుగాను Anglo-Saxon ఇంగ్లీషుభాషగాను Latin భాష ఫ్రెంచిభాషగాను మాఱుట కెన్నో వందలసంవత్సరము లగును. ఆవిధముననే Latin, గ్రీకుభాష, సంస్కృతము మాతృభాషనుండి వేఱయి యిప్పుడు వాని కున్నపరస్పరభేదము పుట్టుట కెంతకాల మయియుండునో మనకు నిర్ణయింప శక్యముకాదు. ఇట్టి పరస్పరభేదము భాషల కెట్లు కలిగినది? అనుప్రశ్నకు సమాధానముగా లోఁగడఁ గొన్నిహేతువులఁ జెప్పియుంటిని. భాషలో మార్పులు కలుగుటకు రెండు ముఖ్యకారణములు గలవు. వీనిలో మొదటిది ఆభ్యంతరము - రెండవది బాహ్యము. ఆభ్యంతర - ముచ్చారణాసౌష్ఠవము. బాహ్యము - రాజపరివర్తనము, సాంఘికవిప్లవము మొదలగునవి. నార్మనులు చెడఁగొట్టకపోయినయెడల Anglo-saxon ఇంగ్లీషుభాషగా మాఱకపోవును. Frank లను నొకమోటుజాతివారు విప్లుతి నొందింపకపోయినయెడల Latin భాష - ఫ్రెంచిభాషగా మాఱకపోవును. ఛందోవస్థానభాష చెడుటచేఁ బుట్టినపారశీకభాషలో మహమ్మదీయుల యభియోగములవలనఁ బారశీకదేశమునకు సంభవిల్లిన నానావిధబాధలను దెలియఁజేయుగుఱుతు లిదివఱకుఁ గానవచ్చుచున్నవి. సంస్కృతభాష గ్రీకుభాష వికృతినొందకుండ నెంతకాలము పరిశుద్ధముగా నుండెనో మన మెఱుఁగము. లిఖితరూప మగువాఙ్మయము కొన్నిదేశములలోఁ గ్రొత్తగాఁ గలిగెను. క్రీస్తుశకమునకు మున్నయిదవశతకమువఱకు మనభరతఖండములో వ్రాఁతపుస్తకము లున్నట్లు రుజువుచేయుటకుఁ దగినసాధనము లెవ్వియు లేవని పాశ్చాత్యపండితులు వ్రాసియున్నారు.

## 6. ఛందోవస్థానభాష.

జండవెస్థా అనునది యగ్నినుపాసించు పారశీకులమతగ్రంథము. ఈ జాతివారు పారశీకదేశమందుఁ జెదరియున్నారు. ఈపారశీకుల ప్రథమనివాసస్థానము ఇరాన్ దేశము. వీ రవలంబించిన మతము ఆసియాఖండములో గొప్పమతబోధకులలో నొకఁడైన జోరోష్టర్ (జరదుష్ట్ర) అనువాఁడు స్థాపించినది. కావున అవెస్థా అనునది గొప్పగ్రంథము. దీనిలోఁ బారశీకదేశస్థుల ప్రాచీన

మతము, ఆచారములు, ధర్మములు, మతసిద్ధాంతములు ప్రతిపాదింపఁబడి యున్నవి. దీనిలోని నవీనభాగము కొలఁదికాలముక్రిందటి దైనను బ్రాచీనభాగము ఋగ్వేదముతోఁ దుల్య మగుప్రాచీనత కలది. ఈయవెస్థామత మొకకాలమందుఁ బ్రపంచకములో నుండెడు గొప్పమతములలో నొకటియై యుండెను. క్రీస్తుశకమునకు ముందు వేయిసంవత్సరములకాలము ఉచ్ఛదశలో నుండి అచిమిని యన్ రాజు లగు సైరస్, డెరయస్, గ్జరగ్జస్ మున్నగువారి మతమయి యుండి అలెగ్జాండరు దండయాత్రచే క్షీణదశ నొందింపఁబడెను. ఈమతసంబంధ మయినగ్రంథము లనేకములు నష్ట మయిపోయినవి. క్రీస్తుశకప్రారంభమందీమతము పునరుజ్జీవిత మయినను మహమ్మదీయుల దండయాత్రలచేఁ దిరుగఁ దల నెత్తకుండఁ జెడఁగొట్టఁబడెను. జోరోష్టర్ మతస్థు లనేకులు మహమ్మదీయులచే హింసింపఁబడినవారై ప్రాణభీతిచే నవశముగా మహమ్మదీయమతమును రించిరి. అపుడు కొందఱు మహమ్మదీయుల బాధల కోర్వఁజాలక స్వదేశమును స్వజనమును విడిచి హిందూదేశమునకుఁ బాఱిపోయి యచటఁ దల దాఁచుకొనిరి. అట్టియుపద్రవములలో నశింపఁగా మిగిలిన కొన్నిగ్రంథము లిప్పటికి మిగిలినవి. గాఢ మగుమతభక్తి గలవాఱుకొందఱు తురుష్కు లొనర్చు హింసల కోర్చి స్వదేశమందే నిలిచిరి. ఇపు డీపారశీకులు పదివేలమంది పారశీకదేశములోను నెనుబదివేలమంది హిందూదేశములో నున్నారు. ఇపుడు నిలిచియున్న అవెస్థాగ్రంథము వీరిచేతనే రక్షింపఁబడినది. అవెస్థాశబ్దము "అవెష్టక్" శబ్దముయొక్కవికృతిరూపము. ఇది మతగ్రంథములకుఁ బేరు. ససేసియన్‌రాజులకాలమునాఁటి పహ్లావీభాషాసంబంధ మగు నీ అవెష్టక్‌శబ్ద మీమతగ్రంథములకు వర్తించును. వేదశబ్దమునకు వలెనే యీఅవెష్టక్‌శబ్దమునకుఁ గూడ జ్ఞాన మని కాని జ్ఞానదాయక మగుగ్రంథ మని కాని యర్థమై యుండును. ప్రాయికముగా నీశబ్దమునకు మూలగ్రంథ మని యర్థ మై యుండును. జండవెస్థా యనునది నిండుపేరు కాదు. అవెస్థా యనఁగా మూలగ్రంథ మనియు జం డనఁగా వ్యాఖ్యాన మనియుఁ గొందఱ యభిప్రాయము.

ఒకశతాబ్దము క్రిందటివఱకు నీప్రాచీనపారశీకదేశపుమతము, మతసిద్ధాంతములు, మనుష్యుల యాచారములు, నడవళ్లు మొదలగువానిని గుఱించి మన కున్నజ్ఞాన మల్ప మయియుండెను. అప్పటి మనకున్నజ్ఞానము గ్రీకు లేటిన్‌గ్రంథములనుండి సంపాదింపఁబడిన దగుటచేఁ దృప్తికరముగా నుండకపోయెను.

దీనినిగుఱించిన సరియయిన జ్ఞానము నేఁటివఱకు నాకరములు మన కపుడు దొరక లేదు. బైబిలులో నీమత మొకచోటఁ బేర్కొనఁబడెను. పారశీక దేశమును మహమ్మదీయులు జయించిన తరువాతఁ గ్రీస్తువెనుక 940 సంవత్సరములో నున్న యొక అరేబియాదేశపు గ్రంథకర్త అవెస్థాను గుఱించియు దానివ్యాఖ్యాన మగుజండును గుఱించియుఁ గొంత మట్టుకుఁ జెప్పెను. క్రీస్తుశకము పదియవ శతాబ్దమందు జీవించిన ఆల్బ్యార్ణి అనుచరిత్రకారుఁడు కూడ దీనినిగుఱించి పలుమాఱు వ్రాసెను. దీని లిపి యెవ్వరికిఁ దెలియక పోవుటచే నీయవస్థా గ్రంథము నెవ్వరుఁ జదువలేకపోయిరి. Anquitel du Perron అను నొక ఫ్రెంచి దేశపు తరుణుఁ డీగ్రంథమును లోకమందుఁ బ్రకాశింపఁజేసి ప్రసిద్ధి గాంచెను. ఈగ్రంథసంపాదనకొఱ కితఁడు పడ్డపాట్లు వర్ణించుట కిది యస్థానము కాదు. ఆక్సుఫరడు (Oxford) పుస్తకభాండాగారములో నున్న యీగ్రంథములయొక్క యొకవ్రాఁతప్రతిని యాదృచ్ఛికముగా నీయాంక్విటిల్ చూచుట సంభవించెను. నాటఁగోలె నెట్లయినఁ బారశీకదేశమునకుఁ గాని హిందూదేశమునకుఁ గాని పోయి యాయవెస్థామతగురువులవలన నాగ్రంథమును నేర్చుకొనవలయు నని యత్యుత్సాహము కలవాఁడై యున్నను ధనహీనుఁ డగుటచేఁ గొంతకాలము తనమనోరథము సిద్ధింపక పోయె నని సంతాపము నొందుచుండెను. అంతట 1754 సంవత్సరము నవంబరునెలలో నిండియాకుఁ బోవుచున్న ఫ్రెంచి పటాలములో బ్యాండు వాయించువానిపనిలోఁ గుదురుకొని యీయువపండితుఁడు ప్యారిస్పట్టనమునుండి బయలుదేఱెను. ఫ్రెంచిదొరతనమువా రీపండితుని సదుద్యమము నెఱింగి యాక్షణమందే యితనిని సైన్యోద్యోగమునుండి తప్పించి ఇండియాకుఁ బోవుట కగుమార్గవ్యయము నీతని కిప్పించిరి. తరువాత ననేక కష్టములు పడిపడి సూరత్పట్టనమును జేరి యచటఁ జెప్పుటకుఁ దరముగాని యాంతంకములకుఁ బాల్పడి కొన కెట్టకేలకు జోరోష్టర్ మతాచార్యుల విశ్వాసమునకుఁ బాత్రుఁడై వారిదయను సంపాదించెను. వారియొద్దఁ గొంతకాలము శుశ్రూషఁ జేసి నవీనపారశీకభాషను నేర్చుకొనెను. పిమ్మట నాఫ్రెంచిపండితుఁ డవెస్థాభాషను దనకు నేర్పుఁ డనియు నామతసిద్ధాంతములఁ దనకు బోధింపుఁ డనియు నాగ్రంథము వ్రాఁతప్రతి నొకటిఁ దన కిమ్మనియు నామతగురువులఁ బ్రార్థించెను. ఏడుసంవత్సరములు వారియొద్దనుండి వారునేర్పిన దానినంతయు శ్రద్ధతో నేర్చుకొని 1761 సంవత్సరములో మరల నైరోపాకుఁ బోయెను. ప్యారిస్పట్టనమునకుఁ బోకమునుపు ఆక్సుఫరడులోఁ గొన్నాళ్లుండి యచ్చట జగత్ప్ర

సిద్ధ మగు బాడ్లియన్ లయిబ్రెరీ అను (Bodleian Library) పుస్తకభాండాగారములోఁ దాను మొదటఁ జూచిన జందుగ్రంథము వ్రాఁతప్రతితోఁ దా నిండియాలో సంపాదించిన వ్రాఁతప్రతిని సంప్రతించి యామతగురువులు తన్ను మోసపుచ్చలే దని సంతసిల్లెను.

కాని పాప మీయాంక్విటిల్ మహాశయుఁ డింతకష్టపడి లోకమందుఁ గ్రొత్తగాఁ బ్రకాశింపఁ జేసిన యీప్రాచీనకాలపు గ్రంథసంతతి దాని మతసిద్ధాంతము దాని తత్త్వము కొందఱవిమర్శకుల పరీక్షకు నిలువ దయ్యెను. కాంటువంటి మహాతత్త్వజ్ఞులు కొంద ఱందులో నేమో విశేషతత్త్వ మున్న దని యాశచేఁ బరీక్షించి కొన కేమియుఁ గానరాకుండుటవలన నైరాశ్యము నొందిరి. ఇంక మఱి కొందఱు దీని కవిత్వసరణి కుచితమయిన విలువ నిడ రైరి.

మఱికొంద ఱల్పకాలములో నాభాషను నేర్చుకొని భాషాంతరీకరణముఁ జేసిన యాంక్విటిల్ పండితుని జ్ఞానమందు సంశయము గలవా రయిరి. ఈ గ్రంథప్రామాణ్యమును గుఱించి పండితులలో వివాదములు పుట్టెను. నిజముగా నీగ్రంథము జోరోష్ట రనువాఁడు వ్రాసినది కా దనియు మఱి యెవ్వఁడో వ్రాసి వానిపేరు పెట్టె ననియుఁ గొందఱు వ్యవహరించిరి. ఇట్లీగ్రంథమును దూషించి గ్రంథకర్తను నిరుత్సాహపఱిచినవారిలో సర్ విలియమ్ జోన్సు (Sir William Jones) పండితుఁడు మొదటివాఁడు. ఇతఁడు పార్సీమతగురువులు యాంక్విటిల్‌ను మోసపుచ్చి పనికిమాలిన యొకపిచ్చిగ్రంథము నితని కిచ్చినా రని 1771 సంవత్సరములో ఫ్రెంచిభాషలో నొకయుత్తరమును వ్రాసి ప్రకటించెను. ఇంగ్లాండులో నుండు (Richardson. Sir John Chardin) అను వారిద్దఱు నీయంశమును మఱింత బలపఱిచిరి. ఫ్రెంచిదేశములో నది యకృత్రిమగ్రంథ మని సార్వజనీనముగా నొప్పుకొనఁబడినది. క్లూకర్ (Kleuker) అను నొక జర్మన్పండితుఁడు స్వదేశమం దుండు వేదాంతులకుఁ దెలియుట కొఱకు Anquetel వ్రాసిన యాంగ్లేయభాషానువాదమును జర్మనీభాషలోనికి మార్చెను. ఏఁబదిసంవత్సరములవఱకు నీయవెస్థాగ్రంథమును గుఱించిన వివాదములు శమింపలేదు. కాలక్రమమునఁ బండితు లది యకల్పితగ్రంథ మని యొప్పుకొనిరి.

పాశ్చాత్యపండితులు సంస్కృతభాషను కృషిచేసినకొలఁది నీపార్సీమతగ్రంథతత్త్వము దీనిప్రామాణ్యము పండితులలోఁ బ్రకటిత మయ్యెను. యాంక్విటి ల్పండితుఁ డీగ్రంథము నాంగ్లేయ భాషలోనికి మార్చిన తరువాత సుమారేఁబదిసంవత్సరములకు 1825 సంవత్సరమందు పాశ్చాత్యులలో సంస్కృతపం

డితు లయినవా రీగ్రంథమును గృషిచేయుట కారంభించిరి. ఈ జందు సంస్కృతభాషల కున్న యత్యంతసాదృశ్యమును బండితు లిదివఱకే కనిపెట్టిరి. 1826 సంవత్సరములో హాలెండు దేశస్థుఁ డగురాస్కు (Rask) అను గొప్పశబ్ద శాస్త్రజ్ఞుఁడు పారశీకహిందూదేశములలోఁ గొంతకాలము సంచరించి మరలి స్వదేశమునకుఁ బోవునపుడు అవెస్థాగ్రంథము వ్రాఁతప్రతిని మఱి కొన్ని పహ్లావీభాషాపుస్తకములను సంపాదించి తనతోఁ దీసికొని పోయెను. అతఁ డీయవెస్థాభాష మిక్కిలి ప్రాచీన మయిన దనియు సంస్కృతభాషకు దగ్గఱగా నున్నను నిది వేఱయిన భాష యనియు సమర్థించుచు 1826 సంవత్సరములో నొక చిన్నపుస్తకమును వ్రాసి ప్రచురించెను. ఆకాలమందే ఫ్రెంచిదేశపు సంస్కృతపండితుఁ డగుయూజైన్ బర్నఫ్ (Eugine Burnouf) అనువాఁడు అవెస్థను గృషిచేయ నారంభించెను. జందు సంస్కృతభాషలకుఁ గల సంబంధమును దెలిసికొని మూలగ్రంథమును బాగుగఁ జదివి తన కున్న సంస్కృతభాషాజ్ఞానముం బట్టి యాంక్విటిల్ వ్రాసిన యనువాదమం దున్న తప్పులఁ గనిపెట్టెను. 15 వ శతాబ్దమందు వ్రాయఁబడిన సంస్కృతభాషానువాద మొకదానిని సంపాదించి బర్నఫ్ (Burnouf) పండితుఁడు యాంక్విటిల్ వ్రాసిన యర్థముల నన్నింటిని సవరించెను. అంతకు ముం దెవ్వరికి నర్థము కాకుండ నుండిపోయిన అవెస్థాగ్రంథభాగమును విశదపఱిచెను. మతగురువులు చెప్పిన యర్థముల నుపేక్షించి సంస్కృతభాషానువాదము ననుసరించి (Burnouf) పండితుఁ డర్థమును బోధింపఁగా నీగ్రంథమం దదివఱకు జనుల కున్నయప్రామాణ్య బుద్ధి నివృత్త మయ్యెను. దీనికి సమకాలమందే 1802 వత్సరములో (Grotefend, Lassen, Sir Henry Rawbinson) మొద లగువారిచేఁ గనుఁగొనఁబడిన ప్రాచీనపారశీకదేశపు శాసనముల సాక్ష్యమును బట్టి యీయవెస్థాగ్రంథము నిర్దుష్ట మయిన దనియు నకల్పిత మయిన దనియు రుజువు చేయఁబడెను. ఇట్లు బర్నాఫ్ పండితుఁడు వైచిన పునాదిపయిని Boph, Haug, Wester guard, Roth, Spiegel, Darmesteser మొదలగు వా రొక పెద్దసౌధమును నిర్మించిరి. ఈపండితు లందఱు శబ్దార్థములను వివరించుటయందు సంస్కృతభాషను గొంతమట్టుకు వాక్యార్థములను వివరించుటయందు పహ్లావీభాషానువాదమును గొంతమట్టుకు సహాయముగాఁ జేసికొని యీయవెస్థాగ్రంథమును వివరించిరి.

పూర్వ మీయవెస్థాగ్రంథ మొక పెద్దవాఙ్మయముగా నుండెను, గాని, కాలక్రమమున నిందులోఁ గొంత గ్రంథనాశము సంభవించినది. ఇపుడు

మిగిలిన గ్రంథ మల్పపరిమితి గలది యై యున్నది. అది యాఱుభాగములుగా విభజింపఁబడినది.

1. Yasna (యజ్ఞము) గాథతోఁ గూడినది.
2. Vispered.
3. Yashts.
4. Minor Texts as Nyaishes, Gahs &c.
5. Vendidad.
6. Fragments from Hadhokht &c.

ఈయాఱుభాగములలో (Yasna, Vendidad, Vispered) అనుమూఁడును దేవతాపూజనమందుఁ దత్ప్రార్థనయందు నుపయోగింపఁబడును. ఈ యవస్థాగ్రంథము స్తోత్రరూప మయినది గాని తత్త్వమును (Philosophy) బోధించు శాస్త్రము కాదు.

అవెస్థామతము.

దీనికి జరదుష్ట్రమత మని రు. ఇది క్రైస్తుమతము, బౌద్ధమతము, మహమ్మదీయమతము మొదలగు సుప్రసిద్ధమతములతో సమాన మయినది. ఈమతమందు మంచి యనియు (Good) చెడు గనియు (Evil) రెండు తత్త్వములు కలవు. ఈ రెంటును సృష్టిమొదలుకొని లోకమం దున్నవి. స్వతంత్రకర్త యగుచేతనుఁడు సద్వృత్తి సౌశీల్యములు గలవాఁడై మంచియొక్క బలముచేఁ జెడుగును జయించును. వీరిలో నీశ్వరునకు "అహురామజ్దా" అని పేరు. హిందువులకు శనిగ్రహామువలె నీమతమందు "అంగ్రమన్యు (అంగారమన్యువు) అను నొకపిశాచము కలదు. వీఁ డెల్లపుడు దైవము చేసినసృష్టిని బాధించును. అహురామజ్దా కాఱుగురు దేవతలు సహాయులు కలరు. జోరోష్టర్ పారశీకులకు బోధించిన మత మిది.

7. అవెస్థా సంస్కృతభాషలకుఁ గలసంబంధము.

ఈయవెస్థాభాష—ఇండూజర్మాని క్భాషాకుటుంబములోనిది యగు ఇరేనియన్ శాఖలోనిది. ఈ యిరేనియన్ శాఖ రెండుభాగములుగా నున్నది. ప్రాచీన పారశీకదేశపు శాసనములతోఁ గూడిన యీయవస్థాభాష ప్రాచీనభాగములోనిది. నూతనపారశికభాష కురుడిష్, బెలూచి, ఘుల్చా మొదలగుభాషలు నవీనభాగములోనివి. అవెస్థలో రెం డవాంతరభాష లున్నవి. వానిలో మొదటిది గాథాభాష. ఇది మిక్కిలి ప్రాచీనము. రెండవది అవెస్థ. ఇది నవీనభాష. ఈభాషలోనే మూఁడునంతులమట్టు కీయవెస్థాగ్రంథము వ్రాయఁబడినది. ఋగ్వేదభాషకు లౌకికసంస్కృతభాషకు నెంత తారతమ్యము కలదో

గాథాభాషకు నవెస్థాభాషకు ,నంతతారతమ్యము కలదు. ఈయవెస్థాభాష సంస్కృతమునకు మిక్కిలి దగ్గఱది.

ఏసంస్కృతపదము నైన నవెస్థాపదముగాను నేయవెస్థాపదము నైన సంస్కృతపదముగాను మార్చవచ్చును. ఉదా:—

అవెస్థా. తమ్ అవమెన్తం యజతం సూరం దామోహూ సవిస్తమ్ మిత్రమ్ యజై జోత్రాభ్యో,

సంస్కృతము. తం అమవన్తం యజతం శూరం ధామ సుశవిష్టం మిత్రం యజై హోత్రాభ్యః.

అవెస్థాభాషాస్వరవివృతి (Phonology)

1 అవెస్థాభాషకు సంస్కృతమునకు అచ్చులొక్కటియే.

అ, ఇ, ఉ హ్రస్వాచ్చులు ఆ, ఈ, ఊ దీర్ఘాచ్చులు.

| అవెస్థా. | సంస్కృతము. |
| --- | --- |
| అ - అస్తి | అస్తి. |
| ఆ - వాతైస్ | వాతైస్. |
| ఇ - హించైతి | సించతి. |
| ఈ - హీర | హీర. |
| ఉ - ఉత | ఉత. |
| ఊ - భూమిమ్ | భూమిమ్. |

2. కొన్నిచోట్ల నవెస్థలో అకారమునకు సంస్కృతములో ఆకారము కనఁబడును.

అవ - బజిన - సం॥ భాజన.

3. మఱికొన్నిచోట్ల ఆకారమునకు అకారము వచ్చును.

అవ - యతారో - సం॥ యతరస్.

4. అవెస్థలో ఈ, ఊల స్థానమందు సంస్కృతములో ఇ, ఉ లు కానవచ్చును.

అవ - వీస్పం = సం. విశ్వం.

అవ - వీతస్తిం = సం. వితస్తిం.

అవ - ద్రూతం = సం. ద్రుతం.

అవ - శ్రూతం = సం. శ్రుతం.

5. అవెస్థాలో ఇ ఉల స్థానమందు సంస్కృతములో ఈ ఊలు కానవచ్చుచున్నవి.

అవ - ఐనికం = సం. అనీకం.

అవ - ఇశానం = సం. ఈశానం.

అవ - తనునమ్ = సం. తనూనామ్.

6. అవెస్థలోఁ బదస్థము లగు ఇ ఉలు పదాంతమందు మకారము ముందఱ దీర్ఘములగును.

అవ - పైతీమ్ = సం. పతిమ్.

అవ - దాహీమ్ = సం. ధాసిమ్.

అవ - తాయూమ్ = సం. తాయుమ్.

7. ఏకాక్షరశబ్దములలోఁ దప్పక దీర్ఘాచ్చు లుండును.

అవ - నీ = సం. ని.

అవ - జీ = సం. హి.

అవ - ప్రా = సం - ప్ర.

8. అనేకాక్షరశబ్దములలో ఓకారము తప్పఁ దక్కినపదాంతాచ్చు లన్నియు హ్రస్వము లగును.

అవ - హేన = సం - సేనా.

అవ - పర = సం - పరా.

అవ - నైరి = సం - నారీ.

9. అవెస్థలో యకారము తరువాత వచ్చు ఎకారము - సంస్కృతములో అ ఆ ల వలెఁ బలుకును.

అవ - రోచయేతి = సం - రోచయతి.

అవ - అయెని = సం - అయాని.

అవ - అస్నె = సం = యజ్ఞె.

10. అవెస్థలో ఓష్ఠ్యములగు ఉ ఊ ఓలకు ముందు వచ్చు ఓకారము సంస్కృతములో అ ఆ లవలెఁ బలుకును.

అవ - దామోహు = సం - ధామసు.

అవ - ఓహోవ్వాంతం = సం. ఓజస్వ_న్తం.

11. అవెస్థలో "అరే" అనునది సంస్కృతములో ఋకారమునకు సరిగా నుండును.

అవ - అనరేతైః = సం - అనృతైః.

అవ - వరేషమ్ = వృక్షమ్.

12. సంస్కృతమందువలె నీభాషలోఁ గూడ సవర్ణసంధి, యణాదేశసంధి, వృద్ధి, గుణము మొదలగునవి కలవు.

హల్లులు.

13. అవెస్థలో చజలు తప్పఁ దక్కిన తాలవ్యములు, మూర్ధన్యములు, మహాప్రాణములు (Aspirates) లేవు. అనునాసికవర్ణము లన్నియు నొకటియే. సంస్కృతమందుకంటె దీనిలో నూష్మములు (Sibilants) హెచ్చుగా నున్నవి. లకారము లేదు. దీనికిబదులుగా రేఫము వాడుకచేయఁబడును.

| అవెస్థా | సంస్కృతము. | అవెస్థా. | | సంస్కృతము. |
|---|---|---|---|---|
| క | క | కతరో | | కతరస్ |
| క | ఘ | జంగం | - | జంఘాం |
| | ఖ | ఖరం | - | ఖరం |
| చ | చ | చరైతి | - | చరతి |
| జ | జ | జ్వంతం | - | జీవన్తం |
| జ | హ | జన్తారం | - | హన్తారం |
| త | త | తాపయేతి | - | తాపయతి |
| ప | ప | ప్రోక్తో | - | ప్రోక్తస్ |
| ద | ద | యదా | - | యదా |
| య | య | యస్నం | - | యజ్ఞం |
| వ | వ | వాతో | - | వాతస్ |
| ర | ర | నరమ్ | - | నరమ్ |
| బ | భ | బూమిం | - | భూమిం |

14. పదాదియం దున్నక, చ, త, న, ప, ల ముందఱ నున్నసకారము సకారముగానే యుండును గాని హకారముగా మాఱదు.

| అవస్థా. | సంస్కృతము. | అవస్థా. | | | సంస్కృతము. |
|---|---|---|---|---|---|
| స | స | స్కంబం | | - | స్కంబం |
| | | స్చిందయేతి | - | | ఛిందయతి |
| | | స్తోతారం | | - | స్తోతారం |
| | | వస్తే | - | - | వస్తే |
| | | స్పెదానాని | - | - | స్పర్ధానాని |
| | | స్నాయేత | - | - | స్నాయేత |

15. పదాదియం దున్నసకారము తప్పక హకార మగును. ఉ. సప్త = హప్త, సోమ = హోమ.

16. సంస్కృతమందువలె నీభాషలోఁ గూడ నామవాచకములకు, విశేషణములకు, సర్వనామములకు విభక్తు లున్నవి. ఏక, ద్వి, బహువచనములు, సంబోధనతో నెనిమిది విభక్తులు, మూఁడు లింగములు కలవు. దీనిలోఁ గొన్నిపదములు సంస్కృతపదములకంటె భిన్నలింగములు కలవిగాఁ గానవచ్చు చున్నవి. వాక్, జంగ, (జంఘా) తరస్న (తృష్ణా)శబ్దములు పుంలింగములు.

17. అజంతము లనియు హలంతము లనియు నీభాషతో శబ్దములు రెండువిధములు గా నున్నవి. కొన్నివిశేషణములకుఁ తరతమప్రత్యయములు, మఱి కొన్నింటికి ఈయస్, ఇష్ఠ ప్రత్యయములును చేర్పఁబడును.

ఉ - మజ్ - మజ్యః - మజిష్ఠ. ఆసు - ఆస్యః - ఆసిష్ఠ.

తరతమప్రత్యయములు.

1. బేషజ్య - బేషజ్యోతర - బేషజ్యోతమ.

2. హుయస్త - హుయస్తతర - హుయస్తతమ.

18. ఈభాషలోని సంఖ్యావాచకములు రూపమందుఁ గాని వాడుకయందుఁ గాని సంస్కృతసంఖ్యావాచకములకంటె నించుకంతయు భేదము లేనివి.

| అవస్థా. | సంస్కృతము. | అవస్థా | సంస్కృతము. |
|---|---|---|---|
| ఏవ - - | ఏక | వీశతి - - | వింశతి |
| ద్వ - - | ద్వి | ద్రిశత్ | త్రింశత్ |
| థ్రి - - | త్రి | చద్వారింశత్ - | చత్వారింశత్ |
| చద్వర్ - - | చతుర్ | పంచాశత్ - | పంచాశత్ |
| పంచ - - | పంచ | క్షువషి - | షష్టి |
| క్షువస్ - - | షష్ | హప్తతి - | సప్తతి |
| హప్త - - | సప్త | అష్టైతి - | అశీతి |
| నవ - - | నవ | నవైతి - | నవతి |
| దశ - - | దశ | శత - | శత |

19. సర్వనామములు.

ఈభాషలో సర్వనామములు సంస్కృతసర్వనామములకు సరిగా నుండును. అస్మద్ యుష్మద్, శబ్దములకు లింగవివక్ష లేదు. యత్, తత్, అదస్,

కిమ్ మొదలగువానికి మూఁడులింగము లున్నవి. అస్మచ్ఛబ్దమునకు ద్వివచన రూపములు లేవు. యుష్మచ్ఛబ్దమునకు షష్ఠీవిభక్తియందే కాని తక్కిన విభక్తుల యందు ద్వివచనరూపములు లేవు.

అస్మచ్ఛబ్దము.

| | ఏకవచనము. | | బహువచనము. | |
|---|---|---|---|---|
| | అవస్థా. | సంస్కృతము. | అవస్థా. | సంస్కృతము. |
| ప్ర. | అజెం | (అహం) | వయెమ్ | (వయమ్) |
| ద్వి. | మం - మా | మాం మా. | అహ్మ<br>నో | (అస్మాన్)<br>(నః) |
| చ. | మవోయ | (మే) | మహ్యాం<br>అహ్మాభ్య | మే<br>నో |
| పం. | మత్ | (మత్) | అహ్మాత్ | |
| ష. | మన | మే. | అహ్మాకం<br>అస్మాకం | నః |

ఈశబ్దమునకు తృతీయాసప్తమీవిభక్తులలో రూపములు లేవు.

యుష్మచ్ఛబ్దము.

| | | | | |
|---|---|---|---|---|
| ప్ర. | తుం | తు (త్వం) | యూజం | యూయం |
| ద్వి | (ద్వాఁ<br>(త్వాం | ద్వా)<br>త్వా) | నో | (వః) |
| తృ. | ద్వయా | త్వయా | (తృతీయాబహువచనము లేదు.) | |
| చ. | తైభ్యం<br>తుభ్యం | తే | యుష్మాయో<br>యుష్మభ్యం | వో<br>వః |
| పం. | ద్వత్ | త్వత్ | యుష్మత్ | యుష్మత్ |
| ష. | తవ<br>తవ | తే<br>తే } యువాకం | యుష్మాకం<br>యుష్మాకం | వో<br>వః |

దీనికి సప్తమీవిభక్తిరూపములు లేవు.

20. తిజన్తము.

సంస్కృతమందువలె దీనిలోఁ గూడ లట్, లఙ్, లోట్, విధిలిఙ్, లిట్, లుఙ్, మొదలగు లకారము లన్నియుఁ గలవు. ఇవిగాక నామధాతువులు, ణిజన్తము, సన్నంతము, యఙ్లుగంతము, భావప్రత్యయాంతములు, ణము లంతములు, తుమున్నంతరూపములు, నిష్ఠాప్రత్యయాన్తరూపములు కలవు. సం

స్కృతవ్యాకరణపు రీతి నవలంబించినయెడల నీయవెస్థాభాషలోని ధాతువుల నన్నింటిని బదితరగతులుగా విభజింపవచ్చును. వీనిలో అకారాంతధాత్వంగము గలధాతువులు నాలుగు తరగతు లొకవర్గము, అకారము చేర్పఁబడక హలంతము లగుధాతువు లయిదు తరగతులు మఱియొకవర్గముగాను మరల విభజింపఁబడినవి. మొదటివర్గములోని ధాతువులకు వికరణప్రత్యయ మగు అకారము చేర్చినపుడు ధాత్వంతమందున్న యచ్చునకు గుణము వచ్చును. (గుణ మనఁగా ఇకారము ఏకారముగాను, ఉకారము ఓకారముగాను ఋకారము అర్‌గాను మాఱుట.)

I. 1. భ్వాది. ఉ. భవతి.

2. తుదాది. ఇందులో అకారము చేర్పఁబడినను గుణము రాదు.

ఉ. "డ్రుజ్. డ్రుజైతి.

3. దివాది. దీనిలో యకారము వికరణప్రత్యయము. నస్–నస్యైతి.

4. చురాది. దీనిలో ధాతువులకు "అయ" అనునది చేర్పఁబడును.

ఉ. రుచ్–రోచయేతి.

II. 1. అదాది. (రెండవవర్గములో మొదటిది యిందులో వికరణప్రత్యయము (శప్) లోపించును.

ఉ. జన్–జన్తి (హన్తి)

2. జుహోత్యాది. (ఇందులో ధాత్వక్షర మావృత్త మగును.

ఉ. దా–దదాతి.

3. రుధాది. ఇందులో ధాతుమధ్యమందు నకారము చొరఁబడును.

ఉ. రిచ్–రిణక్తి.

4. స్వాది. ఇందులో "ను" ధాతువునకుఁ జేర్పఁబడును.

ఉ. సు–సునోతి.

5. తనాది. ధాతువునకు–"ఉ" చేర్పఁబడును.

ఉ. ఆప్–ఆప్నోతి. ఆప్వంతే.

6. క్ర్యాది. ఇందులో ధాతువునకు "నా" చేర్పఁబడును.

ఉ. గరు–గరునైతి (గృహ్ణాతి.)

సంస్కృతధాతువులలో లేని వైచిత్రి యొకటి అవెస్థాధాతువులలో నున్నది. అ దెద్ది యనఁగా; ఒకధాతువునకే స్వవికరణానుసారముగాఁ గొన్ని రూపములు, పరవికరణానుసారముగాఁ గొన్నిరూపములు కలుగును.

భర్ ధాతువు (లట్) పరస్మైపది.

| | ఏకవచనము. | ద్వివచనము | బహువచనము. |
|---|---|---|---|
| ప్ర. | బరైతి | బరతో | బరెన్తి. |
| మ. | బరహి | | బరథ. |
| ఉ. | బరామి | | బరామహి. |

ఆత్మనేపదరూపములు.

| | | |
|---|---|---|
| ఉ. | బరే | బరమైడె. |
| మ. | బరహి | బరోయిధే. |
| ప్ర. | బరైతె | బరెన్తె. |

లజ్.

| | | | |
|---|---|---|---|
| ఉ. | బరెమ్ | బరావ | బరామ |
| | అభరః | అభరావ | అభరామ |
| మ. | బరో | | బరత |
| | అభరః | | అభరత |
| ప్ర. | బరత్ | | బరెన్ |
| | అభరత్ | | అభరన్ |

1. యఙ్లుగన్తరూపములు.

| అవస్థా. | | సంస్కృతము. |
|---|---|---|
| చర్ | చర్కరే | చర్కృ |
| దర్ | దదరే | దదర్ |
| దిశ్ | దేదిశ్ | దేదేశ్ |

2. క్తప్రత్యయాంతములు.

| అవస్థా. | | సంస్కృతము. |
|---|---|---|
| పా | పాత | పాత |
| గర్ | గరస్త | గృభీత |
| ద్రుజ్ | ద్రుక్త | ద్రుగ్ధ. |

3. నకారమకారము లంతమందుఁ గలధాతువులకు క్తప్రత్యయము చేర్చినపు డానర్ణములు లోపింపవు.

ఉ. కన్ (ఖన్) కన్త-ఖాత, గ్రమ్—గ్రన్త.

# ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటితగ్రంథములు.

## (1) విప్రనారాయణచరిత్రము.

పన్నిద్దఱాళ్వారులలోఁ జేరిన తొండరడిప్పొడియాళ్వారు చరిత్రము. కవిత్రయములోని యెఱ్ఱాప్రెగడ చిన్నినమనుమఁడగు చెదలువాడ మల్లయకవిచే రచియింపఁబడిన యపూర్వగ్రంథము. సర్వవిధముల నుత్తమప్రబంధములలో గణింపఁదగినది. వైజయంతీవిలాసముకంటె మిన్న. ౪ ఆశ్వాసములు. ౭౮ పుటలు. సవిమర్శనమైన ౧౮ పుటలపీఠిక. వెల, రూ. ౦-౮-౦.

## (2) జైమినిభారతము (ఆంధ్రవచనము.)

రెండువందల సంవత్సరములక్రిందట మధురాపురాధీశ్వరుం డగువిజయరంగ చొక్కనాథుని యాస్థానకవియు, సామాజికుండు నయిన సముఖము వేంకటకృష్ణప్ప నాయఁకునిచే రచింపఁబడినది. భావ సలక్షణము. శైలి మనోహరము. ధార యనర్గళము. అందఱును ముఖ్యముగాఁ జదువవలసినది. ౩౭౮ పుటలు. ఆంధ్రమునను, ఇంగ్లీషునను పీఠికలు గలవు. వెల, రూ. ౦-౧౨-౦

1917-18 సం॥ ఇంటరుమిడియేటుపరీక్షకుఁ బఠనీయగ్రంథము.

## (3) కవిజనాశ్రయము.

వేములవాడ భీమకవిరచిత మగుఛందశ్శాస్త్రము. ఆంధ్రచ్ఛందోగ్రంథములలో మిక్కిలి పురాతనము. అనేక లిఖితపుస్తక పరిశోధనపూర్వకముగా మూలపాఠము నిర్ణయింపఁబడినది. పాఠభేదములు పుటలయడుగునఁ జూపఁబడినవి. సంస్కృతకర్ణాటాంధ్రఛందస్సుల భేదాభేదము లచటచటఁ బ్రదర్శింపఁబడినవి. కవినిర్ణయము, కాలనిర్ణయము, ఛందస్స్వరూపము మొదలగు విషయము లనేకములుగల విపులమయినపీఠికయు, విషయసూచికయు, ననుక్రమణికయుఁ గలవు. విద్యార్థులకును బండితులకును గూడ నుపయోగకరము. వెల, రూ. ౦-౧౦-౦.

## (4) యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము.

మ-రా-రా-శ్రీ, జయంతి రామయ్యపంతులు బి. ఏ., బి. ఎల్. గారిచే రచియింపఁబడిన సవిమర్శ పీఠికాపూర్వకముగాఁ బ్రకటింపఁబడినది. ఈశాసన మాంధ్రపద్యాత్మకము. నన్నయభట్టారకుని కాలముకంటె ముందుఁ బుట్టినది. ఆంధ్రభాషాస్వరూపము తెలియఁగోరువారల కత్యంతోపయోగకరము. 1917-1918 సంవత్సరములు బి. ఏ. పరీక్షకుఁ బఠనీయగ్రంథముగా నిర్ణయింపఁబడినది. వెల, రూ. ౦-౮-౦.

## (5) నీతిసీసపద్యశతకము.

తాళ్లపాక పెదతిరుమలార్య విరచితము. శ్రీవేంకటేశ్వరుల కంకితము. వెల, రూ. ౦-౨-౦.

## (6) జ్యోతిశ్శాస్త్రసారము.

వచనము. శ్రీమాన్ కపిస్థలము కృష్ణమాచార్యులు బి. ఏ., ఎల్. టి. గారిచే రచింపఁబడినది. ఖగోళవిషయముఁ దెలిసికొనఁ గోరువారి కిది యత్యంతోపకారకము. వెల, రూ. ౦-౮-౦.

## (7) A Defence of Literary Telugu, by J. Ramayya Pantulu Garu 0-8-0.

## (8) జ్ఞానప్రసూనాంబికాశతకము.

శ్రీకాళహస్తీశ్వరుని దేవియగు జ్ఞానప్రసూనాంబను స్తుతించుచు శిష్టు సర్వశాస్త్రి రచియించిన భక్తిరసప్రధానమైన పద్యశతకము. అనర్గళకవితాధార గలది. వెల, రూ. ౦-౨-౦.

# చంద్రభానుచరిత్రము

తరిగొప్పుల మల్లనకవి విరచితము.
మిక్కిలి ప్రౌఢప్రబంధము. వెల, రు. ౧-౦-౦.

# కావ్యాలంకారచూడామణి.

విన్నకోట పెద్దయకవిప్రణీతము.

ఇదివఱకు అచ్చుపడి ప్రచారములో నున్నదాని తరువాతిభాగము, ఛందోవ్యాకరణవిషయము. వెల, రు. ౦-౮-౦.

## చంపూరామాయణము.

ఋగ్వేదికవి వేంకటాచలపతికవిప్రణీతము. వెల, రు. ౧-౦-౦.

భోజరాజకృతసంస్కృతరామాయణచంపువునకుఁ బ్రథమాంధ్రీకరణము. కార్వేటినగర సంస్థానమునం దున్న:

# శివరాత్రిమాహాత్మ్యము
## (సుకుమారచరిత్రము)

శ్రీనాథమహాకవి. వెల, రు. ౦-౧౨-౦.

# ఛందము

వేములవాడ భీమకవిఛందము. వెల, రు. ౦-౧౦-౦.

## ప్రాకృతభాషోత్పత్తి.

శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు రచించినది. రు. ౦-౧౨-౧.

## శివతత్త్వసారము.

మల్లికార్జునపండితారాధ్యులు రచించినది. వెల, రు. ౦-౧౨-౦.

## సర్వేశ్వరశతకము.

యథావాక్కుల అన్నమయ్యగారు రచించినది. వెల, రు. ౦-3-౦.

కావలసినవారు, ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శులకు, చెన్నపురి, వ్రాసినఁ బడయుఁగలరు.

---

Printed at the British Model Press, Choolai and published at the Telugu Academy Office, 39, Harris Road, Pudupet, Madras.

చందా సం॥ కు రూ. 3. విడిసంచిక అ. ౮.



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

సంపుటము ౧౨. { రుధిరోద్గారినామసంవత్సరము. జ్యేష్ఠ — భాద్రపదమాసములు. } సంచిక ౨-౩.

## ప్రధానవ్యాసములు.



చెన్నపురి. ౧౯౨౩.

# విషయసూచిక.

శ్రీరమ.

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక

సంపుటము ౧౨. | రుధిరోద్గారినామసంవత్సరము. జ్యేష్ఠ-భాద్రపదమాసములు. | సంచిక ౨-౩.

## రామాయణచరిత్ర.

భారతీయవాఙ్మయమునందు, శ్రీమద్రామాయణ మాదికావ్యముగాఁ బరిగణింపఁబడినది. అందలి యితివృత్తము పవిత్ర మైనది. హృదయంగమ మైనది. కావ్యనాయకుఁ డద్వితీయుఁడు. రామాయణమును గుఱించియు, రాముని గుఱించియు, భిన్నభిన్న దేశకాలములయందు, వ్యాఖ్యాతలు, భి[illegible] భిన్నమార్గములఁ ద్రొక్కిరి. అద్వైతు లద్దుబొట్టును, ద్వైతు లంగారము[illegible] లను, విశిష్టాద్వైతులు ద్వాదశోర్ధ్వపుండ్రములఁ బెట్టి, యనూహ్య[illegible] తుఁ డగు రామునిఁ దమతమవానిగఁ జేసికొనిరి. ఇపు డావివాదము[illegible] రాముని గుఱించియు, రామాయణమునందలి నిజచరిత్రము గుఱించి[illegible], యథామతిని విన్నవించెదను. స్ఖలితములను మన్నింపఁ బ్రార్థన.

రాముని కాలము:—రాముఁ డెప్పటివాఁ డనుదానిని గుఱించి, విశేష వివాద కలదు. రాముఁడు, నేఁటికిఁ గోట్యతీతవర్షములకుఁ బూర్వమున నుండె నని, సిద్ధాంతులు, పంచాంగములలో వ్రాయుచున్నారు. త్రేతాయుగమున నుండె నని, పౌరాణికులు వాకొనెదరు. క్రీ॥ పూ॥ 1761 సం॥ రము, ఫిబ్రవరి 9-వ తేదిని, రాముఁడు పుట్టినటులు, రామాయణమునందలి, రామునిజాతకముచే నిశ్చయించితి నని “ఇల్లియాట్” అను పాశ్చాత్యపండితుఁడు నుడివియున్నాఁడు. క్షాత్రకాలమునందు, అనఁగా, క్రీ॥ పూ॥ 14,10 శతాబ్దముల మధ్యను రాముఁ డుండె నని, కే. వి. లక్ష్మణరావుపంతులుగారు వ్రాసియున్నారు. రామాయణ

మునందలి, రాముని జాతకము నేఁటిగణితజ్ఞుల కలవిగాని, గ్రహస్థితి కలదై యున్నది చూపుఁడు. రాముని జననఘట్టమునం దీశ్లోకములు కలవు.

శ్లో. తతశ్చ ద్వాదశే మాసే, చైత్రే, నావమికే, తిథౌ ।
నక్షత్రే దితిదైవత్యే, స్వోచ్చసంస్థేషు పంచసు ॥
గ్రహేషు కర్కటే లగ్నే, వాక్పతా విందునా సహ ।
ప్రోద్యమానే, జగన్నాథం, సర్వలోకనమస్కృతమ్ ।
కౌసల్యా జనయద్రామం సర్వలక్షణసంయుతమ్ ॥ వాల్మీకిరామాయణము.

తా. పుత్రకామేష్టి యైన 12 మాసములకుఁ బిమ్మట, చైత్రశుద్ధనవమి దినమున, పునర్వసూనక్షత్రమునందు, గురునితోఁ జంద్రుఁడు కూడియుండఁగా, కర్కటకలగ్నమునందు, కౌసల్యాదేవి, శ్రీరామచంద్రునిఁ గనెను. ఆసమయమునందు 5 గ్రహములు, స్వోచ్చస్థానమునం దున్నవి. ఇదియే పైశ్లోకముల తాత్పర్యమై యున్నది. కాని, పైపద్ధతి ప్రకార మెప్పుడును, నేఁటి సిద్ధాంతముచే, చైత్రశుద్ధనవమినాఁ డైదుగ్రహము లుచ్చస్థితియం దుండవు. అట్లయిదుగ్రహము లుచ్చస్థితియం దుండినయెడల, నవమినాఁడు, పునర్వసూనక్షత్రము రాదు. చూడుఁడు; ఫాల్గున బ॥ 30 నాఁటికి, సూర్యుఁడు, రేవతీనక్షత్రాంత్యకలయం దుండి, చైత్రశుద్ధ ౧ నాఁడు, మేష.రాశి (అశ్వినీనక్షత్రము) లోఁ బ్రవేశించినయెడల, అమావాస్యనాఁడు, రేవతీనక్షత్ర మగును. అట్లయిన, నవమినాఁడు, ఆశ్లేషానక్షత్ర మగును గాని, పునర్వసూనక్షత్రము రాదు. అటులుగాక, అమావాస్యకుఁ బూర్వమె అశ్వినీనక్షత్రమునందు (మేషములో) సూర్యుఁడు, ప్రవేశించినయెడల, నవమినాఁటికి, మఖానక్షత్రము వచ్చును గాని, పునర్వసూనక్షత్రము రాదు. నాఁడు నవమి, పునర్వసునక్షత్రము కలుగుటచే, సూర్యచంద్రులు, స్వోచ్చస్థానము లగు మేష, వృషభములలో లేరు. చైత్రశుద్ధనవమీప్రాంతమున, బుధుఁ డెప్పుడును, కుంభ, మీన, మేష, వృషభ రాసులమధ్యమందే, సూర్యునికి, వెనుకటిరాశిలోనో, ముందటిరాశిలోనో యుండును గాని, స్వోచ్చస్థాన మగు, కన్యారాశిలో నుండఁడు. రాహుకేతు గ్రహములు క్రీ॥ పూ॥ ౭-వ శతాబ్దమునకుఁ బూర్వమునందు, జ్యోతిశ్శాస్త్రములోఁ (ఫలితజ్యోతిషములో) గాన్పింపరు. ఉన్నను నేఁటివఱకు రాహుకేతు గ్రహముల కుచ్చస్వక్షేత్రములను నిర్ణయింప, సిద్ధాంతుల కైకమత్యము కలుగలేదు. మఱియు, "భ" చక్రపరిస్థితులం జూడఁగా (క్రీ॥ పూ॥ 12 శతాబ్దప్రాంత

మునందు) మేషసంక్రమణ మనఁగా, కృత్తికాప్రథమపాదప్రవేశమే, సూర్యున కుండవలెనని, తైత్తిరీయబ్రాహ్మణాదికమువలన, నూహింపవలసియున్నది. మేష సంక్రాంతి, కృత్తికానక్షత్రమున, రవి ప్రవేశించుటయే యైనచో, చైత్రశుద్ధ నవమినాఁ డెప్పుడును, మేషమున సూర్యుఁ డుండఁగా పునర్వసూనక్షత్రము రాదు. కృత్తికాప్రథమచరణమునందు, సూర్యుఁడు ప్రవేశించునపుడు, మేష సంక్రమణ మగుట బ్రాహ్మణముల కాలమునం దగుట నేఁటికి విచిత్రముగాఁ గాన్పించును; కాని, బాలగంగాధరతిలకుగారి "ఓరియన్" అను గ్రంథముం బట్టి చూడఁగా "మృగశిరానక్షత్రము" నందు సూర్యుఁడు ప్రవేశించిన కాలమే యొకప్పుడు, మేషసంక్రమణ మై యున్న దని, తెలియ నగుచున్నది. వేదాంగజ్యోతిషము ననుసరించి, మాఘశుద్ధ ౧ నాఁడు, మకరసంక్రమణ మైన దనియు, నా కాలము, మహాభారతయుద్ధకాల మనియుఁ, గీర్తిశేషు లగు పోలవరము రాజాగారు వ్రాసియున్నారు. ఈగణితవైచిత్ర్యములు, జనసామాన్యమునకు, దురవగాహములై యుండును.

పైకారణములచే, శ్రీరామచంద్రుని జననసమయమునకు, రవి, చంద్ర, బుధ, రాహు, కేతు గ్రహముల కుచ్చస్థితి నేఁటి సిద్ధాంతప్రకారము సంభవింపదు. రామాయణమునందు "స్వోచ్చసంస్థేషు పంచసు గ్రహేషు" అని చెప్పి యుండుటచే, "భ" చక్రపరిస్థితు లైనను నేఁటిగణితమున కందనిరీతి నుండవలెను లేక రామాయణస్థశ్లోకములు, జ్యోతిషానభిజ్ఞునిచేఁ గూర్పఁబడిన వైనఁ గావలెను. "భ" చక్రపరిస్థితులను నేఁటివా రింకను, శోధింపలే దేమో యని ఆపస్తంబ శుల్బమునందలి ప్రాగ్దిఙ్నిర్ణయమునందలి "చిత్రాస్వాత్యో రంతరం" మొదలగు వాక్యములకు నేఁటివారు సమన్వయమును జేయ లేకపోవుటచే నూహింపవలసియున్నది. ఇందును గుఱించి మహామహోపాధ్యాయ సుధాకరపండితులవారు చాల విమర్శించియున్నారు. అది ప్రస్తుతమున కనవసరము గాన దానిని విడచి రామాయణస్థశ్లోకములను నేఁటిసిద్ధాంతప్రకారము స్వల్పముగా విమర్శింతును. రవికి మేషస్థితి స్పష్టముగాఁ జెప్ప లేదు కాని కర్కటకలగ్నమునందు, చంద్రుఁడు, బృహస్పతితోఁ గూడి యుండె ననియు, పునర్వసూనక్షత్ర మనియు, నుచ్చరించుట చేతను, చంద్రుఁడు పునర్వసూనక్షత్రమునందు ¾ భాగములు దాఁటె నని స్పష్ట మగుచున్నది. ఎపుడు, చంద్రుఁడు నవమినాఁడు ¾ వంతులు పునర్వసులో నతిక్రమించెనో సూర్యుఁడు మేషమునందు, లేనటులు మఱింత స్పష్ట మగును. వ్యాఖ్యాతలెలయో, రవి, కుజ, గురు, శుక్ర, శని గ్రహము లుచ్చయం దుండెనని వ్రాసిరి,

నుఱికొందఱు సూర్యుఁడు మేషాయనగతుఁ డగుటచేతనే, యుచ్చస్థగ్రహము గాఁ దలంపవచ్చు నందురు కాని, ఫలితజ్యోతిషగ్రంథము లట్టి పద్ధతి నెపుడు [illegible]చటను, జెప్పియుండలేదు. నేను, రామాయణస్థశ్లోకములు ప్రక్షిప్తములో, [illegible]పద్ధతులు దురూహ్యములో యనుకొందును. రాముఁడు ఋగ్వేదకాలపుపు [illegible], కే. వి. లక్ష్మణరావుపంతులుగారు మొదలగువారు, తలఁచియున్నారు [illegible] ఋగ్వేదకాలపుఁ బురుషుఁ డని, ఋగ్వేదమే, యీక్రింది ఋక్కుచేఁ జెప్పుచున్నది.

ఋ. ప్రతద్దుశ్శీమే, పృథవానే, వేనే, ప్రరామే ఒవోచ మసురే, మఘవత్సు
యేయుక్త్వాయ, పంచశతాస్మయుపథా విశ్రావ్యేషాం॥ 10—93—14.

తాత్పర్యము—ఏదేవతో లయిదువందలరథముల నశ్వములతోఁ గూర్చికొని, మాయందు ప్రేమగలవారయి, యజ్ఞమార్గముచే, వచ్చుచున్నారో, ఆస్తోత్రము, పృథవానునియందును, వేనునియందు, అసురుఁడు బలవంతుఁ డగుచుండఁగా, రామునియందును, ధనవంతులయందును, జెప్పుచున్నాము. అని పై ఋక్కుచే రాముఁడు, ఋగ్వేదపురుషుఁ డనియు, నాతనికి, బలవంతుఁ డగునసురుఁ డొకఁడు శత్రువు కలఁ డనియు, స్పష్ట మగుటచే, నారాముఁడు దశరథరాముఁడే యని స్పష్ట మగుచున్నది. ఐతరేయబ్రాహ్మణమునం దొక రాముఁడు ఋషి కలఁడు కాని, యతఁ డసురవిరోధి కాఁడు. అసురవిరోధి రాముఁడు, దశరథరాముఁడే. ఆతఁడు ఋగ్వేదకాలపువాఁడే, నాఁడు మృగశిరానక్షత్రమున సూర్యుఁడు, మేషప్రవేశము నొందియుండుటచే, "భ" చక్రము, నేఁటిగణితజ్ఞులకు, దురూహ్యపరిస్థితులు కలదై యుండెను. మఱియు వాల్మీకిరామాయణమునందలి గ్రహనక్షత్రాది వర్ణనములు, నేఁటి సిద్ధాంతుల కగమ్యగోచరముగా నున్న వని, యొక ప్రసిద్ధసిద్ధాంతిముఖమునుండియే పలికింపఁగలిగితిని. సూర్యునిలోని మచ్చలు మొదలగునవి వాల్మీకి వర్ణించియున్నాఁడు. నేఁటివారి కవి, నవీనశోధనలలోనివి. మఱికొందఱు నవీనాచారపరులు, ఫలితజ్యోతిషము భరతఖండమునకు గ్రీకుల దండయాత్రతో వ్యాపించిన నవీనవ్యాధి యని దూషింతురు కాని బ్రాహ్మణములయందే "మఘాభి ర్గావో గృహ్యంతే, యాం కామయేత దుహితరం ప్రి యాస్యా మితి తాం నిష్ట్యాయాం దద్యాత్" అని ప్రాజాపత్య వివాహమును మఘానక్షత్రమునఁ జేయవలె ననియుఁ దనకూఁతును, భర్తకుఁ బ్రియురాలినిగాఁ జేయనిచ్ఛయించినవాఁడు, స్వాతీనక్షత్రమునందు వివాహముచేయవలెననియు, వ్రాసినసంగతులఁ బరిశీలింపరు. ఏది యెటు లుండినను రామునిజాతకము నేఁటి

జ్యోతిషమున కందరాని పరిస్థితులు కలదై మిక్కిలి ప్రాచీనకాలపు దని తలంపవలసి యున్నది. ఆవివాద నటుండనిండు-రాముని పితృభక్తి, ఏకపత్నీవ్రతము, సౌభ్రాత్రము, సత్యసంధత మొదలగు వానినిగుఱించి, పెక్కండ్రు విద్వాంసులలోఁ బెంచి, వ్రాసియుఁ, జెప్పియుఁ, బెద్దగ్రంథములఁ జేసియున్నారు. నే నిపు డా సంగతులను, వ్రాయక నాఁటిభరతఖండస్థితిని రామాయణస్థ యుద్ధహేతువులను విన్నవింతును.

నాఁటిభరతఖండనైసర్గికస్థితి:—రామాయణమునందలి భరతఖండపటమి ట్లుండును. ఇప్పటి రాజపుత్రస్థానము సముద్రముగానుండి సింధునదియందు సంగమించుచున్నది. (రాముఁడు ఋగ్వేదకాలపురుషుఁ డగుటచేతను, ఋగ్వేదము రెండవమండలమునందు సింధునదమున్నటులు వర్ణించుటచేతను, నూహింపఁబడెను) ఇప్పటి మధ్యపరగణాల ప్రాగ్భాగము ఒరిస్సాలోని చాలభాగము, నుప్పునీటిపెద్దసరోవరముగా నుండి, యందలిద్వీపములు, కాలకేయాసురుల "కభిజనమై" యాద్వీపములనడుమను "అశ్మపురము" అనుపట్టణముకలదై, వాస్తుశాస్త్రజ్ఞుఁ డగు (ఇంజినీర్) అగస్త్యునిచే నాసరోవరపుజలము బంగాళాఖాతమునకుఁ (నేఁటిచిల్కాసరోవరముతోఁ గలియునటులు) బ్రవహింపఁజేయఁబడి, కాలకేయు "లార్యులకు" విధేయు లగునటులు చేయఁబడి యాసరోవరము భూమిగా మార్పఁబడెను. పిమ్మట స్వల్పకాలమునకే, కాలకేయాసురాధిపుఁడును, శూర్పణఖాభర్తయు నగు విద్యుజ్జిహ్వుఁడు, రావణునిచేఁ జంపఁబడి శూర్పణఖాప్రతినిధిగా, ఖరాసురుఁడు కాలకేయరాజ్యము నేలుటకు నియమింపఁబడినందున, "అశ్మపుర" రాజధాని, "ఖరాలయము" (ఖరియాల్) నకు మార్పఁబడెను. నేఁటిబంగాళాదేశమును బేహారులోని ప్రాగ్భాగమును, సముద్రగర్భము నందుండుటచే, సముద్రము, మిథిలాపట్టణమువఱకు, వ్యాపించియుండుటయే గాక, సముద్రప్రవాహము నేఁటివలెఁ దూర్పుతీరమునందు దక్షిణమునుండి యుత్తరమునకే, వ్యాపించియున్న దని, లంకలోఁ బుట్టినసీతనుఁ బెట్టెలోనుంచి, సముద్రప్రవాహమున నిడఁగా మిథిలాపురిప్రాంతమునకుఁ గొట్టుకొనివచ్చిన దనుగాథవలన నూహింపఁదగి యున్నది. నేఁటి, కేరళ, కోంకణ, దేశములును, దూర్పుకనుమలకుఁ బ్రాగ్భాగమునందలి మనయుత్తరసర్కారులు, నెల్లూరు మండలమే కాక కడప, కర్నూలు, చిత్తూరు, వేలూరు, గూడలూరు, తంజావూరు, తిరుచునాపల్లి మండలములలోఁ జాలవఱకు సముద్రమునం దణఁగి యుండి, తూర్పుకనుమలయొక్క చాలభాగము (పల్లపుఁబ్రదేశములు) సముద్రము

నందు మునిఁగియుండి, యెత్తైనచోటులు, సముద్రమునందు, ద్వీపములుగాఁ గాన్పించుటచే, నార్యావర్తమునకును, లంకాద్వీపమునకు, నడుమ నీద్వీపగణము, నేఁటి జవా కామస్కాట్కాల నడుమ నుండిన, క్యూరెల్ ద్వీపములను, దలఁపింపఁజేయుచుండెను. నేఁటి, కృష్ణా, పినాకినీ, కావేరీనదు లందువలననే, రామాయణమునందు, వర్ణింపఁబడక, లంకనుండి, పర్ణశాలకు, రావణుఁడు వచ్చునపుడు ద్వీపములు, వర్ణింపఁబడెను. నేఁటి సింహళద్వీప మిప్పటివలె నుండక, నిరక్షరేఖ నంటిన సండాద్వీపములతో నైక్యమునొంది, నేఁటియాస్ట్రేలియాను దలపించుచుండెను. ప్రాచీనజ్యోతిష్కు లందువలననే, లంక యనఁగా, నిరక్షదేశమని వాడుకొనుటయు రామాయణమునందు, లంకాద్వీపమును బెద్దదానినిగా వర్ణించుటయుఁ గలిగినది. రాముఁడు కిష్కింధనుండి, సేతుబంధప్రదేశము వఱకు, నడిచినదారి, సహ్యాద్రుల (పడమటికనుమల) నుండి యైనటులు, యుద్ధకాండారంభమునఁ గలదు. (ఇప్పటి రామేశ్వరము క్రీ॥ పూ॥ 14 శతాబ్దమునందు, ఈఁజిప్టుదేశము నేలిన, రామసేను కొడుకు సీతాయి కట్టించినదాయని, వైద్యాగా రొకప్పుడు హిందూస్థాన్ రివ్యూలో వ్రాసిన దేకారణముచేతనో దురూహ్యము) ఇవి నాఁటిభరతఖండనైసర్గికస్థితులు.

అప్పటిజాతులు:—నాఁడు నేఁటియాఫ్గనిస్థాన పశ్చిమోత్తరపరగణాలలో “శైలూషు”లనుగంధర్వులును, ఉత్తరమధురాపురప్రాంతమున మధ్వాసురపాలితు లగు స్వల్పానార్యజాతియు, నర్మదానది నంటిన మధ్యభారతదేశమునందు హైహాయ తాళజంఘాది మిశ్రక్షత్రియజాతియు, మహారాష్ట్రదేశమున మిశ్రగంధర్వజాతియుఁ, బశ్చిమాంధ్ర కర్ణాటక దేశములందు, వానరజాతియుఁ బశ్చిమద్రవిడ సింహళములయందు, యక్షరక్షోమిశ్రజాతియుఁ గలిగియుండెను. కేవలార్యజాతి కేకయ, కురు, కోసల, మిథిల దేశములయందు, అనఁగా, ఉత్తరమున హిమాలయము, తూర్పున నాఁడు “కీకట” మనుపేరు గలిగి నేఁడు “గయా” ప్రదేశముగా నుండిన ప్రదేశము, దక్షిణమున మాళవదేశము, పశ్చిమమున సింధునది, హద్దు కలిగిన ప్రదేశమునందే యుండెను. ఆర్యర్షులు, మిశ్రగంధర్వు లుండినచోటులకును, గాలకేయుల “కభిజన” మగుదండకారణ్యమునకును, నేఁటికాలమునందు, ఆఫ్రికాఖండమునకు వలసపోవు, మిషనేరీలవలె, వలసలుపోవుచుండిరి. అట్టి నాఁటిభరతఖండమున, నార్యులకును, మిశ్రజాతులకును, అసురులకును, బెక్కుయుద్ధములు, స్వజాత్యభివృద్ధికొఱకును, దేశాక్రమణకొఱకును బెక్కుసారు లైనవి. అందు సుమాల్యాద్యసురులు, రామ

రావణయుద్ధమునకుఁ బూర్వ మొకసారి, విజృంభించి, హిమాలయమున కుత్తరమునందుండిన, త్రివిష్టప (తిబెత్) దేశీయులకుఁ గూడ భీతిఁ గొలిపి, యార్యులచే నోడింపఁబడి, లంకకుఁ బరువెత్తి యచటనుఁ గూడ నిలువలేక రాజ్యభ్రష్టులు కాఁగా వారిలంకారాజ్యము నార్యుఁ డగు "కుబేరుఁడు" స్వాధీనము చేసికొనెను. అట్టితఱి "సుమాలి" దీర్ఘదృష్టి కలవాఁడై, యార్యజాతి రక్తసంబంధ ముండినయెడల స్వజాత్యభివృద్ధి నొందఁగల దని తలంచి, తనకూఁతుఁ గైకసిని విశ్రవోబ్రహ్మ కభిసరింపఁజేసెను. ఆర్యుఁ డగువిశ్రవసునకును, అసురయగు, కైకసికిని నార్యానార్యగుణమిశ్రు లగురావణకుంభకర్ణవిభీషణు లుద్భవించిరి. వారి యార్యానార్యగుణవిశేషములు, రామాయణపాఠకులకు విశదములే. రామాయణపాఠకులకు, రావణనామోచ్చారణముతోడనే, వాని పది తలలు, నిరువదిచేతులు, నిరువదికన్నులు, నిరువదిచెవులు, మనోగ్రాహ్యములగును. కాని, రావణుఁడు, సింహాసనస్థుఁ డైనపుడును యుద్ధమునకుఁ బోవునపుడే, దశశిరస్కునిగాను వింశతిభుజునిగాను వాల్మీకి వర్ణించియున్నాఁడు కాని, పగుండినపుడు, నిద్రనుండి లేచునపుడు స్త్రీలతో ముచ్చటించునపుడు, తుదకుఁ జచ్చునపుడు, నేకశిరస్కుఁడు, ద్విబాహుఁడు, ద్వికర్ణుఁడు, ద్వినేత్రుఁడు, గానే వాల్మీకి వర్ణించియున్నాఁడు. వానిని దిక్ప్రదర్శనముగా వ్రాసెదను. సుందరకాండ ౧౦-వ సర్గ—రావణుఁడు నిద్రపోవుచు హనుమంతునికిఁ గనఁబడినపుడుండినరీతి.

శ్లో. శుశుభే రాక్షసేంద్రస్య స్వపత శ్శయనోత్తమం ।
కాంచనాంగదనద్ధౌచ దదర్శ స మహాత్మనః ।
విక్షిప్తౌ రాక్షసేంద్రస్య భుజా వింద్రధ్వజోపమౌ ।
ఐరావణవిషాణాగ్రై రాపీడనకృతవ్రణౌ ।
వజ్రోల్లిఖితపీనాంసౌ విష్ణుచక్రపరిక్షతౌ ।
పీనౌ సమసుజాతాంసౌ సంగతౌ బలసంయుతౌ ।
సులక్షణనఖాంగుష్ఠౌ స్వంగులీతలలక్షితౌ ।
సంగతౌ పరిఘాకారౌ వృత్తౌ కరికరోపమౌ ।
విక్షిప్తౌ శయనేశుభ్రే పంచశీర్షావివోరగౌ ।
తాభ్యాం సపరిపూర్ణాభ్యాం భుజాభ్యాం రాక్షసేశ్వరః ।
శుశుభేచలసంకాశ శ్శృంగాభ్యామివ మందరః ।
ముకుటే నాపవృత్తేన కుండలోజ్జ్వలితాననమ్ ॥

తాత్పర్యసంగ్రహము—రాక్షసేంద్రుఁ డగురావణుఁడు పరుండినశయ్య శోభించెను. మహాత్ముఁ డగునాతని రెండుభుజములను, బంగరుభుజకీర్తులు గల వానినిగాను, జాఁపఁబడిన వానినిగాను, ఇంద్రధ్వజముతో సమమైనవిగాను, ఐరావతపు దంతపు దెబ్బలచేఁ బుండ్లుపడినవానినిగాను, వజ్రముచే గీచుకొనఁబడి బలిసినభుజశిరస్సులు గలవిగాను, విష్ణుచక్రముచేఁ గొట్టఁబడినవిగాను, బలిసినవిగాను, సమానభుజశిరస్సులు కలవిగాను, బలము కలవిగాను, అందమైయుంగరములతోఁగూడిన వ్రేళ్లు కలవిగాను, పరిఘాకారము కలవిగాను, గుండ్రనై యేనుఁగుతొండమువలె నుండినవిగాను (హనుమంతుఁడు) చూచెను. ఆ రెండుచేతులును, ప్రక్కపైని చాఁపఁబడి, య్యైదుతలలపాములవలె నున్నవి. - - - - ఆరెండుచేతులచేతను రావణుఁడు రెండుశృంగములు గల మందరగిరివలె శోభించుచుండెను. - - - - కోలనైన కిరీటముచేతను కుండలములచేతను శోభించుచుండిన ముఖము కలవాఁడై రావణుఁ డుండెను. పైశ్లోకములయందు చేతులను వర్ణించునపుడు ద్వివచనముచేతను, గిరీటము నేకవచనముతోను నిర్దేశించుట గమనింపఁ దగినది. ఇది రావణుని నిద్రాసమయమునందుండిన స్వరూపము. స్త్రీలతో ముచ్చటించునపుడును, నిజస్వరూపముతోనే యుండు నని, సుందరకాండ 22-వ సర్గనుండి తెలిసికొనవచ్చును.

**ఘట్టము - సీతాక్రోధము.**

> శ్లో. ఇమే తే నయనే క్రూరే విరూపే కృష్ణపింగళే।
> క్షితౌ నపతితే కస్మా న్మామనార్య నిరీక్షితః।
> సీతాయా వచనం శ్రుత్వా రావణో రాక్షసాధిపః।
> వివృత్య నయనే క్రూరే జానకీ మన్వవైక్షత॥

తాత్పర్యము—(తన్ను వరింపు మని రావణుఁ డనఁగా సీత యిటులుతిట్టుచున్నది.) ఓరి దుర్మార్గుఁడ క్రూరములై నల్లని గ్రుడ్డునందు పచ్చపాపలు కలిగి వికారరూపముగా నుండిన నీనేత్రములు రెండును నన్నుఁ జూచుటవలన నేల భూమిపైఁ బడుట లేదు?

సీతయొక్క (తిట్టుతోఁ గూడిన) మాటను విని రావణుఁడు, రెండు క్రూరనేత్రములను బెద్దవిగాఁ జేసి సీతను జూచెను.

ఈస్థలమునందును నేత్రములను వర్ణించునపుడు ద్వివచనములనే యుపయోగించుట గమనింపఁదగియున్నది. ఆసర్గయందే మఱియొకచోటునఁ గుండల

ములను భుజములను వర్ణించునపుడు ద్వివచనములనే ప్రయోగించుట నాలోచింపఁదగియున్నది.

శ్లో॥ - - - తాభ్యాం సపరిపూర్ణాభ్యాం భుజాభ్యాం రాక్షసేశ్వరః।
- - - - - - తరుణాదిత్యవర్ణాభ్యాం కుండలాభ్యాం విభూషితః।
రక్తపల్లవపుష్పాభ్యా మశోకాభ్యా మివాచలః॥

తా॥ పరిపూర్ణ మగు రెండుచేతులతోను రావణుఁ డుండెను. - - - - - బాలసూర్యుని కాంతిగల రెండు కుండలములచే నలంకరింపఁబడినవాఁడై (రావణుఁడు) ఎఱ్ఱని చిగుళ్లను, బుష్పములుఁ గల రెం డశోకవృక్షములచే శోభించు పర్వతమువలె నుండెను. ఇచట నుపమానోపమేయములు కూడ ద్వివచనములచేతనే వచించుట, రావణునకు ద్వినేత్ర ద్విబాహు ద్వికర్ణాస్తికతనే గూఢిచేయుచున్నది. మఱియు నిద్రనుండి లేచునపుడును, ద్వినేత్రుఁడుగానే యుండినటులు వర్ణించెను.

శ్లో॥ తస్య క్రుద్ధస్య నేత్రాభ్యాం ప్రాపత న్నాస్రబిందవః।
దీప్తాభ్యా మివ దీపాభ్యాం సార్చిషస్నేహబిందవః॥ 42 సర్గ. సుందరకాండ.

తా॥ కోపముతో నుండిన యారావణుని రెండునేత్రములనుండియు రక్తబిందువులు ప్రకాశించుచుండిన రెండుదీపములనుండి మండుచుండిన చమురు చుక్కలువలెఁ బడెను. ఇది యశోకవనభంగమును వినునపు డుండినరీతి.

ఇట్లే యుద్ధకాండములోను, రావణుఁడు గోపురమునందుండి రహస్యముగా వానరసైన్యమునుఁ జూచునపుడు సుగ్రీవుఁడు తటాలున, రావణునితోఁ దలపడఁగా, రావణుఁ డపుడు రెండుచేతులతోనే, సుగ్రీవునితోఁ బోరెను. చూడుఁడు. యుద్ధకాండములోని 40 సర్గ.

రామరావణుల ప్రథమయుద్ధమునందు రావణుఁడు, లక్ష్మణునిమూర్ఛనొందించి, యాతనిని దీసికొని పోవఁ దనశక్తి నంతయు నుపయోగించునపుడును, రావణుని రెండుచేతులు మాత్రమె పనిచేసినవి కాని తక్కిన యష్టాదశహస్తములును, నలంకారహస్తములే యైనవి. యుద్ధకాండ 59 సర్గ. మఱియు నింద్రజిద్వధను వినునపు డంతఃపురమున రావణుఁ డేడ్చునపుడును, రెండుకన్నులనుండియే, నీరుకాఱినది. ఒక లలాటమునందే, ముడుతలు పడినవి. చూడుఁడు యుద్ధకాండ 93 సర్గ. మఱియుఁ గిరీటములు, దశశిరస్సులకు నుండక యొక శిరస్సనకే యుండినటులు, పెక్కుచోటులను వర్ణించి, వాల్మీకి సత్యప్రకటనమునే

చేసియున్నాఁడు. గ్రంథవిస్తరభీతిచేత నాశ్లోకములు వ్రాయ లేదు. కాని వాల్మీకి రామాయణము నాంధ్రీకరించిన భాస్కరాదు లయినచోటునను, గానిచోటు నను, రావణునికి దశశిరస్సులను, వింశతిభుజములను దగిల్చి మఱింత వికృత రూపుని జేసిరి. దశశిరస్సులు గలరావణుఁడు చాలక, "మర్దనకవి, కూచిమంచి గంగనకవి" మొదలగువారు, "శతకంఠరావణాసురుని"గూడ సృష్టించి తనివి నొందిరి. "సహస్రకంఠరావణచరితము" కూడఁ గలదఁట. చూచుట కదృష్ట మింకను నాకుఁ గలుగ లేదు. నిజముగ రావణుఁడు వరబిభీషికకై నాటకము లోని, రావణ వేషధారివలెనే, దశశిరస్సులను, వింశతిభుజములను, సభలోఁ గూర్చుండినపుడును, యుద్ధప్రస్థానసమయమునందును ధరించుచుండె నని, తలంపవలసి యున్నది. కడపటి యుద్ధమునందును, దలనుఁ గొట్టఁగాఁ దల మొలచుట, భాస్కరాదులు వర్ణించినటులు కోటానకోట్లు లేక, నూఱుమా త్రమె యని, యుద్ధకాండ 111 సర్గయందుఁ గలదు. వింశతిభుజముల ప్రశంస యచటఁ గానరాదు. రావణుఁడును, రామునివలె నొకధనుస్సుతోఁ బోరినట్లే యుద్ధకాండలోఁ గలదు. కాని నేఁటిభారతీయవక్తలలో మేఘగంభీరనిస్వనుఁ డని, సురేంద్రనాథబణర్జీనిఁ జెప్పుకొనినట్లు నాఁటికాలమునందు, రావణుఁడు పెద్దగొంతుకతో, మాటలాడువాఁ డగుటచే నాతనిని దశగ్రీవుఁ డనియు, దశ వదనుఁ డనియుఁ బిలిచిరి. ఆతనికి "రావణ" బిరుదము నిచ్చునపుడు శివుఁ డాడినవాక్యముల నుత్తరకాండలోఁ జూచిన, దశవదనశబ్దభావము స్పష్ట మగును.

రావణునిరాజనీతి:—రావణుఁడు, బ్రహ్మచే వరములనొందునాఁటి కార్యు లపై నంతగ విద్వేషము లేదు. పిమ్మట నే మాతామహుఁ డగుసుమాలి కుబే రునిపై నీర్ష్యనుఁ గలుగఁజేసెను. మొదట రావణుఁడు కుబేరునిపై ద్వేషమున కంగీకరింపక, మేనమామ యగుప్రహస్తుఁడు సహవాసుఁడై, మెల్లగఁ బురి కొల్పుటచే రావణుఁ డార్యులపై దాడివెడలుట కారంభించి కుబేరునిఁ బరా భూతుం జేసి కైలాసమున కాతని నంపి లంకం జేకొనెను. ఈసత్వరజయ, మాతని రాజ్యాభిలాషం బెంపఁగా, నాతఁ డనేకదండయాత్రలం జేసెను. ఈతనియుద్ధయాత్రలు, మిశ్రజాతీయుఁడును, నర్మదానదీప్రాంతరాజ్యపాలకుఁడు నగు, కార్తవీర్యార్జుననికడను, జాత్యంతరానార్యుఁడును బశ్చిమాంధ్రదేశరాజు నగువాలికడను ఫలకారులు కానందున వారితో సంధిఁ జేసికొనెను. ఇట్లే; వేఱొకయిక్ష్వాకురా జగుమాంధాతతో సంధిఁ జేసికొనెను. సజాతీయుఁడయి, యమునానదీతీరమున రాజ్యముఁ జేయుచుండిన మధ్వాసురునితోఁ బోరాడుట

యుక్తముగా దని, యాతనికిఁ బినతల్లి కుమార్తెను వివాహముం జేసి, మిత్రునిఁ జేసికొనెను. ఆర్యానార్య సంజనితులై నేఁటి యాఫ్గనిస్థాన ప్రాంతమునందు ప్రముఖులుగా నుండిన "శైలూషుల" యాఁడుపడు చగు "సరమ"ను, విభీషణునకుఁ బెండ్లి చేయించెను. నేఁటి "మధ్యపరగణాల" ప్రాంతమున నధికారులుగా నుండిన "కాలకేయు" లను నార్యేతరుల కధిపుఁ డగు "విద్యుజ్జిహ్వు"నకుఁ దనతోఁబుట్టువు "శూర్పణఖను" బెండ్లి చేసెను. కాని, కాలకేయులు, అగస్త్యాద్యార్యజాతివారిశక్తికి లోఁబడి తన కెదురుఁ దిరుగుటచే, రావణుఁడు "అంగవ్రాతములోఁ జికిత్సకుఁడు, దుష్టాంగంబు ఖండించినరీతిగఁ" దనబావమఱఁదినే తనతోఁబుట్టువు పెనిమిటి యగువిద్యుజ్జిహ్వునే, చంపి యాదండకాంతర్గత జనస్థానరాజ్యమును స్వాధీనపఱుచుకొని, ఖరాసురు నచటఁ బ్రతినిధిగా నియమించెను. రాజకీయమునం దెంతటినైచ్యమున కైన రావణుఁ డొడఁబడువాఁ డని, శూర్పణఖను విధవఁజేయుటలోనే కాక, వాలితోఁ జేసికొనిన సంధిలోఁ గూడఁ బ్రస్ఫుట మగుచున్నది. ఆసంధి యెట్లున్నదో చూడుఁడు.

శ్లో॥ త్వయాసహ చిరం సఖ్యం సుస్నిగ్ధం పావకాగ్రతః ।
దారాః పుత్త్రాః పురం రాష్ట్రం భోగాచ్ఛాదనభోజనమ్ ।
సర్వమేవావిభక్తం నో భవిష్యతి హరీశ్వర ॥

తా॥ ఓవానరశ్రేష్ఠుఁడ వగువాలీ, నీతో నాకు నగ్నియెదుటను స్నేహము చిరకాల మగును. మనయిద్దఱకు, భార్యలు, పుత్త్రులు, పట్టణము, రాజ్యము, భోగము, బట్టలు, భోజనము నంతయు నవిభక్తమే కాఁగలదు.

ఇందు భార్యలుకూడ, మన కుమ్మడి యని, కాముకుఁడును, సోదరభార్యాపహర్తయు నగు వాలితో ననుటకంటె నైచ్యము వేఱేమి కలదు. ఇందువలననో యెందువలననో వాలిమందోదరుల కంగదుఁ డుద్భవించె ననువాడుక కలదు. ఇది యేపురాణమున నైనఁ గల దేమో, శోధింపవలసి యున్నది. రావణుఁడు, ఆర్యులరాజ్యములు మాత్రము వేఱుగనుండుట కిష్టపడక వానిని గూడ స్వాధీనపఱుచుకొనుటకుఁ బ్రయత్నించి ఖరాసురునకుఁ దోడు పదునాలుగువేల భటుల నిచ్చి జనస్థానమున నిల్పి యాసైన్యమునకుఁ బురోగామిగా, సమాతృభ్రాతృయుక్తుఁ డగుమారీచుని సైన్యముతోఁగూడ నార్యదేశములపైకిఁ బంపెను. అందు తాటక, మలద కరూశదేశములను, నిరార్యకముగఁ జేసెను. మారీచసుబాహులు కోసలమిథిలదేశములకు వార్తనైనఁ బోకుండఁ జేయఁగల్గిరి.

అప్పటి యార్యుల కక్షలు:— అప్పటి కేకయ, కోసల, మిథిల రాజులు సుప్రసిద్ధులే కాని స్వశక్తిచే నేదేని పనినిఁ బ్రారంభించి నిర్వహింప సామర్థ్యము కలవారు కారు. కోసలదేశమునందు వసిష్ఠునిపలుకుఁబడియు మిథిలదేశమునందు, విశ్వామిత్ర శతానందులపలుకుఁబడియు రాజాస్థానములయందుఁ జెల్లుచుండెను. వసిష్ఠుఁడు పూర్వాచారపరుఁడు. ఈతనికిని, సంఘసంస్కర్త యగువిశ్వామిత్త్రునికిని, బద్ధవైరము కలదు. పరశురాముఁడు పూర్వాచారపరులలోఁ దీవ్రవాది, స్వజాత్యభివృద్ధియే న్యాయ మనువాఁడు. ఈపరశురాముఁడును, పూర్వాచారపరుఁడగు సగరచక్రవర్తియు, మిశ్రక్షత్త్రియు లగు హైహయ తాళజంఘులచేఁ బెక్కుబాముల ననుభవించి వారివంశముల నే నాశము చేసినటులు బ్రహ్మాండాదిపురాణములలోఁ గలదు. ఆర్యులలోని వసిష విశ్వామిత్ర పరశురామ కక్షలవారి కన్యోన్యము పొసఁగదు. కాని రావణకృతోపద్రవము భరతఖండస్థార్యజాతినిఁ దుడిచివేయు నను సూచనలు కాన్పించుటచే వసిష్ఠవిశ్వామిత్త్రు లేకమై దశరథునిచే రామలక్ష్మణులను దేశారాధనకు ధారపోయించిరి. విశ్వామిత్త్రుఁడు నవీనయుద్ధపరికరముల నలవఱచికొనిన వీరర్షి. కాని, వృద్ధగుటచే నాపరికరములను, రామునిస్వాధీనముఁ జేసి, వానిచేఁ దాటకనుసుబాహునిఁ జంపించి, యార్యదేశములకు మొదటి యుపద్రవముం దప్పించెను. అందుకుఁ బారితోషికముగా సీతను రామునకుఁ బెండ్లిచేయించెను. శ్రీరాముఁడు, పరశురాముని స్వల్పకక్షం గూడఁ దనలోఁ గలిపికొనెను. పిమ్మటఁ బరశురామకక్ష, తటస్థముగా నుండెను. వసిష్ఠకక్షవారే, ధర్మపునెపముతో రాముని రాజ్యభ్రష్టునిఁ జేసి రని కాని, లేక కుటుంబకలహముచే రాముఁడు, వనమునకుఁ బోయె నని కాని చారిత్త్రికదృష్టిలో రామాయణాయోధ్యకాండఁ జదివిన విశదము కాఁగలదు. వసిష్ఠకక్షవా రడ్డుకొనినచో, రామునకు, వనవాసము కలుగ దేమో యని, రామాయణములోని, వసిష్ఠుని పలుకుఁబడిఁ దలంచి చెప్పవలసి యున్నది. రాముఁడు, చిత్రకూటమునం దుండినపుడు భరతుఁడు, రాము నయోధ్యకుఁ దోడ్కొనిపోవ రాఁగా, ఋషులు, రాముఁడు తిరిగి యయోధ్య కేగునేమో యని వారిభ్రూభంగాదికముచేఁ దెలియఁజేసిన విధానముచే, వసిష్ఠకక్షవారిప్రయత్నమువలన నే, రామువనవాసము కలిగె నని తలంపఁబడుచున్నది. రాముఁడు చిత్రకూటమునందే యుండిన యెడల రాక్షససంహారము జరుగ దని తలంచి, దక్షిణదేశమున కేగ రాముని మునులు ప్రోత్సహించుచుండిరి. రాముఁ డాశ్రమాదాశ్రమమున కేగుచు నే నెచట నుందునని ఋషుల నడుగుచు వారివలన, అత్త్రి, సుతీక్ష్ణ, శరభంగ, అగస్త్యా

శ్రమములకు సాగనంపఁబడెను. నడుమ నడుమ, మునులు, రామునకు రాక్షస విద్వేషమును నూరిపోయుచుండిరి. జనస్థానమునం దుండిన ఖరాసురానుయాయు లగు రాక్షసులును, ఒంటరిగఁ గనఁబడిన మునులను బోనీక వధించుచుండిరి. ఇదియే మునులకు రాక్షసులపైఁ గల ద్వేషకారణము. అందువలననే రాము నంతగాఁ బురికొలిపినదియు. ఒకప్పుడు, సీతాదేవి మునులు రామునకుఁ గలుగఁజేయుచుండిన యీవిద్వేషకారణముచేఁ దమకుఁ గీడు రానున్న దని తలంచి, రామున కనేకవిధముల, రాక్షసద్వేషము కూడ దని బోధించినది. మునులబోధ తల కెక్కినట్టియు స్వజాత్యభివృద్ధియు దీనరక్షణమును వ్రతముగాఁ గలరాముఁ డెట్లు సీతావాక్యములను వినును. రామునకు రాక్షసద్వేషము వృద్ధియగుట కెట్టిది దృశ్య మాయెనో చూడుఁడు. ఒకచోటఁ బర్వతసదృశ మగు నస్థికలప్రోగు కాన్పించెను, దానిని గుఱించి రామునకు మును లిట్లు చెప్పిరి.

శ్లో॥ ఏహి పశ్య శరీరాణి మునీనాం భావితాత్మనామ్ !
హతానాం రాక్షసై ర్ఘోరై ర్బహూనాం బహుధా వనే॥

తా॥ ఓరామా రమ్ము నిదిధ్యాసపరాయణులయి వనమునందు బహువిధములుగా ఘోరముగా రాక్షసులచే వధింపఁ బడిన పెక్కండ్రు మునుల శరీరములఁ జూడుము.

శరణాగతత్రాణబిరుదము గలరామున కిట్టి ఘోరాస్థిపంజరములు, కాన్పించినంతనే, రాక్షసబీజము నణఁతు నని, ప్రతిజ్ఞఁ బట్టుటలో వింత లేదు. రాముఁడు సుతీక్ష్ణ, అగస్త్యాశ్రమములలోఁ, దననియమితకాలమునంతయుఁ గడపఁదలంచెనుగాని, వా రచట నిలువనీయరైరి. తుద కగస్త్యుని బోధచే, లంకకును, ఖరాలయమునకును, నడుమ నుండిన పంచవటిలో నివసించెను. ఇచట నుండిన యెడల, రామునకు, రాక్షసోపద్రవము కలిగి, యందువలన రాక్షసులు రామునిచేఁ జత్తు రనియే, మునుల తలంపు. తుద కట్టిపరిస్థితియే కలిగినది. రాముఁ డచట నుండఁగనే, కాముకి యగుశూర్పణఖ వచ్చుటయుఁ, దత్పరాభవము, ఖరాసురవధ, లోకవిదితము లైనవే. ఇక్కథయం దేపురాణమునుండియో మహాకవి భాస్కరుఁడు, తనరామాయణమునందు, శూర్పణఖాపుత్త్రుఁ డగు, జంబుకుమారుఁడు, తండ్రిపగఁ దీర్చుటకై పంచవటియందుఁ దపముఁ జేయుచుండినట్లును, వానికి, శూర్పణఖ భోజనాదికము నిడి సహాయము చేయుచుండినట్లును, వానిని ఋషులప్రోత్సాహముచే, లక్ష్మణస్వామి, వధించినట్లు నాంధ్రీకరించి యున్నాఁడు. ఇందు జంబుకుమారుఁడు తండ్రిపగఁ దీర్చుట

యనఁగాఁ దనతండ్రిం జంపిన, రావణుని వధించుటయే యగును. రాక్షసు లలోను రావణుని యవినీతికి రోసినవారు పెక్కండ్రు కలరు. కుంభకర్ణుఁడు, విభీషణుఁడు, శూర్పణఖ, మాల్యవంతుఁడు, అతికాయుఁడు మొదలగు దేహ సంబంధులే పెక్కువారు లాతనికి ఘోరకృత్యములు, పరదారాపహరణాదికము కూడ దని బోధించిరి. తుదకు విభీషణునికక్షలోనివారు విడిపోయి, శత్రుకోటి లోఁ జేరిరి. శూర్పణఖకూడఁ దనభర్త నన్న చంపె ననుపగ మనమున నిడి కొని, రామునితో రావణునకు విరోధముఁ బురికొలిపెను. రావణునకు మిత్ర కోటిలోఁజేరిన, వాలికక్షకూడ ద్విధాభిన్నమై సుగ్రీవకక్ష వారు రామునితోఁగలి సిరి. అనార్యజాతిలో నైకమత్యాభావము నార్యజాతిలో నైక్యతయే శ్రీరామ జయమునకును రావణమరణమునకు హేతు వయ్యెను. రావణుఁ డనార్యసం ఘైక్యతకు, మొదటఁ జాలఁ బ్రయత్నించెను గాని, వాని రాజసముతోఁ గూడిన ఘోరకృత్యములే వాని పతనమునకు హేతు వయ్యెను. ఆర్యర్షులు పెక్కు కక్షలు కలవా రైనను, తుద నైకమత్యము నొంది, రాముని కార్యదీక్షితునిఁ జేయఁగలుగుటచేతనే, ఖరాదులవలన వారి కగుకష్టపరంపరలనుండి తప్పించు కొనుటయే గాక, యార్యజాతి పలుకుఁబడిని భరతఖండమునంతయు వ్యాపింపఁ జేయఁగలిగిరి. అయినను, ఆర్యు లనార్యులను బూర్తిగ నశింపఁజేయక, వారి ఘోరకృత్యములతోఁ గూడిన మతమును మాత్రము మార్చి వారివారిరాజ్య ములను, వారివారిపరములుగానే చేసి యుండి రనుటకుఁ గిష్కింధారాజ్య మును, సుగ్రీవునకును, లంకారాజ్యమును, విభీషణునకు నిచ్చుటయే నిదర్శ నము. జనస్థానమునం దేరాజ్యము స్థాపింపఁబడ లేదు కాని, ఖరవధానంతరము జనస్థాననివాసు లగునసురులు, నివాసములను వీడి, పాఱిపోయి రనియు రావ ణుఁడు, సీతాపహరణానంతర మెనమం డ్రసురుల జనస్థానమునకుఁ గాఁపుగాఁ బంపె ననియు రామాయణారణ్యకాండములో నుండుటచేతను, రావణ వధానంతరము, జనస్థానస్థితు లగుమునులు, నసురులు నైకమత్యముతో నచటఁ బ్రజాసత్తాక రాజ్యమును స్థాపించుకొని రని తలంపవలసియున్నది. రామా యణగాథఁ జూడ మునులు కొంతవఱకు రాక్షసవినాశముకొఱకుఁ బ్రత్యక్షా ప్రత్యక్షములచే రాముని బురికొలిపి రని తలంపవలసియున్నది. కాని యందు వలన మునులకుఁ బ్రత్యేకలాభము కలుగక యార్యజాతిని గబళింప నుద్యమిం చిన యనార్యజాతి విజృంభణము నడఁగుటయే లాభముగఁ బరిణమించినది. అయినను ఋషు లెప్పుడును నార్యజాతిసముదాయలాభమే, స్వధర్మముగాఁ

దలంచి క్షత్రియులం బురికొల్పు చుండిరి కాని కేవలబ్రాహ్మణజాతిలాభ మునకై మెలఁగినటులు పురాణములం దెచటను గాన్పింపదు. అందువలననే బ్రాహ్మణపాలితరాజ్యము లేనాఁడును గలుగలేదు. పరశురామునివంటి యతివాదబ్రాహ్మణుఁడును, ఇరువదియొక్కసారులు, విజయయాత్రలు సాగించి, సంపాదించిన రాజ్యమును, ధనమును, కశ్యపాధీనముఁ జేసి వనవాసాయాసక్తుఁడే యయ్యెను. ఆకశ్యపుఁడైనను, స్వజాతిబ్రాహ్మణుల కారాజ్యముల నీయక క్షత్రియులకే రాజ్యముల నంటఁ గట్టెను. ఇదియే నాఁటి బ్రాహ్మణుల స్వార్థత్యాగనిదర్శనము. గ్రంథవిస్తరభీతిచే రామాయణమునందలి యితరసంగతులను బెంచి వ్రాయక విరమించుచుంటిని.

పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి.

శ్రీ

# ద్రావిడకంబమహాకవిజీవితము.

-----

శ్రీమద్వాల్మీకిరామాయణమును ద్రావిడవాఙ్మయంబుగా 'కంబరామాయణము' అను పేర ద్రవిడీకరించి చతురబ్ధిపరీతరసాతలంబునం దనయశః ప్రభాధవళిమంబుచే నిండుపండు వెన్నెలయందు లోకులకుం దరితీపు పుట్టించి కవిసార్వభౌమ బిరుదముతో విరాజిల్లిన కంబమహాకవి, భరతఖండ మనువనితామణి వదనారవింద తిలకాయమానమై సలిలసమృద్ధి భూసారము మొదలగు చేవచేఁ బాగడొంది, నాణెములచే నాణియములన్నిటికి నెక్కుడుగారవమునంది వేల్పువీటికి నుద్దియై పిసాళించునట్టి చోళమండలమును మనునీతిని జవదాఁటక పరిపాలించుచుండిన "స్వస్తి చరణసరోరుహావిహితవిలోచన త్రిలోచన ప్రముఖాఖిలపృథివీశ్వరకారిత కావేరీతీరకరికాలరత్నప్రదీపాహితకుమారాంకుశ ఉరయూరుపురవరాధీశ్వర కరికాలచోళాన్వవాయకలశవారాశిరాకాసుధామయూఖాభినవమహేంద్రకులోత్తుంగచోళభూపా"లుని పేరోలగంబుం గైసేయుచుండిన కవిగ్రామణుల శిరోవతంసమై బెడఁగారుచుండెను.

చోళమండలములోని తిరువళుందూరనుపురములో నాదిత్యుఁ డను మానవప్రవరుఁడు చిరకాల మపత్యము వడయమిం జేసి తిరువళుందూరిలో సన్నిధిసేసియుండు శ్రీమన్నారాయణుఁ డైనపరిమళరంగని భజించుచుండి, శుభావహం బైనయొక్కదినంబున నతండు దంపతీసహితముగాఁ బెరుమాళ్లసేవకై కోవెలలోనికిం బోవుచో ధ్వజస్థంభాంతికంబున నెలనాళ్లమగబిడ్డ యొక్కటి యాదంపతులకగపడెను. ఆదిత్యుఁడు దనప్రోయాలిం దిలకించి 'ప్రేయసీ! గర్భభారవహనము నామనస్యముం బొందనీక మనకు నీపరిమళరంగఁడు కనికరము వెల్లివోడుచుడెందముఁగలవాఁడై యీనిసువుం బ్రసాదించెను.' అని నుడువుడు, నామెకుం జన్నుసేఁపఁగాఁ దనయీనినచిఱుతనింబలెఁ బరమానందకందళితాంతరంగయై బిడ్డం జేతులం దీసికొని చన్నుగుడిపెను. పెరుమాళ్లతిరువరుల పేరిమిం గొనియాడుచు, దంపతులు గానకకన్నబుడుతనిం గైకొని యిలుసేరి, కంబమునందనుండినకతంబునఁ దముముద్దుపట్టికిఁ 'గంబఁడు' అని పేరిడి పెంచుచుండిరి. ఇటీవల, బాలుఁ డెదుగుచుండుచో రెండేండ్ల తరవాయి నాదిత్యుఁడు కాలధర్మమొందెను.

తల్లిబిడ్డలం బోషించువా రట లేమిం జేసి యాయువిద దనపాపనిం జంక నిఱుకుకొని బ్రదిమిక్కై తిరువెణ్ణెయ్‌నల్లూ రనుపురమున కేగి యందు మహాశ్రీమంతుఁ డైనసడయప్పవళ్ల లనుదానవీరునిప్రాపు సేరి యతనినే యేడు గడగాఁ గొని మనియుండిరి. అలవదాన్యశిరోమణియు నాయనదల న్నిక్కు టంపుటక్కటికముతోఁ బ్రోచుచుండెను. ఇట్లు దినదినప్రవర్ధమానుఁడై యై దాఱేండ్లు నిండఁగా సడయప్పనిబాలురు సదువుటకై బడికి వెళ్లునపుడెల్ల నీ కంబఁడు సైతము వారిపొత్తముల మూటల మోసికొని వారివెంటన బడి కేగి వారు సదువుచదువుల బహుగమనముతో గ్రహించుచుఁ గొన్నాళ్లు గడు పుచుండెను.

చదువు సెప్పించునొజ్జకు సజ్జపొల మొకటి గలదు. ఆపొలములోని పైరులం గాచుటకు బడికుఱ్ఱలలో నొక్కొక్కనిగా వంతువేసి యయ్యవారు గావలి యుంచుటలో నీకంబఁడు సయితము కావలి యుంపఁబడెను. అట్లు కంబఁడు కాచుచుండునప్పుడు, ఆదేశపురాజు కాళింగరాయుని వారువ మొక్కటి యాపొలముఁజొచ్చి కంబుపైరుల మెసవి పాడుసేసెను. కంబుపైరుల యెన్నులన్నియుఁ జేడ్పడుటం గని కంబఁడు మనికితపడి వాపోవుచుఁ బొలము గుఱంగట నుండు దుర్గాలయంబున కేగి యెలుఁగెత్తి యేడ్చుచు బెగ్గటం గూర్కొనెను. అట్లు తూఁగుచుండుతఱిఁ గాళిమ్మ కనికరముచే డెందము గరఁగి పొడకట్టి బొడిగను మేల్కొలిపి నాలుకం జాఁపు మని వానిజిహ్వపై భారతీబీజాక్షరముల వ్రాసి కనుమొఱఁగెను. అంతటం గంబఁడు విద్యానిలయుఁడై కాళిమ్మను గుఱించి

క. కుదిరిన వయిరపురంబునఁ, గదియుమహాకాళి వినుము, కంబెన్నుల వే
గదినితినిన కాళింగని, కుదిరను మాయించి కడిఁదిఁ గొనిపోవమ్మా!

*வாய்த்த வயிரபுர மாகாளி யம்மேகேள்,*
*காய்த்த திணைப்புனத்துக் காலைவைத்து—சாய்த்தக்*
*'கதிரை மாளத் தின்ற காளிங்கராயன்*
*ரை மாளக் கொண்டு போ.*

అని ద్రావిడోక్తిగా నొక్కపద్య ముద్ఘాటించినంతనె యాకిలాతము చదికిలంబడి తన్నుకొని పొడవడంగెను. ఈకర్జము నెఱిఁగి యొజ్జ సజ్జపొలమున కేతెంచి, మావుచావుం గాళింగనృపతి యెఱింగిన నేపాటిచేడ్పాటు వాటిల్లునో యని నడునడునడుంగఁగా నయ్యవారిబెగ్గలముఁ బ్రుగ్గింపం దలపోసి యా

పద్యతురీయపాదమును "కుదిరను బ్రదికించి కడిఁదిఁ గొనిరావమ్మా!" 'குதிரை மீளக் கொண்டுவா' యని మార్చి నొడివెను. అంతటఁ గత్తలాని యసుఱు వచ్చి లేచెను. ఇట్టి యబ్బురములఁ జెవిఁగొన్న కాళింగరాయఁడీభారతీవరప్రసాద లబ్ధమసీమావైదుష్యుఁ డైనబాలుని రప్పించి విశేషమర్యాదలఁ బూజించి పుత్తెంచెను. కంబమహాకవియుఁ దనకు జనపాలుఁ డొనర్చినబహుమానవు రస్సర మైన మేల్మిప్రేగికిఁ గారణభూతురా లైనభారతీదేవిని ద్రావిడోక్తిమయ ముక్తపదగ్రస్తత్రింశత్పద్యములచే స్తవ మొనరింపఁగా వాగ్దేవియుఁ బొడచూపి యతని కోరికిచొప్పున వలసినప్పు డెల్లఁ బొడవుసూపి యుపకరించునట్లు వర మొసఁగి యేగెను.

తత్కాలము చోళరాజ్యముఁ బరిపాలించుచుండిన కరికాలచోళవంశ పావనుఁ డైన రెండవకులోత్తుంగచోళుఁడు ఒట్టక్కూత్తఁడు మొదలగు కవిపుంగవులతో భాషాపరిశీలనోత్కంఠుఁడై కాలముఁ గడుపుచుండి కంబమహాకవి యశఃప్రభావంబుల విద్వద్వరు లగ్గింప విని యతని రప్పించి యర్హాసనాసీనుం జేసి యుపచరించి 'కవివరేణ్య! తమమనికిప ట్టెద్ది?' యని యడిగెను. మహాకవి తనజన్మభూమిం దెలుపక

క. *ఎనుము మడుగుఁ జొరఁ బేడిస, దనదూడని పాలుగురియఁ దగు "వెన్నపురిం"
బెనఁగొననితలుపు, నంజకు మనునొడి, గల సడయుఁడుండునది నాపురియా.

மோட்டெருமை வாவிபுக முட்டுவரால் கன்றென்று
வீட்டளவும் பால்சொரியும் வெண்ணெயே—நாட்டில்
அடையா நெடுங்கதவு மஞ்சலென்ற சொல்லு
முடையான் சடையன்ற னூர்.

అని తన్నాదటఁ బెంచిన సడయప్పదానశీలుని పురమునే యగ్గించి యుగ్గడించెను.

చోళరాజేంద్రుఁ డలనుడువుల నాలకించి కంబమహాకవికి విద్యాప్రభావముం బురణించియే గుణప్రభావము నలవడియుండుటం గని యమితానందకందళితమానసుండై యతనిం దన సభాసదులయిన విద్వద్బృందారకులకు మహేంద్రుంగా నియమించి యప్పుడప్పుఁ డతఁ డుపన్యసించు వాక్సుధామధురిమ నాస్వాదించుచుండెను.

* ఎనుములు దూడను విడుచునంతలో నిల్లునిండున ట్లేపురమునఁ బాలిచ్చునో వీదలకొఱకెల్లపుడు తలుపు లేపురమునఁ దెఱచియుండునో, భయపడకుఁ డని యేవురిలోని వా రభయమిచ్చుచుందురో యా సడయప్పఁ డుండు వెన్నపురి (తిరువెణ్ణైనల్లూరు) నాయూరు.

ఈమహాకవీంద్రుని విద్యావైదుష్యముల, నూహాపోహణలఁ గల్పనాచమత్కృతుల, నవరసభావాలంకారఘటనాప్రావీణ్యముల, నర్థరచనాగౌరవసంపత్తుల, వర్ణనాపటిమల నుద్ఘాటించుకవిత్వంబులఁ దిలకించి యతనిం గొని శ్రీమద్వాల్మీకిరామాయణము ద్రవిడీకరింపందలపోసి యాతని నామంత్రించి యుచితోపచారంబులఁ గైవారంబు సేసి తన యేకటముం బ్రకటీకరించెను. మహాకవి యతని సపర్యల కోరి యట్టియుద్యమము నూరీకరించి యేగెను. అప్పుడప్పు డీప్రభుపుంగవుఁ డాతనిం బురికొల్పుచుండియుఁ బెద్దతడవున కాతఁడు దలపెట్టమి నెఱింగి రాజాజ్ఞ నారోపించినచోఁ దనకోరికి తుదముట్టఁ గల దని తలంచి కులోత్తుంగచోళరాజేంద్రుని సముఖమునం దెలిపించెను. ఱేఁడు నిట్టిప్రబలోద్యమము స్పర్థచేఁ గాని కొనసాగ దనుతలంపుతో, కంబఁడు, ఒట్టకూత్తు లైనయిద్దఱికి నీరామాయణనిర్మాణకార్యవహనము నారోపించెను.

ఇట్లానతియిడిన కొంతకాలమునకు నొట్టకూత్తఁడు సప్తకాండములలో మొదటి యైదుకాండముల రచించియుండెను. కంబమహాకవి యదివఱకు నాంది పద్యముసయితము రచింపఁడాయెను. ఇది యెఱింగిన మన్నీఁ డిద్దఱిని రావించి రామాయణభాషాంతరీకరణకార్య మెంతవఱకు సాగిన దని మొదట నొట్టకూత్తని నడిగెను. తాను యుద్ధకాండములో సముద్రునిం దెరువు గోరు సందర్భముదాఁక రచించిన ట్లొట్టకూత్తఁ డుత్తరమిచ్చెను. వెంటనె రాజు, కంబని నడుగఁగా నతఁడు "మన మిప్పు డీతనికంటె నెక్కుడుగా రచించియుండు నట్లు నొడివినఁగాని పూజ్యత దక్కదు; "కల్లయు నేటుంబో లొక, కల్లయు లేనట్టి లగ్గు గలిగించుననన్" అని తిరువళ్లువరు వాకొనియుండుటం బట్టి మన మిప్పు డొకదుద్దు పల్కుట సడి గాఁజాల" దని తలంచి, తాను సేతుబంధనమువఱకు రచించియుండునట్లు నొడివెను. 'అట్లైన నందులోఁ గొన్నిపద్యములం జెప్పి వ్యాఖ్య నుపన్యసింపుఁ డని రాజు వేడఁగాఁ గంబఁడు హృద్గతముగా ద్విసప్తతి పద్యములం గల్పించుకొని యుపన్యసించుచు నలువదిరెండవదియైన

*కుముదుఁడుంచిన కులగిరి నటు లనం, దిమిది మంచు మున్నీ రెగఁదిరివడఁ
దిమితమూర్జ్జొర దివిజులుఁ ద్రుళ్లి రి, ప్డమృత మింకను నబ్బునం చాశచే.

குமுத னிட்ட குலவரை கூத்தரில்
திமித மிட்டுத் திரியுந் திரைகடல்

* ఈపద్యము పద్యలక్షణములోఁ జేరలేదు గాని ద్రావిడపద్యమున కుద్దిగానుండుటకై యొక్కొక్కచరణమునకు నినగణం బొక్కటియు నింద్రగణత్రయంబుగాఁ గల్పించి మూఁడవగణాద్యక్షరము యతిస్థానముగా నొనర్పంబడియె.

துமித மூர்புக வானவர் துள்ளினர்
அமுத மின்னு மெழுமெனு மாசையால்.

అనుపద్యముం జెప్పి వ్యాఖ్య నుపన్యసించిరి:—

కుముదుఁ డనుపడవాలు, తాఁ దెచ్చి యందఱివలె నలునిచేతి కీయక దాన మున్నీటం బడవేసిన తిప్ప నర్తకులంబవలె ధిమిధిమి యనునులి వొనర్చుచు దిర్దిరఁ దిరుగుటవలనం గలఁతపడిన కడలినీటిచినుకు లెగిరి వచ్చి వేల్పువీటిం దూ ఱెను. వానిం జూచిననిలింపులు, పూర్వకాలంబున మనము పాలకడలిం ద్రచ్చి నపుడు వెన్నుఁడు దరిగొండ నీటం గ్రుంగనీకఁ దామేలై తనవీఁపున మోచి యమృతముఁదీసి మన కిచ్చెఁగదా! అట్లే యిప్పుడు నావెన్నుఁడె శ్రీరాములు గాఁ బుట్టినందున వానియానతిమెయి మనమచ్చువంబుట్టిన కోనద్రిమ్మరు లీకడ లిం ద్రచ్చుటచే నిప్పుడు కూడ మనకమృత మబ్బుఁగల దను మచ్చికచేఁ ద్రుళ్లి యాడిరి.

ఇట్టియుపన్యాసముం జెవిఁగొని యొట్టకూత్తకవి కంబమహాకవిం దిలకించి నీటిచినుకులకుఁ దుమి యనుపేరు నిఘంట్వాదుల నున్నదా? లేక లక్ష్యగ్రంథంబులలో నున్నదా యని యడిగెను. అందుకుఁ గంబఁడు వాని యం దొండునను లేదు; లోకవ్యవహారములో గ్రామ్యోక్తిగా వాడంబడుచున్న' దని ముచ్చటించెను. అట్లైన మూదలింపవలె నని యొట్టకూత్తకవి యడుగఁగా, మఱునాఁడు వేకువ మూదలించెదనని మహాకవియుత్తరమిచ్చి యుపన్యాసముం జాలించి యిలుసేరెను. ఇలుసేరి పలుకుల వెలందిం దలంప నామె పొడ గట్టి వలసిన దేమని యడిగెను. ఓజగముతల్లీ! ఱేనియోలగంబున నీవు నానా లుకనుండి ముచ్చటించిన పద్యమొండునంగల తుమియనుపదమును గుఱించి యొట్టకూత్తఁ డాక్షేపించెను. అది లోకవ్యవహారోక్తి యని నొడివితి; నద్దాని నెట్లైన నిక్కముసేయవలయు నని ప్రార్థింపఁగా వాగ్దేవి 'యెల్లిరేయి నాల్గవ జామున వారలం గొల్లలవీథికిం దెమ్మని నొడివి కనుమొఱఁగెను.

కంబమహాకవి యాలాగున నొట్టకూత్తకవి కులోత్తుంగచోడులం దీసికొని గొల్లవీథికిం జనుదేరనంత కావీథి నొకగుడిసెలో ముంజేతిమణికంకణ క్వణనంబులు విద్వద్వరుల చెవులుపండువులు సేయ, మౌక్తికనికరంబులం బోల్చి వదనారవిందంబున స్వేదాంబుబృందంబు లంకురింపం బెరుఁగుద్రచ్చు భారతీ దేవి దన్నుఁ బరివేష్టించి యాడుచుండు చిన్నకుఱ్ఱలం గని, నాయనుంగుబుడుత లారా! మీమీఁదఁ జల్లతుంపరలు (மோர்த்துமி) పడఁగలవు; ఇంచుక

దలఁగి యుండుఁ డని వక్కాణించెను. అది విన్నకంబమహాకవి యొట్టకూత్తనిం జేరి, 'యీలోకోక్తి నాలించితిరా' యని మూఁదలించెను. అతం "డౌను; చెవులార వింటి" నని మందలించి, యిచ్చోటు నిన్నటిదాఁక బయలుగా నుండెను గదా. ఇంతలో నీగుడిసె యేలాగునం గల్గెను; యీగుడిసెలోఁ బసిబిడ్డలతో నుండు పైదలి యెవ్వతె? దీనిం జక్కఁగ నారయవలయు నని యాగుడిసె చేరువం జేరెను. కదియునంత కాచిఱుగుడిసెయు బాలురుం బైదలియుఁ గంచుమింపైరి. కూత్తఁ డచ్చెరువు నంజికయు నొంది కంట నానందబాష్పంబువులు గ్రమ్మ నురఃఫలకంబునం బులకంబులు గులకంబులై తిలకంబులొత్త జిచ్చవడి శారదాదేవి లీలావినోదంబు లీచందంబుననా యున్నవి! యనియు గీర్వాణీపరిపూర్ణ కటాక్షవీక్షణంబునం గ్రాలునీకంబమహాకవితోఁ దర్కింపఁ దగ దని యుఁ దలంచి మహాకవిం గొనియాడుచుఁ దనటెంకి సేరెను.

వెండియుఁ గంబమహాకవి తనమనికిపట్టైన తిరువెన్ననల్లూరు సేరి, గీర్వాణకవీంద్రుల నండఁ బెట్టుకొని వాల్మీకి, బోధాయన, ఆధ్యాత్మిక రామాయణంబులఁ బురాణంబులం జర్చించి, రచనాపద్ధతిం దీర్మానించి శుభదినంబునం బ్రారంభించి దినమొక్కటికి నేడువందలపద్యములవంతున నొకపక్షదినములలో బాలకాండ మాదిగా షట్కాండంబులం బదివేల యేనూఱుపద్యములచేఁ గంబరామాయణ మును దుదముట్టించెను.

ఒట్టకూత్తక్కవి రామాయణము సప్తకాండముల విరచించి కొనసాగించెను. అట్లయ్యు నతండు మనకంబమహాకవి రామాయణమునం గ్రాలుపద్యముల పదగుంభనంబుల నర్థాలంకార శబ్దాలంకారకల్పనావైశారద్యగరిమల, వర్ణనాలంకారరచనాసారస్యముల, నవశిరీషకుసుమపేశలమృదులపదఘటనామాధుర్యంబుల, నవరసానురూపరచనానియమంబుల నౌచిత్యంబులపాటవముల ననౌచిత్యనిరసనంబులఁ, గైశికీవృత్తియుఁ, బాంచాలీరీతియుఁ గలిగి సమత, ప్రసాదము, ఓజస్సమాధిశ్లేషౌదార్య సౌకుమార్యాది మాధుర్యకావ్యగుణ సమంజసంబులను భాసిల్లి నిరుపమాన మధురవాఙ్మయమాధురీణకవిత్వధారాపూరం బీకంబమహాకవి రచనయం దంతట నమృతవాహినీస్రోతముంబలె గ్రాలుచు మానసోల్లాసజనకంబై శ్రోతల నితాంతసంతోషపారావారంబున నోలలార్చుటం జేసి మనసాహిత్యము లీతనిసాహిత్యఖద్యోతన మరీచి పుంజంబులసన్నిధి ఖద్యోతములే యని తలంచి తనరామాయణమునం గల తాటాకుల షట్కాండంబులవఱకుఁ జించుచుండుచో మనకవిగ్రామణి డబ్బాటుగాఁ జని యొట్టకూ-

త్తఁ డాకులత నాకులం జించుటం జూచి యతనికేలు వట్టికొని చించి మిగతఁ బడిన భాగ ముత్తరకాండ మని యెఱిఁగి, 'అయ్యా! రామాయణమునఁ షట్కాండంబులవఱకే యేను రచించితి; నుత్తరకాండము రచించు నాతురత నాకుప్పతిల్ల లేదు; కావున, మీయుత్తరకాండమును నాషట్కాండములతోఁ జేర్చి సప్తకాండములుగాఁ జేసికొనియెద' నని మందలింపఁగా నొట్టక్కూత్తఁ డియ్యకొనెను.

ఇటీవలఁ దనరామాయణమును సమగ్రముగాఁ దుదముట్టించి రాజసముఖంబున నివేదించెను. కులోత్తుంగచోడరసాకళత్త్రుం డెంతయు నలరి, కవిపుంగవా! ఇది వైష్ణవకావ్య మగుటచే శ్రీరంగములోని వైష్ణవులను మెప్పించి రంగనాథసన్నిధిని బ్రకటీకరింపవలయు నని యాజ్ఞాపించెను. కంబమహాకవియు శ్రీరంగములోని వైష్ణవుల యాజ్ఞచొప్పున, చిదంబరములోని మహావిద్వాంసులు త్రిసహస్రదీక్షితులు మొదలగువారియెడలం బడినశ్రమముల నింతింతనరాదు. అట్లన్నిట జయశీలుండై శ్రీరంగము మొట్టళగరు అను శ్రీనృసింహస్వామి సన్నిధిం జదివి ప్రకటీకరించెను. అట్టితరవాయి నృసింహస్వామి పెడబొబ్బ చేసి శిరఃకంపముతో నాహ్లాదింపఁగా శ్రీరంగవాసు లత్యాశ్చర్య మొంది కవికులశేఖరుండైన కంబమహాకవికి 'కవిచక్రవర్తి' యనుబిరుద మొసంగి, యొక్కొక్కరు నతనిమీఁద చాటుకవిశ్లాఘాపద్యములరచించి భూషించిరి. 'కంబనాట్టాళ్వారు' అను ఆళ్వారుబిరుదము సయిత మిచ్చి పుత్తెంచిరి.

వీని నన్నిటిం గని చోళమహీపాలుండు బహువిధవిచిత్త్రాంబరజ్వలన్మణిభూషణాదులచేత, ననేకవస్తువాహనాదిభవ్యనికేతనంబులచేతను, బహువిధబిరుదసంచయంబులచేతను మహారాజతుల్యపూజలం గవిసార్వభౌమునిం బూజించి మన్నించుచుండెను. ఈరేవం గొంతకాలంబు గడచనిన పిమ్మట నన కారు పెనుపారం దలపెట్టెను. అట్టివాసంతవాసరంబున నొక్కనాఁడు కులోత్తుంగచోళక్షమాధవుండు కవిసార్వభౌమునిం బురస్కరించుకొని మాపటివేళ నుద్యానంబునకు వనవిహారార్థము విజయము సేసెను.

అప్పు డాయారామంబు పల్లవితకోరకితకుసుమితఫలితలలిత తరుగుల్మాదులఁ జైత్త్రరథముంబోలిన దాని సౌకుమార్యముం దిలకించి యభినవమహేంద్రుం డైనకులోత్తుంగచోళకాశ్యపీకళత్త్రుండు పులకితగాత్త్రుండై యమితానందమున దాడిమబీజంబులం దిరస్కరించు దంతదీధితులుగ్రాలఁ బ్రహసించెను.

దండనుండిన కంబమహాకవి 'యల్లుఁడా! ఏపాటియబ్బురము నబ్బకయే యింతయుబ్బుతోఁ బెడబొబ్బవేసి నవ్వం గారణ మేమి'? యని వసుమతీంద్రు

నడిగెను. ధరణీపాలుఁడు 'మామగారూ! నాకు నగవుపుట్టినకారణంబు నేమని నుడువుదు' ననెను. 'అట్టికారణమును నేనెఱుఁగఁగూడదా' యని కవిసార్వభౌముఁ డడుగ, రాజు, 'మీ రెఱుఁగఁదగని కర్జముం గలదా? యాలకింపుఁడు. ఇట్టిమాధవంబున మానసోల్లాసకరంబునం గ్రాలునందనంబుచందంబున నందగించు నీనందవనేందిరాసుందరీసుందర్యంబుం దిలకించినంతనె యీవసుంధరాతలంబును, నందుంగల గంధసింధురసైంధవస్యందనాదిపదాతిబృందంబులు, నీరాజ్యంబునం గలమనుజసందోహంబులును నాయధీనములే గదా! యను తొందర డెందంబునం గ్రందుకొన నగ వుప్పతిల్లె' నని వక్కాణించెను. అందుకుఁ గంబమహాకవి 'యీరాజ్యంబును దీనంగల సకలాంగంబులును మీయధీనమగుటకును, నేతత్ప్రభావోత్కర్షు లైనమీరు నాయధీను లగుటకు నేమి సందియంబు గల' దని ముసిముసినగవుతో మందెమేలముగా మందలించి తాను సయితము నవ్వెను. చోళమహారాజు మహాకవిపలుకుల నాలించినంతనె చెవిలో మిణుఁగుఱులు సొచ్చినట్లు చిడిముడిపడి యెడఁద దడదడమన, నుడువులు తడఁబడ, మోము వెలవెలఁబాఱ వెగడుపడి, 'వీఁ డేమి ననుం బురణించు మండలాధిపతియో! మనకు లోపడి మన మిచ్చినం దీసి జీవించునట్టి విద్వాంసుఁడేగదా! ఇతఁడు న న్నిసుమంతయు నేత యని చీరికిసేయక నన్ను లెంకనాఁ దనకధీనమని నుడివెనే! యీతని కింతకావరము దగునా? ఇట్టివెడఁగునుడువు లొరుఁడు నుడివినయెడల నాతులువతల దడయక గెడసిపడదె' యని తలంచి కంబనితో మఱుమాట లాడక బైడాలము బడాయింప దిడ్డిత్రోవం దూఱి నగరిలోనికిం బోయి చప్పరకొల్లమంచములో వెతారమునం బరుండెను.

అప్పుడు దేవేరి యెడవేళఁ జిఱుతిండిం దెచ్చి యారగింపుఁడని యుపచరించెను. రాజు వెగటుచే నంగరొల్లెల నొల్లకయు, దేవేరితోఁ బలుకకయు నుండెను. ఇది చూచి దేవేరి రాచవానిభోగస్త్రీనిఁ బొన్ని యనునామముగల గడనపడతిం బిలిపించి యీయంగరొల్లెల నారగించునట్లు మన్నీనిం బెరరేఁచు మనెను. అందు కది, 'అమ్మా! కానిండు; ఇదిగోఁ జూడుఁడు, వ్రేలిడిలో మీకోరిక నెఱవేర్చెద' నని మన్నెకాని చెంగటం జేరి లేపెను. రాజు లేవకుండుటం గని తనజాత్యోచితక్రియలచే లాలించి లేవనెత్తి కూరుచుండఁ బెట్టి 'స్త్రీయావతంసమైన తమదేవేరిమీఁద నింత వెగటుపుట్టనేల' యని యడిగి వెండియు, నేంతైనను నాయందుఁ జనవుతోఁ బెనఁగక పెనఁగులాడుటకుం గతం బేమని యడిగెను. తోడునీడగా నుండునట్టి యనుఁగుంబ్రోయాలికిం దెలుపక డెందములోఁ

బొందుపఱిచి వందురుచుండునట్టి సందేశము న్వందలించెను. ఇంతవింతకే యింత వంతసంతరించెనా! మంతనంబున మీపొంత నోటిమాటగా రంతుగొన్న యా మంతవ్వ్యాని నాచెంత సంతతంపు లెంకగా సంతపఱిచి యతనిసంతకమును మీచెంత నిచ్చువింతఁ జూడుఁడు. తాము చింతగొనక లేచి యిసుమంత జంతికల నారగింపుఁ డని పలుకు నాటవలంతి యలంతిపంతములకు నంతరంగంబున మంతనంబుగ నెంతో సంతసించెను. పిమ్మట నాగవనపఙ్క్తి తఱయకఁ దన నెలవుసేరి, తన బానిసం బిలిచి కంబమహాకవి మనగీముదారి నేగుచోఁ నేఁ జూడఁగోరి యుండెద నని నుడివి నాయొద్దికిఁ దీసుకరమ్మని యానతిచ్చి పడకటింటిలో వెలిదడిబమునం బరుండియుండెను.

ఇది యిట్లుండఁ, బ్రమదావంబున రాజురాకకై పెద్దతడ వెదురుసూచుచుండియు రామింజేసి యోహూ నాపల్కినపల్కులం బ్రమాదముగఁ దలంచి కినుకమెయిం జనెనో కో! ఎల్లి యంతయుఁ దెలియనగు నని తలంచి తాను నా నిష్కూటము ప్వవలి యంపలము నెక్కి తనదీమంబున కరుగుచుండునదను కాట క్షత్రియ బానిస మహాకవికి జోహారొనర్చి తన యేలికసాని తమ మేలిమిదరిసనమునకు వలచియున్న దని తెలిపి గృహంబులోనికి నాతనిం దీసికొనివచ్చెను. అప్పుడంగ మొలతోఁ బరుండియుండిన పొన్ని యనునాటవెలఁది దబాలున లేచి వచ్చి మహాకవిని గాఢముగాఁ బరిరంభించుకొని యేను పెద్దతడవు మీయందుఁ దగులముపడి యెదురువేచి యున్నదానను; ఇప్పుడు తమకమగ్గలమయి పరుంటిని; యిట్టి తఱిఁ దరితీపు సేయకుమని చాల నిక్కచ్చి సేసెను. కంబమహాకవి యాటకటాంకు టాటోటుమాటలకు వెక్కసపడి 'యమ్మా! నేఁడు నాకలుఁ దనువాపి యగుటం బట్టి నీవు నాకుఁ గొమరితగావలయుఁ గాన నిట్టితగనిజోలికిం దెగువసేయనేర; నిది తప్ప నిఁక నెద్దియేనియు నీవలసినపనిం గొనసాగింతు' ననియె. అట్లైనఁ దాము నాకు వరవుఁ డని వ్రాసి సంతకముసేసి యీయఁగలరా?' యనెను. అందు కాతఁ డాటక్కరి టాలాటోలితనమునకు నేటని నచ్చి 'ఆహా ఇదిగో వ్రాసి యిచ్చెద' నని తాటాకును గంటముం బుచ్చుకొని, 'దాసి పొన్నికిక్కంబ నడిమై' 'గణికపొన్నికిఁ గంబఁడు వరవుడు' అని వ్రాసి సంతకముం దారీకు మొదలగునవి వేసి యిచ్చి తన నెలవుసేరెను. ఆయాటబోటి యామాటకానిచీటిని నేటని పాటించి వీటినేతమాటునకుం బోయి నూటిగ నిచ్చెను. మన్నీఁడద్దానిం దిలకించి యది కొంచెతనమని యెంతయు నెంచక యెంతో సంతసిల్లి వఱువాతఁ దన యొడ్డోలగంబున కేగి యందఱిని రావింపఁగాఁ గంబమహాకవియుఁ దోతెంచి

యాసీనుఁ డయ్యెను. మన్నెకాఁడు ప్రధానిచే బదరికమును దెప్పించి తెఱచి యాకిల్లాకు నెత్తి కంబనికిం జూపి 'యిది మీసంతకమే కదా'! యని యడుగ నతం 'డౌను; ఇందున నించుకయు సందియము లే' దనెను. పదంపడి రాజు వ్రాయసకానిచేతి కాకిల్లాకు నిచ్చి చదువు మనెను. వాఁడు, 'గణిక పొన్నికిఁ గంబఁడు వరవు' డనిబిగ్గరం జదువఁగా సభనలంకరించుచుండిన చదువరు లందఱు ఱిచ్చవడి, యిదియేమి యన్యాయ మని మోము వెలవెలఁబాఱఁ దలంకుచుండిరి. కులోత్తుంగచోళవసుంధరాధిపుండు కవిసార్వభౌమునిం దిలకించి మీరు గణిక పొన్నికి దాసుఁడేనా? యని యడుగఁ గంబఁ 'డందుకు సందియ మే' మని వక్కాణించెను. అందుకు ఱేఁడు సుమాళముచేఁ దన దేహము గంపమొందఁ గలకలమని నెలవివాఱ నవ్వి 'కవిసార్వభౌములైన మీ రొకబోగముదానికిం బానిసీఁ డౌట మానహాని గాదా' యని యడిగెను. అందుకు మహాకవి 'నే నెద్దియేని మ్రుచ్చిలించితినా? తగనికార్య మొనర్చితినా? యేమియు లేదు; ఆవాచకముయొక్క తత్త్వార్థమ్ముం జక్కఁగ నెఱిఁగినవారికి మానహాని యని యేల తోఁచు' ననెను. రాజు దాని నిక్కంపు తాత్పర్య మేమి? వక్కాణింపుఁడు, వినుద మనెను. కంబ మహాకవి యీచందంబున నుపన్యసించెను. "దాసి పొన్నికుక్ కంబ నడిమై" యనువాచకము పదషట్కముచే నైనది; మొదటిపదము తా యనునది, యకార వ్యంజనాక్షరలోపాంతపదము; ఇది లుక్సంధి. రెండవపదము,సి యనునది సీ యను దాని హ్రస్వసంధి, మూఁడవపదము పొన్ని యనునది యికారప్రత్యయముతోఁ జేరిన మహతీవాచకము; నాలుగవది కు-ఇది చతుర్థీవిభక్తి; ఐదవది కంబన్-ఇది మహద్వాచకపుంలింగశబ్దము; ఆఱవపదము అడిమై-ఇది కృదంతము. ఇది పదవిభాగము. అర్థము:- తాయ్=జగన్మాత, సీ=మంగళకరము, పొన్ని=లక్ష్మి, కు=చతుర్థీవిభక్తివర్ణకము, కంబన్=కంబఁ డనువాఁడు, అడిమై=దాసుఁడు. తాత్పర్యము:—జగన్మాత యైనశ్రీమహాలక్ష్మీదేవికిఁ గంబఁడు దాసుఁడు. ఇటీవల సర్వశక్తినేతృత్వ, త్రిజగన్మాతృత్వ, మంగళకరత్వ, సకలసంపత్ప్రదాతృత్వములుగల మహాలక్ష్మీదేవికి నొక్కమానవసామాన్యుఁ డైనయేను లెంక యని వ్రాసియిచ్చితిఁ గాక మ త్తేమి? ఇందువలన నాకు సుభగత్వమా? దుర్భగత్వమా? మీరేమిటికి లొటారముగా మందెమేలము సేయుచున్నా రని కంబఁడు నుడివెను.

చోళమహారాజు ఇట్టివక్కాణము నాలించినంతనె తనపోతరంబును దలగాద్దెలియనిసుమాళమునుఁ బంచబంగాళమై తల్లడపడి, యుఱుతం జొంప మెక్క విడిచిన వేఁపిమాడ్కి మహాకవి నెగాదిగఁ జూచి బైడాలము రెక్కొన 'లోక

ములో విద్వాంసుల నమ్మరాదు; ధన మొసంగిన వా రెంతకురూపు లైనను ఇంద్రుం డనియుఁ, జంద్రుం డనియు, మదనుం డనియుఁ బొగడినం బొగడుదురు; నెలగ లేనివార లెంతయాలుడిగల పెద్ద లయినను వారలం బ్రత్యక్షంబున దేవానాంప్రియుఁ డనియు, నమస్త్రి యనియు, ధూర్తశిఖామణి యనియు దూషించిన దూషింతురు. అట్లు దూషింపఁగా విన్నవార లేలొకో మమ్ము దూషెద రని యడిగినచో ‘‘ఆహా! మిమ్ము దూషింపఁగలనా! మిమ్ములం బొగడితినే కాని వేఱు లేదు. దేవతలకు నయితము మిక్కిలిం బ్రేమ గలయంతటి పూజ్యులనియు, నందఱియందు నాత్మసమముగా వర్తించునట్టి సర్వభూతసము లనియుఁ దెల్లనిముక్కంటిపువ్వుల శిఖలో ధరించిన దేవశిఖామణి యైన శ్రీమహాసదాశివుం డనియు బొగడితినే కాని వేఱులే’ దని తా నొడివిన నొడువుల మార్చిన నార్పఁగల మహాక్రూరులు? అమ్మరో! జమునికంటె విద్వద్వరులే మహాభీకరు లని నొడివి యీతాత్పర్యముగల—

క. పొగడినఁ బొగడుదు రర్థముఁ, దగ నీయనిచోట దూఱుఁదడయరు నొడులం
దెగున న్మార్చిన మార్తురు, జగమున జముకంటెఁ గవులు జాల్మలె తలఁపన్.

*போற்றினும் போற்றுவர் பொருள் கொடாவிடில்*
*தூற்றினுந் தூற்றுவர் சொன்ன சொற்களை*
*மாற்றினும் மாற்றுவர் வன்க ணாளர்கள்*
*கூற்றினும் பாவலர் கொடிய ராவரே.*

అనుపద్యముం జెప్పి, కంబమహాకవిం జూచి నేఁటిదినము మొదలు మీరు నారాజ్యమునం దుండఁగూడదు; నే నొసంగిన బిరుదావళిం దీసియుంచి యెం దేనియుం బోవలయుఁ దడవుసేయఁ దగ దని యాజ్ఞచేసెను.

తత్క్షణంబ, కంబమహాకవి యెంతేనియుఁ దడయక తనబిరుదావళియు వస్త్రాభరణములం దీసి యుంచి రాజు కట్టెదుట నిక్కి నిలిచి ‘‘ఓరాజా! నీదేశము న్వదలి తలఁగు మని యానతిచ్చితివి కదా! అట్టె యగును; మంచిది; నీదేశము, యిరువదినాలుగామడకంటె నెక్కువ గలదా? నీరాజ్యమున కవతల నీ కేమి స్వాధీనము గలదు? ఇరువదినాలుగామడ వెడలుపైన యీచోళదేశము దప్పఁ దక్కిన నలకడనుండు నేఁబదియాఱామడపొడవుగల పాండ్యదేశంబును, పడమట నెనుబదియామడపొడవుగల చేరదేశంబును, డాకడనుండు ననేకదేశంబులు నెందుఁ బోయినవి? అవి యన్నియు మున్నీట మునింగెనా? నీవు గినిసి తేని మాకుఁ జొచ్చుచోటు వేఱు లేదా?’’ యనునర్థము గల

క. *ఆమడయిరువదినాలుగు, భూమియె గాకితర మబ్ధి మున్గెనొ ''కొల్లీ
భూమీధ్ర'' దేశమేలెడి, భూమీపతి కినిసి తేనిఁ బొసఁగదె చోటుల్.

*காத மிருபத்து நான்கொழியக் காசினியை*
*ஓதக் கடல்கொண் டொளித்ததோ—மேதினியிற்*
*கொல்லிமலை நாடாளுங் கொற்றவா நீமுனிந்தால்*
*இல்லையோ எங்கட் கிடம்.*

ఈపద్యము నుద్ఘాటించి ''పూర్వముకంటె నీరాజ్య మెక్కుడు పొడవైనదో? మిట్టమిట్టు లన్నియుఁ ద్రవ్వి సదును సేసి నీభూమిని విశాలముగాఁ జేసికొంటివా? అట్టిది యేమియు లేదు; లోకమునం గలపుడమిఱేండ్లలో నీవ శ్రేష్ఠుఁడవా? నిన్ను మించిన శ్రేష్ఠులైన పాండ్యచేరరసాధిపతులు మొదలగువారలు లేరా? నీదేశమేనా సారవంతమైనది? నిన్నుఁ గూర్చియే కవిత లల్లితినా? కేదారేశులం బొగడిననోట ధరాధీశులం బొగడమి నాప్రతిన యనుట నీవెఱుఁగవా? శాఖిశాఖలలో శాఖామృగమును భరింపని శాఖియుఁ గలదొకో? అట్లు నేవలచి యేగినచో నన్నుఁ జూచినంతనె యుపచారపురస్సరముగా న న్నంగీకరింపని యవనీపతులుం గలరే? యని యిట్టితాత్పర్యముగల

క. మన్నీఁడు నీవొ నేలను, నిన్నెఱిఁగియొ ద్రవిడవిద్య నేర్చితి నన్నున్
మన్నన సేయని రాజులు, నున్నారొ? గలదె క్రోఁతి నోపని కొమ్మున్.

*மன்னவனு நீயோ வளநாடு முன்னதோ*
*உன்னையறிந்தோ யித்தமிழை யோதினேன்—என்னை*
*விரைந்தேற்றுக் கொள்ளாத வேந்துண்டோ வுண்டோ*
*குரங்கேற்றுக் கொள்ளாத கொம்பு.*

అను పద్యముం జెప్పి 'యిఁకమీఁద నీయండ నుండనోపను; ఇప్పుడె వీడ్కొనియెద; నిన్ను వదలి నేనేగుచోఁ గట్టుకొన్న కచ్చడముతోనే వెడలెద; మరలి యిచటికిం జనుదేరఁ దటస్థించినచో నీయొద్దం బన్నుగొనెడి, నీకంటెదొడ్డ రాజు, అడపకాఁడై యాకుమడుపు లందియిచ్చునంతటి వైభవముతో రాఁగల' నని ప్రతినసేసి కంబమహాకవి చోళమహారాజు నెడఁబాసి తలఁగిపోయెను.

పోవునప్పుడు తనయింటివారల కెంతేనియుఁ దెలుపక పంచెలును, దారి బత్తెమునకుం దగినవిత్తముం గైకొనక రిత్తచేతులం బయనమై చాల దవ్వేగు

---

* ఈపద్యములోని, కొల్లీభూమీధ్రము = కొల్లిమలై (పర్వతము) చోళరాజధానిలోనిది. కొల్లిమల = చంపునట్టికొండ దానిమీఁదికెక్కిన జ్వరములచేత దుష్టజంతువులచేతఁ జత్తురు కావునఁ జంపునట్టికొండ యయ్యెను.

నప్పటికిఁ దా సంగదం గ్రుంగి సేయునది లేకయుండెను. దారిలో వేలి యనునొక గడనపడఁతి తనయింటిపెరటిలో నొకమఁటిగోడ నెత్తింపఁ దలంచి, గోడ నెత్తించిన వారికిఁ దూమెఁడువడ్లు సంబళమిచ్చునట్లు వెల్లడించియుండెను. మనకవి వరేణ్యుఁ డిది యెఱిఁగి ప్రొద్దుపోవునఱకుఁ గష్టపడి గోడయెక్కించి వేలియొద్దికి వచ్చి కూలియడిగెను. 'గోడ యెత్తింపఁబడెనా' యని వేలి యడుగ 'యెత్తఁబడె' నని బదులిచ్చెను. అట్లైనఁ జూత మని పెరటికిం బోయి చూచునప్పటికి గోడ క్రిందఁబడి యుండెను. మహాకవి నివ్వెఱపడి యుండుచో రేపు వచ్చి గోడ నెత్తించి నాకుం జూపించితేని బత్తె మివ్వఁగల నని వేలి నొడివెను. కంబఁ డన్నఁడు నిద్రిల్లి మఱునాఁడు వఱుబాత నేతెంచి నడుము విఱుగునట్లు కష్టపడి గోడ నెత్తించి వేతనముం గొనఁ దిరుగునదనున గోడ క్రిందఁ బడఁగ నుంకించుసన్న యెఱిఁగి

ఉ. ఆలములోన దోర్బలపరాక్రముఁ జోడుని వీడి వచ్చితిన్
శీలకవిత్వతత్త్వముల చేవ యెఱింగెడివారు లే రిటన్
బాలసుధామయూఖనిభఫాలశరాసనభ్రూయుగాంక యీ
వేలి యొసంగు కూలిఁగొని పీడ్కొనునంతకు నిల్వు కుడ్యమా.

*மற்கொண்ட திண்புயத்தான் மாநகர்விட் டிங்குவந்தேன்*
*சொற்கொண்ட பாவின் சுவையறிவா ரீங்கிலையே*
*விற்கொண்ட வாணுதலாள் வேலி தருங்கூலி*
*நெற்கொண்டு போமளவு நில்லாய் நெடுஞ்சுவரே.*

అని ద్రావిడోక్తిం బద్య మొక్కటి నుడువఁగా, నెప్పటివలె గోడం బట్టి త్రోచునట్టి యొక్క బమ్మరాకాసి యీతఁడు కవీశ్వరుఁడుగా నున్నాఁ డని యెఱింగి కొంత జంకి గోడను ద్రొబ్బక యొదిఁగిపోయెను. గోడయు నేలఁబడక యట్టె నిలిచియుండెను. దీనిం గంబఁ డెఱింగింప వేలి వచ్చి చూచి యబ్బురపడి, మీ రెవ్వ రని యడుగఁగా, నేఁ గూలిపనివాఁడను; నీవిచ్చున ట్లియ్యకొనిన కూలి నిమ్మని యడిగెను. వేలి సందియపడి వెఱఁగుపడి కూలి నొసంగి మీ రిచ్చుటనే యుండుఁ డని వేఁడి యుపచరించెను. మహాకవి యియ్యకొనక వడ్లు గొని యొకయింట నిచ్చి యచ్చట నానాఁటి రేయి బసగొని యుండి వఱువాత లేచి తనయిచ్చచొప్పున నడువసాగెను.

ఇటీవల నా దేశముం గడచని ’చాలద వ్వేగుతఱి నాఁకటం దూలినందునం దా నేగు నూరివీథిం గోమటియొక్కఁ డంగడి వెట్టి యుండఁగాఁ జూచి వానిపజ్జఁ జేరి 'ఓ సెట్టిగారూ! నా కాఁకలి కడుమెండు; తినుట కెద్ది యేని

యింత యడుకులైన సెనగలైనం బెట్టు మని వేఁడెను. "అంగడి యింకను బేరము గాలేదు; 'బేరమునకుఁ గొలుచుటకు ముందు బిచ్చమునకుఁ గొలవు'మన్న కైవడి నున్నది; లెస్సాయె; లేదు పో పొమ్మ"నెను. అది వదలి మఱింత దవ్వేగునంతకు తెలికవాఁడు గానుగాడుచుండం గని వానియొద్దికి నేగి 'యాఁకలి కింత తెలికపిండి యి' మ్మని యడిగెను. వాఁ డిసుమంతయు నొసంగక దండ నుండనీక బిసబిస వెడలఁ గొట్టెను. కంబఁడు సాల యంగడ గొని మఱంత దవ్వేగి యొక బాఁపనిగీముం దరిసి, యింటిపాఱునిం దిలకించి 'యాఁకటం బ్రాణములు వెడలున ట్లున్నది; దప్పి కింత నీ రొసఁగుఁ' డని సవినయముగా వేఁడెను. పిసినిగొట్టైన యాజన్నిగట్టు 'బాఁపనవారియిండ్ల నడుగుఁబుట్టువుల కిచ్చునట్టినడవడి యేయూర నేకాలమునం గన్నాఁడవు? వెలమవారికిం బెట్టినమిగత బాడబులకుం బనికివచ్చునా? ఛీ! ఛీ!! లేదు పోపొ' మ్మనెను. అక్కటా! పాపము కంబఁడేమి సేయఁగలఁడు; ఆఁకలి దప్పుల కోర్వలేక బడలి యెండతాఁకుడుచేఁ గమలి నడువలేక యొక్క చెట్టునీడ సోలి పరుండెను. అచ్చట నేల దున్నుకొనుచుండిన శైవవెల్లాలుఁ డొకనికిఁ గుడుచుటకుఁ జలిదియోగిరము వచ్చెను. ఆ కాఁపు చదువరియుండిన చెట్టునీడం జని యోగిరము నారగింపఁబోవుచోఁ గంబమహాకవియు లేచి కూరుచుండి తన రెండుచేతులం జాఁచెను. వెల్లాలుఁడు గనికరించి కైవారముతోఁ దనచేతంబెట్టిన యోరెము నల్లే కంబనిచేతం బెట్టి పొట్టనిండఁ గుడిపించెను. ఇటీవలం జలిదియారగించి బడలికదీఱి కూరుచుండి

ఉత్సాహ॥ సెట్టికోమ టింటికడపఁ జేరఁజాల మెప్పుడున్
గట్టి తెలికవారికడపఁ గదియఁజాలఁ దిరిపముల్
వట్టు పాఱు లిండ్లకడపఁ బట్టిచూడ మెప్పుడుం
బట్టుగాను గమతగాండ్రె ప్రజలఁ బ్రోతు రన్నిటన్.

*செட்டிமக்கள் வாசல்வழிச் செல்லோமே செக்காரப்*
*பொட்டிமக்கள் வாசல்வழிப் போகோமே—முட்டிபுகும்*
*பார்ப்பா ரகத்தையெட்டிப் பாரோமே யெந்நாளும்*
*காப்பாரே வேளாளர் காண்.*

అని పద్యమొక్కటిం జెప్పెను. కమతగాఁడు కంబఁ డారగించి తనిసిమిగిలిన చలిదిం గుడిచి నాఁగటిమేడిం బట్టి యెప్పటివలె దున్నుచుండఁగా నాచేనునం గలపకొట్టు దాఁకి నాఁగేటిచాలున ఘణిల్లని యొక్క చప్పు డుప్పతిల్లెను. దుక్కిము చ్చది యేమని సందియపడి దోఁకుడుపాఱచేఁ ద్రవ్వి చూడఁగా నేల

యం దొక్కయిత్తళితపెల బంగారునాణెములతో నిండియుండం గనంబడెను. సైరికుం డమితానంద మొంది, యీతండు నేం బంచిపెట్టిన చలిది నారగించి యొకకవిత సెప్పంగా నాతనివాగ్విశేషమువలనం బరంపరగా నిప్పచ్చర మను ముప్పుచే ముప్పిరిగొని తెప్పిలులుచున్నట్టి నెప్పుగానక వగచుచుండిన నా కీపూడ్పు దొరికెను. ఈతం డెవ్వఁడో మహనీయుఁడుగా నున్నాఁ డని తలంచి కంబమహాకవినిం దనయింటికిం దీసుకపోయి పంచభక్ష్యపరమాన్నములతో షడ్రసోపేతమైన యన్నము వడ్డించి నారగింపవేఁడి సవినయముగా నుపచరించి రెండుమూనాళ్లతనిం దనయింట నుంచియుండెను.

తదనంతరంబ, కంబఁడు 'నేఁ బోవలయును, నాకు సెల వొసంగు' మని యడిగెను. అందుకుం గర్షకుఁడు 'అయ్యా! మీవాగ్విశేషమువల్ల నాకీపూడుపు దొరకినది; కావుట్ట మీ రెచ్చటికిం బోవలదు; ఇందే యుండుఁ' డని ప్రార్థింపఁ గంబఁ డియ్యకొనఁడాయెను. 'ఈపిడిముడిలో సగమైనం బడసి వెడలుఁ డని కాఁపు నుడువఁగా 'నాకు సెలగ లక్కఱలేదు; నాలుగేసి మూరలు గల రెండు తెల్లనిపంచె లిచ్చినం జాలు నని యడిగి పుచ్చుకొని మొల నొక్కటియుఁ దల నొక్కటియుం గట్టుకొని యందుండి తరలి చేరదేశముం జేరెను. అట నొక శ్రీమంతు నాశ్రయించి, 'అయ్యా! నేఁ గంబమహాకవియొద్ద నడపకాఁడుగా నుండినవాఁడను; ఆయనకుం జోళమహీపాలునికి విద్వేషము గల్గినందున నాయన యావీడు వీడి యెందో చనిరి. దానం జేసి నే వినువున నా ప్రోలువిడువడి దేశాటనముగా నిట కేతెంచితి; దాము కనికరించి బీదవైన నాకుం గొలువమర్చి చెయిసూపినయెడలఁ గృతజ్ఞతం దమపేరుం జెప్పుకొని మనఁగల' నని వేఁడఁగా, నాప్రభువుఁ, గంబమహాకవియొద్ద నున్నవాఁ డనుటకు నభిమానించి, చేరరాజుపాలిటికి నీకంబనిం గొనిపోయి యడపముఁ బట్టుపనిలో నియమించెను.

ఇటులం బలుకులనేత కాలము సాలమిం జేసి పుడమితేనియండ నూడిగము సేయుచుండు తరవాయి, చేరమహీపాలుఁ డొకనాఁడు తీరిక యైనపుడు తన యొడ్డోలగముం గైసేయుచుండు చదువరులచేఁ గంబరామాయణము పద్దెములం గొని వావాదొనర్ప నానతియిచ్చెను. అప్పు డచ్చటివిద్వాంసులు బాలకాండములోఁ గౌశికయాగసర్గములో—

గీ. ఎన్నఁ జేయనరిది నిరుమూఁడునాళ్లలో, విన్నవార్కిఁ జేయు విజ్ఞవేల్పి
మన్నుఁగాచునట్టి మన్నినిబుడుతలు, గన్నుతెప్పఁబోలి కాచిరోలి.

என்ணுதற் காக்கரி திரண்டு மூன்றுநாள்
விண்ணவர்க் காக்கிய முனிவன் வேள்வியை
மண்ணினைக் காக்கின்ற மன்னன் மைந்தர்கள்
கண்ணினைக் காக்கின்ற விமையிற் காத்தனர்.

అనుపద్యముం జెప్పి వ్యాఖ్య ని ట్లుపన్యసించిరి:—

'కుశికనందనుఁడు బాసవాలపొంటె నైదు, లేక యాఱునాళ్లదనుకఁ దలఁచుటకుం జేయుటకు నరుదుగాఁ జేయ జతనపడిన జన్నమును, బుడమింగాచుచుండు దశరథునిపుత్త్రు లైన రామలక్ష్మణులు గన్నులంగాచునట్టి ఱెప్పలఁబోలి కాచుచుండిరి' అని యి ట్లనేకపద్యములఁ జెప్పి తమతమ యూహాపోహాలకుం దగినభంగి నుపన్యసించుచుండిరి. అప్పుడు ధాత్రీశ్వరుఁ డట్టియుపన్యాసముల కెంతో యలరి తన పేరోలగంబున నందఱు నీప్రసంగంబుల కానందించుచున్నా రా యని యందఱి మోముగోములఁ జక్కఁగఁ దిలకించుచో నించుమించుగా నందఱు నామోదించున ట్లగపడిరి. తనప్రక్కనుండు నడపకానిమోముఁ గాంచినప్పుడు, అక్కజ మందుచో వెక్కసపడుచు, సంతసించుచోట వంతనొందుచు, వినువందగుచోట నుసులుగొనుచు నుండుటంగని 'నీవేల యి ట్లెడమడుగుఁగాఁ దోఁపడుచున్నా' వని రా జడిగెను. అందున కడపకాఁడైన కంబమహాకవి రాజుం దిలకించి మహామండలేశ్వరా! వీరిప్రసంగములు గ్రంథకర్త యగు కంబమహాకవి యభిప్రాయంబునకుం బొందియుండ లే' దనెను. 'గ్రంథకర్తయభిప్రాయము నీ వె ట్లెఱుంగఁజాలుదు'వని క్షితిపతియడుగఁ 'గంబమహాకవియొద్ద నడపకాఁడుగా నుండినప్పు డతఁడు ప్రసంగించుచో నేఁ గమనించియున్నాఁడ' నని చెప్పెను. 'అట్లైన నీ విప్పుడు ప్రసంగింపంగలవా?' యని రా జడిగెను. 'వలనుపడినంత యుపన్యసింపఁగల' నని కంబఁ డుత్తరమిచ్చెను. 'అయిన నెదిగోఁ గొంత యుపన్యసింపుము విండ' మని ధరణీపాలుం డానతీయఁగా నడపకాఁడైన మహాకవి ప్రసంగింపఁ దలకొనెను.

'ఎన్నఁ జేయనరిది' యనుపద్యముయొక్క మొదటిమూఁడుచరణములకు వీరలు సెప్పినయర్థ మించుమించుగా సరిపడియున్నది; మొదటిచరణములో 'ఎన్నఁ జేయ నరిది యైనవేల్మి'యని చెప్పుటతోఁ జెప్పుటకు నరిది యని చేర్చి త్రికరణక్రియల విస్తరించి చెప్పవలయు. మఱియు 'ఇరుమూఁడునాళ్లలో విన్నవార్కింజేయువిజ్జు' అనుటకు-ఐదునక్షత్రములచే(అనూరాధ మొదలు ఉత్తరాషాఢవఱకు) త్రిశంకువునకు స్వర్గమును సృజించినట్టి మునియన్నను జాలఁ బొంది యుం

డును. 'కన్నుఱెప్పఁ బోలి కాచి రోలి' యనుతురీయపాదమున నర్థము ధ్వనింప లేదు. భావము స్ఫురించునట్లు సెప్పం దొరఁకొనినయెడల ని ట్లనవలెను.

మీఁదిఱెప్ప, క్రిందిఱెప్ప లని కంటిఱెప్పలు రెండు గలవు; వానిలో మీఁదిఱెప్ప పెద్దది, క్రిందిఱెప్ప చిన్నది; మఱియు మీఁదిఱెప్ప కదలుచుండును; క్రిందిఱెప్ప కదల కుండును. మీఁదిఱెప్పం బోలి పెద్దవాఁ డైనరాముఁడు కదలి గాధినందనుని యాశ్రమముయొక్క నాలుగువైపులం బోలదిండ్లువచ్చి కడగం డైన హానిసేయకుండుపొంటెఁ జక్రాకారముగ వేడించి కాచుచుండెను. క్రింది ఱెప్పంబోలి పిన్నవాఁ డైనలక్ష్మణుఁడు, ఆశ్రమములోని కొరులు సొరకుండ వాకిటఁ బదిలముగాఁ గదలక నిలిచినట్లే కావలియుండెను. ఇట్లాశ్రమము నోము చుండు నాయిర్వురిలో శ్రీరాముఁ డాశ్రమముం జుట్టితిరిగి వచ్చునప్పుడెల్ల, మీఁది ఱెప్ప కదలి కదలి క్రిందిఱెప్పం దాఁకునట్లు వాకిటం గాచుచున్న లక్ష్మణునిం జేతం దేపతేపకుం దాఁకి తాఁకి 'లక్ష్మణా! జాగరూకుఁడుగా నుండు' మని హెచ్చరించుచు వచ్చె' నని యుపన్యసించెను.

ఇటీవల నావిద్వాంసులు సెప్పినయన్నిపద్యములకును రసభావస్ఫురణ నర్మగర్భంబుల విస్తరించి పామరులకు సయితము బోధపడున ట్లత్యద్భుతంబుగా నుపన్యసింప నాలించి క్షితిపతి యీప్రసంగము నుపమానోపమేయములతోను, నుదాహరణరూపవిశేషార్థంబులతోను బ్రౌఢప్రౌఢాలధారాసారంబులంబరె నవరసాసారంబుగా నమృతవాహినిరేవ హృదయానందకరంబై ప్రాలుచున్నది. దీనికిం దీటుగా నెవ్వరియుపన్యాసముం బురణింపవచ్చును; దీనికంటె సాహిత్యంబమహాకవియొక్క వావా దేచందంబున డెందంబున కందంబై యింపు సొంపునం బెంపారుచుండునో, యనియబ్బురమందుచుఁ జాల నగ్గించి యమితానందకందళితాంతరంగుఁడై నాఁటిదినము మొదలు నడపకాఁడు జీవమును దాదేహము నై పరస్పరసౌహార్దభావముతో నతని నెడఁబాయక తనతోఁగూడ సమానస్కంధముగాఁ గూరుచుండి భోజనముసేయున ట్లుపచరించి యితర విద్వాంసులకంటె వేయిరెట్లు మేలిమిగా మన్నించుచుండెను.

ఈరీతి భువివల్లభుండును, గవివల్లభుండును జీవశరీరైక్యభావముగా మెలఁగుటవలన నాస్థానవిద్వన్నికరము విశ్వంభరాగమణుండు దమయెడల ననాదరముగా నుండుటకాఁ దలంచి యందఱు గుమిగూడి యాలోచింపసాగిరి. ఎందుండియో ముందు వెనుక లెఱుఁగని యడపకాని నాదటం జనవుసేయుచు మనయందుం దఱితీపుగలిగి మెలఁగునట్లాయెనే; ఇందులకు సందుగొందు

లీయడపకాఁడే కదా! మంచిది, వీర లిరువురిని వేరమునం గారించి గౌరవముం దొరించి యొండొరుల నెడఁబాపితే కాని మనదోసంగులు గసిమసంగి యిసుమంతయు నుసువులు పొసఁగనేర దని యెత్తుగడ సేసియుండిరి. కంబమహాకవి యెడల నింతింతగా నీసువు పెరిఁగి, 'తెమ్మెర ముదిరి తుపా నైన' కైవడి నానాఁటికి వారిమచ్చరము పెచ్చుపెరిఁగి వెచ్చనూది యడపకాఁడు హీనకులస్థుఁ డని యపవాదము గల్పించి రాజునకు వినువు బొసఁగింపవలయు నని కైలాటమున కొడిగట్టి, రాజునకు వపనముసేయు మంగివాని మంతనంబున రావించి 'మన్నీని యడపకాని మీఁవంగడపువాఁ డని యేమాడ్కి నైన రాజునకు నిక్కముగాఁ దోఁచున ట్లొనర్చితివేని నీకు రెండువేలదీనారము లొసంగెద; ఇందువలన నెంతవిడిముడి యొడనెడ వెచ్చమైనం బొచ్చెము లేక నిచ్చెద' మని వానికి నచ్చిక వచ్చుమచ్చున వాక్రుచ్చి, హాఁ డొడఁబడుటకై యొడఁబడిక వ్రాసి పైకముం జేతఁబెట్టిరి. చేత రొక్కముం గనినంతనె 'పైకముంజూ పీనుఁగును నోరు దెఱచు' ననుటకు నుజ్జిగా వానికి నడియాస గడలుకొన నొడఁబడి యడపకాని మాత్రము గాదు పుకమిత్తేని సయితము నగడుపఱుపఁ గడంగి యెదరువేచి యుండెను.

ఇట్లుండ నొక్కనాఁ డేలిక వానితో మేలిమిగద్దియుం జాలువాఱి యుండిన కంబఁ డెద్దియో యొక్కకర్జమునెపమునం గద్దియ డిగి హజారము వాకిటికి నేగుదేరునవను, నచ్చట వేచియున్న నాపితుఁ డందఱుఁ జూచుచుండ మహాకవిం గౌఁగిలించుకొని "అన్నా! ఇన్నాళ్లనఱకు నీమోముం దిలకింపక నలందురుచుంటినే, నీవెచ్చటికిం జొచ్చియుంటివి? యిన్నాళ్లకు నీమోముం జూడఁగల్గెనే" యని పొరిపొరిం బొక్కుచు వాపోవుచుండెను.

కంబఁ డీలూలామాలంపు నవ్వడి నెఱిఁగియామంకుని బింకంపు బొంకుల కుఁ గొంకక నింకెఱ 'గడ్డిమోపువానితో నడ్డుకట్టుక నేడ్చిన' చందంబునఁ దాను నామంగలిం బిగగట్టుకొని విడువక యేడువనాగెను. మంగివాఁడు తను దాన తేఱుకొని తనమాసినచింపిగంత చే మహాకవి కన్నీళ్లం దుడిచి యేడ్వకు మని యూఱడింపఁగాఁ గవిగ్రామణి తనజజ్జర వెతారము నుజ్జగించి నాపితునిం జూచి 'యోరీ తమ్ముఁడా! నీవు మనుచుండు మనికిప ట్టెద్ది? నీ కిందాఁకఁ బెండిలి యైయుండుఁ గదా? బుడుత లెందఱు గలరు? చూతము ర మ్మని వెంటఁబెట్టుక నోలగంబు నోసరిలెను.

అ ట్లింటికి న్వెడలునపుడు కవిసార్వభౌముఁడు మంగలిం గని 'బాబూ! బిడ్డ లుండుచోటికి నెడ్డచేతుల రాఁజాలను, దేవతాసన్నిధికిని రాజసన్నిధికిని,

బిడ్డ లుండుచోటికిని రిత్తచేతులం బోరా దని పెద్దలు వక్కాణింతురు: కావున, నేదేని తినుబండారములం గొనిపోవుద మని యంగడివీధికిం బోయి యడుకులు సెనగలు పండ్లు మొదలగు నప్పచ్చులు గొంత విలుచుకొని మంగలియింటి చేరువం జేరెను. నాపితుఁడు, ముందుగా నింటిలోనికిం బోయి, తనయిల్లాలిం జీరి, ఓసీ! నీబావగా రిదిగో వచ్చిరి; వారు గూరుచుండుటకుం గద్దియ యిడు మని నుడువఁ గా నది యొక చిఱుబల్ల దెచ్చి యిడి కూరుచుండఁ గోరు చుండఁగా నతఁడు నట్లే కూరుచుండ మంగలిసాని యతనిపజ్జఁ జేరి యజ్జలవ్రాలి జోహా రొనర్చెను. మహాకవి యాబిడకు 'దీర్ఘసుమంగలీభవ' యని దీవించి బిడ్డ లని యడుగ మంగలి తనబోడిగల మువ్వురం దెచ్చి యిదిగో! మీ పెత్తండ్రి మిమ్ములం జూడ వేఁడుచున్నా రని చెప్పి బుడుతల నడుగుల నిడెను. చదువరి యాబిడ్డలం జేతనెత్తి యక్కునం జేర్చి మోముతో మోమిడి 'నాయ నుంగుఁ గూనలారా! మీరు దోఁగాడుటం గన్నులు దనియం జూడను, మీరు దడఁబడినడుచు తప్పటడుగులం జూచి యింపారను, బాల్యంబునం బల్కు తొక్కుపల్కుల విని చొక్కుటకు నోమనైతి;' నని కన్నీరు మున్నీరుగా నించి పలుమాఱుఁ జెలువార ముద్దాడి లాలించి దివాకీర్తిం బిలిచి 'నా కంగద కడు మెండు; ఓరెముం దోరముగాఁ దారుకొలుపు' మని వచింప వాఁడు జాలిగొనక యాలింబిలిచి వంటింపక వెంటనె వంటసేయఁ గెంటించి కంబనిం గని అన్నా! నీరాటకు లెం డని వేఁడుకొనెను.

పలుకులనేత బావిలో నీళ్లాడి వచ్చి బోనముం దెప్పింపు మన వాని భార్య విస్తరిని బోనము వడ్డింపఁ గంబఁడు 'నే నేమి లాఁతివాఁడనా? నాకేటికి విస్తరియుఁ గిస్తరియు? మనము గుడుచుకంచము నుంచు' మన మంగలియు వానియిల్లాలు నిట్టిచెద్దము గొడవ నడరింపఁ గల దని యెంతేనియుఁ జింత సేయక కంచమున వడ్డించి తినున ట్లుపచరించిరి. చదువులపెద్ద మంగలిం జూచి 'తమ్ముఁడా! నీతో నొకకర్జము మాటలాడవలసి యున్న' దన మంగి 'భుజించిన పిమ్మట వచింపవచ్చు' ననెను. భుజించిన పిమ్మట వచించిన నీయన్నము దిని నీకన్నెముం దలఁచిన ట్లగుం గావున నిప్పుడే మాటలాడవలయు నని చదువరి వక్కాణింప మంగలి యట్టిది యేమి కార్య మనెను. కవిశేఖరుఁ డిట్లని వచించెను:—'మనపెద్దలు గలాపమున నొండొరులం బాసి వారివారి యిచ్చకు వచ్చిన ట్లెందేనియుం జనిరి; ఊఁతకోలలేని లేఁతతీఁగవలె దేశా టనముగాఁ బోఁదు గనక యిట్టట్టు తారాడుచుండి చిట్టచివర కీనట్టుం బట్టితిని.

నీవెట్లో నిలుకడగా నీపేటినేత చాటునం బాటింపఁబడి యీపేట మనియున్నాఁడవు; చాల సంతసమే. ముసిఁడిచెట్లైనం బసిమిఁగా నుండుట చూపఱులకంటికింపుగ నుండును. మనకుటుంబము విభక్తము గాలే దనుట నీవెఱింగినదియ; ఇందాఁక మొత్తమున సంపాదించి వెచ్చించి మిగతవడియుండు సొమ్మెంత గలదో దైవము సాక్షిగాఁ గలిగినది చెప్పుమన; మంగలి 'నాలుగువేలవరహాలిప్పటికి నావద్దనున్నవి' యనెను. కంబఁడందుకు 'నట్లైన నందులో నర్ధభాగము నాదాయభాగము గదా? యిప్పుడే దానిం బంచిపెట్టు' మని యడుగ నాపితుఁడు నట్లే పంచిపెట్టెను. వెండియుఁ గంబఁడు 'మంచిది యిరువదియేండ్లుగా నీవి రాజుల కూడిగము సేసి నట్లేను నావంతునకు నిరువదియేం డ్లూడిగము సేయవలె నన 'నట్లేసరి, నేనొప్పుకొన్నియెద' నని మంగలి సెప్పెను. 'అట్లైన నీవియ్యకొని నట్లు పుడమితేఁడు నయిత మియ్యకొనవలయుఁ గావున రాజసముఖమునకు రమ్మని వానిందీసికొని రాజసన్నిధికి నేతెంచెను.

ఇది యిట్లుండ నగరిహజారంబునఁ గంబమహాకవిని మంగలి ''అన్నా' యనికట్టుకొని యేడ్చినపు డం దుండినవార లడపకానిం బెద్దవిద్వాంసుఁ డని యభిమానించి వానికి నభయం దాసన మిడినది గాక, వానిఁ దమయండఁ బెట్టుక సమపజ్క్తిగా భోజనమును సేయుచుండిరి కదా! అడపకాఁడు మంగలిగా నున్నాఁడే యిది యేమిఘోరము; వీనిం బట్టి మనరాజు కులమునకును, వారి వహించియుండు మహిమలకును, లెక్కింప నలవిగాని యశఃప్రభావంబునకును భంగము వచ్చెఁ గదా! ఇఁక దీనికై రా జేపాటిప్రాయశ్చిత్తముం జేసికొందురో! లేక యవమానముపాలైతి మని ప్రాయోపవేశముం జేసికొందురో యని ప్రజలు సాల వగచుచుండిరి. కాశ్యపీకళత్రుండు నట్లే విషయము నెఱింగి పొరింబొరిం బొక్కుచుఁ బలుదోవలఁ జింతించి హృదయంబు వ్రణంబైనను సూక్ష్మబుద్ధియగుటం జేసి, 'వీఁడు మంగలిగా నుండిన నంతటికంబమహాకవి దన యొద్ద నడపకానిఁగా నమర్చికొని యుండునా? వేగిరపడక దీర్ఘాలోచనచే నన్నియు నిశ్చయింపవలయు' నని ధైర్యము నవలంబించి వేగరుల విడిచి యందు నడుచునట్టి చెయ్దములఁ జక్కఁగ నెఱింగి రం డని ఘ౯త్తెంచెను.

వారలుఁ గైతవరూపంబునం జని, వారిరువురు నోలగంబు వదలి కదలినది మొదలు వారివెంబడిన యేగి నడుచునడవడు లన్నియు నాద్యంతిముగా నప్పుడప్పుడు సెప్పి పంపుచుండి తుదకు, అడపకాఁడు మహారాజుగారికి వపనము సేయవచ్చుచున్నాఁ డను మిఱుంగుఱుంబోని పలుకులం జెవిలోఁ జొనిపిరి.

ఇది వినఁగానే, యడపకాఁడు నిక్కంపుమంగలియే యని నిశ్చయించి, యొడఁ దఁ బెడిదముపడి యీబెడఁద నెట్లు గడపఁగల మని వడంకుచు నిట్టిమానహానికి నేమి సేయఁగలము? వీసము జేడకు నోసరిల్లిన మానము వేయిమాడ లిచ్చిన డాయఁగలదా యని చుమ్మలు చుట్టుచుండెను. ఇట్లుండ గోరుచుట్టుమీఁద రోఁకలి పడినట్లు ముల్లువుచ్చి కొఱ్ఱడిచినచందంబున మఱింత గొందలమందు చుఁ జూకురుచుండెను. అప్పు డామంగలియుఁ గంబఁడును రేనిమ్రోల కేతెంచి చాఁగిల్లి నిలుచుండిరి. వారిం గన్న నేత వడవడ వడంకి దీమసము నోముకోని, కాఁగలది గావుత; యింకను బరిశీలింత మని కంబనిం జూచి కార్య మేమని యడిగెను. అందుకుం జదువరి దనకు న్మంగలికిం దాయభాగవిభక్తముం దెలిపి, యాయొడంబడికను రేనిమ్రోల నుంచి మహాస్వామీ! నాతమ్ముఁడు తనవంతున కిరువదియేం డ్లూడిగముసేసి వచ్చిన న్నేను నిరువదియేం డ్లూడిగము సేయ నానతి వడయవచ్చితి' ననెను. పుడమిఱేఁడు 'సరి యట్లే యగుఁ బొమ్మని యనియెను.

అందాఁక నగరివిద్వాంసులు మంగలిం బిలిచి 'లొంగక నీజతనపడినపని యం దెంత వెచ్చము వచ్చిన నిసితెంతలు వాఱక, నెదవడక, నుడివడని కడంకచే నమకూర్పవలయు' నని మంగలిం బెరరేచుచుండిరి. మఱియు, మీయిచ్చ చొప్పున నడపకాఁడును ఱేఁడు నొనర్చిన యొగ్గుచేతను, మీ లగ్గుసేతను, నా యగ్గలికచేతను బని కొనసాగి పండియున్నది' యని చెప్పుచుండెను.

వెండియుఁ గంబమహాకవి శారదాదేవిం దనమానసంబున ధ్యానించి హేజగన్మాతా! గీర్వాణి! యిట్టియాపత్కాలంబున నీవేళాకోళము నుండి వెలిఁ దిగుచుపొంటెఁ గనికరించి నీయొడమకాలియందెనను గ్రహింపవలయునని బతిమాలికొనెను, తత్క్షణంబ, యతని వేఁడికోలుచొప్పున భారతీదేవి యనుగ్రహంబున నామెవామపాదహీరమణి నూపురము గంబనిచంకలో వచ్చియుండెను. అది యొఱఁగి మగటాలచే బెడగారు నాపలుకులవెలందియందెం దీసి వసుంధరాపతికి నివేదించెను. అది తటిత్ప్రభాభాసమానమై ధగద్ధగయని మెఱసి చూపఱ కన్నులకు మిఱుమిట్లు గొలుపుచుం గ్రాలగా రాజు నీకిది యేడ దని యడుగ, 'మహారాజా! ఒక్కవిన్నపము; విన్నవించెద నాలింపుఁడు:— ఈమంగలియు నేనును లాఁతివారము గాము; వీనితండ్రియు నాదుతండ్రియు నొక్కతల్లికడుపునం బుట్టిన సోదరులు; వీరు నేము నవిభక్తకుటుంబస్థులు గా నుంటిమి; కొన్నాళ్లకుఁ గ్రింప డబ్బాటుగా నుప్పతిల్లిన కయ్యముచే నొం

డొరు లెడఁబాసి యేగ నొనఁగూడినందునం డెంకింగల బండారువుల స్వట్టక యక్లే వదలిపోవునదను, మహారాజుంబోని పెద్దలచెంగట నూడిగముసేసి గడించిన విలువ కెక్కు నీయందెమాత్రము చేతికి సులువుగా నుండినందున మా పెద్దలు తలకొక్కటిగాఁ బంచి తీసికొని పోయిరి. పేదలును హీనజాతివారలము నైన మా కీపాటిమగఱాలయందె యేమిటికి? ఇది చక్రేశ్వరులగు మహారాజా వారికే తగునట్టిది; దయసేసి దీని నూరీకరించి, దీని జతయైన మణియొక్క నూపురమును నాతమ్మునివద్దనుండి పుచ్చుకొని పట్టమహిషియైన మహారాజ్ఞి గారి పాదారవిందంబులం దొడిగిన నీయందెలకుం గారవము గల్గియుండు' నని వక్కాణించెను.

చేరమహారా జాయొంటినూపురముం గైకొని తిలకించి దానియందము నకు నివ్వెఱపడి 'యోరీ! నీవద్దనుండు మణియొక్క నూపురముం దెమ్మని మంగలికి నానతిచ్చెను. వాఁ డిదియేమి "బావిత్రవ్వ బూచి పుట్టినట్లు" నాతలలో వచ్చి విడిసినదే యని చాల నెదవడి కాలుసేతులు వడవడవడంక డగ్గుత్తికతో నాయొద్ద నందె లేదని విన్నవించెను. దండనుండిన కంబఁడు 'ఓగీ! తమ్ముఁడా! యిట్టినూపురము మనకేటికి? నోరుమూసికొని యందెను, దేవేరిగారికి సమర్పింపు మనెను. మంగలి, 'అన్నా! యిదియేమి యిట్లనుచున్నారు? నాయొద్ద నిట్టిది యుండియుండినదే లేదు; నే నెందుండి తేఁగలనని దత్సందర్భమునఁ జెంత నుండిన పట్టమహిషి 'యామణియొక్కనూపురముం దెచ్చి యిచ్చున ట్లాజ్ఞాపింపుఁ' డని సన్నసేసెను. రాజును దేవేరికొఱకు నాలుగైదుసారి యందెం దెచ్చి యి మ్మని నిక్కచ్చి చేసి నొక్కియడిగియు యథాపూర్వము మంగలి లేదు లే దనెను. కంబఁ డామంగలిం జీరి "తమ్ముఁడా! ముసిఁడికి ముండ్లకంపయు, గాడిదకుఁ గళ్లెము నెందుకు? అటువలెఁ దలగొఱిగి పొట్టపోసికొని బ్రదుకుచుండు మనబోటిపేదల కిట్టిమగఱాలయందె యెందుకు? పుచ్చుకొనునది యంబలి పుక్కిలించునది పన్నీరా? ఎత్తునది గంత బిచ్చము నెక్కునది దంతపల్లకియా? అట్టిది మనకు వలదు; వైళమ తెచ్చి యి మ్మనెను. మంగలి యందుకు 'దైవము తోడు నావద్దలేః దనెను' జనపాలుఁడు, ఏమి! వీఁడు లే దని యొట్టువెట్టుచున్నాఁడే, యనెను. కంబఁడు 'మహారాజా! వీఁడు కడుం బిసినిగొట్టు; చిఱుత నాఁడుమొదలు దబ్బఱొట్టుం బెట్టుట యేవీనియలవాటు; దబ్బఱొట్లు వీనికి దధ్యోదనమువంటివి. ఇట్లు శాంతముగా నడిగిన నివ్వఁజాలఁడు; కాలం ద్రొక్కుకొని పెఱికినంగాని నెమిలీ నెమిలీ యీఁక యిమ్మన్న నివ్వఁగలదా? అట్లే వీని నడుగ

వలసినచందంబున నడిగితే కాని నిక్కముఁ జెప్పఁజాలఁ' డనెను. అంతటం బుడమినేతదురాయి నొక్కమోపు చింతచివ్వలు వచ్చిపడెను. కంబములో మంగలినిఁ బెడకేల్వ్రిరియఁ గట్టి యొడలంతయు నల్ల యొలుకున ట్లడిచిరి. మంగలి దెబ్బల నోర్వలేక 'మహాప్రభో! కట్లవీడ్చినం గలిగినవానిని విన్నవించెద' నని మనవిసేసి నంతనె వానిం గొట్టక కట్ల వదలించిరి.

పదంపడి, మంగలి జేనిమోలఁ 'జదురునఁ బొదివిప్పి న'ట్లంతయు వెల్లడించెను. ఎట్లనిన:—చాఁగిలంబడి లేచి కేలు మోడ్చుకొని 'రాజాధిరాజా! మహారాజా!! యీమహాపురుషులు నాకన్నయుఁ గారు; నే నాతనికిం దమ్ముఁడం గాను; వీర లెవ్వరో మహానుభావులు; వీరినడవడుల నేనెంతేనియు నెఱుఁగ నేరను. మిన్న కుండిన నన్నుం జీరి యీసంస్థానపు చదువరు లీతనియందుఁ జలపకారంబున నింత యూరివేరముల నన్గొని చేయించిరి. వారలు నాకు వ్రాసియిచ్చిన యొడంబడిక యిదిగో యున్నది; తిలకింపుఁ' డని దానిం దెచ్చి రాజసమ్ముఖంబున సమర్పించెను. వెండియు వారలు సేయఁ దెగించిన దుండగంబుల నెల్ల శ్రీముఖంబుఁ జదువు చందంబున బహిరంగముగా వెల్లడించెను. వీని నంతయుఁ జక్కగ నెఱిఁగిన చేరమహారాజు 'ఏయువాఁ డేసిన నీటె యేమి సేయఁగలదు?' అని మంగలిపై రేచినయలుక నెట్టకేలకు మట్టుపఱిచి యాస్థానపువిద్వాంసుల ద్రోహచింతకు డెందము వందురి క్రోధమూర్ఛితుండై కంటఁ దామ్రదీధితులు వెలుంగ విస్ఫులింగంబులు సెదర మోముఁ జేవుఱింప మనచేఁ బరిపాలింపఁ బడునట్టి యీచదువరులు మనకే యీపాటి యెగ్గొనర్చిరి కదా! యని వారలం గొఱఁతవేయ దురాయించెను.

ఇది యెఱిఁగిన చదువరులు హెచ్చుగఁ బుచ్చవాఱి యీగొడవపిడుగుల కేలాగునం దప్పఁగలము? 'ఒరులకుఁ దలంచిన కీడు తనతలమీఁదనే వ్రాలు'నన్న ట్లీయాపద మనతలలందే వచ్చివ్రాలెనే యని యెదవడి యందఱుం జేరి యుజ్జగించియు నేపాటియెత్తుగడయు దొరకమిం దమతమ యిల్లాండ్రంవఱుం గుమిగాఁ జని యడపకాని యజ్జలం బడి వేఁడునట్లు పురికొల్పి పంపిరి. పయిదలు లందఱుఁ దలవిరియఁబోసికొని పరువిడి యేగి యడపకాని యడుగుల మీఁదం జాఁగిలంబడి, కంటఁ గంకణంబు లుంచుచుఁ జేత ముక్కర చెఱఁగుఁ జాఁచుచు నైదువతిరిపము లిండని పలవించి యైదుపదిసేసిరి. కంబఁ డాయువిదల నెతారంపు మోములం దిలకించి డెందము గరఁగి, వార లెలుంగెత్తి వాపోవు నులివుల నాలింప నైఁపకఁ గనికరించి 'యో యైదువలారా! మీ రేడువవలదు;

మీమగల యనువుల నేఁగాపాడెద; మీర లంజకుఁడు; మీమీ యిమ్ములకడ కేగుఁ' డని నుడివి వారలం బంపి చేరమహారాజుం దిలకించి 'రాజశేఖరా! లోకములో మాత, పిత, గురువు, పురోహితుఁడు, పౌరాణికుఁడు, బాడబులు, తాపసులు, విద్వాంసులు, వికటకవులు, యోధవీరులు, సేనాపతులు, దూతలు, బందుగులు, రోగులు, దరిద్రులు, బాలురు, శరణాగతులు, భోగవనితలు అను నీ పదునెనమండ్రు నొనర్చిననేరములం గొని వారల దండించుట భూపాలవరులకు మనునీతి గాఁజాలదు. ఇదిగాక వారలు నేనును విద్వాంసులము గావున వారలకుఁ బొసంగిన యవమానము నాకుం బొసంగినట్లే యగుంగావున మహారాజుగారు పరిపూర్ణకృపసేసి, వార లెఱుకలేమి నెఱుఁగక యొనర్చిన నేరముల మన్నించుటయ మీవంటివారి గౌరవమునకుం దయకుం దగినది యౌను. అని యలుక దొలఁగునట్లు మృదుమధురనయభాషణంబులం జెప్ప రాజుం గినుకమాని విధించిన యాజ్ఞను మన్నించి కంబనిం జూచి 'యిట్టిమగఱాలయందె మీ కెందు దొరకినది' యనియు, మీరెవ్వ రనియు నడిగెను.

అందులకుం గంబమహాకవి చేరరాజు నవలోకించి 'చక్రేశ్వరా! వినుఁడు; ఈనూపురమును ధరింపఁగల దేవిం దర్శింపను, నన్నెవరని తెలియుటకును వలఁతురేని నిరూపించెద,' నని నొడివి రాజసభాస్థలమధ్యంబున మండప మొక్కటి యేర్పఱిచి, యందులో ముత్యంపుటుల్లడయు, జాలర్లును, మకరతోరణములును బుష్పమాలికలుఁ గదళీక్రముకవృక్షంబుల నిలిపి, మలయజగంధముం గొజ్జంగి నీటం గలిపి యలికి మౌక్తికచూర్ణంబులచే రంగవల్లికలం దీర్చి, యాపందిరిలో మరకతవిమానమొక్కటి యలంకరించి మాణిక్యమయపీఠం బమర్చి వేదిక మధ్యంబున జాంబూనదకలశము నుంచి యందు జగన్మాతయైన వాగ్దేవి నావాహనముసేసి, శంఖకాహళమురళీమర్దలపణవాది యాతోద్యమ తూర్యరావంబులు సెలంగ ధ్యానావాహనాదిషోడశోపచారములచేఁ బూజించి, భారతీదేవీమూలమంత్రమును బ్రణవనమకచమకములతో సహస్రావృత్తి జపించి, జవనికాభ్యంతరముననుండి నూతనముగా సరస్వతీముక్తపదగ్రస్తశతక మొక్కటి రచించి హేఘనసారస్వతరూపిణీ! వీణాపుస్తకపాణీ! ధవళాంబరధారిణీ! హీరమణిభూషణీ? త్రిజగన్మాతా సాన్నిధ్యముగావలయు' నని ప్రార్థింపఁగా శారదాదేవి సాక్షాత్కరించి నృత్యముసల్పుచు 'నెద్దిరా కంబా యెడమకాలియందె' యని ప్రావృట్కాలఘనాఘనగంభీరభాషణంబుల నడుగునప్పటికిం గంబమహాకవి చేరమహారాజుం జీరి శారదాదేవిం జక్కగ దర్శింపుఁడు; నూపురము నిం డని పుచ్చు

కొని వాగీశ్వరి యెడమకాలిపజ్జ నుంచఁగా నది యాదేవి వామపాదము నలంకరించినంత భాషాదేవి యోలమాసగొనియెను. శారదాదేవీవాఙ్జాలముచే నడపకానిం గంబమహాకవి యని యెఱిఁగి, యతనిం దనయూడిగంబున నమర్చినందుకై చాల వగచుచు మనోవేదనచే సోలి క్రొంతదడవునకుఁ దెప్పిఱిల్లి 'మహాఘనతవహించిన కవిలోకసార్వభౌమా! అజ్ఞానకృతమైన నానేరములం గనికరించి సైరింపుఁడు, ఇట్టిమహనీయులు గైతవరూపంబున నీచందంబునం గందువాఱం గారణం బేమి? తాము నిజరూపంబున వేంచేసినయెడల నెంతో గౌరవముగాఁ బూజించి సంతస మందఁజాలనా? ఏటికిట్టి ప్రచ్ఛన్నవేషముతో నేతేరవలయు' నని పొరిపొరిం బొక్కుచు నతని సహామండలేశ్వరుని కంటె నెంతో యెక్కుడుగా, రత్నఖచితసింహాసనంబున నాసీనుం జేసి కనత్కనకమణివిభాసితంబులైన బహువిధాభరణంబుల చేతను, చీనిచీనాంబరంబుల చేతను, గంధసింధురసైంధవస్యందనాది బహువిధబహుమానంబులచేతను, బహువిధబిరుదావళులతోను బూజించి పూర్వముకంటె వేయిరెట్లుపచరించుచుండెను. అప్పుడు కంబమహాకవి 'మహారాజా! కరుణానిలయా! రాజాధిరాజా! రాజమార్తాండా! రాజకంఠీరవా! భోగబిడౌజా! ఆశ్రితలేఖానోకహా! ముందు వెనుకలు దెలియని యెవఁడో మానవసామాన్యుఁడుగా నుండిన నన్నెంతో చనవున మన్నించుచుంటిరే గాని యేపాటి తక్కువయుఁ జేయలేదు. వేలావలయితభూమండలము ధర్మమార్గముగాఁ బాలించునట్టి దేవర నాకింత యుపచారములం బచరింపవలయునా? నేనెంతవాఁడను? యింతకైవారంబులు నాకేమిటికి' అని వినయాతిరేకమైన మృదుమధురభాషణంబుల రాజుం దనిపించెను.

ఇటీవలఁ బ్రొద్దుల నింపుతోఁ గడపుచుండ నొక్కనాఁడు వీటినేత మాటలనేతం గని 'చోళరాజుం బొలాప్పుచు నేకతముగా రాఁగతంబే' మని యడుగఁ గంబమహాకవి యిట్లని యుటంకముగా వక్కాణించెను:—'చోళమహారాజుగారికిని నాకుం గొంత వైరస్యము వొడమినకతంబున నతని పజ్జనుజ్జగించి యొంటిమెయి నిటకేతెంచి మీచేత మన్నింపఁబడితి. రాజు పేరోలగంబున నుండి వీడ్కొనునప్పుడు 'ఓరాజా! నీవద్దఁ బన్నుఁ గొనెడినీకంటె శ్రేష్ఠతరుఁడైన భూమీపతి నాకాకుమడుపులు మడిఁచియిచ్చునట్టి వైభవముతో, నిచ్చటికి రాఁ దటస్థించిన, రాఁగల' నని ప్రతిన సేసి వచ్చితి; నింతియ నాచరితమన' క్షమాకళత్రుఁడు 'మీరు నాకుం జేసినభంగి మీరు వలచినప్పుడు మీకు నాకుమడుపులిచ్చునడపకానిఁగా మిమ్ములఁ గైసేయఁ గల' నని వాక్రుచ్చెను.

ఈరీతిం గంబఁడు చేరమహారాజుచే సత్కరింపఁబడి యతని పేరోలగంబుఁ గైసేయుచుండ నచ్చటఁ జోళరాజ్యంబునం గులోత్తుంగచోళవిశ్వంభరాధీశుఁడు కంబని ముఖ మాలోకింపలేమిని, మాతృవదననిరీక్షావిరహితస్తనంధయునియనువున, భర్త్రాననసమాలోకనము లేని ప్రోషితపతికపోలికి, వర్షముం గానని సస్యములచందంబున, వదాన్యుల వదనాలోకము లేని వనీపకులవైఖరి, యుద్ధరంగముం బొడగనని యోధులయొప్పున నేకారుచు, నక్కటా నే నొక్కింతయుఁ బర్యాలోచింపకయు నిసుమంతయు మోమోటము లేకయు, సౌహార్దత నించుకఁ బాటింపకయు బరుసనిపలుకులం బేలార్చుచు, నారాజ్యమున్వదలి వెడలుఁడని నుడివినవడిచేతఁ గదా విద్వచ్ఛిరోమణి యైనకంబమహాకవి యెంతేనియుఁ బంటింపక నాయోలగంబు నొసరిల్లి యెందో చనిరి. ఇఁక నెన్నఁ డాతని మోముగోముం దిలకింపఁగల్గుదునో? అతఁడు లేనియోలగంబు కమలషండము లేని కమలాకరంబుకరణి, చందమామ లేని చదలుచాడ్పున, నేఱు పాఱని యూరిమేర, విజ్ఞానము లేని విద్యావిధమునఁ, బాతివ్రత్యము లేని భామిని భాతి, శివధ్యానము లేని డెందంబుచందంబున నీవి లేని యింటికాఁపురీవి, భక్తి లేని మానవునిమాడ్కి, చిత్తశుద్ధి లేని శివపూజచెలువున, పతి నెఱుఁగని పాళజంబాలమగ్నపశువులభంగి మన్నన లేని మన్నినిచెన్నునఁ, బొందు లేని విందునందంబున గట్టువిల్తుని మెట్టదమ్ములఁ బట్ట లేని చిత్తంబునుత్తి, చంద్రార్ధశేఖరుం బూజింపని వాని యింటియోగిరమునొప్పున, జీవకారుణ్యము లేని యిల్లంబు చొప్పునఁ జెన్నుదఱిగి విన్నఁబోయియున్నది. అతఁ డెందులకేగెనో! ఎందున్నారో? ఏ యాణియమందు నాణియము గలిగి పోణిమిమీఱి యున్నారో? ఏపుణ్యాత్ముఁ డెట్టిపురములో నెట్టిభూపాలుని ప్రాపుగాంచి యేపుమీఱి యున్నా రనునమృతధారను మత్కర్ణరంధ్రంబున నాసారించునో? యని సభ్యులతో వాచారుచు నష్టదిక్కులంగల దేశము లన్నిటికిం దూతలం బంపి చిరకాలము నన్వేషించియుఁ దెలియలేక వందురుచుండ దైవగతిగా వేగరియొక్కఁడు కంబమహాకవి చేరమహారాజాస్థానములో సభాస్తారులుగా భాసిల్లుచున్నా రని విన్నవింపఁగా నిక్కముం దెలిసికొనెను. పదంపడి రాజు 'ఈలేఖనాలోకనము సేసినంతనె యంకిలిసెప్పక దయసేసి కంబమహాకవిం గారవముగా నిచటికిం బుత్తెంచవలయు' నని చేరమహారాజుగారికి విన్నప మొక్కటియు, 'నా నేరములం దూరీకరించి వేఱడము లేక గారాబముతో నాచేరువకు నేతేరవలయు!' నని దూరదర్శికి నొక లేఖయును వ్రాసిపంపెను. ఆ లేఖలు రెంటి నిర్వురుం బుచ్చికొనిరి. చోళరాజు

పంపిన తనకప్పం గంబఁడు దీసికొనివెళ్లి చేరరాజునకు సమర్పించి 'చోళరాజు వద్ది కేగుటకుం గనికరించి యనుమతింపవలయు' నని ప్రార్థించెను. చేరరాజు సయితము తనకుఁ బంపఁబడిన విజ్ఞాపనముం జూపించి 'మీ రిచటికి నేతెంచి కొంతకాలము వసించియుండ సమకూడినది యెవ్వరి భాగ్యమో' యనియు, 'నిప్పుడు దాము దబ్బాటుగా నావీడు వీడునట్లు దటస్థించినది నాదౌర్భాగ్యమో' యనియు, 'మీరు నాసభ నలంకరించుచుండుటచే నాసభ వాచస్పతివాఙ్ముఖముచే వాసికెక్కి వాస్తోష్పతి సుధర్మసొబగున సొంపు పెంపారుచుండెను. ఇఁక నా యోలగంబు కులసతి లేని కుటుంబముకొమరున, వన్నెచెడిన మిన్నచెన్నున విన్ననై యుండుఁగదా' యనియు, 'మీవలె నింపుసొంపు సంపాదింప నమృతధారాపాతముం బలె మృదుమధురోక్తుల నావాదొనర్చి నన్నుఁ దనిపించువారిఁక నెవ్వరున్నా' రనియుఁ, నింతలోన నింత దురంతమగువంత నాకు సంతరించెనే యనియు నడలుచుండెను. కంబఁడు, సకలభూభారము వహించుచు, పరదేశమునుండి నిరాధారముగాఁ దోతెంచి ప్రాపుగన్న పేదనైన నన్నెంతో గారాబముగా నన్నవస్త్రాభరణాదికము లొసంగి, కన్నతల్లి బిడ్డలఁ బోషించుపేరిమిఁ బోణిమిమీ నాదటం బ్రోచిన మహోపకారులయిన మీయంతటి మహామండలేశ్వరుల నెడఁబాయుటచే నేనెంత మొరమొరలాడవలయు? పదంపడి, లోకంబున విచారము లేనివాఁ డొక్కఁడును లేఁడు; కర్జము పిన్నదైనను బెద్దదైనం దానం బొడమువగపు మాత్రము వారివారి యంతస్థులం బట్టి యోజింపఁగా నొక్కరీతిగానే యుండు' నని వక్కాణించి యందుకుం దార్కాణముగా

మత్తకోకిలవృత్తము.

పాలవేయఁగఁ బంచదార యభావ మంచను వారికిం
బూలియుంబలి కుప్పు లేదనఁ బొక్కువారికిఁ గాళ్లకుం
దోలుచెప్పులు లేవన న్నదిఁ దూలువారికిఁ గర్బురాం
దోలికిం బడమొచ్చమైన మనుష్యునాదయు నొక్కటే.

*பாலுக்குச் சர்க்கரை யில்லையென்பார்க்கும் பருக்கையற்ற*
*கூழுக்குப்போட வுப்பில்லை யென்பார்க்குங் குற்றிதைத்த*
*காலுக்குத் தோற்செருப் பில்லையென்பார்க்குங் கனகதண்டி*
*மேலுக்குப் பஞ்சணை யில்லையென்பார்க்கும் விசனமொன்றே.*

అనుపద్యము నుద్ఘాటించి మన్ననివగపుం బాపెను. అటుపిమ్మట చేర మహీపతి కంబని బహువిధములం గొనియాడి యాత్మతుల్యమహామండలాధిపతి

కిం జేయురీతిం గంబమహాకవిని సకలమర్యాదలం బూజించి తన మంత్రిప్రధాను లిరువైపుల వింజామరలు వైచుచు బహువిధాడంబరములతోఁ దోడ్కొని యేగి చోళరాజ్యమున విడిచి రం డని యానతిచ్చెను.

కంబఁ డాచేరరా జొసంగిన పైఁడిజలతారు దుప్పటములం గప్పుకొని మించునొంచునట్టి మంచిమిన్నలు పొదువఁబడిన పలురకము లైనకడానితొడవులం దొడిగి, యెక్కుడుమొకము, లరదములు, వారువములు, గాల్వురుం బలిసి కొలిచి రా, మత్తుగొరుమూఁపునం గూరుచుండి, చలివెలుంగు నిగ్గుజగ్గు లగ్గలించు వెలిగొడుగు గవియ నాలవట్టములు, మొసలిబిబ్బీలు, టెక్కెములు మొదలయిన రాజబిరుదములు వెలుంగ, బట్టులు హెచ్చరికలు సెప్పఁ, దంబుఱ, దండె, దండియ మొదలగు నరమువాద్యములును, బిల్లనగ్రోవి, నాగసరము, చిందము మొదలగు బెజ్జపువాద్యములును, జయ్యంకి, చిటితాళము, కైముడి మొదలగు కంచువాద్యములును, డవిణె, డమరుగ, డంగుర, డక్క, ఢోలు, కవడె, యురుము, గిడియ, మద్దెల, పంబ, జమళిగ, తమ్మటము, పీరణము మొదలగు తోలువాద్యములును, కాళె బూరుగు మొదలగు గొమ్మువాద్యములును, మొదలగువాని చప్పుడులు గడలు పదింటను గడలుకొనంగ, బట్టులు బిరుదములు వాడ, నిరువైపులం బ్రెగ్గడలు వింజామరలు వైవ, దిందిమిదిమి యని మద్దెలలు మ్రోయఁగ, విన్నాణంబులు గొలుపుటెలుంగుల గాణలు పాటలు వాడ, నట్టుగులు తద్ధరికిటకిటతకణకఝుం, ధరికిటతకణకఝుం, కిటతకణకఝుం, తకణకఝుం, తకఝుం, ఝుమ్మని తీరుకుల జతివరుసల నుగ్గళించుచు, తకదిత్తళాంగుతకదికితదింగిణతోం, దిత్తళాంగుతకదికితదింగిణతోం, తళాంగుతకదికితదింగిణతోం, తకదికితదింగిణతోం, తదింగిణతోం, తో మను తీర్మానములం జటితాళములచే గణిల్లణిల్లని తీర్పఁగ, గుజరాతి, జక్కిణి, పెక్కణము, పేరణి మొదలగు నాటలం బదచాళిగఁ బాతరలాడుచు నాగవాసము లేతేర, నిట్టి పలువితములయిన గారవములతోఁ బయనముగా బయలుదేఱెను. చేరరాజు సయితము గొంతద వ్వరిగి వీడుకొల్పి మరలుచో 'మీరు చోళుని వదలునప్పు డొనర్చిన ప్రతిన మఱచితిరి కాఁబోలు' నని నుడువం గంబఁడు 'మఱువలేను, నేఁ జోళనాఁడు సేరి యదనెఱిఁగి కమ్మ పుత్తెంచెద నపుడు దాము దయసేయ వచ్చుఁ గాని యిప్పు డక్కఱ లే' దని వాకొన, 'నట్లే కానిండు; తమ కమ్మఁ జూడఁగానే పంటింపక యేతెంచి తాము నాకొనర్చిన మేలునను మీ కొనర్చి నాయప్పులం దీర్చుకొనియెద' నని చేరరా జుగ్గడించెను. పదంపడి, కంబఁడు

నేతయానతిం గైకొని యతని నీడ్కొని చేరదేశము న్వదలి చాలదవ్వునడచి చోళరాజ్యముం దార్కొనెను.

ఇట్లరుదెంచుటం జోళమన్నీఁ డెఱింగికొని గెంటెంపువెంటముతో నెదు రేగి బుజ్జగించి తోడ్కొనివచ్చి తనయోలగంబునం బలువన్నియల మిన్నలం దాపిన బొబ్బమెకపుగద్దియయం దుండఁబనిచి యతనిమోముం దిలకించి కను దమ్ములు హొళంజెంద డెందము సంతసింపఁ, దన్నెడఁబాసిన పిదప నడిచిన నడవడుల నెల్లం జెప్ప నాలించి కనికరమైనచోట్ల వంతనొందుచు, సుమాళ మైనయెడనున హొళిఁజెందుచు, నబ్బురపు టింపుసొంపులఁ దనివారుచుండెను. ఇటీవల రెండుమూఁడునాళ్లు గడచినపిదప 'మీ రిచ్చట నుండి బయలుదేఱు నప్డు డొనర్చిన ప్రతినమాత్రము కొనసాగలేకపోయెఁ గాఁబోలు,' నని పరి యాచకముగా నొడివెను. కంబఁ డందుకు 'నేఁటి కెనిమిదవనాఁడు నెఱవేఱఁ గల' దని చెప్పి చేరనేతకుఁ గమ్మ పుత్తెంచెను.

చేరనేత కంబఁ డంపినకమ్మఁ దిలకించి నంతనె పంటింపక యడపకాని వేసబముతోఁ గిలాతము నెక్కి వైళమ యాయెనిమిదవప్రొద్దునకు వేంచేసి చోళమన్నీని యోలగంబునఁ గంబమహాకవికెలంకున నిలువంబడి యతనికి బాగాలయాకుమడుపులు మడిఁచి కంబనిచేతి కిచ్చుచుండెను. వాని మోము గోముం గని చోళరాజు కూఁతురు చేరరాజును గుఱుతించి తనతండ్రిచోళునికి సన్నసేసెను. ఈకర్జము నెఱింగిన చేరనేత వైళమ తత్తడినెక్కి తనయూరియము సేరెను. చోళుఁడు కంబనిం జీరి 'మీయండ నుండినవాఁ డెవ్వఁ' డని యడుగఁ గంబఁ 'డతండె చేరమహారా' జనెను. 'అట్లయిన నతని నెందు కంతచెచ్చెరం బంపితి' రనిన, 'మీకంటె దొడ్డనేతయై మీయొద్దం బన్ను వుచ్చుకొనునట్టి మన్నీఁడు మీకుఅంగటం దనబలఁగములులేక నొంటిమెయి వేంచేసియుండుచో నతనింబట్టి చెఱనుంచి వానిరాజ్యము నలముకొనుట నీకు నలఁతిగదా యని తలపోసి యతనిం బోఁ బనిచితి' ననెను. చోళమన్నీఁడు, 'మంచిది సరే యతఁడు మడిఁచియిచ్చిన బాగాలమడుపు బాగుగ వ్రేళ్లసందులో నిఱుకు కొంటిరే గాని వీడెము సేయలేదుగదా! అదేల' యని యడుగఁ గంబఁ 'డలఁ తులకు నను లబ్బిన యెడల నడికిరేయిం గొడుగుఁ బట్టఁగలరు; నేనట్లు నడువఁజాలను. అంతటిగొప్పయేకిమీఁడు నన్నుఁ గారవించుటకై యాదట నన్ను బుజ్జగించిన నాగరిమ నెఱుంగక తలవిరియఁబోసికొని యాడఁదగునా? మడుపులం బుచ్చుకొని వీడెముసేయుట మేర యగునా?' యని నొడివెను.

చోళరాజు కంబని చదువులవిన్నాణముకంటె యాలుడియుఁ, బెద్దఱికమును, దెలివిడియుఁ బెచ్చుపెరిఁగి తుఱంగలించుటంగని డెందంబునం గొనియాడుచు నదిమొదలు వారిద్దఱు గేస్తునొడలుమేర మెలఁగుచు నింపుపెంపునం గాలము గడపుచు హాళిమెయి మనుచుండిరి.

కవిసార్వభౌముఁ డైనకంబఁడు జీవంతులుగా నుండుచో నెచటికైనం బయనము వోయిరావలసి యుండినప్పుడెల్లఁ గరుణాకరపాండ్యుఁ డొసంగిన జీవదంతచిత్రితచామీకరాందోలికారోహణముసేసి, కులోత్తుంగచోళుఁ డొసంగిన ధవళాతపత్రంబులుపట్ట, వింజామరలు వీవ, కాహళ, బాఁకా, కొమ్ములు మొదలగు వాద్యరావములు దిక్కులం బ్రతిధ్వనులొసంగ నవవిధభేరులు ధ్వనింప కుడగదేశాధిపతి సమ్మానముగా నొసంగిన మత్తమాతంగంబులును, సింధుదేశాధిపతి యిచ్చిన సైంధవనికరంబులు నాంధ్రదేశాధిపతి యిచ్చిన గండుబెడ్లగుంపును, మార్వాడిదేశాధిపతి యొసంగిన లొట్టిపిట్టలగుమియు నొకదొడ్డదేశాధిపతి దండువలెఁ దన్నుం బలిసికొలిచి యే తేరఁ బయనముసేయుచు మహావైభవాతిశయముతో విరాజిల్లుచుండెను.

తి. సు. మురుగేశుఁడు,
వడగరై నగరి తెలుఁగుపండితుఁడు,
పెరియకుళము, మధురజిల్లా.

# సోమునిహరివంశము.

(గతసంచికశేషము.)

తరువాతిపద్యములలోఁ గనఁబడు సోమునిపదములైన 'లంజెతనము, మిండతీకము' అనునవి రోఁత జనింపఁజేయుచున్నవో, ఎఱ్ఱనప్రయోగించిన "మనోజానీకసంక్రీడలన్" అనునది యేవపుట్టించుచున్నదో విచారింతము.

లంజె, మిండ, ఈపదములు సామాన్యములు. 'లజ్జికా, మిణ్ఠః' అనుసంస్కృతపదముల వికృతులు (తెలుఁగుపదములు) 'కులట, విటుఁడు' అనునవి మనకు రోఁత జనింపఁ జేయుటలేదు. అట్లే యివియును నేవము పుట్టింపవు. 'లంజె, మిండ' అనువానితద్ధితరూపములు 'లంజెతనము, మిండతీకము' అనునవి. కావున వీనియందు రోఁతలేదు.

ఎఱ్ఱన ప్రయోగించిన 'మనోజానీకసంక్రీడలన్' అనునదియే రోఁతను బుట్టించు నర్థము గలిగి యున్నది. ('లంజె, మిండ' అనునవి తాతలు మనుమరాండ్రను, మనుమలను ముద్దునకై పలుకుసామాన్యపదములుగఁ గూడ వాడుకయం దున్నవి.)

సోమునిహరివంశములోని యూర్వశీనరకాసురసంభాషణఘట్టమును జదివియున్న యనేకులు పండితు లది రసవత్తరమైన నాటకములోని యొకయంకమువలె హృదయరంజకముగా నున్న దని మెచ్చుకొనియున్నారు. దీనిఁగూర్చి వేఱొకగ్రంథమునఁ జర్చించెదను.

**VI.** ఆక్షే. "సోమునకు లోకోక్తులం గడుఁబ్రీతి. ఎట్లయిన మూఁడు నాల్గుపద్యముల కొకమాఱైన నొకసామెతఁ దూర్పకున్న నితనిమనసు నిలువదు. వాస్తవముఁ జూడ కవితకుఁ గలసుభగాలంకారములలో లోకోక్తులును జేరినవనుట నిజమ కాని, బలవంతముగఁ గావలయు నని పట్టి సందులోఁ జొన్పినచో నది యెంతయు రోఁత."

సోముఁ డుపయోగించిన యేలోకోక్తియు బలవంతముగఁ దూర్చినట్లు లేదు. గ్రంథ మంతయుఁ బరికించినను నొక్కటి యైనను వ్యర్థముగ నున్నట్లు తోఁపదు. ఆయాస్థలంబుల నాయాసామెత లెంతయు నొప్పుచుఁ బాఠకుల నానందాద్భుతరసంబున నోలలాడించు చుండుటయే కాక కవికిఁ గలలోకజ్ఞాన మపార మని వేనోళ్లఁ జాటుచున్నవి.

VII. ఆక్షే. "సోమునకు హాస్యరసమునందు విశ్వాస మెక్కు డని తోఁచెడిని. కొన్నియెడలఁ జదువరులను నవ్వింపవలయు నని ప్రయత్నపడి వ్రాయును, గాని, హాస్యమునకును సౌమనస్యము తోడుపాటు ముఖ్యము. ఆగుణముం బాటింపక యితఁడు వ్రాసినహాస్యముం జూడుఁడు!

"ముందటిది కన్నాడి మొలత్రాటఁ దవిలిన తోఁకగోఁచుల వెంటఁ దూలువారు"

ఇది నరకాసురానుచరపీడితు లగువసిష్ఠాదిమహర్షులయవస్థ! ఇది మర్యాదను లజ్జను బాటించువాఁడు వ్రాయుమాట గా దని వేఱ వాకొనవలయునా? ఒరులయవస్థం జూచి హాస్యముసేయుట నీచలక్షణము గాని మహాపురుషలక్షణముగాదు." అని శర్మగా రాక్షేపించినారు.

ప్రత్యు:— బదరికాశ్రమవాసు లగుమునీంద్రులకు రాక్షసులవలన సంభవించిన దురవస్థలను వర్ణించుచు, వానియం దొకటిగాఁ జైయవస్థను గవి వర్ణించినాఁడు. ఈపాదముం జదువఁగానే వీరికి నవ్వు వచ్చినది గాఁబోలు! నవ్వువచ్చున వెల్లను హాస్యరసమునఁ జేరవు. దానిశాస్త్రము వేఱు.

ఒరులకు బాధలేకుండ మహారణ్యమధ్యమునకుఁ బోయి పరమార్థమే ప్రధానముగాఁ దపములు సలుపుచుండు సన్మార్గు లగుమహామునీంద్రులకు సయితము దుష్టదానవులవలన నెట్టిపాట్లు ఘటిల్లుచుండెడివో యనువిచారమును, రాక్షసులపై నీసును జనించుటచేఁ జెప్పిన వీరకరుణభయానకబీభత్సాదిరసమిశ్రితం బగునీఘట్టమునందలి పద్యములోని యీపాదము హాస్యరసమునఁ జేరదు. కవిసౌమనస్యము నీఘట్టమే కాక గ్రంథమంతయు వెల్లడించుచున్నది. ఆతఁడు నీచుఁ డనుట పాడిగాదు.

ఎఱ్ఱన యెందేని హాస్యము వ్రాసినను నది గంభీరమై యుండు నని శర్మగా రీపద్యము నిచ్చిరి.

క. "పోరానిచుట్ట మితఁ డనఁ, గూరిమిచెలికాఁ డనంగఁ గోరి వరుస గో
త్రారి హరిబాంధవులఁ బే, ర్వేరం గుశలంబు లడిగెఁ బ్రియమెలరారన్."

దేవేంద్రుఁడు శ్రీకృష్ణునితో నరకాసురపీడను దెల్పవచ్చినచోటఁ గానవచ్చునీయెఱ్ఱనపద్యమున హాస్య మిమిడి యున్నదనియు, పై సోమునిపద్యపాదమున నింద్య మగుహాస్యము గల దనియు వ్రాసిరి. సోమనాథునిపద్యము హాస్యరసమునఁ జేరదని పైని వ్రాసియే యున్నాను. పైయెఱ్ఱనపద్య మెట్టిహాస్యరసమునఁ జేరునో పాఠకమహాశయులు నిర్ణయింతురుగాక!

### శ్రీకృష్ణుని కైలాసయాత్రాఘట్టము.
### సోమునిపూర్వోత్తరవిరోధము.

ఉత్తరహరివంశమునఁ బూర్వోత్తరవిరోధము గల దని సంభావించి శ్రీశర్మగా రాతని నధిక్షేపించుచు నిట్లు వ్రాసియున్నారు.

"ఏ మోసంబుముగ నాయాసందర్భముల నేమేమియో వ్రాయును గాని సోముఁ డందువలనఁ గలుగుపూర్వోత్తరవిరోధము లంతగాఁ బరిశీలింపఁడు. అప్పుడు వ్రాయుపద్య మెంతబాగుగ నున్న దని యోజించువాఁడే కాని, వెనుక నేమి వ్రాసితి నని విచారించుట యాతని కార్యక్రమము గాదు. శ్రీకృష్ణుని కైలాసయాత్రాఘట్టమున నీవిషయమును గనుఁగొనవచ్చును.

శ్రీకృష్ణుఁడు రుక్మిణియు నొకనాఁ డేకాంతగృహమున నున్నపుడు రుక్మిణి తన కొకకుమారు ననుగ్రహింపు మని వర మడుగఁగా, శ్రీకృష్ణుఁ డట్లు కానిమ్మని దానికై శ్రీపరమేశ్వరునిఁ గూర్చి తపము సేయఁ గైలాసమునకుఁ బోయెను. తపోవసానమునఁ బ్రత్యక్షుఁడై పరమేశ్వరుఁడు, 'కృష్ణా! నీ వేల తపము సేసెదవు? పుత్రార్థ మైనయెడ నీ కిదివఱకే నేను గుమారు నొసఁగియున్నాఁడను. నా నేత్రాగ్నిచే దహింపఁబడిన యనంగుఁడే నీకుఁ బ్రద్యుమ్నుఁ డనఁ గుమారుఁడై యున్నవాఁడు. అని పల్కి యాతని స్తుతించెను. కృష్ణుఁడును మఱలివచ్చెను.' ఇది సంస్కృతహరివంశమునఁ గలయానుపూర్వి. దీనివలన శ్రీకృష్ణునకుఁ గైలాసయాత్రకన్నమున్నే ప్రద్యుమ్నుఁడు జనించి యుండె నని స్పష్ట మగుచున్నది గదా. కావుననే యెఱ్ఱన, రుక్మిణి శ్రీకృష్ణుఁ బ్రార్థించుమాటలలో,

క. "తనయులఁ బ్రద్యుమ్నాదులఁ, గనియుఁ దనియ దాత్మ, కొడుకుగములను నానా
ధనరాసులనుం దనిసిన, జనములు భువిఁ గలరె యిది నిజంబు మహాత్మా"!

అని మూలమున లేని యొకమాటను వ్యాఖ్యానముకొఱకై దూర్చినాఁడు. ఇందు సోమునికి బలమైనసందేహము గలిగినది. మొదలే ప్రద్యుమ్నుఁ డనుకుమారుఁ డున్నచో రుక్మిణి మరలఁ గుమారుఁ గోరనేల? కోరెఁబో, శ్రీకృష్ణుఁడు కైలాసమునకుఁ బోయి, యంతటిఘోరతప మొనరించి, తుదకు నీకున్నకొడుకే చాలు నని శివుఁడు వచింపఁగాఁ జేతులు వెలికిలవైచుకొని మఱలునా? కాని యీసందేహ మెఱ్ఱనకును గలిగినది. ఐనను నతఁడు మూలమును మార్చుస్వాతంత్ర్యమును వహించినవాఁడు కాఁడుగాన మూలమునకే యుపోద్బలముగా శివుఁ డొసంగిన వరమ్ములలో 'నీవు పూర్వమునందు నధికతపం బొనర్చితివి. ఇపుడు నధికతపోనిర్వాహకుండ వైతివి. నీదైనయీభవి

వృత్తపోవిభవంబు వెలింగి యింతవట్టునకు ఫలరూపంబుగాఁ గొడుకును మున్న యిచ్చుట యిట్లు సున్యక్తంబు సేయవలసెనను క్రొత్తమాట యొకటి యిటి కించి తాను దేసుకొనెను. సోముఁ డింతమాత్రమునఁ దృప్తిపడయక విష యమునే మార్చినాఁడు. రుక్మిణి శ్రీకృష్ణుఁ గోరునపు డాయమకుఁ గొడుకులే లేరు. శ్రీకృష్ణుఁడు శివుని వేఁడినపుడు గూడ, 'తొల్లి నాకంటిమంటచేఁ గాలి యనంగుఁడై యున్నమన్మథుఁడే యిఁకముందు ప్రద్యుమ్నుఁ డనఁబడు కుమారుఁడై నీకు జనించు' నని శివునియానతి. పురాణకథలలోఁ బౌర్వా పర్యము నిర్ణయించుట యసాధ్యము గావున నిట్లు విషయమును మార్చి నను దొందర యుండ దని యతఁడు తలఁచెఁ గాఁబోలు! అతఁడు తలఁచి నట్లే పురాణకథలవలన నేమియుఁ బ్రమాదము రాలేదు గాని, తనవలననే తనకుఁ బ్రమాదము వాటిలు నని తలఁపఁడయ్యె. చూడుఁడు, శ్రీకృష్ణుఁడు "మురామరారి నరకక్రవ్యాదముఖ్యాసుర, ధ్వంసాపాదనవీతకంటకవతి" యగు ద్వారావతిలో నంతఃపురమున రుక్మిణితో వినోదించుచుండఁగా నాయమ తన యునిగోరిన దని వ్రాసినాఁడు. దీనివలనఁ గైలాసయాత్రకుఁ బూర్వమే నరకా సురసంహారము జరిగిన దని యతఁడే మనకుఁ జూపి యిచ్చిన ట్లయ్యెఁగదా! అనఁగా, నరకాసురుని జయించినపుడు కృష్ణునకుఁ గుమారులు లే రనుట సోమునిమతము. ఇ ట్లయ్యును శ్రీకృష్ణుఁడు నరకుఁ జంపి ద్వారకను బ్రవేశిం చినసమయమందు "బలభద్రసాత్యకిప్రముఖసోదరులును బ్రద్యుమ్నానిరుద్ధాది పుత్రపౌత్రవర్గంబును - - - - చతురంగబలసమేతంబుగా నెదుర్కొని రని పెద్ద వచనమున నాడంబరముగా వర్ణించినాఁడు! (కావున సోముఁడు పూర్వోత్తరవి రోధంబు నెఱుంగఁడు.") (అని యాక్షేపము.)

ప్రత్యు—దొరకక దొరకక నిధివలె దొరకిన తాళపత్రగ్రంథమునుబట్టి ప్రతివ్రాయించి తెప్పించి ('కాపీరైటు' కొఱకు) రాత్రులు నయితము ముద్రిం పించి యతివేగమున ('టెక్స్టుబుక్కు' గా నంగీకరింపఁబడు ననుతలంపున) సంపూర్ణగ్రంథముగా వెలువరించిన పుస్తకము నొక్కదానినే నమ్ముకొని వీ రీయాక్షేపమును జలిపినారు. సరియే. ముద్రితగ్రంథమునుబట్టి యైనను వీరి యా క్షేప మెంతవఱకు నిలుచునో ముందుగ విచారించి, పిమ్మట, నుత్తరహరివంశము లోని ప్రథమాశ్వాసము కడపటనుండు వచనముస్థితిని గూర్చి, యాలోచింతము.

పురాణములలోనికథలు దేశచారిత్రమును బోధించునాఖ్యాయికల (నవ లల) వంటివా? వాని పౌర్వాపర్యమును విచారించుట ధర్మమా? అవి మన

కేమి బోధించుచున్నవి? శ్రీకృష్ణునికైలాసయాత్ర సంస్కృతహరివంశమున నెచ్చట వ్రాయంబడియున్నది? దానిని వ్రాయుటయందు వ్యాసునియుద్దేశ మేమి? అనువాని నియ్యెడఁ బరిశీలించుట న్యాయ్యము.

పురాణములలోని పాత్రముల పౌర్వాపర్యమును మనము పరీక్షింప దొరకొందుమేని తత్కర్త యనఁబడు వ్యాసమునీంద్రునిఁ, బూర్వోత్తర విరోధ మనియెడు దుఃసహూవాతూలము తూలముంబోలె నెగురఁగొట్టును. మనదేశముసంకలి పురాణేతిహాసాదిగ్రంథములను జదువువారి కీవిషయము విదితమే. పురాణములు కేవలము చరిత్రగ్రంథములు గావు. దేశచారిత్రమును బోధించుట వానిపని గాదు. అయ్యవి నీతినిబోధించును; ఆస్తిక్యము నుప దేశించును; ధర్మాధర్మముల నిరూపించును; భక్తిమార్గమును జూపును; పరమేశ్వ రుని శిష్టరక్షణదుష్టశిక్షణాదిలీలలను వివరించును; శ్రేయము నొసఁగును - - - పూర్వకాలమున మతము లనేకములు బయలువెడలి దైవదూషణము పెచ్చు పెరిఁగెను. శైవులు, వైష్ణవులు, కాపాలికులు, శాక్తేయులు మొదలగువా రొకరి దైవము నొకరు దిట్టుచుఁ బరస్పరము కొట్టుకొనుచు నుండిరి. ఎవరుదూషించి నను దేవుఁ డని పేరుపెట్టఁబడినవానినేకదా! మతాభినివేశముచేఁ గలుగు నయ్యీశ్వరనిందామహాపాతకమునంబడి జనులు ఘోరనరకముపాలు గాకుండ, విద్వజ్జనసంస్తవనీయభవ్యకవితావేశుండు, విజ్ఞానసంపద్విఖ్యాతుఁడు, సంయమి ప్రకరసంభావ్యానుభావుండు, కృష్ణద్వైపాయనుఁడు లోకహితనిష్ఠం బూని, ధర్మాద్వైతస్థితి యొప్ప ననేకపురాణములను గావించి వానిని వ్యాపింపఁజేసెను. వానియందుం బౌర్వాపర్యమునే యాతఁడు గమనించియుండు నేని యక్కాల మున లోకహితకార్య మొనరించి యుండునా? కావునఁ బురాణములలోని కథల పూర్వోత్తరసందర్భముల నెంచుట ధర్మముగాదు. వానినుండి తెలిఁగింపఁబడినగ్రం థములలోని సందర్భమును నట్టిదే! కాన దాని నాక్షేపించుటయుఁ బాడిగాదు.

పైఘట్టము సంస్కృతహరివంశమునఁ గడపటిపర్వములో "ఉద్వృత్తభావే కృష్ణంప్రతి రుక్మిణ్యాః పుత్రప్రార్థనాకథనమ్" అను 73-వ యధ్యాయము మొదలు కొని "పునః శివకృతకృష్ణస్తుతిః" అను 90-వ యధ్యాయమువఱకు పదునెనిమిది యధ్యాయములయం దున్నది. దాని కథ సంగ్రహముగ వ్రాసెదను. (ఇందు శర్మగారివాక్యములును గొన్ని గలవు)

"నరకాదిశత్రువర్గమును సంహరించి శ్రీకృష్ణుఁడు రుక్మిణితో ద్వారా వతిలో నంతఃపురమున వినోదించుచుండ, నామె కృష్ణునితో 'దేవా నీయట్టి

శౌర్యసౌందర్యాదులు గలవాఁడును వృష్ణికులుల కందఱకుఁ బ్రభు వగువాఁడును నగుకుమారు నొకని దయచేయు' మని వర మడిగెను. శ్రీకృష్ణుఁడును నామెతో "ప్రాణేశ్వరీ! నీకోరిక యర్హ మైనది. పుత్త్రవంతులు పుణ్యాత్ములు. పున్నామ నరకమునుండి రక్షించువాఁడు పుత్త్రుఁడే సుమా! భర్త భార్యగర్భమందుఁ బది యవు నెలఁ బుట్టుచున్నాఁడు సుమా! ------" అని పలికి శ్రీపరమేశ్వరునిఁ గూర్చి పుత్త్రార్థము తపము సేయఁ గైలాసమునకుఁ బోయెను. తపోవసానమున నీశ్వరుఁడు ప్రత్యక్షుఁడై "కృష్ణా! నీ వేల తపంబు సేసెదవు? పుత్త్రార్థ మైన యెడ నీకిదివఱకే నేను గుమారు నొసఁగియున్నాఁడ. నానేత్రాగ్నిచే దహింపఁ బడిన యనంగుఁడే నీకుఁ బ్రద్యుమ్నుఁ డనఁబడు పెద్దకుమారుఁడై యున్న వాఁడు.' అనిపలికి తామిరువురు నభిన్నమూర్తు లని మునులకెఱుకపఱుచుటకై యతఁడు మున్ను తన్ను నుతించుటకు ద్విగుణముగా నతని నుతించి యంతర్ధాన మందెను. కృష్ణుఁడు మఱలి వచ్చెను."

(పైని శర్మగారు వ్రాసినకథాసంగ్రహమున నేలొకో మూలమున నున్న (1) "నరకాసురవధానంతరము, (2) ప్రద్యుమ్నుఁ డనఁబడు పెద్దకుమారుఁడు" మొదలగునవి విడిచిపెట్టఁబడినవి!)

ఇక్కథను వ్రాయుటయందు వ్యాసునియాశయ మేమి?

ఈయాత్రకుఁ బూర్వమే శ్రీకృష్ణునిపట్టమహిషి యగురుక్మిణికిఁ బదుగురు కొడుకులును, ఒకకూఁతురును గలిగియుండి రని సంస్కృతహరివంశమునందును నెఱ్ఱన తెలుఁగుహరివంశమునందును జెప్పఁబడియున్నది. సంస్కృతోదాహరణము మాని తెలుఁగుపద్యమును మాత్ర మిచ్చుట నిచ్చెదను.

క. "విను ప్రద్యుమ్నుఁడు రుక్మిణి, కనఘా! తొలుపట్టిగాఁగ నాత్మజులు క్రమం
బునఁ దొమ్మండ్రు మఱియు సం,జనితులయిరి కన్యయొకతె జనియించెఁ దుదిన్."

తక్కిన దేవులవలనఁ గృష్ణునకుఁ గలిగినబిడ్డలకు లెక్కయే లే దని యెఱ్ఱన హరివంశమే చెప్పుచున్నది.

అంతమంది బిడ్డలతండ్రి శ్రీకృష్ణుఁడు నిజముగాఁ గొడుకును బడయుటకే పోయెనా కైలాసమునకు? పోయెంబో, తనయంతవానిని శివుని వేఁడి, వ్యర్థుఁడై చేతులూఁచుకొనుచుఁ గ్రమ్మఱుట సిగ్గులచేటుగాదా యాబృహత్కుటుంబికి? వ్యాసుఁడు శ్రీకృష్ణుని నిక్కముగ నిక్కార్యమునకే పంపెనా శివునిచెంతకు? పంపినవాఁ డా లెక్కలేనికొడుకులకుఁ దోడుగా 'వీఁడుగో! వీనినిగూడ నీకున్నవారితో నాడుకోనీవయ్యా!' అని యిం కొకకొడుకును శివునిచే నిప్పింపలేక

పోయినాఁడా! నోటఁ గదవ మున్నది గదా! [illegible] నిప్పించిన నేమి మునిఁగిపోయినది? భూమికి [illegible]? ఆలోచించఁగా, అట్లు చేయుట వ్యాసుని యాశయము గాదనియు, [illegible] కైలాసమునకుఁ బంపలే దనియుఁ దేలుచున్నది. [illegible] వ్రాసినాఁడు:—

శివుఁడు నీవుఁ దనికైవల్యప్రదులు, [illegible] శైవులును, వీరు, ఆది శక్తికొడుకు లని శాక్తేయులును - - - - [illegible] విని వారిమాహాత్మ్యము [illegible] వ్రాసియుండెను. [illegible] లను [illegible] మొదలగు పిశాచనాయకులు [illegible] వైష్ణవు లయినట్లు [illegible] క్రియలు నయి తము భగవద్భక్తిచే స్వర్గాధిపత్యము నొందిరి అని [illegible] ప్రశంసించి, అట్టి ఘోరకృత్యముల [illegible] శ్రీకృష్ణునిచే నప్పిశాచనాయకు లకుఁ జెప్పించి, శాక్తేయులకును, కాపాలికులకును బుద్ధివచ్చునట్లు చేసినాఁడు. వ్యాసుని కల్పనమహిమ మనల్పముగదా!

పైని వ్రాసినది వ్యాసునియభిప్రాయము కాదేని ప్రద్యుమ్నుఁడు పుట్టకే పూర్వమే దీనిం జెప్పక యెచ్చటనో భవిష్యపర్వమున గ్రంథ మంతయు ముగియు వేళఁ జెప్పనేల? మఱియుఁ గృష్ణునకుఁ గొడుకులు, మనుమలు మునిమనుమలు గలిగినపిమ్మటఁ జెప్పనేల? ఈభావము నూహించియే కాఁబోలు మనసర్వజ్ఞకవి

మ. “పరివాదాస్పదవాదమోదమదిరాపానంబుచే మత్తులై
హరి మేలంచు హరుండు మేలనుచు నాహా! కొంద ఱీపాం దెఱుం
గరు కైలాసనగంబునందు మును లేకత్వంబు భావించి రా
మురవైరిం బురవైరి బాపుట మహామోహంబు ద్రోహం బగుఁ.”

అని తనగ్రంథమున నీకథకు మొదట నే (మూలమున లేకపోయినను) జనమేజయునిచేఁ బలికించినాఁడు. ఈ యద్వైతవిషయము నిట్లు చెప్పుటతోడనే తృప్తినొందక యాసాహిత్యరసపోషణసంవిధానచక్రవర్తి (పైవిషయమును దర్శించుకొనియే కాఁబోలు!) రుక్మిణీదేవి శ్రీకృష్ణదేవునిఁ బ్రార్థించుఘట్టమున, నౌచిత్యముకొఱకుఁ గొంతస్వాతంత్ర్యమును వహించెను. రసజ్ఞుఁ డగుకవి రసము వెల్లివిరియించుట కై మూలమును మార్చు స్వేచ్ఛను బూనుట తప్పు గాదు. కాళిదాసుఁడు శకుంతలకథయం దౌచిత్యముకొఱ కెంతమార్పును జూపినాఁడు?

తెలుఁగుకవులలోఁ దిక్కన సోమన శ్రీనాథులే యట్టి స్వాతంత్ర్యము గల వారు. తిక్కన విరాటపర్వము మొదలుగువానియందలి కథలను జూచినఁ దెలియును. శ్రీనాథుఁడును దన శృంగారనైషధమహాకావ్యమున,

“అశేషమనీషి హృదయంగమంబుగా శబ్దం బనుసరించియు, నభిప్రాయంబు గుఱించియు, ధ్వానం బుపలక్షించియు *రసంబు పోషించియు, నలంకారంబు భూషించియు, నౌచిత్యం బాదరించియు, ననౌచిత్యంబుఁ బరిహరించియు - - - - ”

అని చెప్పియున్నాఁడు. సోముఁడును నౌచిత్యముకొఱకు మూలమునం గొన్నిటిని బరిత్యజించినాఁడు. ఎట్లన,

పదిమందిబిడ్డలఁ గన్నముసలిపడుచు రుక్మిణి, వేలకొలఁదిపిల్లలు గల శ్రీకృష్ణునితో నేకాంతగృహంబున వినోదించుచున్నట్లు వర్ణించుటయు, ఉన్నవారు చాలకలోటువచ్చినట్లుపుత్త్రునిమ్మని ప్రార్థించుటయు, నామెయట్లడుగఁగానే, “సెబాస్! బాలా! చాలా బాగుగాఁ గోరితివి! ‘పుత్త్రవంతు లగుపుణ్యాత్ములకఖిలలోకసుఖములు ననంతములు’ సుమా! తనయవిహీనులు దుఃఖులు’ సుమా! ‘తనూజలాభంబు పరమధనమనిరార్యులు! ‘పతియ చూవె భామినియందుఁ బట్టియనఁగఁ బుట్టుఁ బదియవునెల!’ ‘పుత్త్రుఁడే సుమా పున్నామనరకమునుండి రక్షించువాఁడు!” అని పిల్లలు లేనివా రనుకొనుమాటలను గృష్ణుఁడు పలుకుటయు, ఆవలఁ బౌండ్రకవాసుదేవుఁడు తాను లేనిసమయమును జూచి ద్వారకపైఁ బడుటకు వేచియున్నాఁ డని యెఱిఁగి యుండియుఁ దక్కిన తొమ్మండ్రుబిడ్డలను గన్నట్లే యింటియొద్దనుండియే కనలేక కైలాసపర్వతమునకు నాకుటుంబి పోవుటయుఁ, దపకుఁ బండ్రెండేండ్లు, పదునొకండవ ముద్దుఁగొడుకు కొఱకు ఘోరతపం బొనర్చియుఁ, జేతు లూఁచుకొనుచు మఱలుటయు—రసపోషణమున కేటిసంవిధానము లని యాసర్వజ్ఞకవి యాలోచించెను. ఆతఁడు కడు గడుసువాఁడు. కావుననే యీఘట్టమున రుక్మిణికిఁ గొడుకు లున్నట్టుగాని లేనియట్లు గాని చెప్పక కొడుకులు లేనియాఁడుది పలికినట్లే యామెచేఁ బలికించినాఁడు. అట్టిచమత్కారమునే చూపక యాముసలిదంపతులనే పాత్రములుగాఁ గైకొని యుండెనేని, యాంధ్రగ్రంథప్రపంచమున నెచ్చటను రసవత్తర మగునిట్టి

* ఇక్కడ శబ్దాలంకారనియమముఁ గనఁబఱుచు వాక్య మొకటి పాత మైట్లు తోఁచెడి. ప్రతులన్నిట నిట్లే యున్నది. “క్షించియు” అనుదానికి, నట్టిదివేఱొకటి కవి వ్రాసియుండెనేమో!

యుత్తమశృంగారరసపూరితఘట్టము లేదని ఘంటాఘోషముతోఁ జెప్పఁదగిన యీ భాగము సృజింపఁబడియుండునా? ఈ క్రిందిపద్యములం గనుఁడు!

శా. "కంసారాతి మురాసురారి నరకక్రవ్యాదముఖ్యాసుర
ధ్వంసాపాదనవీతకంటకవతిన్ ద్వారావతిన్ రుక్మిణీ
హంసీహారమృణాళహారిభుజమధ్యస్ఫారకాసారుఁడై
సంసారార్ణవసారమన్మథసుధాసారంబునం దేలఁగన్.

సీ. "యమునాతరంగడోలాధిరోహణమునఁ దళుకొత్తు పసిఁడినెత్తమ్మివోలె
*హరినీలమణిమనోహరమందిరస్తంభముల వినోదించు కీల్బొమ్మవోలె?
దళితనీలోత్పలదళదామసంగతిఁ గొమరారుసంపంగిగుత్తివోలెఁ
దరుణతమాలపాదపశిఖాశాఖలఁ జెలువారువలరాచచిలుకవోలెఁ
బారిజాతగోవర్ధనోత్పాటనమున, బలిమితోడనైన మురవైరిబాహుయుగము
తెప్పగా మన్మథాంబుధిఁ దేలుచుండె, రమ్యగుణమణి రుక్మిణీరమణి ప్రీతి.

శా. "ఆరామాతిలకంబు మన్మథవినోదైకాంతగేహంబులో
గారామై యొకనాఁడు లేనగవు శృంగారంబుగాఁ గన్నులం
బారం జేదనిలజ్జఁదోఁప హరికిం బాదప్రణామక్రియా
ప్రారంభం బగుభక్తిఁ గుట్మలితహస్తాంభోజయై యిట్లనున్.

గీ. అఖిలలోకైకనాథ! నీయట్టిరూప, విక్రమౌదార్యశౌర్యవివేకనిలయు
నొకకుమారుని దయచేసి యుర్విలోనఁ, గడుపుచల్లనికాంతలఁ గలుపునన్ను.

సోముని గ్రంథములోని యీఘట్టము దేశచరిత్రమును దెల్పుటకై కల్పింపఁబడిన యిప్పటినవలలవంటిది గాదు. "అల్లాయుద్దీన్ చక్రవర్తి హైదరాలీతో వియ్యమందె" నను దేశచారిత్రమునకు భంగమును దెచ్చువిరుద్ధవిషయము లిందు వ్రాయఁబడి యుండలేదు. మఱి యిందేమి వ్రాయఁబడియున్నవి?

దంపతులయన్యోన్యానురాగము, వారిభావవిలసనములు, సరససల్లాపములు, ఆనందసాగరవీచీవిహారములు—ఉత్తమకాంత తనభర్తకుఁ బాదసేవ చేయుచు నాతనియెడఁ గలిగియుండవలసిన గారాము, శృంగారము, లజ్జ, భక్తి, వినమ్రత, చనవు—భర్త తనప్రాణప్రియయెడ నొనర్పవలసిన ప్రీతి, యుపలాలనము, అభీష్టవరదానము, దయ—మొదలగుసద్గుణములం దెలుపుచుఁ బాఠకులను, శ్రోతలను వినూత్నసంతోషాంబునిధిం దేల్చువిషయము లిందు వ్రాయఁబడియున్నవి.

కావునఁ బురాణములలోని కథల నాయాచోటులఁ జదివి యానందింప వలసినదే. వానిపౌర్వాపర్యముల నెత్తుట ధర్మముగాదు.

పై వ్రాతకు సంతృప్తినందనివారీక్రిందివిషయముం గనిన నపాస్త సంశయు లగుదురు.

తాళపత్రగ్రంథములలో సోమునివ్రాఁత యెట్లున్నది?

ముద్రిత మైనయుత్తరహరివంశము ప్రథమాశ్వాసము కడపట నున్నవచనము సోమనాథమహాకవి వ్రాసినది గాదు. ఈనావాక్యమునందు సాహసము గల దని కొందఱకుఁ దోఁపవచ్చును. కాని నిపుణముగాఁ బరిశీలించుచో నది తద్విరచితము గా దని తెలియవచ్చును. ఈవాదమున నాకుఁ గలయాధారములలోఁ గొన్నిటి నిచ్చట వ్రాయుచున్నాను.

(1) శ్రీవీరేశలింగముపంతులుగారు తాము గ్రంథమును బ్రకటించుట కాధార మని పేర్కొనిన తంజావూరిప్రతిలోఁ బ్రథమాశ్వాసాంత్యభాగమున భూదేవిపలుకు "కన్నమోహంబు గావున - - - - - -" అనుపద్యము తరువాత గ్రంథభాగము కొంత విడిచిపెట్టఁబడి పిమ్మట ద్వితీయాశ్వాసము ప్రారంభింపఁ బడియున్నది. .

(2) శ్రీపీఠికాపురసంస్థానమునకు బ్ర. మ. రా. శ్రీజయంతి రామయ్య పంతులుగారు వ్రాయించి 'ఆంధ్రసాహిత్యపరిషత్ప్రత్రికాకార్యస్థానము' నుండి పంపించిన వ్రాఁతప్రతియందును బై 'కన్నమోహంబు' అనుపద్యము తరువాత—"ఇచ్చటనుండి ప్రథమాశ్వాసము నంతమువఱకు పాతము" అని వ్రాయఁబడియున్నది.

(3) చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునందలి ప్రతియందును బ్రథమాశ్వాసము కడపటిభాగము లేదు.

(4) రెండువందలయేండ్లక్రిందట వ్రాయఁబడి కూచిమంచి తిమ్మకవి సార్వభౌముని పురాతనగ్రంథజాలమునఁ జిక్కిన యొకవ్రాఁతతాటియాకుల వ్రాఁతప్రతియందును 'కన్నమోహంబు' అనుపద్యము తరువాత మూఁడు పట్టెతాటియాకులు విడిచిపెట్టఁబడి మఱియొకయాశ్వాస మారంభింపఁబడినది.

(5) శ్రీవీరేశలింగముగారి యొద్దఁ బూర్వ మున్నప్రతిలోఁ బ్రథమాశ్వాసము లేనే లేదని వారి పీఠికయే చెప్పుచున్నది గదా!

(ఏప్రతియందును లేనియీవచన మెక్కడనుండి వచ్చినది?)

(6) సోముని గ్రంథములోని తక్కినవచనములను ప్రథమాశ్వాసము కడపట నున్నవచనమును జదివిన, అది, సోమునిది గాదని తెలియును. సోముని పదగుంఫనము వేఱు. ఈవచనములోని మాటలకూర్పు వేఱు. వీనులలోఁ జేరినభీరువుం బోలె నాతనివచనములలో నీవచన మన్యమై యుత్తరకవికల్పితమని చాటుచున్నది.

(7) సోముఁడు వర్ణనాంశములఁ దక్కఁ గథాభాగము నెప్పుడు నింతవచనమున వ్రాసి యుండలేదు. మఱియు నరకునిచేఁ జెఱపట్టఁబడిన పదియాఱువేలస్త్రీలకథయు, వారికిఁ గుండలముల నర్పించినసంగతియు నిందుఁ జెప్పఁబడలేదు. శ్రీకృష్ణుఁడు వారిని జేపట్టియుండుటచే సోముఁడే యావచనమును వ్రాసియుండిన నవ్విషయము నిందుఁ జెప్పియుండఁడా? అదితికిఁ గుండలము లిప్పించి యుండఁడా?

(8) "బ్ర. శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రి అండ్ సన్స్" వారి ముద్రితప్రతియందును నీవచనము గానవచ్చుచున్నది. నేను వారిపేర సోముని యుత్తరహరివంశములోని ప్రథమాశ్వాసముకడపటఁ నున్నవచనము మీయొద్ద నున్న వ్రాఁతప్రతియం దున్నదా, శ్రీవీరేశలింగముపంతులవారి ముద్రితప్రతిని బట్టి మీగ్రంథమునఁ జేర్చి ముద్రింపించినారా? అని (1926 ఫిబ్రవరి 4,17 తేదులను) రెండు 'రిప్లయికార్డు' లను వ్రాసియుఁ బ్రత్యుత్తరమును బొందఁజాలనైతిని. 'ఇది గొప్పవిమర్శవిషయము గావున లోకోపకారమునకై గ్రంథములఁ బ్రకటించుచున్న మీవంటి మహనీయులే ప్రత్యుత్తర మీయనిచో నింక భాషకు దిక్కేమి?' అని వ్రాసియు నుత్తరముఁ గాననైతిని. దానంజేసి వారి ప్రతియం దున్నయీవచనము వీరేశలింగముపంతులవారి ముద్రితగ్రంథములోని వచనమునకుఁ బ్రతిబింబమే యని నిశ్చయపఱుచు కొంటిని.

☞ ప్రథమాశ్వాసాంతపద్యములను జూచినచో సోముఁడావచనమును వ్రాయలేదని స్పష్టముగఁ దెలియనగును.

1. పద్యము — "శా. పారావారవగాధిరాజతనయా &c." ఇది 5-వ ఆశ్వా. కడపటిది.

2. పద్యము — "క. చక్రపురశ్వేథ - - &c." ఇది 4- కడపటిది.

3. పద్యము — "మాలిని. జలధిగిరినివాసా &c." ఇది 4- కడపటిది.

ఒకకవి తనగ్రంథమున నొకయాశ్వాసమునంతమునఁ దాను వ్రాసిన పద్యములను వేఱొకయాశ్వాసముకడపటను వ్రాసి యుండఁడు.

4. కొన్నిస్థలములలో నీతకారము చేర్చినపుడు ధాత్వంతోకారమునకు దీర్ఘము వచ్చును. ఉ-అ॥ శ్రు-శ్రూత. సం॥ శ్రుత. అవ॥ద్రు-ద్రూత. సం॥ద్రుత.

5. తుమున్నంతరూపములు వేదభాషలోనివియే. ఉ- చరంద్యే - శ్రావయెద్యై. తయే - అనుమతయే. ఐ - జన్యై.

6. క్తప్రత్యయతకారము సంస్కృతభాషలోవలె నీభాషలోఁ దఱచుగా నకారముగా మాఱదు. మాఱినరూపము లరుదు. ఉ-పర్-పరణః=పూర్ణ.

7. క్త్వాప్రత్యయాంతరూపములు. ఉ-జన్-జద్వా (హత్వా)

8. అవ్యయములు.

| అవస్థా. | | సంస్కృతము. | అవస్థా. | | సంస్కృతము. |
|---|---|---|---|---|---|
| అవితో | - - | అభితః | దక్షిణం | - - | దక్షిణేన |
| హద్రా | - - | సత్రా | నూ | - - | నూ |
| ఇదు | - - | ఇహ | మంక్షు | - - | మంక్షు |
| కుద్ర | - - | కుత్ర | పశ్చేతా | - - | పశ్చాత్ |
| యధా | - - | యదా | మా | - - | మా |
| యథా | - - | యథా | క్వ | - - | క్వ |
| అథ | - - | అథ | బాడా | - - | బాఢం |
| హకృత్ | - - | సకృత్ | ఏవ | | ఏవ |
| యావత | - - | యావతా | | | |

9. ఉపసర్గలు.

| అవస్థా. | గ్రీకు. | సంస్కృతము. |
|---|---|---|
| అపి - - - - | అపి - - - | అపి |
| అవి - - - - | - - - - | అభి |
| అన - - - - | అన - - - | |
| అను - - - - | - - - - | అను |
| అవ్ - - - - | అవ్ - - | అప |
| అంతర్. | (Latin) ఇంటర్. | అంతర్ |
| అరమ్ - - - - | - - - - | అరమ్ |
| ఉప - - - - | - - - | ఉప |

| అవస్థా. | గ్రీకు. | సంస్కృతము. |
|---|---|---|
| ఉపరి | ఉపెర్ | ఉపరి |
| పైరి - | | పరి |
| తరో - | | తిరస్ |
| పరో - | | పరా |

10. వేదభాషయందువలె నీభాషలోఁ గూడ నుపసర్గలు ధాతువులకు వ్యవహితము లయి యుండును. ఉ॥ అప-హూచ-అజహిభ్యో-మిత్ర-బరోయిస్ (ఓమిత్రుఁడా మమ్ముల నాపదలనుండి పైకిఁ దీసికొని పొమ్ము.) అనువాక్యమందు "బరోయిస్" అనుక్రియకు "అప" అను నుపసర్గ ముం దుండక దూరముగా నున్నది. అప - బరోయిస్ అని యుండవలయును.

11. కొన్నిచోటుల ధాతువున కుపసర్గ దూరముగా నున్నయెడల మరల నాయుపసర్గ క్రియతోఁ గలిపి చెప్పఁబడును.

ఉ. హం - ఇదా సేతం - హం - బరాయన్ ఈవాక్యములో మొదటఁ జెప్పఁబడిన హం అను నుపసర్గ - "బరాయన్" అనుక్రియతోఁ గలిపి మరలఁ జెప్పఁబడినది.

12. కృదంతరూపములు.

అవ-అ=సం॥ అ. ఈ "అ" అనుకృత్ప్రత్యయము ధాతువులకుఁ జేర్చుట వలన విశేషణములు, క్రియాజన్యనామవాచకములు (Verbal nouns) కర్తృవాచకశబ్దము (agent) పుట్టును.

| అ. | | అన. | |
|---|---|---|---|
| అవస్థా. | సంస్కృతము. | అవస్థా. | సంస్కృతము. |
| వాజ | వాజ | బాజన | భాజన |
| మేగ | మేఘ | హంజమన | సంగమన |
| గోస (ear) | ఘోష | రోచన | రోచన |
| అమ | అమ | ఆన | |
| ఉక్షన్ | ఉక్షన్ | ఈశాన | యజాన |
| తషన్ | తక్షన్ | ఈ | |
| మసన్ | మహాన్ | దేవీ | మహీ |

తర్ — మన్

వాతర్ - జోతర్ — అశ్మ - నామన్

అనుమతి - స్తుతి - గతి. — వజ్ర - శుక్ర

తు

సేతు - క్రతు - పితు (food)

త్ర

పుత్ర - వస్త్ర - ఉష్ట్ర

13. తద్ధితప్రత్యయములు.

(ఇన్) మత్వర్థీయప్రత్యయము.

ఉ. ద్రుజిన్ - పరనిన్ (పర్శిన్)

క. పశుక, దాహీక, ద్రప్సక, నైరిక, అష్మాక (అస్మాక)

త్య - పాశ్చాత్య.

మ - అపమ - ప్రథమ.

మన్ - అర్యమన్.

మన్త్ - క్రతుమన్త - మదుమన్త.

ర - అదర (అధర) అపర.

వన్ - ఆద్రవన్ (అధర్వన్.)

వన - ధన్వన - ఆఫ్రివన.

వన్త్ - అమవన్త్ - పుద్రవన్త్.

14. సమాసము.

1. విశేష్యమునకు విశేష్యముతోను

2. విశేషణమునకు విశేషణముతోను

3. విశేష్యమున కవ్యయముతోను సమాసము కలుగును. ఉదాహరణము.

1. రెండువిశేష్యములకు - వీస్పతి - విస్పతి.

2. రెండువిశేషణములకు - విస్పోచాన్య.

3. విశేష్యము - అవ్యయము - హ్వాస్ప.

4. విశేష్యము - విశేషణము - దరజోబాజు (దీర్ఘబాహు.)

5. విశేష్యము - ధాతువు - రథేష్ఠర్ - రథష్ఠ.

15. కొన్నిచోట్ల సమాసములలోఁ గలిగిన వర్ణలోపముచే సంధి యగును. ఉ. ఔరుషాస్ప (ఔరుష + అస్ప) మజ్జోక్త (మజ్జ + ఉక్త)

16. కొన్నిట సమాసపదమధ్యమందు విఱుపు గలుగును.

ఉ. ఆసు - అస్ప (ఆశ్వశ్వ) చిత్రా - అవః (చిత్రవ.)

17. సమాసములో హల్సంధి తఱచుగాఁ గలుగును. ఉ - దుష్కృత (దుష్కృత) దుజుక్త (దురుక్త)

18. సంస్కృతమందువలె నీభాషలో సమాసమందుండెడు పదములకుఁ బరస్పరసంబంధము స్పష్టముగా నుండదు. సమాసములో మొదటిశబ్దమునకు విభక్తి లోపింపక ప్రథమైకవచనరూపముతో నుండును.

ఉ. హజారాగోనా (సహస్రఘోషః) (వెయ్యిచెవులు గలవాఁడు) ఇచట హజారా శబ్దము ప్రథమైకవచనము. దీనికి విభక్తి లోపింపలేదు.

19. సమాసవిభాగము.

1 ద్వంద్వసమాసము 2 తత్పురుష 3 బహువ్రీహి. 4 కర్మధారయము 5 ప్రాదిసమాసము నని యీభాషలో సమాసము లయిదువిధములు. సంస్కృతములో ద్వంద్వసమాసాంతమందు ద్వివచన ముండును. ఉ. రామలక్ష్మణౌ, ఈభాషలో నట్లు కాదు. సమాసములో నున్నప్రతిశబ్దము ద్వివచనములో నుండును. ఉ. పసుబ్య, వీరేబ్య (పశుభ్యాం వీరాభ్యాం) అపా ఉర్వోరా (Water of trees)ఫాయూదోవ్రస్తా (the keeper and judge.)

20. తత్పురుష.

ఇది సంస్కృతతుల్యమే. ఉ. మిత్రోద్రుజ్ (మిత్రద్రుహ్.) ద్వితీయా తత్పురుష - అహురదాతా (తృతీయ - తత్పురుష) దామిదాతా (చతుర్థీతత్పురుష) అజోబుజె (పంచమి తత్పురుష) విస్పతి (షష్ఠీతత్పురుష.) జమరేగూజ్ (సప్తమీతత్పురుష.)

21. కర్మధారయము.

ఇది విశేషణవిశేష్యములతోఁ గూడియుండును. ఉ. విస్పచామ్ర (all brilliant) అర్హ్నుక్త (right spoken) ఉష్ట్రదేను (she camel)

22. బహువ్రీహి. దరేజోబాజు (దీర్ఘబాహుః)

23. ద్విగుసమాసము. నవక్షపర (nine nights.) త్రిపాద (త్రిపాద)

24. ప్రాదిసమాసము. పైత్యాపమ్ (against the current.)

25. సంధి - ఈభాషలోఁ బదసంధి వాక్యసంధి యని సంధి రెండువిధ ములు.

1. పదసంధి - ప్రేష్యేతి, ఉపేత.

2. సమాసములయందుఁ దప్ప అవెస్థలో సాధారణముగా వాక్యగత పదములకు సంధి యుండదు. ఉ. నీ అమమ్. ఐపి ఇమమ్.

8. వేదభాషాలక్షణము.

వేదసంస్కృతమందుఁగూడఁ బ్రాచీనభాష యనియు నవీనభాష యని యు రెండుతరగతులు గలవు. వేదసంహితలలో నుండుమంత్రభాగము ప్రాచీన మయినది. ఈసంహితలలో ఋగ్వేదసంహిత ముఖ్యతమము ప్రాచీనతమము. వేదభాషాప్రాచీనత యిందులోఁ గానఁగును. గద్యరూపముగా నున్న బ్రాహ్మ ణముల భాష నవీనమయినది. వానిభాషాస్వభావమును బట్టి విమర్శింపఁగా వానిలో మిక్కిలి ప్రాచీనము లనిన్యవహరింపఁబడుచున్నవి కూడ నవీనములగు కొన్నిసంహితాభాగములకంటె వెనుక వ్రాయఁబడినవి గా నూహింపఁబడినవి. ఆబ్రాహ్మణములలోని సంస్కృతభాష యించుమించుగాఁ గావ్యనాటకాదుల యం దుండు లౌకికభాషతో సమానముగా నుండును. అయినను వానిలో లౌకికసంస్కృతమందు వాడుకచేయఁబడని లేట్ప్రయోగములు (Vedic Subjunctive) అశ్నవన్ కథైన్యన్ మొదలగు తుమున్నంతరూపములు, మఱికొన్ని ఛాందసప్రయోగములు కానవచ్చుచున్నవి. అయినను మంత్రభాగముకంటె నీబ్రాహ్మణములు కొంతమట్టుకు సులభముగా నర్థ మగును. ఈబ్రాహ్మణముల కనుబంధరూపము లయియున్న ఆరణ్యకములభాష ఉపనిషత్తులభాష లౌకిక సంస్కృతముతో నభిన్న మయిన షడ్దర్శనీసూత్రముల భాషగా మాఱినది.

ఋగ్వేదభాష యితరవేదసంహితల భాషకంటె మిక్కిలి ప్రాచీన మయి నది. వ్యాఖ్యానము లేకుండిన నెట్టివారికి నర్థము కాదు. ఋగ్వేదసంహిత లోని మంత్రములే కొంత మార్పు నొంది యితరవేదసంహితలలోఁ బఠింపఁ బడుచున్నవి.

ఋ. వే. 1-11-5. త్వం బలస్య గోమతోపావర ద్రివోబలమ్.

తై. సం. 2-1-5-1. ఇంద్రోబలస్య బిల మపౌర్ణోత్.

ఋ. వే. 1-52-4 ఆ. యం. పృణంతి తివిసద్మ బర్హిషః సముద్రం నసు భ్వః స్వా అభిష్టయః.

తై. సం. 4-6-2-6 సముద్రాయ వయునాయ సింధూనాం పతయే నమః.

ఋ. వే. 1-110-7. ఆభరతం శిక్షతం వజ్రబాహూ అస్మాన్ ఇంద్రాగ్నీ అవతంశచీభిః। ఇమేనుతే రశ్మయ స్సూర్యస్య యేభి స్సపిత్వం పితరో న ఆసన్.

తై. బ్రా. 2-1-2-7. అగ్నిం వా వాదిత్య స్సాయం ప్రవిశతి తస్మా దగ్ని ర్దూరా న్నక్తం దదృశే.

కావున నిట్టిప్రాచీనతను మగుఋగ్వేదభాష కిచటఁ గొంత లక్షణము చెప్పుట యావశ్యకము.

1. వేదభాషకు వర్ణము లేఁబదిరెండు వానిలో నచ్చులు పదుమూఁడు. హల్లులు ముప్పదితొమ్మిది.

అచ్చులు:—అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఎ, ఐ, ఓ, ఔ.

హల్లులు:—1. క ఖ గ ఘ ఙ (కంఠ్యములు)

2. చ ఛ జ ఝ ఞ (తాలవ్యములు)

3. ట ఠ డ ఢ ణ (మూర్ధన్యములు)

4. త థ ద ధ న (దంత్యములు)

5. ప ఫ బ భ మ (ఓష్ఠ్యములు)

6. య ర ల వ (అంతస్థలు)

7. శ ష స హ (ఊష్మములు)

2. రెం డచ్చులమధ్యను డకారముగా మాత్రను ళకార మొకటి, ఢకారముగామాఱుళకారము మఱియొకటి. రెం డక్షరము లీభాషలో నధికముగా నున్నవి. ఉ. ళ-ఈళే-ఈడే; ళ్హా-మీాళ్హుషే-మీాఢుషే.

అనుస్వారము, విసర్జనీయము, జిహ్వామూలీయము, ఉపధ్మానీయము, దీని లోఁగూడ నున్నవి.

3. ఈభాషలోని కొన్నిహ్రస్వాచ్చులు, దీర్ఘాచ్చులు, ఘోషవదను నాసికములు (voiced nasals) ఆంగ్లేయభాషలో Z (జడ్) తోసమానమయిన స్వరము గలవర్ణములు లోపించినవానికి బదులుగా మఱికొన్ని వాడుకచేయఁ బడుచున్నవి. ఈమార్పులు అవెస్థాభాషకుఁ గూడ సమానమే. ఈ Z అక్షరము లోపించిన జాడ తెలియకుండ రెండుధాతువులలో లోపించినది.

1. ఆసఉపవేశనే (అదాది) ఆధ్వమ్. లోణ్మధ్యమపురుషబహువచనము)

2. శాస్ (అదాది) శాధి. (లోణ్మధ్యమపురుషైకవచనము)

3. ఏధి (అసభువి-అదాది) లోణ్మధ్యమపురుషైకవచనము.

ఈ z కు అకారము ముం దున్నపుడు అజ్ (az)అని యుండును. ఈ అజ్ కు ఆదేశముగా వచ్చిన ఏకారముచే దీనిలోపము తెలియఁజేయఁబడు చున్నది. ఇచట "అజ్ధి" యను దానికి "ఏధి" అను రూపము వచ్చినది అస్తే జుహోత్యాది ధాతు వగు "దాదానే" యనుధాతువునకు లోణ్మధ్యమ పురుషైకవచనమందు "దజ్ధి" యని యగుటకు బదులుగా "దేహి" యను రూప మయినది.

4. ఒకపదములో నొకవర్ణము వరుసగా రెండుమార్లు వచ్చినయెడల వానిలో నొకవర్ణము తఱచుగా లోపించును.

ఉ. తువీరవవాన్ = తువీరవ; మధు ధుఘు = మధూఘు.

శీర్ష-శక్తి = శీర్ష క్తి (Head-ache) దీని కాంగ్లేయశాబ్దికులు "Haplology" అని పే రిడిరి.

5. ఒకహల్వర్ణము రేఫతోఁ గాని యనునాసికవర్ణముతోఁ గాని కలిసి యున్నపుడు ఛందస్సు (Metre) సరిగా నడచుట కారెండక్షులములమధ్య నొక హ్రస్వా చ్చుచ్చరింపఁబడును. ఉ-ఇంద్ర = ఇందర, యజ్ఞ = యజన, గ్నా = గనా (స్త్రీ) దీనికి ప్రాతిశాఖ్యలో "స్వరభక్తి" యని పేరు.

6. అరుదుగా నొకటిరెండుచోట్లఁ బదాదియందున్న (initial) అకారము లోపించును. ఇట్టి యకారలోపము చరిత్రకాలమునకు ముందటిది యని (Pre-historical) పాశ్చాత్యపండితులయభిప్రాయము.

ఉ. విః (పక్షి) Latin భాషలో (a-vis) సన్తి = అ - సన్తి - ఇట్టివర్ణ నాశము లౌకికసంస్కృతములోఁ గూడఁ గొన్నిచోట్లఁ గానవచ్చుచున్నది.

ఉ. అ - వతంస - వతంస, అ - పిధాన - పిధాన -

7. సంహితలోఁ దఱచుగాఁ బదమధ్యమందు విఱుపు (Hiatus) వచ్చును

ఉ. పాన్తి = పా + అన్తి, జ్యేష్ఠ = జ్యాఇష్ఠ ఐచ్ఛన్ = అఇచ్ఛన్.

8. కొన్నిస్థలములయందు సమాసమందున్న ప్రథమపదముయొక్క యం త్యాచ్చు లోపించును. ఉ. అను + వర్తిష్యే = అన్వర్తిష్యే, చారు + వదన = చార్వదన. తిల + పింజ = తిల్పింజ.

## సంధి (Euphonic combination)

9. బాహ్యసంధి యనియు నాభ్యంతరసంధి యనియు నీవేదభాషలో సంధి రెండువిధములు. ఈరెండుసంధులు స్వరనియమము మూలముగాఁ జేసి

కొని పుట్టినను నీరెండింటికిఁ గొంచెము భేదము కలదు. దీనిలో మొదటిది (బాహ్యసంధి) పదముల కాద్యంతములయం దుండు నక్షరములకు మార్పులను గలుగఁజేయును.

ఉ. త్వా + అగ్నే = త్వాగ్నే, వి + ఇదమ్ = వీదమ్, సు + ఉక్తమ్ = సూక్తః

10. రెండవది (అభ్యంతరసంధి ధాతువులకు నామవాచకములకుఁ బ్రత్యయములు చేర్చునపు డక్షరములకుఁ గలుగుమార్పులను జెప్పును. ఉ లభ్ + స్య + తే = లప్స్యతే. అ + దోహ్ + త్ = అధోక్ - రభ్ + త = రబ్ధ బుణధ్ + తి = బుణద్ధి.

లౌకికభాషలోవలె నిందులోఁగూడ సవర్ణసంధి, యణాదేశసంధి,, గుణసంధి, విసర్గసంధి. ప్రగృహ్యసంధి మొదలగునవి కలవు.

విభక్తిప్రత్యయములు.

| | ఏకవచనము. | | | ద్వివచనము. | | | బహువచనము. | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | స్త్రీ. | పుం. | నపుం | స్త్రీ. | పుం. | నపుం. | స్త్రీ. | పుం. | నపుం. |
| ప్ర. | స్ | స్ | ,, | ఔ | ఔ | ఈ | అస్ | అస్ | ఇ |
| ద్వి. | అమ్ | అమ్ | ,, | ఔ | ఔ | ఈ | అస్ | అస్ | ఇ |
| తృ. | ఆ | ఆ | ,, | భ్యాం | భ్యాం | | భిస్ | భిస్ | ,, |
| చ. | ఏ | ఏ | ,, | భ్యాం | భ్యాం | | భ్యస్ | భ్యస్ | ,, |
| పం. | అస్ | అస్ | ,, | భ్యాం | భ్యాం | | భ్యస్ | భ్యస్ | ,, |
| ష. | అస్ | అస్ | ,, | ఓస్ | ఓస్ | | ఆమ్ | ఆమ్ | ,, |
| స. | ఇ | ఇ | ,, | ఓస్ | ఓస్ | | సు | సు | ,, |

11. అకారాంతపుంలింగశబ్దములకు ఆకారాంతస్త్రీలింగశబ్దములకుఁ దృతీయైకవచనములో నాకారము వచ్చును. ఉ. యజ్ఞేన - యజ్ఞా. మనీషయా - మనీషా.

12. వన యనుప్రత్యయములో నున్ననకారమునకుఁ దఱచుగా దీర్ఘము వచ్చును.

ఉ. బ్రహ్మాకృతా మారుతేనా గుణేన (111-32-2)
దశరాత్రీ రశివేనానవద్యానబనద్ధం (1-116-24)

13. మన్ ప్రత్యయాంతము లగుశబ్దములలో మన్ప్రత్యయమందలి యచ్చొకప్పుడు లోపింపదు. లోపించినపుడు మకారముగాని నకారముగాని లోపించును. ఉ. భూమనా - భూనా, ద్రాఘ్మనా - ద్రాఘ్నా - మహిమ్నా - మహినా - లౌకికసంస్కృతములో నీశబ్దమునకు భూమ్నా - ద్రాఘిమ్నా - మహిమ్నా యనిరూపములు.

14. ఇకారాంతశబ్దములకు సప్తమ్యేకవచనమందు ఔ, గాక యరుదుగా ఆ కూడ వచ్చును. ఉ. అగ్నా-అగ్నౌ.

15. మత్, వత్, వన్, యస్, అనునవి యంతమందుఁ గలశబ్దములకు సంబోధనలో అస్ వచ్చుచు. ఉ. భానుమాన్ - భానుమన్, హరివాన్ - హరివన్, చక్రవాన్ - చక్రవన్, కనీయాన్ - కనీయన్ - లౌకికభాషలో "భానుమన్" అగును.

16. సంబోధనప్రథమ, ప్రథమ, ద్వితీయ, యీవిభక్తులయందు ద్వివచనమునకు ఔకంటె నెక్కువగా ఆకారము వచ్చును. ఉ. అశ్వినా (అశ్వినౌ) ద్వారా (ద్వారౌ) నదియా (నద్యౌ)

17. యుష్మచ్ఛబ్దమున కీభాషలోఁ గొన్నివిశేషరూపము లున్నవి.

ప్ర. యువమ్
ద్వి. యువామ్
తృ. యువభ్యాం    ద్వివచనమందు.
పం. యువత్
స. యువోస్

తృతీయైకవచనము - త్వా
చతుర్థ్యేకవచనము - తుభ్య
సప్తమ్యేకవచనము - త్వే
యుష్మచ్ఛబ్దమునకు స్త్రీలింగమందు
ప్రథమాబహువచనము - యుష్మాన్
షష్ఠీబహువచనము - యుష్మాక
సప్తమీబహువచనము - యుష్మే

బహువచనములు.

వాన్ - ప్రథమాద్వివచనము.
ఆవద్ - పంచమీద్వివచనము.
అస్మే - చతుర్థీబహువచనము.
అస్మాక - షష్ఠీబహువచనము.

1-173-10 విష్పర్ధసోనరాం నశంసైరస్మాకాస దింద్రో వజ్రహస్తః

అస్మే - సప్తమీబహువచనము.

సస్మిన్ - తచ్ఛబ్దమునకు "తస్మిన్" వంటి మఱియొకరూపము.

త్య = త + య - దీనికి ఋగ్వేదమందు బహుళముగాఁ బ్రయోగములు గానవచ్చుచున్నవి. తరువాత సంహితలలో నీరూపము కానరాదు.

అయా - అనయా యొక్క రూపాంతరము.

ఏన - అది - వాఁడు - ఆమె అని యర్థమిచ్చు నొకసర్వనామము. ఏక, ఏవ, దీనితో సంబంధించిన పదములు. ఈశబ్ద మవెస్థలోఁ గానవచ్చుచున్నది. "అవ్యోః" అనునది దీనిషష్ఠీద్వివచనము.

అమ - దీనినుండి అమా - అమాత్ (near), అనుక్రియావిశేషణములు పుట్టినవి. ఇది అవెస్థలో నున్నది.

"అమోహా మస్మి"

తతి - తచ్ఛబ్దమునుండియు, యతి - యచ్ఛబ్దమునుండియు, చతుర్వయ - చతుశ్శబ్దమునుండియుఁ బుట్టినవి.

సమాసము.

14. వ్యస్తపదములను గలిసి యొకసమాసముగా నేర్పడుశక్తి వేదభాషకు ఇండూయూరపియన్భాషలవలనఁ గలిగినది. ఇట్లు రెండుమూఁడుపదములు కలిసి యొకపదముగా నేర్పడినదానికే స్వరము, విభక్తిప్రత్యయములు వచ్చును. తఱచుగా సమాసములను వాడుకచేయుటలో వేదభాష, హోమర్ కవీశ్వరుని గ్రీకుభాషను బోలియున్నది. ఋగ్వేదమందు, అవెస్థయందు మూఁడింటికంటె హెచ్చుపదములు గలసమాసములు లేవు. అవియు నరుదుగా నుండును.

ఉ॥ అదబ్ధవ్రతప్రమతి (superior-minded owing to unbroken observances) పూర్వకామకృత్వన్ (fulfilling former desires) మిథోవద్యప (mutually warding off want.)

15. తెలుచుగా వేదభాషాసమాసములలోఁ బదములసంధి క్వగతపద సంధికంటె విలక్షణముగా నుండును. రెండుపదములకు మధ్య నొకపదము వచ్చును. ఉ॥ నరావాశంసం (నరాశంసమ్) ద్యావాహక్షమా (ద్యావాక్షమా) శునశ్చిత్ శేఫం (శునశ్శేఫం)

16. ఒకప్పుడు సమాసఘటిత మగుశబ్దమునకు విభక్తి లోపింపదు. ఉ. రాయస్పోషమ్ - విష్ణోఃక్రమః

17. తెలుచుగా రెండుసమాసములకుఁ గొనపద మొక్కటియై యున్నపుడీకొన నున్నపద మొక్కమాత్రే పలుకఁబడును.

ఉ॥ మిత్రోతమేధ్యతిథిమ్: (మిత్రతిథింఉతమేధ్యతిథిమ్) 1-36-7 పత యన్మందయత్సఖమ్. (పతయత్సఖం, మందయత్సఖమ్.)

18. కొన్నిచోట్ల సమాసములో నున్నపదములోఁ బైపద మన్వయించును.

ఉ॥ అర్వతో మాంసభిక్షాః 1-162-12.

19. ద్వంద్వసమాసమం దున్న రెండుశబ్దములు ద్వివచనాంతము లయి యుండును.

ఉ॥ ప్ర - మిత్రయో ర్వరుణయో స్తోమోన ఏతు శూష్యః॥ 7-66-1 ద్యావాచి దస్మై పృథివీ నమేతే 2-12-13.

20. హేమన్తశిశిరా, అహోరాత్రే. యీరెండు ద్వంద్వసమాసముల యందుఁ బూర్వపదలింగమే సమాసమునకంతకు వచ్చును. ఇది “పరవల్లింగం ద్వంద్వతత్పురుషయోః” అనుసూత్రమునకు విరుద్ధము.

21. పతి, పుత్ర, పృష్ఠ, పార, పద, పయః, పోష - యీశబ్దములు షష్ఠీ విభక్తికంటెఁ బరమయి యుండఁగా విసర్గకు సకారము వచ్చును.

ఉ॥ పతి - వాచస్పతిం విశ్వకర్మాణమ్.
పుత్ర - దివస్పుత్రాయ సూర్యాయ.
పృష్ఠ - దివస్పృష్ఠం ఛందమానః.
పార - తమసస్పార మస్య.
పద - పరివీత ఇళస్పదే.
పయః - దివస్పయోధి ధిషాణాః.
పోష - రాయస్పోషం యజమానేషు.

22. బహువ్రీహిసమాసమం దంత్యపదమున కాకారము వచ్చును. ఉ- సహస్రాక్షా - వార్ధీ - ణసా (Rhinoceros.)

23. వేదభాషలో ప్ర, సమ్, ఉప, ఉత్ ఇవి ద్విరుక్తములయి పాద పూరణమందు వాడుకచేయఁబడును.

ఉ. ప్ర - ప్రప్రాయ మగ్నిః.
సమ్ - సంసమిద్యువసే.
ఉప - ఉపోపమే పరామృశ.
ఉత్ - కింనోన్న దుదుహర్షసే.

24. మంత్రమం దున్న తు, ను, ఘు, మక్షు, కు, త్ర, ఉరుష్య. యీశబ్ద ములయంత్యాచ్చునకు దీర్ఘము వచ్చును.

25. ఛందస్సులో "మాతరాపితరా" అనియు, పితరామాతరా" అని యు నిపతింపఁబడిన యొకరీతి ద్వంద్వసమాసము కలదు. ఉ - ఆమాగన్తాం పితరా మాతరాచ" నమాతరాపితరా నూచిదిః

26. సాదృశ్యార్థమందు యుష్మదస్మచ్ఛబ్దములకు "వతుప్" ప్రత్యయము వచ్చును - ఉ. త్వావతః పురూరవసో నత్వావాం అన్యః - యజ్ఞం విప్రస్య మావతః.

27. సుప్తి ఙుపగ్రహ లింగనరాణాం కాలహలచ్ స్వరకర్తృయఙాంచ వ్యత్యయ మిచ్ఛతి శాస్త్రకృ దేషాం సోపిచ సిద్ధ్యతి బాహుళకేన.

సుబంతము, తిఙన్తము, పరస్మైపద, ఆత్మనేపద ప్రత్యయములు, లింగము, పురుష, కాలము, హల్లులు, అచ్చులు, స్వరము, కృత్తద్ధితప్రత్యయములు, యఙ్ ప్రత్యాహారఘటితప్రత్యయములు మొదలగువానియం దీవేదభాషలో వ్యత్యయములు కలుగును.

1. సుబంతము - ఉ. యుక్తామాతాసీ ద్ధురిదక్షిణాయా అతిష్ఠద్గర్భో వృజనీష్వంతః (1 - 164 - 9) ఇచట "దక్షిణస్యామ్" అనుటకు దక్షిణాయాః అని యున్నది.

2. తిఙన్తము - యూపవ్రస్కా ఉతయేయూపవాహాశ్చ షాలం యే అశ్వ యూపాయ తక్షతి (1 - 162 - 6) ఇచట తక్షతి యనుచోట తక్షంతి అని యుండవలెను.

3. పదవ్యత్యయము. బ్రహ్మచారిణమిచ్ఛతే - ఇచట ఇచ్ఛతి అనుపరస్మై పదమునకు ఆత్మనేపదము ప్రయోగింపఁబడినది.

4. లింగవ్యత్యయము - మధోస్తృప్తా ఇవాసతే - ఇచట మధునః అని యుండవలెను.

5. పురుషవ్యత్యయము - అధాసవీరైర్దశభి ర్వియూయాః - ఇచట వియూయాత్ అని యుండవలెను.

6. కాలవ్యత్యయము. (Irregular use of Tense) శ్వోగ్నీన్ ఆధాస్యమానినః - ఇచట లుట్టునకు (Periphrastic Future) బదులుగా ల్ృట్ (Second Future) వాడుక చేయఁబడినది.

7. హల్వ్యత్యయము - తమసోవా అదుక్షత్ - ఇచట దకారమునకు బదులుగా ధకార ముండవలెను.

8. అచ్చులవ్యత్యయము - మిత్రం వయంచ సూరయః - ఇచట మిత్రా అని యుండవలెను.

9. కారకవ్యత్యయము - ఇందులో కృత్తద్ధితప్రత్యయవ్యత్యయ మంతర్భూతమై యున్నది. ఉ॥ అన్నశబ్ద ముపపదముగాఁ గల అద్ ధాతువునకు లౌకికసంస్కృతములో అణ్ ప్రత్యయము వచ్చును, అన్న + అద్ + అణ్ = అన్నాదః; వేదభాషలో అచ్ ప్రత్యయము చేర్పఁబడును. అన్న + అద్ + అచ్ = అన్నాదః, ఏప్రత్యయము చేర్చినను శబ్దరూప మొక్కటియే గాని అణ్ ప్రత్యయము చేర్చినపుడు అన్న + ఆదః; అగును. అచ్ చేర్చినపుడు అన్న + అదః అగును.

10. యఙ్ - ఈయఙ్-అష్టాధ్యాయి మూఁడవ యధ్యాయము-ప్రథమ పాదములో 22 సూత్రము "ధాతోరేకాచో హలాదేః క్రియాసమభిహారే యఙ్" అనుసూత్రములో నున్న యఙ్లో యకారమునకు 111 - 1 - 86 లిఙ్యాశిష్యఙ్" అనుసూత్రములో నున్న ఙకారమునకు ప్రత్యాహారము చేయఁగా "యఙ్" అయినది. దీనిచే నీరెండుసూత్రములకు మధ్య నున్నసూత్రగణముచే విధింపఁబడిన ప్రత్యయముల నన్నింటిని గ్రహింపవలెను. అవి యెవ్వి యనఁగా 1 యఙ్ 2 ణిచ్ (చురాదిప్రత్యయము) 3 యక్ (కండ్వాది ప్రత్యయము) 4 ఆయ - 5 ఇయఙ్ 6 ణిఙ్ 7 స్య, తాసి, ల్ృఙ్, ల్ృట్ ప్రత్యయములు 8 సిప్ - లేట్ప్రత్యయము 9 ఆమ్ - లిట్ప్రత్యయము - 10 చ్లి - సిచ్, క్స, చఙ్, అఙ్, చిణ్ - లుఙ్ప్రత్యయములు. 11 యక్ - కర్మణిప్రత్యయము 12 శప్,

శ్ను, శ, శ్న, మ్, ఉ, శ్నా మొదలగు వికరణప్రత్యయములు, 13 అక్ - ఆశీర్లిఙ్ప్రత్యయము. ఈ ప్రత్యయము లన్నియు వేదభాషలో వ్యత్యయముగాఁ బ్రయోగింపఁబడును. గ్రంథవిస్తరభీతిచే నుదాహరణములు వ్రాయలేదు. లౌకికసంస్కృతమందువలెఁ దఱచుగా వేదభాషలో సార్వధాతుకార్ధధాతుక భేదము గ్రహింపఁబడదు. ఉ॥ పితరంచ దృశేయం మాతరంచ (1 - 24 - 1) ఇచట "పశ్యేయమ్" అని యుండవలెను.

## 23. వైదికతుమున్నంతములు.
## (Vedic Infinitive.)

ఈతుమున్నంతరూపములు ప్రాచీనవిభక్తిరూపము లని పాశ్చాత్యపండితు లభిప్రాయపడుచున్నారు. వేదభాషలో నిట్టిరూపములే వాడుకచేయఁబడినవి గాని లౌకికసంస్కృతమందువలె "గంతుమ్" "భోక్తుమ్" వంటిరూపము లెచ్చటను గానరావు.

1 సే 2 సేన్ 3 అసే 4 అసేన్ 5 క్సే 6 కసేన్ 7 అధ్యై 8 అధ్యైన్ 9 కధ్యై 10 కధ్యైన్ 11 శధ్యై 12 శధ్యైన్ 13 తవై 14 తవేఙ్ 15 తవేన్. ఇందు కుదాహరణములు.

1. సే - వక్షేరాయః.

2. సేన్ - తావామేషేరథానామ్.

3 - 4 - అసే - అసేన్ - అస్మైశతం శరదోజీవసేథా అస్మేవీరాన్ శశ్వత ఇంద్రశిప్రిన్ - (III - 36 - 10.)

5. క్సే - ప్రేషేభగాయ. (ప్ర + ఇషే = ప్రేషే.)

6. కసేన్ - గవామివ శ్రియసే.

7 - 8 అధ్యై - అధ్యైన్ - జఠరంపృణధ్యై.

9. కధ్యై - ఉభావా మింద్రాగ్నీ ఆహువధ్యా ఉభారాధసః సహమాదయధ్యై.

10. కధ్యై - శ్రియధ్యై.

11 - 12 - శధ్యై - పిబ.

13. తవై - సోమమింద్రాయపాతవై.

14. తవేఙ్ - (X - 184 - 3) హిరణ్యయీ అరణీయం నిర్మన్థతో అశ్వినా తం తేగర్భం హవామహే దశమే మాసి సూతవే.

15. తవేన్ - (I - 46 - 7) అనోనావా మతీనాం యాతం పారాయ గంతవే.

29. వేదభాషలో ప్ర, రోహిష్యై, అవ్యథిష్యై, దృశే, విఖ్యై - మొదలగునవి కూడఁ దుమున్నంతధాతురూపములు.

1. ప్రయై - ప్రయై దేవేభ్యో మహిః (I - 142 - 6)

2. రోహిష్యై - అపామోషధీనాం రోహిష్యై - (రోహణాయ)

3. అవ్యథయిష్యై-అవ్యథనాయ.

4. దృశే - దృశే విశ్వాయ సూర్యమ్. (I - 50 - 1)

5. విఖ్యై - విఖ్యైత్వయా హరామి.

29. వేదభాషలో భావకర్త్రార్థములయందు, కృత్యప్రత్యయములకు బదులుగా తవై, కేన్, కేన్య, త్వన్, అనుప్రత్యయములు ధాతువులకుఁ జేర్పఁబడును. ఉ.

1. అన్వేతవై = అన్వేతవ్యమ్

2. పరిధాతవే = పరిధాతవ్యమ్

3. నావగాహే = నావగాహితవ్యమ్

4. శుశ్రూషేణ్యః = శుశ్రూషితవ్యః

5. కర్త్వమ్ - (1 - 10 - 2.) యత్సానోస్సాను మారుహ ద్భూర్యస్పష్ట కర్త్వం (కర్త.)

30. క్త్వాప్రత్యయమునకు "ఈనమ్" అనునది యంతాదేశముగా వచ్చును.

ఉ. ఇష్ట్వీనం, దేవాన్ (ఇష్ట్వా)

31. కొన్నిచోట్ల క్త్వాప్రత్యయసంబంధ మగు ఆకారమునను ఈకారము వచ్చును. ఉ - స్నాత్వీ - స్వేన్నస్నాత్వీమలాదివ - పీత్వీసోమస్యవా వృధే స్నాత్వా - పీత్వా అనువాని కీరూపములు.

ఇట్టి ప్రాచీనభాషలో ఋగ్వేదము వ్రాయఁబడినది. ఇది యంతేయుఁ బదిమండలములుగాను, ఎనుబదియయి దనువాకములుగాను, 1017 సూక్తములుగాను, 10580 ఋక్కులుగాను విభజింపఁబడినది. ప్రథమదశమమండలములలోని మంత్రములు వేఱు వేఱు కుటుంబములలోఁ బుట్టినఋషులచే రచింపఁబడినవి,

ద్వితీయమండలమునకు గృత్సమదుఁడు, తృతీయమండలమునకు విశ్వామిత్త్రుఁడు, చతుర్థమండలమునకు వామదేవుఁడు, పంచమమండలమునకు అత్త్రి, షష్ఠ మండలమునకు భరద్వాజుఁడు, సప్తమమండలమునకు వసిష్ఠుఁడు, అష్టమమండల మునకు కణ్వఋషి - నవమమండలమునకు అంగీరసుఁడు ప్రణేతలు.

గీ. భాషపుట్టినవిధ మార్యభాషలకును, గలపరస్పరసంబంధగరిమ ప్రాచ్య
సంస్కృతంబున కిప్పటిసంస్కృతమున, కున్నభేద మవస్థతో నున్నపొత్తు
మొదలుగాఁగల విషయము ల్కాలమరసి, తేటమాటల వివరించె దీనియందు
నఖిలబుధసేవి మేడెపల్ల్యన్వవాయ, వేంకటార్యుఁడు శాస్త్రానువిద్ధసరణి.

సంపూర్ణము.

యేతటిఁ జూచినా వాతంధయాధీశపత్త్రరత్నావళీదర్శనంబు
లేసమయము చూచినా సదాశివమిత్రగోచరగ్రంథార్థసూచనంబు
గాఁగ రాజ్యంబుఁ బ్రోచె సాగరముఁ జేరు, నేఱులునుబోలె లోకసమిద్ధలక్ష్మ
లాత్మభవనాంతరంబున నతిశయింపఁ, బ్రోదిఁ బ్రహ్లాదుఁ డాశ్రితాహ్లాదకరుఁడు.

సీ. ధర్మప్రజాప్తికై ధరణీతలేశ్వరార్పితకన్యకాశ్రేణిఁ బెండ్లియాడి
యవనీసురప్రీతికై న్యాయమార్గంబు జరపుచు విత్తంబు సంగ్రహించి
యధికకీర్తిప్రాప్తికై యెదిర్చిన వైరిమండలాధీశులమద మణంచి
దివిజపంక్తితృప్తికై ధృతితోడ నశ్వమేధాధ్వరాదిక్రియ లాచరించి
యఖిలవిద్యావిశేషంబు లభ్యసించి, డెంద మంతయు హరిభక్తియంద నిలిపి
గంధవద్వైరివంశనిర్గంధనముగ, ధాత్రిఁ బాలించె బలశత్రుశత్రుసూతి. ౧౫

సీ. హృదయంబు లక్ష్మీశపదపద్మములయంద వీనులు హరికథల్ వినుటయంద
నయనంబు లిందిరాప్రియదర్శనమునంద శిరము కేశవనమస్కృతులయంద
పదము లంబుజనాభభవనయాత్రలయంద కరములు విష్ణుపూజనమునంద
ఘ్రాణంబు శార్ఙ్గినిర్మాల్యగంధమునంద రసన కైటభరిపుప్రణుతియంద
పాదుకొనఁ గామినీపుత్త్రబాంధవాది, కలితసుఖములు మిథ్యగాఁ దలఁచికొనుచు
వసుమతీచక్ర మేకోష్ణవారణముగ, లీలఁ బాలించె దైతేయపాలసుతుఁడు.

చ. హరిహయువిందు పావకున కద్దిలి భానుజు మేనినీడ ని
ర్జరరిపుమంత్రి యబ్ధిపతిప్రాణము వాయువుకాయ మాధనే
శ్వరుపరమాప్తుఁ డీశ్వరు వశంబుగఁ జేయు కుశాగ్రబుద్ధి యీ
సురరిపుసూనుఁ డంచుఁ దలఁచుర్ భువనత్రయ మమ్మహామహుర్. ౧౭

క. చీఁకటియుఁ జంద్రికారస, మేకస్థానంబునంద యిరవొందుగతి
న్నాకౌకోరిపుకులము, న్నాకాలయకులము నొక్కచటున మెలఁగుర్. ౧౮

వ. అట్లు సాదరగుణమేదురుండై ప్రహ్లాదుండు గురువులకుం బరిచర్యయు సుమన
స్కులకు మనస్తర్పణంబును గులంబునకు బలంబును సిరులకుం బరిపుష్టియు
వసుమతికిం బసిమియుఁ బాతాళంబునకుఁ బ్రీతియుఁ ద్రిదివంబునకు ముదం
బును దిక్పతులకు మక్కువయును నగ్నులకు హర్షనిమగ్నత్వంబును వైదాంతి
కులకుఁ బ్రమోదంబును దార్కికులకుఁ దర్కంబును బరమవైష్ణవులకు నిరుప
మానందనిష్ణాతుఁడగుటయు శ్రుతులకు నభిరతియుఁ బురాణంబులకు నపరి
క్షీణభావంబును శాస్త్రంబులకుఁ బ్రశస్తియుఁ గావించుచు భూవలయపాలన
ఖేలనలంపటుం డై సొంపుమీఱి నిజకీర్తిగంగాతరంగధారాప్రవాహంబున

రజనీచరచరిత్రదుర్దమకర్దమసంక్షాళనం బాచరించుచు సింధుదేశవిధంబున
వివిధమణిప్రభాశుభావహం బై ప్రభావతి యనం బరంగిన విశ్వకర్మనిర్మితం
బగుపురంబు గరంబు తిరం బగునైశ్వర్యంబు తిమ్యాంబున నరయుచు నానందె
నంపలి సౌభాగ్యం బెట్టిదనిన. ౧౯

## పురవర్ణనము.

సీ. వేదండతతు లెల్లఁ బౌదంతికోత్తమములు హరు లెల్ల నుచ్చైశ్శ్రవాన్వయజము
లరదంబు లెల్ల దివ్యవిమాననిభములు భటు లెల్ల సింహాదింభకసమాను
లంగన లెల్లఁ బుష్పాస్త్రశస్త్రంబులు విప్రు లెల్లరు వేదవిత్తనిధులు
క్షత్త్రియు లెల్లరు శరభశౌర్యాఢ్యులు కోమటు లెల్లరుఁ గోటిపతులు
శూద్రు లెల్లరు నిరవధిభద్రవశులు, తోఁట లన్నియు వేలుపుఁదోఁటలట్లు
దీర్ఘికలు దేవతాపురిదీర్ఘికాభి, రాముములు దానవేంద్రుపురంబునందు. ౨౦

గీ. పద్మరాగాశ్మఘటితవరా పఱపునేల,నంటు మెఱసిన ప్రస్లోదునగరు మెఱయు
నీలనిర్మిత మగుచు నుత్తాలగరుడ, వాహనాంకహర్మ్యఁ దగునీలవర్ణుఁ బోలి. ౨౧

గీ. మేటికలువులమీలనోన్మీలనములఁ,బ్రజలులోఁడించ వెలిఁబర్వఁబరఁగుఁబురము
నిదురవోవుట లయమును నిదురలేమి, సృష్టియును గాఁగ విలసిల్లు స్రష్టఁబోలి.

చ. తరళసుధాకరప్రభలు దార్కొనుమాత్రఁ గరంగి చంద్రకాం
తరచితసౌధముల్ గురియు తజ్జలధారలఁ బొంగుచూపు ని
ర్జరనది యప్సరోగణకుచద్వయనిర్దయమర్దనక్రియా
స్ఫురితతరంగభంగదశ వోవఁగఁ బున్నమరేలఁ గ్రాలుచున్. ౨౩

క. పురగోపురవరముకురో, దరమునఁ దమనీడఁ జూచి దైవతముగ్ధో
త్కర మితరకాంత [1]లంచు, న్మురిపెంబున సారెసారె ముచ్చటలాడున్. ౨౪

గీ. గంధబంధురసింధురస్కంధపీఠి, మీఁదఁ దక్కరనిక్షిప్తమేదురోరు
పాంసువలయంబు చెన్నొందుఁ బుష్కరాగ్ర,తలసుఖాసీనమేఘసందర్భమనఁగ.

క. హరులు సువర్ణవకరిములు, పరిపంథిమదాపహములు బహువిధలక్ష్మీ
స్ఫురణాపరిణాహంబులు, పురి తేజులు శార్ఙ్గపాణిఁబోలుం జాలన్. ౨౬

గీ విశ్వకర్మవినిర్మాణవేళఁ గూర్చు, నమరయానంబులకుఁ బడియచ్చు లనఁగఁ
జారుచామీకరాలేపసంప్రదాయ,కవచితము లైనరథములు గలవు పురిని.

క. భటులు రణరంగలీలా, నటు లుద్భటసింహనాదనారదఘోషో
త్కటులు మృగీమదచర్చో, త్కటు లప్పుటభేదనమునఁ దనరుదు రెపుడున్.

గీ. యజ్ఞశత మొనర్చి సవనీసురేంద్రులు, జయశతంబు గలుగు క్షత్త్రియులును
సంధిశతంబు గూర్చి వెరయువైశ్యులు గాని, తక్కువారు లేరు తత్పురమున.

సీ. తమములుఁ దారలుఁ దరుణకూర్మంబులు వరిపోట్లు లరఁటులుఁ గరిశి[రము]లుఁ
బిప్పలదళములు విప్పారుపుష్పచు నాగడపలు గగనాంతరములుఁ
జలిచీమచాలును జక్కవపులుఁగులు ఫణిఫణంబులు బిసపాశములును
దగుపోఁకబోదులు దర్పణంబులుఁ బల్లవములు సంపెగమొగ్గవంగడములు
[1]బేడిసలు సింగిణులు విజృంభించు హిమకరార్ధములు శ్రీలు హరినీలవర్ధనములుఁ
గూర్చి తాఁ జతురాస్యుఁడై కుసుమశరుఁడు, చేసెనో యనఁ బురివధూశ్రేణి మెలఁగు

సీ. హరికౌస్తుభం బైన నంగళ్లఁ గొనవచ్చు ననిన రత్నచయంబు లడుగనేల
లేకి యేనియుఁ బద్మినీకులోద్భవ యన్నఁ బడఁతులగరిమంబుఁ దడవనేల
కడపటి చెఱువైన గగనసింధుసమాన మనినఁ గేలిసరస్సు లరయనేల
కలివెకట్టియ యైన బలభేదితరువన్న నుపవనంబుల పెంపు లొరయనేల
రుగ్ము లేనియుఁ గంధర్వహయము లన్నఁ, బూరుషవిశేషముల సొంపుఁ బొగడనేల
బాహుబలమున దైతేయపాలుఁ డేలు, నిరుపమంబు ప్రభావతీపురమునందు.

సీ. ఆరకూటపిశంగ మగుజటాజూటిపై నెలపువ్వు లేఁత వెన్నెలలు గాయఁ
ధళుకుధళుక్కంచుఁ గలికి నెమ్మొగమున ముచ్చూపు మెఱుఁగులు పిచ్చలింప
దంతపుఁగమ్మల ధావళ్యమంజరి గండదర్పణములఁ గలయఁ బ్రాఁకఁ
బటికియూర్ధ్వ్న హేమఘటయుగ్మమును బోని పాలిండ్ల మణిహారపంక్తులలియఁ
జక్రశూలాంబురుహగదాచాపబాణ, చరఖడ్గము లాత్మహస్తముల మెఱయ
వీఁకఁ దత్పురరక్ష గావించుచుండు, గమలపత్త్రాక్షునాజ్ఞచేఁ గాళరాత్రి.

వ. మఱియు నప్పురంబు కిరీటియుం బోలె సుభద్రాలంకృతబహువిధసౌధం బై మాధవుండునుం బోలె విచిత్రపత్త్రనివహం బై దాశరథిసేనాసముదయంబునుం బోలె నమందమారుతకుమారవిహరణపరిచితం బై సమరయాత్రాసముత్సాహంబునుం బోలె సుద్యోతితోద్యానహృద్యం బై సుకవికవిత్వంబునుం బోలె బహువిధచిత్రవర్ణవర్ణితం బై గోకర్ణపతినివాసంబునుం బోలె ననంతభోగికులభాగధేయం బై వెలయు నందు. 33

## ఋతువర్ణనము.

ఉ. సంతస మొందె నంతట వసంతము పుష్పమరందసింధు వే
శంతము భోగిలోకచయశాంతము సంతతపుష్పమల్లికా

[1] బేడలు.

కాంతము మాన్మథస్ఫురణకాంతము దిక్కటకావగాహను
గ్భ్రాంతము షట్పదస్ఫురదుపాంతము చెన్నగు నున్నతోన్నతిన్. ౩౪

సీ. కోయిల లిగురాకుఁగొనలాని ముసమూని కావించె బహుకుహూకారఘటితిఁ
బుష్పంధయములు సంఫుల్లమల్లీలతాప్రసవగుచ్ఛంబుల భ్రమరివాఱె
రాయంచ చంచద్విరాజితోద్యానమధ్యస్థలి దీర్ఘికఁ దనువు దడిపెఁ
జిలుకలు పండ్లు భుజించె నేఁడాదియు నవసిన కఱవుదైన్యము దొలంగ
మురిసె సహకారమాధవీతరళకుసుమ, పరిమళోదారసౌభాగ్యభాగ్యనిధులు
మలయగిరిజాయమానము ల్మారుతములు, విరహిణీస్మరపావకవీజనములు. ౩౫

క. పొదలెఁ బ్రసూనపరాగము, లుదయార్కసమానరుచుల నుద్యానముల
న్మదనమహారమూర్తితతులం, బొదివిన మన్మథవిభూతిపుంజము వోలెన్. ౩౬

గీ. మానినీమానవిత్తసమాజ మెల్ల, మరుఁడు గిలుబాడి గ్రొచ్చు నిర్భరకఠోర
నఖరరాజియుఁబోలెఁ గానలఁ జెలంగెఁ, గింశుకంబులు విస్ఫురదంశుకములు.

గీ. మారనీరాజనాసంప్రసారచంద్ర, ఖండములు కారులచ్చి యఖండమహిమఁ
బొలువుగావించుపొక్కిళ్లు వెలసె నుల్లసిందుసురపొన్న లుద్యానసీమయందు

గీ. అంత హేమంత మసుదెంచె నమరవైరి, మేను యానతకుచయుగీమేళనమున
సంఘటింపంగఁ జాలిన శైత్యగరిమ, కతన ముల్లోకములును గొంకరలువోవ.

గీ. సకలకుసుమరహితజని యయ్యె హేమంత, వేళ యొప్పె విటుల విటజనంబు
నొక్కమేను గాఁగ నొద్దికసేయుచు, మదనుదోఃప్రతాపమహిమ దనర. ౪౦

క. కుసుమపరాగము దిక్కుల, విసరంబులఁ గలయఁ బర్వె [1] వేధించిహిమో
ల్లసనంబు మొదలు ద్రెంచిన, విసువుచు దేశాంతరంబు వెడలెడుకరణిన్.

గీ. కలయనిండినమంచుమీఁగడలువోయి, వెలసె బ్రహ్మాండభాండంబు చలియచిక్కి
కప్పురము గ్రుమ్మరించినకరవటంబు, పరిమళముమాత్ర చిక్కినపరిధవమున.

ఉ. మోమును మోము మోవియును మోవియుఁ జెక్కును జెక్కు నల్లిబి
ల్లై మర యింతలేని విమలాంగములుం గరపాదమేళన
స్థేమము గల్గి రాగములఁ జేసిన విభ్రమమూర్తులో యనం
గాముకులుం గళావతులు గ్రమ్మి రమింతురు సీతుగందువన్. ౪౩

సీ. యువయుగ్మసంగమవ్యవహారవిఘ్నంబు చండాంశుకరవహ్నిసామిధేని
సర్వసర్వంసహాచక్రసారగ్రాహి దీర్ఘయామస్ఫూర్తి నిర్ఘృణంబు

[1] వేధించుటు మొల్ల.

మల్లికావల్లికామంజరీనిబిడాట్టహాసకారియుఁ బాటలాసఖంబు
ద్రాక్షాగుళుచ్ఛోచ్ఛ్రసుమాక్షికమధువనం బక్షీణఘర్మగర్వాతిశయము
వచ్చెగ్రీష్మంబు మంచులు విచ్చెమధువి, కాస మొక్కింత మునిఁగెఁ గైలాసశిఖరి
విడిచిహిమగిరికై యేగెవిషమబాణ, సంహారుఁడుగ్రీష్మమత్యుగ్రరంహమగుడు

ఉ. వర్తితతాళవృంతపవనంబులఁ గొంత వధూకుచాంతర
స్ఫూర్తిమదిందుసమ్మిళితశోభనచందనచర్చఁ గొంత గా
ఢార్తిహరంబులైనశిశిరానిలపోతవిభూతిఁ గొంత సం
వర్తశిఖావదుగ్రకరవాసరతాపము నాఁపఁగాఁ దగున్. ౮౫

వ. అంత నవ్వేసంగి యంతరించిన తదనంతరంబ భూనభోంతరాళంబులు జోరు
కలంగంజేయు దంభోళిగంభీరధ్వానంబులు విజృంభించెఁ బంచవన్నియచిలుక
పలుకం గరకమలంబునం బ్రథమదిక్కాంత సంతసంబునఁ బాటించెనో
యన నిరాఘాటప్రభాపాటవహిండితం బగునాఖండలధనుఃఖండంబు మెండు
కొన నొండొండ నిండారం బూనిన ముత్యాలపేరులు గగనలక్ష్మీకంఠభాగం
బుననుండి వ్రేలెడినో యనఁ గరకావారంబు తోరంబుగ మయూరకేకావంది
వాక్యసందర్భనిర్భరానందంబై యొసంగిన వసనవిసరంబునుం బోలెఁ బయోధ
రచ్ఛేదంబులసాదప్రసాదంబులై చూపఱకుం బ్రమోదంబు లొసఁగ విసవిస
విసరు చలికరువలియు ముసరుకొన నసమమహీరజోరాజి యొండొండ నీడా
డం దలచూపు ప్రథమోదబిందుసందోహంబును వాతెఱలు దెఱచుచాత
కంబు లద్భుతప్రీతినికేతంబులై కొనియాడు క్రీడాసల్లాపంబులునుం గ్రేళ్లు
మెలంగు తటిల్లతలయుల్లాసంబును నతూర్యార్జితంబు లగుగర్జితంబుల విస్ఫూర్జ
నంబును బంధురాంధకారపరిణాహంబును నుదారాసారప్రచారంబును
నుడ్డీనకుల్యామహోల్లాసంబును నుత్సాహవివర్జితసముద్రంబును నుద్యోగ
హృద్యహాలికంబును నుపచితాతపవాసరతప్తతృణాంకురసంకులంబునై వర్షాగ
మంబుమహోత్సవంబున నావిర్భవించి శరత్సమయవత్సనిపీతపయోధరపయః
పూరం బయ్యె నయ్యెడ. ౮౬

సీ. వారాకరంబు దేవేరి యాకావేరి కల్లోలఘటలలో నుల్లసిల్లి
ద్రవిళదేశాంగనాస్తనకుంభములమీఁది పసుపుపూఁతల తావి పాలుపట్టి
మధుపానకేళీనిమగ్నపుష్పంధయభాందవపరిపాటిఁ బరిఢవిల్లి
కీచకరంధ్రప్రకీర్ణమై ఘుమ్మంచు నభిరామనాదంబు నావటించి

నట్టువయుఁబోలె లతలకు నయముమీఱ
నటనమొఱఁగించుచును జూపఱవిటుఁడువోలెఁ
గొమ్మలకు సౌఖ్యమొసఁగుచుఁ గోముమీఱె
ఋతుసమాగతమలయమారుతవిభూతి ౮౮

సీ. మిసమిసమనుగండుమీను టెక్కెముతోడి పువ్వారుఁ దేరిపైఁ బొలుపుమీఱి
రతిదేవి భారంబురానాపుచనుదోయి పుత్తడిబటువుల నొత్తగిల్లి
ముక్తామయం బైన మోహనచాపంబు తేఁటి లేనారిను స్సిఁగఁ గూర్చి
సంచితమంత్రప్రపంచమౌ నిజబాణసంచిక పొదిలోన సంఘటించి
మెత్తనిగుఱుఁదపారంబు మించుకలువ, రేకుపట్టియు మొల్లపూజోకజోడు
మొగలిమొగ్గకఠారంబు జిగిదొలంక, వెడలె మదనుండు విరహులవేఁటలాడ.
గీ. ఋతువులాఱుఁ దనకు నతులవిభూతితోఁ, దోడుచూపుట యనుదొలుత వేల్పు
పట్టి బహువిహారపరిణతబుద్ధియై, సంచరించు వివిధసౌఖ్యలహరి. ౮౯
క. ఈరీతి మదనరాగిక, శారంజితహృదయుఁ డగుచు లలనాజననా
నారతిసౌఖ్యపరాయణుఁ, డై రక్షోరాజపుత్త్రుఁ డలరఁగ నంతన్. ౯౦

రాక్షసమంత్రులరహస్యాలోచనము.

గీ. ఆహిరణ్యకశిపునాప్తమంత్రులు గొంద, ఱతనిపుత్త్రుఁ గొలుచునాస విడిచి
నిజమనంబులందు గుజగుజవోవుచు, వంది సంచరింతు రిందునందు. ౯౧
వ. వా రెవ్వ రంటేని. ౯౨
సీ. సూచీముఖుండును శూర్పకర్ణుండును వృశ్చికరోముండు వికటబలుఁడు
శంబరుండును దీర్ఘజంఘుండు బలియును గపిలాక్షధూమ్రాక్షకంకటులును
గాలకేయుండును గాలదంష్ట్రుండును వక్రదంతుండును వామనుండు
ఖరుఁడు ద్విమూర్ధుండుఁ గల్పకేతుండును దూషణుండును జర్మపేషణుండు
నాదిగాఁగల పూర్వులౌ నమరవిమతు, మంత్రు లెల్లరుఁ గూడి సన్మంత్రగోష్ఠి
నతిరహఃకృత్యమునకు యోగ్యతమమైన, సింధువనమున కరిగి యాసీనులగుచు.
క. ఆమంత్రివరులు సంతత, ధీమంతుం డగుసరస్వతీసింధుసుతున్
వామనుఁ డనురక్కసుని న, వామనమతిఁ బల్కి రుచితవాక్యముఖరులై.
క. అనఘా సర్వంబును నీ,కని విన్నది గాదె వేఱె కఱపఁగ నేలా
మనకార్య మింక నెట్లగు, వినిపింపఁగఁ బాడి నీకు విమలవివేకా. ౯౪
చ. హరి పగవాఁడు దేవమును లంతకమున్నె విరోధు లిట్టిచో
హరి తనకూర్చునాయకుఁ డటంచు నిశాటకుమారుఁ డెప్పుడున్

సురలును దానుఁ గూడి మఱచొప్పునఁ బోవక శౌర్యహీనుఁడై
యరులకుఁ గ్రిందివాఁ డగుచు నాహవదోహలి గాఁ డొకింతయుః ౫౬

సీ. సమరాభిముఖు లైనయమరవీరులఁ గిట్టి యనిమొనఁ దూత్తుము రాఁడవలదె
దర్పితదండయాత్రాభేరిభాంకారఝుంకారముల మిన్ను చఱవవలదె
యుత్పలదళములయొప్పునఁ జైకొను నరిశిలీముఖముల నాఁపవలదె
తుంగమాతంగశతాంగతురంగాంగశకలకోటుల నేలఁ జదురవలదె
కలవె యొకనిఁ గొలిచి గర్వవిహీనుఁడై, యూడిగములు సేయుచున్నపతికి
ధూర్తవిజయలబ్ధ కీర్తిప్రతాపంబు, లసురసుతున కిట్టు లడఁగఁ దగునె. ౫౭

క. మన మితనికిఁ బగవారము, మనపగరులు ప్రీతిపరులు మనవాక్యంబుల్
విననొల్లఁడు ప్రహ్లాదుఁడు, మనకార్యం బెట్లు నిలుచు మాన్యచరిత్రా. ౫౮

గీ. ఆహిరణ్యకశిపునందు నీమాఱిడి, కిందిసోము రెట్లు బొందె యొత్తెఁ
బులికి మేఁకమఱక పుట్టినయ ట్లయ్యె, శిరసు లెత్తి తిరుగ సిగ్గుగాదె. ౫౯

క. అనిమిషు లితనికి సఖులై, మనుచుండిర యేని దివిజమర్దనకులముం
దునుముదురు పూర్వవైరము, మనముల నిడి పాముతోడిమచ్చిక దగునే ౬౦

క. అందఱముఁ గూడి యీకను, గందుం దునుమాడి యొక్కకఠినభుజబలో
గ్రుం దెచ్చి రాజుఁ జేసినఁ, బొందు నమందాఘనిచయములు ఘోరములై.

గీ. రాజపుత్త్రుఁ దునుమరాదు వేల్పులచేతఁ, బడఁగరాదు దురితపదవి చొరని
కార్య మెద్దిగలదు ధైర్యంబుతో నది, నీవు నిర్ణయించి నిర్వహింపు. ౬౨

మ. ఘనసంగ్రామపరుల్ హిరణ్యకశిపుస్తోమల్లభుం గొల్చి త
ర్జనముల్మీఱ సురేంద్రముఖ్యవిబుధవ్రాతంబు భీతిల్లఁ ద
ద్వనితాజాతముఁ బట్టి తెచ్చు మనమా దైత్యారులం జేరి సి
గ్గున వర్తించుటకన్న మే ల్గిరిగుహాక్షోణీతటిన్ దాఁగుటల్. ౬౩

ఉ. పక్షికులేంద్రవాహనుని బల్విడిఁ దోలఁగరాదొ దేవతా
ధ్యక్షునివైభవంబులు ప్రతాపమునన్ హరియింపరాదొ త
త్పక్షమువారి నెల్ల శితబాణపరంపరఁ గూల్పరాదొ యీ
యక్షము రాక్షసేంద్రసుతు నాడెడిదేమి వివేకహీనునిన్. ౬౪

చ. మనము దొలంగినప్పుడె క్రమంబున దేవతలెల్ల దైత్యరా
ట్తనయుఁడు వీఁ డటంచు నతిదారుణవృత్తిఁ గడంగి దూషణం
బున కభివక్తులై నిమిషమున్ ధర యేలఁగనిత్తురేల యీ
ఘనునకుఁ జెల్లునా యసురకంటకు సఖ్యము సౌఖ్యహేతు వై. ౬౫

క. మానంబు విడిచి యన్యుల, మానికులం గొలువలేము మన తెఱఁ గెటులో
మానము గలవారికి నభి, మానము రక్షించుటయె సమస్తశుభంబుల్. ౬౬

వ. అని నిజపక్షంబు రక్షోవీరు లుదారార్థగౌరవగభీరంబుగాఁ బలికిన పలుకులు విని మనంబున మెచ్చి వినయవినమితసుధాజేమనుం డగువామనుండు వారల కిట్లనియె. ౬౭

ఉ. ధీరులు శౌర్యసంయుతులు దీర్ఘవచోరచనాచమత్క్రియా
పారగు లైనమీహృదయపద్మము లెంతయు సంతసిల్ల ర
క్షోరమణోత్సవావహ మకుత్సిత మార్యనుతంబు నై సుధా
హారులయత్నము ల్మాఁచునట్టి యుపాయ మెఱుంగఁ జెప్పెదన్. ౬౮

మ. చల మొప్పం బరిపంథినిర్జరతతి న్సాధించి వేధోవధూ
కలనిక్వాణవిపంచిక న్నిజయశోగాథాసహస్రంబు సం
ధిలఁగా వంశధురీణుఁడై ప్రతిభ చే దీపించు దైత్యేశ్వరుం
దలఁపంగాఁ దగుఁ గాక తత్సుతుని చేతల్లెంత లూహింపఁగన్. ౬౯

క. ఏలికపుత్త్రు వధించిన, బాలిశులకు నిహముగలదె పరముం గలదే
శీలించెద నొకకార్యము, మేలెంచుఁడు నయము లెఱిఁగి మీమీయుక్తిన్.

చ. పతి యతిమూఢుఁ డైన బహుపాపసమన్వితుఁ డైన రోగసం
తతి వినిమగ్నుఁ డేనియును దాంతియు శాంతియుఁ గల్గకుండినన్
సతులకుఁ బాయరానిక్రియ శౌర్యము ధైర్యము లేకయున్న భూ
పతిఁ దమకంబున న్విడువఁ బంతమె సేవకులైనవారికిన్. ౭౧

చ. క్రమమునఁ గాని వక్రమగుకార్యము చక్కన గాదు గాథవి
క్రమము వివేకహీనుఁ డగురాజునకున్ హితకారణంబు గా
దమరులు నేఁడు దైవగతి నద్భుతశౌర్యసమేతులై యతి
ప్రమదము నొందినారు మనపౌరుషముల్ ఘటియింప వియ్యెడన్ ౭౨

క. సురపతియు నసురపతియును, నిరతంబును క్షీరనీరనిబిడహృదయులై
సరిపొత్తు మనెడిచోటన్, సురలపయిం గొలుప వాత్మశూరత్వంబుల్. ౭౩

గీ. రాజు లేనిబలము రాజీవశత్రుండు, లేనిరాత్రి మగఁడు లేనిమగువ
పౌరుషంబు లేని పతియును వృథగాదె, మీర లెఱుఁగరే సమిద్ధమతులు.

క. నరపాలుఁడు తనబలములఁ, బురికొలుపకయున్న వానిపో టమరునె భూ
వరవిరహితసేనయు నం, బరరహితస్తనము నేకపర్యాయంబుల్. ౭౪

వ. ఏనెఱింగించిన తెఱంగ మీయంతరంగంబులం దరంగితంబైనయది గదా
గదాధరచరణసేవనచతురుం డగుప్రహ్లాదకుమారునకు నాహ్లాదంబు పుట్టు
నట్లు గొన్నియుపాయంబులు వన్ని సర్వంబును శుభోదర్కంబు సేయుదము
వినుం డనిన వెండియు వార లి ట్లనిరి. ౭౬

చ. కనలక దేవతావిభునికార్యవశస్థితియంద నిల్చుచు
[1]స్తనలను జేరనీఁడు లవమాత్రము నిర్జరశత్రుసూతి యే
యనువునఁ బుట్టెనో నిజకులాంబుధిశోషణబాడబాగ్ని యై
తనమదిలోనఁ బెద్దలప్రతాప మెఱుంగఁ డెఱుంగఁ డేమియున్. ౭౭

క. అతఁ డేకైవడి నస్త, స్తతమున కొనగూడి దివిజమర్దనలీలో
ద్ధతిమాపు శ్రుతిసుఖంబుగ, హితసూక్తులఁ దెలుపవే యహీనవివేకా ౭౮

వ. అనిన వారల కతం డి ట్లనియె. ౭౯

క. ఏకార్యంబున నసుర, స్త్రీకాంతుఁడు తెలిసి మనవశంబునఁ దిరమౌ
నాకార్యము వినిపించెద, నాకర్ణింపంగవలయు నందఱు మీరల్. ౮౦

క. ఏకాలంబున నెవ్వని, కేకార్యము జరపవలయు హితవెఱిఁగి నరుం
డాకాలంబున నతనికి, నాకార్యము సలుప ఫలము నందఁగవచ్చున్. ౮౧

క. ఆరూఢయౌవనుం డై, నారీజన సరసకేళి నర్మసఖుం డై
యారక్షోవీరుఁడు సం, చారము లొనరించుఁ గృతకశైలములందున్. ౮౨

సీ. మాధవవల్లరీమండపాంతరముల మధువేళ విహరించు మదమువొదల
గ్రీష్మాట్టహాససంకీర్ణపుష్పంధయధ్వానంబు వినుఁ దపవాసరముల
శైలకందరనటన్నీలకంఠోత్తాలవైఖరి వాటించు వర్షలందు
నుద్దండపుండరీకోత్పలచ్ఛన్నదీర్ఘికల శారదవేళఁ గ్రేల్లుమలఁగు
హిమశిశిరసముచిత మైన యిచ్చనిచ్చ, నంగనాలింగనాహ్లాద మాత్మఁగోరు
నిపుడుప్రహ్లాదుఁడతనికినిందుముఖులఁ,గన్యకలఁదెచ్చియిచ్చిరాగమునొనర్చి.

వ. నేర్పు మెఱసి కందర్పవిహారలంపటుం డగునిలింపారిం జేరి పర్యాయగతిం
బాటవంబు మెఱసి బాంధవం బతిదృఢసంధానబంధురంబుగ నమరించి
యమరులయంటు వాసి మననంటున మెలంగునట్లు చేసిన సకలశోభనంబు
లుం గరతలస్ఫటికంబుల - - - కరణీయం బగు నతండు. ౮౪

క. కులమున రూపున గుణమున, బలమున సంబంధమునకుఁ [2]బాత్రుం డగు మీ
తలఁపునకు నెక్కునేనియుఁ, దలఁచిన పను లెల్ల సఫలతాయుతము లగున్.

[1] మనములఁ   [2] బ్రాత్తుండగు.

క. అదిగావున నీయత్నము, పదరక మన మిప్పు డొనర్పఁ బ్రస్తుతము లగు సం
పదయును శత్రుల గెలుచుట, విదితమనోవాంఛితములు విశ్వోన్నతియున్.

గీ. కామమోహితునకుఁ గాంతాజనంబును, ధనవిహీనునకును గనకచయము
వ్యాధిమగ్నునకును వలనైన యౌషధం, బొసఁగుటయు నిజార్థయోజకములు.

క. సంతుష్టులైన ధరణీ, కాంతులు సేవకులకోర్కెఁ గావింపుదు రా
వంతయు నింత యెఱుంగని, యంతఃకరణంబు నిత్తు రతిసులభగతిన్. ౮౯

వ. అని తామరసంభవశేముషీసముద్దాముం డగువామనాసురుండు పలికిన నీతిప్రస్ఫీతం బగుసూక్తిజాతంబునకుఁ బ్రీతహృదయు లై దైతేయు లాతనిం దోకొని నిజనివాసంబులకు మరల నేతెంచి కౌతుకాయత్తచిత్తు లై చిత్తజుపూములుకులుం బోని తమకులపాలికాసంభవ లగుసౌభాగ్యధన్యలం గన్యకలం బెక్కండ్రఁ దెచ్చి యారక్కసులచేనితనూజునకుం గానుక సేయుటయు నానందకందళితహృదయారవిందుం డై హిరణ్యకశిపుప్రథమనందనుం డాపృథులనితంబలం బరిణయం బై తరుణతరతరలసమీరకుమారతాండవితశిఖండకలతాతరుషండ మండితోద్యానహృద్యపద్యాపరిసరంబులయందు మసృణమసారమాణిక్యశకలమయకృత్రిమశైల కందరామందిరాంతరంబులయందును నరవిందమకరందనిష్యంద బిందుతుందిలపయఃప్రవాహమనోహరంబు లగు కేలికుల్యాకులంబులయందును,నిందుకాంతసందానిత సోపానపరంపరావ్యావృతప్రాసాదవేదికలయందును మదనవేదవిద్యావ్యాఖ్యాన వైఖరీమహోపదేష్ట యై త్రివిష్టపవిమతులకు నభీష్టంబు లొసంగి ప్రసాదదృష్టిమధురంబుగ వారివారి యావాసంబులకుం బోవం బనిచె నంత నొక్కనాఁడు.

చ. హరునిమనంబు తుత్తుమురు లైచన నేసినదంట మిక్కిలి
న్విరహులపాలిమంట నెఱవీరుఁడు మారుఁడు తియ్యవింట సు
స్థిర మగునిర్జరారిసుతుచిత్తము గెంటఁ బ్రసూనసాయకో
త్కరమున నంట నేసెఁ గడకంటికిఁ గోపపుఁబంట పాటిలన్. ౯౦

క. మరునిశరపుంఖములఁ గల, కరువలిచేఁ దూలి యసురకంటకహృదయాం
తర మతిభంగురగతిఁ ద, త్తరుణీకుచశైలసీమఁ దలఁదూర్చుకొనున్. ౯౧

సీ. హరిరూపదర్శనాయత్తంబు లగుకన్ను లతివలకుచములం దంటి నిలిచె
విష్ణుకీర్తనములు విని చొక్కువీనులు తరుణులగీతామృతముల నానెఁ
బురుషోత్తముని వేడ్కఁ బొగడుచుండెడుజిహ్వ సమదాంగనాధరాస్వాదమెఱిఁగె
జలజాక్షుపదభక్తిఁ బులకించునెమ్మేను ప్రమదాపరిరంభణములఁ బొదలె

సిల్కు ప్రహ్లాదవిభునిసద్వృంద్రియములు, మాధవారాధనక్రియాహ్బోధముడిగి
నిత్యయౌవనపూర్ణ లౌ దైత్యపత్త్ని, కన్యకలయందె యాసక్తిఁ గడలుకొనియె.

చ. కెరలు మదోదయంపుగిలిగింతలు వో నిడి బ్రహ్మచర్యని
ష్ఠురహృదయాంతరాళు లగుసూరిజనంబుల కైనఁ గామినీ
తరళకటాక్షవీక్షణసుధాకరచంద్రిక యింత సోఁకినం
గరఁగక యున్నె దైత్యకళికావిధుకాంతశిలాకలాపముల్. ౯౩

గీ. అంత నొక్కకందువందుఁ బ్రహ్లాదుండు, బాలికాళతానుకూలుఁ డగుచు
వనవిహారకాంక్షఁ జన సముద్యుక్తుఁ డై, మరునిజోడుకోడెమాడ్కిఁ దనరి.

సీ. ఉదయార్కబింబంబునోరసచ్చు నెరమెచ్చు[1]చిగురుచెంద్రికచాయచేలమమర
గంధానుమేయంబుగా మేన నలఁదిన చర్చ రహెంకానుషక్తి (?) దోఁపఁ
గంకణకుండలగ్రైవేయముద్రికాహారప్రభల రోహణాద్రిఁ బోలి
మాయామయబుభోంపు లుపాయనం బొసఁగిన కుసుమంబు లలకలఁ గుస్తరించి
మదనశతకోటిలావణ్య మెదురుకొన్న, నిద్ద మగుమూర్తి యద్దాన నీడచూచి
కామినీమణిపరివారకలితుఁ డగుచుఁ, దనగృహోద్యానసీమకుఁ జనఁదలంప.

శా. ఆదైత్యేంద్రకుమారుఁ గొల్చిరి మహోద్యద్రత్నహారావృతల్
పాదాబ్జక్వణదచ్ఛనూపురలు శంపాసంపదుద్వృత్తనుల్
మోదావాదిసుగంధబంధురలు సంపూర్ణేందుబింబాననల్
యాదోలాంఛనమంత్రదేవతలు దైత్యాధీశకన్యామణుల్. ౯౪

వ. ఆప్రహ్లాదుం డాహ్లాదపరిపూరితహృదయుం డై యమ్మదవతీశతంబుఁ గర్ణీరథా
రూఢంబు గావించి పూవుందోఁటకు హాటకవిమానారూఢుం డై చనునవస
రంబున. ౯౫

సీ. శ్వేతాతపత్త్రాళి వెలఁదివెన్నెల గాసెఁ బార్వికశశిపరంపరలఁ బోలి
కలహించురాయంచగములసందడి చూపెఁ గామినీకరదత్తచామరములు
కంతుసేనాకలకలము నాకర్షించె నర్మగర్భోక్తివీణాస్వనములు
కర్పూరకస్తూరికాసంకుమదకుంకుమాదిసుగంధము లతిశయిల్లె
మసగదిత్తుల (?) నించి పల్లటును జిమ్ము, సారపన్నీరనీరాతిశైత్య మెసంగె
నసమయౌవనపరిపూర్ణుఁ డసురరాజ,సుతుఁడువన కేళికరుదేర నతులమహిమ.

సీ. కొంద ఱాందోళికాసందోహముల నెక్కి కేళిఁ గొందఱు పల్లకీల నెక్కి
ప్రకటశిల్పము లైనశకటంబు లొకకొంద ఱెక్కి హయంబుల నెక్కి కొంద

[1] చికురు.

జిభరాజముల నెక్కి హేమశేషముల దూకొనుసద్వజంజరా (?)ర్గొంద జెక్కి
భీమసత్త్వము లైనవాజిరాశితంబులపైఁ గొంద జెక్కి నృపాలగణిక
లసమపిశితవిశేషంబు లాసనములుఁ, గుసుమఫలములుఁబట్టించుకొని యరిగిరి
రాజనిపగడ రతిరాజు తేజ లసఁగ, సరసవాక్యాల నమృతవర్షములు గురియ.

క. దండెత్తు మరునిగతి నా, ఖండలరిపురంధనుండు గనుపట్టె మహీ
మండలకుండల మగుతన, పండనివేశమున సకలసౌభాగ్యన్నతుఁడై. ౧౦౦

క. పిడియేనికె మొత్తము తన,బడిరా నైరావణంబు బలభిద్వనిలో
నడమక్రియఁ గనకకశిపుని, కొడుకుపవనవీథి నమరెఁ గొమ్ములు గొలువన్.

సీ. ఏడాకుపొన్నలు చోడుముట్టెడుచోట సురపొన్న విరి తేనె గురియుచోటఁ
జంద్రకాంతములునిచ్చలుఁగరంగెడుచోటఁగపురంపుటరుఁగులుగలుగుచోటఁ
దరుణవాసంతికల్ దళ్ళుగట్టెడుచోటఁ జిలుకబోదలు ముద్దుగులుకుచోటఁ
జలిగాడ్పువిసువులుతెలలుసూపెడుచోటఁ గోయిల లిగురాకుఁగొఱుకుచోట
గర్వితస్మరచాపటంకార మఖిల, విరహిజనమోహనస్ఫూర్తిఁ బెరయుచోట
విపులవిహారణపరతంత్రవృత్తి హత్తి, విడిసెఁ బ్రహ్లాదుఁ డుద్యానవీథినడుమ.

చ. తొలకరి లేమెఱుంగు లనఁ దోయజగర్భుఁడు హేమపుత్రికా
వలుల సజీవభావమున నన్నియ వెట్టె ననంగ నంగరే
ఖల విలసిల్లునంగనలు గబ్బున నిబ్బర మందికోల్వఁగా
వలవుల [1]రాచవానిచెలువంబున రాజతనూజుఁ డుండఁగన్. ౧౦౩

క. తరుణులకు నుపవనశ్రీ, కరుణించి యొసంగురత్నకనకాభరణో
త్కర మనఁగ వారు వానికి, ధరియించిరి ప్రసవకల్పితము లగుతొడవుల్.

గీ. వనిత యొకతె కొమ్మ వంచి పూవులుగోయ, రాలె దనుజలోకపాలుమాళిఁ
గొన్ని యతఁడు కీర్తికుసుమముల్ శిరసున, నావహించి మించి యలరె ననఁగ.

ఉ. ఇంతిలె కాని నాకుచము లింతకు నెక్కుడు లేవు కామినీ
సంతతిలోన లేఁత నని సంజ్ఞ సురారికిఁ జేయుకైవడిం
గంతుని బెట్టుకోల యొకకన్నియ మారెడుపండ్లు పాణిప
ద్మాంతరసీమ నించె సరసాకృతిఁ గందుకకేళి సల్పుచున్. ౧౦౬

క. మరుతూపు విభునిచూపుం, గరమూలములందు నొకటఁ గదలక నిలువ
న్విరు లరవిరిబాగున నొక, విరిబోఁడి నఖాంచలముల వేమఱుఁ జిదిమెన్.

[1] రాచవాని.

క. కరకందుకమున నొకసతి, సురవైరిన్ వైనఁబూనుసుళుగతేఁడు హృదం
తరమునఁ గని లీలాపం, కరుహముఁ దొలఁగించి దానికన్నులు గప్పెన్.

చ. అలికులనీలవేణి విను మాపోదరింటికిఁ బోకు నీకుఁ గా
వలసినయేని యేమి కలవా తరువాటమునందుఁ గ్రొవ్విరుల్
పెలుచన నీదుమోవిఁ గబళింపఁగఁ [1]బూంచెను గండుఁదుమ్మెదల్
దలఁపవు ముగ్ధ వంచు నొకతామరసాక్షి యదల్చె నెచ్చెలిన్.   ౧౦౯

క. విరిసినకుంతలబంధము, మురిసిననీవియును హస్తములఁ బట్టి కృశో
దరియొకతెపసుపుఁబయ్యెదఁ, గరువలిజడియింపఁ (?) గుంజగర్భముదూఱెన్.

తరల. పదనుమీఱు రసాలపేశలపల్లవావళి ముక్కులం
జిదిమి కుత్తుకబంటి తద్రసనీధువుం గొని చొక్కున
క్కొదమకోయిలగుంపు కన్నులఁ [2]గోరగించెదు కెంపు సొం
పొదవెఁ బాంథులమీఁదికోపపుటు బ్బటంచు సతుల్ నగన్.   ౧౧౧

మత్తకోకిల. తోర మా విరితేనెసంద్రపుఁదొట్టునం బడి యీఁదుచు
న్నారసింగణిమ్రోఁతలో యన మాటిమాటికి మ్రోయుచుం
దూర నెక్కి పరాగపంక్తులఁ ద్రొక్కి సౌరభ మానుచు
న్వారిజాక్షులచూపుచాయల వాలెఁ దుమ్మెద లమ్మహిన్.   ౧౧౨

సీ. పల్లవపరిణాహపాదారవిందయుఁ గర్పూరరంభోరుకాండయుగయు
సుమరేణుసైకతసముదగ్రజఘనయు నవనవపున్నాగనాభితలయు
భ్రమరడింభకరోమరాజిరాజితయును శ్రీఫలస్తనకుంభశీలితయును
వల్లీమతల్లికాప్రోల్లసద్బాహయుఁ గ్రముకకోమలకంబుకంఠయుతయు
మధురసాదరదళపుష్పమంజరీము, ఖయును మాయూరపింఛాగ్రకేశపాశ
శాలియును నైనవనరమా చపలనయన, మమతఁబ్రహ్లాదునాహ్లాదమగ్నుఁజేసె.

చ. అసురవరేణ్యుఁ గూడి హరిణాక్షులు వృక్షలతానుతల్లికా
ప్రసవము లాహరింప ముఖపద్మము లించుకవాడుచూపెఁ బై
దుసికిలఁజొచ్చె ఘర్మభవతోయకణంబులు తొట్రుపాటునన్
విసవిసగాక మందగతి విభ్రమము ల్విలసిల్లె నత్తఱిన్.   ౧౧౪

క. ఆకాశకృష్ణవక్షః, స్వీకృతకౌస్తుభమువోలె వెలుఁగులతేఁ డు
ద్రేకించెఁ బట్టపగ లతి, లోకమ్ములై కిరణపంజ్ఞులు విసాళింపన్.   ౧౧౫

[1] బూంచిన.   [2] కోరకింపెడు.

వ. అంతఁ బ్రస్తోమంబు ప్రచండమార్తాండకిరణముచండిమ సహింపనోపక మహీపతిసహాయుండై రాయంచమిండం బోఁడులఁ గూడి సంచరించు రాజహంసంబునుంబోలె భాసిల్లి సలిలకేళికి సగ్గలించు నంతరంగంబు పొంగార నయ్యారామంబునం గలయందిరుగం దత్పూర్వభాగంబునఁ బరమయోగియుం బోలెఁ బంకరహితస్వభావంబును రాకారాత్రియుంబోలెఁ జంద్రశీతలంబును భవసఖనివాసంబునుంబోలె మకరకచ్ఛపపద్మాదిసద్మంబును మహాగహనంబునుంబోలె నుద్దండపుండరీకంబును బుండరీకాక్షుపొక్కిలియుం బోలె సర్వతోముఖశోభితంబును నైనయొక్క సరోవరంబుఁ గని కనకకమలకళికాపరాగపరంపరాపరిచయసరససలిలసమీరంబుల శరీరంబులకుఁ బ్రీణనంబు గావించుచు మదకలకారండవక్రౌంచప్రముఖఘనరసవిహగవిసరమస్పణరణనంబులు శ్రవణరంధ్రంబులకుం బరమానందంబు నొందింపం దత్కాసారసౌభాగ్యంబునకు మెచ్చుచు వచ్చి యచ్చటఁ బచ్చవిలుతువిడిదియుం బోని గురువిందపొదరింట మృదులలతాంతశయ్యాతలంబున సుఖాసీనుండై మానవతీజనంబుల వారివిహారంబొనరించుటకు ననుజ్ఞ నొసంగుటయు.

క. జలకేళికి నుచితము లగు, వలిపంబులు గట్టి కనకవలయాదికభూ
షలు డించియు విలసిల్లిరి, లలనలు నీహారసమయలతలుంబోలెన్. ౧౧౮

గీ. కనకశృంగంబులును లక్కకరపటములు, నేత్రములు గందళీఫలనికరములును
మొదలుగాఁ గలసాధనంబులు ధరించి, కొలనుసొచ్చిరి ఫుల్లజలజముఖులు.

చ. కుచములకుంకుమ ల్చెదరఁ గ్రుక్కినపూవులు పుక్కిలించుచుం
గచములు వీడ గండయుగకల్పితనూతనపత్త్రవల్లికా
రచనలు మిక్కిలిం గరఁగ రామలు కాంచనశృంగపూరితాం
బుచయము చల్లి రొండొరులఁ బూఁచి తనూతటిదాళిమీఁదటన్. ౧౧౯

గీ. చాలలోఁ తైనతత్సరస్సలిలపూర, మంగనలనాభిబిలములయందు నణఁగె
నెంతగంభీరు లేనియు నింతులకును, లోను గాకున్నవారిని గాన నరిది. ౧౨౦

ఉ. చల్లిన మాఱులే కెదురు చల్లెడువారలుఁ జల్లినన్ వస
ద్గల్లతలంబుగా నిజముఖంబులు ద్రిప్పెడువారు మూఁకపైఁ
జల్లుచు గెల్వుగొన్నసతిఁ జాగురె యంచు నుతించువారు నై
యల్లలనల్ సరోజలవిహారము సల్పిరి పొల్పుమీఱఁగన్. ౧౨౧

గీ. పడఁతి యొక్కతె కుత్తుకబంటినీట, నుండు నవ్వేళఁ గనుఁగొనును విదపిండు
భ్రమరమిథునసమాశ్రితపద్మ మనుచుఁ, జపలదృక్తన్ముఖంబుఁ బ్రశంస చేసె.

వ. అట్టిసమయంబున. ౧౭౩

సీ. తరుణీదృగంజనప్రసలతాకీర్ణ మై యొకచోట నీలిమ నొదవఁ జేసి
వామనేత్రీకుచద్వయకుంకుమాలేపక్ష ప్తిచే నొకచోటఁ గెంపునెఱపి
వనితాజనాంగచందనరసాక్రాంతిచే ధావళ్య మొకచోట నావటించి
సుదతులపసుపుపయ్యెదలని గ్గొదవుట నొకచోట హరితాళవికృతిఁ గూర్చి
కొలనుబహువర్ణసాంకర్యకలితమయ్యె,గట్టుబయలయ్యెఁగలఁకలోఁదొట్టునొ
నెట్టివారికి నేనియునిందుముఖులఁ,గలసిమెలసినఁ గలుగునేగౌరవంబు. [నియె
గీ. కామరూపుఁ డగుట గంధర్వమూర్తి.య, య్యసురరాజసూతి యచ్చరలకు
నీడువచ్చుదానవేశ్వరదత్తక, న్యకలఁగూడి క్రీడ లాడఁదొడఁగె. ౧౭౪

క. మరుఁ డేయుతూపుగములకుఁ, దరుణీమణివీక్షణములు తాపలొసఁగ ని
ర్జరవైరిసుతునిడెందము, గరఁగెఁ శిఖితప్తజతుశకలపరిపాటిఁ. ౧౭౫

సీ. దానవాధీశవేదండంబుకాంతావశావశుండగుట యాశ్చర్య మగునె
యసురమార్తాండుండు బిసరుహాలోచనాప్రభలకు లోనౌట యభినవంబె
రాక్షసాధ్యక్షునళక్షుభానుఁడు కాంత లనుతారకలఁ గూడు టద్భుతంబె
క్రవ్యాదసింహంబు కలకలకంఠీగుహాలీనుఁడగుట మహాఘనంబె
యనఁగ జలకేళివిహరణం బాచరించె, సారకాసారనవవారిపూరవీచి
ఘటలఁగుటిలేందునిటలానగంధగాత్ర,గంధకలితాంగుఁడైమరుత్కంపనుండు.
గీ. కంజపత్రాక్షి యోర్తు లాతూకరండ, తాడనంబునఁ జెనకిన దైత్యభర్త [గ.
దానికుచమధ్యవీథిఁ గెందమ్మినిచ్చె,ననవిలుతుఁ డేయుప్రథమబాణంబొయనఁ

ఉ. దానవరాజసూనుకరతామరసేరితవారిధారలన్
మానవతీశరీరనఖమండనముల్ పయిపూఁత లూడిపం
గానఁగవచ్చెఁ బుల్కడుగఁగాఁ బ్రసవాస్త్రకృపాణపట్టికా
స్థానములందుఁ దోఁచునునుజాయలకైవడిఁ జూడ నందమై. ౧౭౬

గీ. తనదు[1]లోఁదొడఁ దేఁటిముద్దాఁకెననుచు,మిట్టిపడునొక్కనునుజను[2]మిట్టలాఁడి
నోడ కోడకు మని నాథుఁ డూఱడించెఁ, జలువకౌఁగిట జిగియార [3]సవదరించి.

ఉ. దానవభర్త రత్నములుతాఁచినబుఱ్ఱటకొమ్మునీట న
మ్మానవతీజనంబుఁ బలుమాఱును జల్లుచుఁ గ్రేళ్లుదాఁటె వ
ర్షానవమేఘమండలము చల్లనియుల్లసితాంబువృష్టిచేఁ
గానవభూములుం దడుపఁగా నగువిభ్రమ ముద్భవింపఁగన్. ౧౩౧

[1] లోదడ. [2] మిట్టలాని. సవధరించి.

క. ఘలుఘల్లనఁ గరకంకణ, ములు మొరయఁగఁ గాంతలొక్కమొనయై నేత్రం
బుల ఫలములఁ బూబంతుల, జలజంబులఁ గప్పి రసురశాసనతనయున్.
గీ. కామినీప్రేరితానేకగంధతోయ, ధౌతనిజదేహుఁడై యొప్పె దైత్యభర్త
వడియుపూఁదేనెకాలువఁ గడుగఁబడిన, మేనుగనఁగల్గు మన్మథునేనుఁగనఁగ.
సీ. చక్రవాకస్తనాంచలఫేనహారంబు లదుకులువిచ్చి యిట్టట్టు చనఁగఁ
దరుణశైవాలకుంతలకలాప మొకింత పద్మాస్యమునఁ గొంత ప్రాఁకుదేఱ
సైకతజఘనచంచద్రాజహంససంసక్తకాంచికలకలస్వనము లుడుగఁ
జపలకల్లోలభుజాబంధముద్రల జడభావ మెంతేయుఁ గడలుకొనఁగ
లోనఁ గలఁగుట సంగమజ్ఞానిగాఁగ, శైత్యమును బారవశ్యంబు సంభవింప
దనుజకందర్పుఁ గూడినతరుణివోలెఁ, గేళిదీర్ఘిక యొప్పె నవ్వేళయందు.

సూర్యాస్తమయాదివర్ణనము.

వ. అరవిందంబులవిందు మందమందకిరణప్రసారుండై చరమశైలశిఖానుఖాసీనుం డగునంతఁ గాంతాసమన్వితుండై దానవకాంతుండు సలిలకేళి చాలించి మడువు వెడలి తత్తీరంబున నుచితశృంగారాంగీకారంబున నభిరామమూర్తి యయ్యె నయ్యావర్తనాభులును నలుదెఱంగుల నలంకృతలై చెలంగుచుఁ బూజపెట్టిన వలరాజువాలురమ్ములుంబోలె భాసిల్లి రాసమయంబున.
గీ. క్రుంకుమెట్టు దాఁకి గుఱ్ఱంబు మ్రొగ్గిన, నొంటికంటితేర నుండలేక
జిఱ్ఱువాఱె ననఁగ నర్కమండలము ప, శ్చిమపయోధిలోన శిరసు ముంచె.
స్రగ్ధర. భానుం డస్తాద్రి దాఁటం బవిరియఁగొనుచుం బక్షసంఘంబులో భృం
గానీకం బార్తి నొందెన్ హరిణకులము కచ్ఛాంతరక్షోణి నిల్చెన్
నానావృక్షాగ్రశాఖోన్నతగృహములలో నమ్మయూరాళి కన్నుం
గోన ల్మోడ్చెం బ్రవాళాంకురరుచుల హరిత్కోణముల్ రాణమీఱెన్.
క. మసమసగఁబడియెఁ బడమర, నినువుంజీఁకటులమూఁకనీడలు దోఁచెం
గుసుమం బెట్టినగతి యా, కస మెంతయు నరుణకాంతిగర్భిత మయ్యెన్.
గీ. సమయసింహంబుదివసగజంబు వ్రచ్చఁ, దొరఁగు నెత్తురుకరణిసాంధ్యరుచి దనరె
నందు రాలినకుంభముక్తాంకురముల, తళుకుఁ దలకొల్పె నూతనతారకములు.
సీ. ఇల దనయంతయ కలదొ లేదో యని కొలువవచ్చిన నభోవలయ మనఁగ
బలిబంధనమునాఁటి బలుమేను హరి పీడఁదాఁచినఁ బోవక యేచె ననఁగ
నక్షులు గప్పి పదార్థజాలంబుల మాయంబుసేయు పెన్మాయ యనఁగ
సూర్యవిజ్ఞానంబు సొరుగఁ గాలముమీఁదఁ గవిసిన మోహవికార మనఁగఁ

శ్రీరస్తు.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు.

## (TELUGU ACADEMY.)

## దుందుభినామసంవత్సర కార్యనివేదనము.

ఈపరిషత్తునకు మొదటివార్షికసభ చెన్నపట్టనములో పచ్చయ్యప్పకలాశాలాభవనమున జరగినది, రెండవది రాజమహేంద్రవరమున, మూఁడవది కాకినాడలో, నాల్గవది బళ్లారిలో, అయిదవది గుంటూరిలో, నాఱవది కడపలో, నేడవది మధురలో, ఎనిమిదవది నెల్లూరిలో, తొమ్మిదవది బెజవాడలోఁ, బదియవది యేలూరఁ, బదునొకండవది పిఠాపురమున జరగినవి. ఇదిపండ్రెండవసభ.

### సభ్యులు మొదలగువారు

ఈయాంధ్రసాహిత్యపరిషత్తునకు: దుందుభిసం॥ నకు, ప్రతిష్ఠాపకులిరువురు, ఉద్ధారకులు ముగ్గురు, పోషకులేడుగురు, యావజ్జీవసభ్యులు క్రొత్తవారుఁ బ్రాఁతవారుఁ జేరి యిరువది యెనమండ్రు. సాధారణసభ్యులు క్రొత్తవారు, ప్రాఁతవారు 198 గురు. గౌరవార్థసభ్యులు 3౯ గురు. కార్యనిర్వాహకసభాసభ్యులు 47 గురు. కార్యదర్శు లిద్దఱు. కార్యనిర్వాహకసభాధ్యక్షులొక్కరు. కోశాధ్యక్షు లిద్దఱును గలరు.

ప్రతిష్ఠాపకులు మున్నగుముఖ్యుల నామధేయము లీనివేదిక ముఖపత్రము రెండవపుటలోఁ దెల్పఁబడినవి.

### విచారకరవార్త.

ఈసంవత్సరమునఁ బండితులును బరిషద్గౌరవసభ్యులును గార్యనిర్వాహకసభాసభ్యులునైన దండిగుంట సూర్యనారాయణశాస్త్రిగారు కాలధర్మమునొందిరి. పరిషత్తు ప్రారంభమునుండియు నభిమానముగనుండి మొన్నమొన్నటివఱకుఁ గోశాధ్యక్షులుగాఁ బరిషత్తును గౌరవించి యున్నింట వృద్ధులై జగద్విఖ్యాతముగఁ గీర్తినిమాత్ర మీలోకమున విడిచి దివాన్ బహద్దరు కంచి కృష్ణస్వామి రావుపంతులుగారు స్వర్గస్థులైరి.

### పత్రికాప్రకటనము.

నిరుటివలెనే పరిషత్పత్రిక యీయేఁడును రెండునెలల కొకసారి ప్రకటింపఁబడినది. ఈసంపుటములో రఘునాథభూపాలవిరచితమగు రఘునాథరామాయణమును బ్రకటింపఁదలఁచితిమి గాని సంపూర్ణప్రతి దొరకనందున హరిభట్టు

నారసింహపురాణము (ఉత్తరభాగము) నారంభించినారము. ఈహరిభట్టు మత్స్య పురాణము, వరాహపురాణము, భాగవతములోని కొన్ని స్కంధములు రచించి ప్రసిద్ధిగడచినవాఁడని పండితులోక మెఱుఁగును. ఈపురాణమును, చిత్రకవి పెద్ద నార్యుని లక్షణసారసంగ్రహమును మైసూరుదొరతనమువారి ప్రాచ్యలిఖితపుస్త [illegible] (కన్నడ [illegible]) గారి యొద్ద నుండి కొంటిమి. దీనిప్రతి మన [illegible] లే. [illegible] పూర్వభాగము నెవ్వరైనను రచించినట్లు [illegible] ఇది [illegible] ముండి.

పత్త్రికయందు వివిధవిషయములతోపాటు వెనుకటిపరిషత్సభలలోఁ బండితులు సంగ్రహముగాఁ జదివినవ్యాసములు పూర్ణముగాఁ బ్రకటింపఁబడుచున్నవి.

పత్త్రికకుఁ జందాదారులు క్రొత్తవారుఁ బ్రాఁతవారును 230 మంది.

పత్త్రికలోఁ బ్రకటింపఁబడినవ్యాసములు రెండవ యనుబంధమునఁ జూడ నగును. పరిషత్పత్త్రికకు వినిమయముగా నాంధ్రవార్తాపత్త్రికలు, మాససంచికలు సుమారు 30-కి పైఁగా వచ్చుచున్నవి. వానిఁ గడపటఁ గనఁబఱచినారము.

### పుస్తకభాండాగారము.

పరిషత్తువారిచేఁ బ్రకటింపఁబడిన గ్రంథములు ముఖపత్త్రము మూఁడవ నాల్గవపుటలలోఁ దిలకింపఁదగును. పుస్తకసంపాదకుల సీవత్సరమున నెవ్వరిని నియమింపలేదు. మైలాపూరులోనున్న బ్ర. శ్రీ. టి. రాఘవేంద్రరావుగారు విశేషవ్యయప్రయాసములపై వారిపెద్దలు వ్రాయించిపెట్టుకొనిన 29 తాళపత్త్రకోశములఁ బరిషత్తున కిచ్చిరి. కోశములు 29 యైనను వానిలో మఱికొన్ని యెక్కుడుగ్రంథములు గలవు. నిరుడును, ఈయేఁడును, బరిషత్తునకు వ్రాఁతప్రతులనిచ్చియున్న వారిపేరులను జిట్టచివర సూచించినారము.

పరిషద్భాండాగారమునందలి వ్రాఁతప్రతులు 4441. అచ్చుపుస్తకములు గత సంవత్సరమున 1096 దుందుభిలో నుచితముగావచ్చినవి 36 కొనినవి 12 మొత్తము 1144. కాగితములపై వ్రాయింపఁబడినవి, గతసంవత్సరము 27 ఈసంవత్సరము 7 మొత్తము 34.

కొన్ని సంవత్సరములక్రిందటఁ బత్త్రికలోఁ దొంవరగఁ బ్రకటించిన మహాకవి శ్రీనాథప్రణీతమగు శివరాత్రిమాహాత్మ్యముఁ బునర్ముద్రణము గావించితిమి. రెండవప్రతిదొరకకపోయిన, నున్నదానినిబట్టియె తగినంతశ్రద్ధతోఁ బరిశీలించి చూచితిమి.

దొరతనమువారి పుస్తకభాండాగారములో శ్రీకృష్ణదేవరాయలు రచించిన జాంబవతీకళ్యాణమను సంస్కృతనాటకము కనఁబడినది. కాల మనుకూలించునేని సంస్కృతమైనను శ్రీకృష్ణరాయలపైఁగలగౌరవమునఁ బ్రకటింపఁదలఁచుచున్నారము.

సంతోషకరవార్త:- పరిషత్తువారిచేఁ బ్రకటింపఁబడిన మల్లికార్జునపండితారాధ్యులవారి శివతత్త్వసారమును దిలకించి శైవమతసభాధ్యక్షులు శ్రీ దేవిడి జమీందారు ఇజ్జతాసార్ శ్రీ కందుకూరి బాలసూర్యప్రసాదరావు బహద్దరుగారు రు 150 లు విరాళ మొసంగిరి.

## నిఘంటనిర్మాణము

శ్రీసూర్యరాయాంధ్రనిఘంటునిర్మాణము పరిషత్పక్షమునఁ బిఠాపురములో జరగుచున్నది. దానింగూర్చినవిషయము మొదటియనుబంధములోఁ జూడవలయును.

## ఆయవ్యయములు.

దుందుభిసంవత్సరములో నైన యాయవ్యయములనుదెల్పు పట్టికల నిందు వెంటఁ జేర్చియున్నారము.

ఆంధ్రదేశమునకు విశ్వవిద్యాలయము వచ్చునఁట. దేశములో నెక్కడఁ జూచినను నూతనగ్రంథములు పురాతనగ్రంథములుఁ బ్రకటింపఁబడుచున్నవి. పూర్వశాసనములు బైటఁబడుచున్నవి. భాషాసభలుప్పతిల్లుచున్నవి. పండితులు దీక్షతోఁబరిశోధనలు గావించుచున్నారు. నూతనపత్రికలు వెలువడుచున్నవి. శిల్పములుమొదలగు విజ్ఞానములు పూర్వాచారములు వెల్లడియగుచున్నవి. విద్వాంసులు ఘనోపన్యాసము లిచ్చుచు భాషావిషయములను జిక్కులందీర్చుచున్నారు. అనాఁటిసరస్వతి యీనాఁడు మరల నవతరించినది. అనేకవివాదాంశములు నేఁడు విజ్ఞులు తీర్మానించి యపవాదములఁ బోనాడుచు భాషను జరిత్రమును స్వచ్ఛపఱుచుచున్నారు. మాధ్యస్థసభ లెక్కడికక్కడ బయలుదేరుచున్నవి. పరస్పరవిరుద్ధము లగునంశములు సమాధానమునకు దిగుచున్నవి. ఎంతటిసమర్థు లున్నను జిరకాలమునుండి యైనయింటిబిడ్డలు లక్ష్మీసరస్వతు లాంధ్రభాషావిషయమై పడు కలహమునకు మధ్యవర్తులుగానుండి సామరస్యము కలిగింపకునికి శోచనీయ మైనవార్త.

గతసంవత్సరము పిఠాపురములోజరిగిన వార్షికసభలోఁ బరిషత్కార్యాలయ మాంధ్రదేశమధ్యభాగమునం దుంపవలయునని కొందఱు సభ్యు లుపపాదించిరి. ఆవిషయము చక్కఁగా విచారించి తమయభిప్రాయముఁ దెలుపుటకై యొక యుపసంఘ మేర్పఱుపఁబడినది. తత్సంఘసభ్యులు పలువురు తమ యభిప్రాయములను దెలిపి యున్నారు. ఈవిషయమును బరిశీలించి నిర్ణయము చేయవలసియున్నది.

ఆంధ్రసాహిత్యపరిషత్తు—చెన్నపురి. శ్రీదుందుభినామ సం॥ (ది 29 మార్చి

ఆయము.

| | | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|---|
| సంవత్సరాది నిలువ - - | | | | | 161 | 12 | 9 |
| బ్యాంకివడ్డీ - - - | | | | | 769 | 7 | 10 |
| బ్యాంకినుండి తెచ్చినది - - | | | | | 1474 | 7 | 11 |
| చందాలు:— | | | | | | | |
| | యావజ్జీవసభ్యులు చందా - | 10 | 0 | 0 | | | |
| | సాధారణసభ్యులు చందా - | 231 | 8 | 0 | | | |
| | పత్రికచందాలు - - | 158 | 8 | 0 | | | |
| | | | | | 400 | 0 | 0 |
| విరాళములు - - - | | | | | 150 | 0 | 0 |
| విడిసంచికల విక్రయము - - | | | | | 49 | 4 | 0 |
| పుస్తకముల విక్రయము:— | | | | | | | |
| | విప్రనారాయణచరిత్రము - | 8 | 12 | 9 | | | |
| | జైమినిభారతము - - | 31 | 4 | 6 | | | |
| | కవిజనాశ్రయము - - | 18 | 13 | 0 | | | |
| | జ్యోతిశ్శాస్త్రసారము - - | 5 | 7 | 6 | | | |
| | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము | 2 | 8 | 0 | | | |
| | నీతిసీసపద్య శతకము - - | 2 | 14 | 0 | | | |
| | చంపూరామాయణము - | 18 | 7 | 3 | | | |
| | జ్ఞానప్రసూనాంబికా శతకము - | 2 | 4 | 0 | | | |
| | సర్వేశ్వర శతకము - - | 2 | 7 | 0 | | | |
| | కావ్యాలంకార చూడామణి - | 6 | 4 | 0 | | | |
| | అకారాదిపుస్తక సూచిక - | 3 | 0 | 0 | | | |
| | ప్రాకృతభాషోత్పత్తి - - | 2 | 14 | 0 | | | |
| | డిఫెన్సు ఆఫ్ లిటరరీ తెలుఁగు - | 1 | 8 | 0 | | | |
| | చంద్రభానుచరిత్రము - | 11 | 12 | 6 | | | |
| | శివతత్త్వసారము - - | 15 | 4 | 0 | | | |
| | | | | | 133 | 8 | 6 |
| చేబదుళ్లు - - - | | | | | 1400 | 0 | 0 |
| వి. పి. పోస్టేజి - - | | | | | 11 | 13 | 0 |
| బైండింగువలన - - | | | | | 8 | 0 | 0 |
| రిజస్టరీ పోస్టేజి - - | | | | | 0 | 14 | 0 |
| పత్రికలలో ప్రకటన - - | | | | | 3 | 0 | 0 |
| | మొత్తము - | | | | 4562 | | |

నెం. 307, లింగచెట్టివీథి, మదరాసు.

11-4-1923.

గుళ్లపల్లి నరసింహము,

ఆడిటరు.

1922 సం॥ మొదలు ది 17 మార్చి 1923 సం॥ వఱకు) ఆయవ్యయముల లెక్క.

వ్యయము.

| | | | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|---|---|
| బ్యాంకికి పంపినది - | | | | | | 1631 | 8 | 10 |
| చేబదుళ్లు - - | | | | | | 400 | 0 | 0 |
| వి. పీ. పోస్టేజి - | | | | | | 12 | 15 | 0 |
| ప్రయాణవ్యయములు:— | | | | | | | | |
| పండితులవ్యయము - | | | 23 | 15 | 0 | | | |
| ఉద్యోగులవ్యయము - | | | 39 | 10 | 6 | 63 | 9 | 6 |
| పత్రికావిషయము:— | | | | | | | | |
| కాగితములు - | | | 250 | 0 | 0 | | | |
| ముద్రణవ్యయము - | | | 378 | 4 | 0 | | | |
| పోస్టేజి - - | | | 96 | 8 | 0 | | | |
| బ్లాకులు ప్రతిమలు - | | | 4 | 12 | 0 | | | |
| చిల్లరవ్యయము - | | | 5 | 11 | 9 | 735 | 3 | 9 |
| ఇతరముద్రణము బైండింగు | | | | | | 61 | 12 | 0 |
| పుస్తకభాండాగారము:— | | | | | | | | |
| కొనినపుస్తకములు - | | | | | | | | |
| తాళపత్రములు - | 19 | 14 | | | | | | |
| ముద్రితములు - | 12 | 4 | 32 | 2 | 0 | | | |
| ప్రతులు వ్రాయించుటకు | | | 31 | 0 | 0 | | | |
| ఇతరవ్యయములు - - | | | 11 | 3 | 9 | 74 | | |
| ఉద్యోగుల జీతములు - - | | | | | | 819 | | |
| ఇంటి అద్దె - - - | | | | | | 480 | | |
| చిల్లర పోస్టేజీ - - | | | | | | 41 | | |
| తంతులు, రిజిష్టరీ పోస్టేజీ - - | | | | | | 6 | | |
| కార్యస్థానము చిల్లరవ్యయము - | | | | | | 30 | | |
| కలములు మొదలైనవి - - | | | | | | 1 | | |
| ఆడిటరు ఫీజు - - | | | | | | 50 | | |
| పత్రికలలో ప్రకటనలు - - | | | | | | 25 | | |
| పుస్తకప్రకటనము - ముద్రణాదికము - | | | | | | 61 | | |
| నిఘంటు చిల్లరవ్యయము - - | | | | | | 22 | | |
| కార్యస్థానమున సంవత్సరాంతమున నిలువ | | | | | | 45 | | |
| మొత్తము - | | | | | | 4562 | | |

గుమ్మిడూరి వేంకటరంగరావు,

కోమర్రాజు లక్ష్మణరావు,

కార్యదర్శులు.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు—చెన్నపురి. దుందుభినామసంవత్సరాంతము

### అప్పు.

| | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| పరిషత్తు ఖండము:— | | | | | | |
| గతసంవత్సరాంతమున నిలువ - | 85087 | 7 | 1 | | | |
| ఈసంవత్సరమున హెచ్చు ఆదాయము | 1308 | 15 | 0 | 86396 | 6 | 1 |
| తంజావూరు లైబ్రరీ చందా - - | | | | 33 | 0 | 0 |
| చేబదులు - - - | | | | 1400 | 0 | 0 |
| నిఘంటుఖండము:— | | | | | | |
| గత సంవత్సరాంతమున నిలువ | | | | 15000 | 0 | |
| మొత్తము - | | | | 102,829 | 6 | 1 |

పైని దెలుపఁబడిన జమాఖర్చు నిలువ లెక్కను, ఆంధ్రసాహిత్యపరిషత్తువారి దుందుభి సంవత్సరపు లెక్కలతో తనిఖీచేసి సరియైనట్లు తెలుపుచున్నాను.

నెం. 307, లింగచెట్టి వీథి, మదరాసు.
11-4-1923.

గుళ్లపల్లి నరసింహాము,
ఆడిటరు.

## (ది 17 మార్చి 1923 సం॥) న జమాఖర్చు నిలువ లెక్క.

### ఆస్తి.

| | | | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|---|---|
| పరిషత్తుఫండు:— | | | | | | | | |
| మదరాసు ఇంపీరియల్ బాంక్ ఆఫ్ ఇండియా వారి జాగ్రత్తలో నుంచఁబడినవి— | | | | | | | | |
| 3½% 1900-01 గవర్నమెంటుపత్రము - - | | | 10000 | 0 | | | | |
| రు. 55½ చొప్పున తరుగు - - | | | 4450 | 0 | | 5550 | | |
| 5% 1929-47 గవర్నమెంటుపత్రము - - | | | 10000 | 0 | 0 | | | |
| రు. 80 చొప్పున తరుగు - - | | | 2000 | 0 | 0 | 8000 | 0 | |
| నగదువగైరా నిలువ:— | | | | | | | | |
| మేనేజరు వశమున నిలువ - - - | | | 45 | 3 | 10 | | | |
| ఇంపీరియల్ బాంక్ ఆఫ్ ఇండియాలో నిలువ - | | | 166 | 15 | 7 | 212 | 3 | |
| సభ్యులవలన రావలసిన చందాలు:— - - | | | 17847 | 11 | 0 | | | |
| గతసంవత్సరము దాఖలా వసూలుకాని బాకీలు - | | | 1226 | 0 | 0 | 16621 | 11 | |
| కుర్చీలు మొదలగు సామానులు (అసలు) | | | 525 | 8 | 0 | | | |
| గత సంవత్సరాంతమున మినహా | 194 | | | | | | | |
| ఈసంవత్సరమునకు మినహా | 12 | | 206 | 2 | 0 | 319 | | |
| ప్రచురింపఁబడిన పుస్తకముల నిలువ:— - | | | 2806 | 1 | 0 | | | |
| పత్రికలు నిలువ - - | | | 1757 | 4 | 0 | | | |
| కాగితము నిలువ - - | | | 156 | 6 | 0 | 4719 | 11 | |
| పుస్తకభాండాగారము ముద్రితప్రతులు:— | | | | | | | | |
| గతసంవత్సరాంతమున నిలువ - | | | 1740 | 10 | | | | |
| ఈ సంవత్సరమున ఉచితముగ వచ్చినవి | | | 33 | 14 | | | | |
| ఈ సంవత్సరమున కొనినవి- - | | | 12 | 4 | | | | |
| | | | 1786 | 12 | 0 | | | |
| గతసంవత్సరాంతమునకు మినహా | 605 | 0 | | | | | | |
| ఈ సంవత్సరము మినహా | 50 | 0 | 655 | 0 | 0 | 1131 | 12 | 0 |
| పుస్తకభాండాగారము వ్రాఁతప్రతులు - | | | | | | 51427 | 8 | 6 |
| నిఘంటువ్యయము గత సం॥రాంతమునకు - | | | 14824 | 9 | | | | |
| ఈ సంవత్సరమునకు - - - | | | 22 | 9 | 0 | 14847 | 2 | 2 |
| మొత్తము - | | | | | | 102,829 | 6 | 1 |

గుమ్ముడూరి వేంకటరంగరావు,

కొమర్రాజు లక్ష్మణరావు,

కార్యదర్శులు.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు—చెన్నపురి. శ్రీదుందుభినామ

### వ్యయము.

| | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| ఆఫీసు ఉద్యోగుల జీతములు - - | 819 | 7 | 1 | | | |
| ప్రయాణవ్యయములు - - - | 63 | 9 | 6 | | | |
| ఆడిటరుఫీజు - - - - | 50 | 0 | 0 | | | |
| కార్యస్థానమునకు అద్దె - - - | 480 | 0 | 0 | | | |
| కాగితములు మొదలైనవి - - - | 1 | 4 | 6 | | | |
| చిల్లర పోస్టేజి - - - | 41 | 2 | 9 | | | |
| రిజిస్టరు పోస్టేజి - - - | 6 | 1 | 6 | | | |
| చిల్లరవ్యయము (కార్యస్థానము) - - | 30 | 8 | 6 | | | |
| బ్యాంకి చిల్లరవ్యయము - - - | 0 | 1 | 0 | | | |
| వి. పి. పోస్టేజి - - - | 12 | 15 | 0 | | | |
| ఇతర ముద్రణము - బైండింగు - - | 61 | 12 | 0 | | | |
| పత్రికలలో ప్రకటనము - - - | 25 | 0 | 0 | | | |
| పుస్తకభాండాగారము చిల్లరవ్యయము - - | 11 | 3 | 9 | 1603 | 1 | 7 |
| పుస్తకప్రకటనము - ముద్రణాదికము - - | | | | 61 | 8 | 0 |
| **పత్రికావిషయము:—** | | | | | | |
| గతసంవత్సర ప్రతులు - - - | 1276 | 12 | 0 | | | |
| కాగితము ముద్రణము మొదలైనవి - - | 735 | 3 | 9 | 2011 | 15 | 9 |
| **మినహాయింపులు:—** | | | | | | |
| కుర్చీలు సామానులు - - - | 12 | 2 | 0 | | | |
| పుస్తకభాండాగారము - - - | 50 | 0 | 0 | | | |
| గత సం॥ ప్రచురింపఁబడిన పుస్తకముల నిలువ - | 1632 | 14 | 0 | 1695 | 0 | 0 |
| హెచ్చు ఆదాయము - - - | | | | 1308 | 15 | 0 |
| మొత్తము - | | | | 6680 | 8 | 4 |

నెం. 307, లింగచెట్టి వీథి, మదరాసు.
11-4-1923.

గుళ్లపల్లి నరసింహము,
ఆడిటరు.

సంవత్సరావ్యయముల లెక్క.

ఆయము.

| | రు. | అ. | | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| విరాళములు - | | | | 150 | 0 | 0 |
| సాధారణసభ్యులు - | 444 | 0 | 0 | | | |
| పత్రికచందాలు - | 357 | 0 | 0 | 801 | 0 | 0 |
| విడిసంచికల విక్రయము | 49 | 4 | 0 | | | |
| పుస్తకముల విక్రయము | 133 | 8 | 6 | | | |
| పత్రికలనిలువ - | 1757 | 4 | 0 | | | |
| కాగితమునిలువ - | 156 | 6 | 0 | | | |
| | | | | 2096 | | |
| పుస్తకములనిలువ:— | | | | | | |
| బెండువి - | 1687 | | 0 | | | |
| బెండుకానివి | 1118 | 12 | 0 | 2806 | | |
| బ్యాంకివడ్డి | 769 | 7 | 10 | | | |
| వి. పి. పోష్టేజి | 11 | 13 | 0 | | | |
| చిల్లరజమ - | 11 | 14 | 0 | | | |
| ఉచితముగా వచ్చిన పుస్తకము | 33 | 14 | 0 | | | |
| | | | | 827 | 0 | 10 |

మొత్తము -

గుమ్ముడూరి వేంకటరంగరావు,
కొమఱ్ఱాజు లక్ష్మణరావు,
కార్యదర్శులు.

# అనుబంధము I.

## శ్రీసూర్యరాయాంధ్రనిఘంటునిర్మాణము.

దుందుభిసంవత్సరము. 1922–23.

### సంస్కృతపదములు.

గతసంవత్సరాంతమునకు ఎత్తివ్రాసిన తత్సమపదములసంఖ్య 69,155 అనియు, ఇంకను వ్రాయవలసియున్నవి రమారమి 5,000 ఉండు ననియుఁ, దత్సమపదములమొత్తము సుమారు 75,000 అగుననియు, వానిలో విమర్శకకాలమునఁ గొన్ని పరిహరింపఁబడఁగాఁ జివరకు గ్రాహ్యములై నిలుచుపదములసంఖ్య సుమారు 50,000 ఉండవచ్చు ననియు, దుందుభిచైత్ర — ఫాల్గునమాసముల పరిషత్పత్రిక రెండవయనుబంధములోఁ బ్రకటితమైనది.

1-4-1922 మొదలుకొని 18-10-1922 వ తేదీవఱకు విమర్శింపఁబడిన తత్సమపదములసంఖ్య 7135 తత్పూర్వము 1-4-1922 వఱకు విమర్శింపఁబడినపదములు 5736 పండితాభిప్రాయములు వచ్చినమీఁదట తదనుసారమైన కొన్నిమార్పు లావశ్యకము లని తోఁచుటచేఁ బ్రథమవిమర్శన మాఁపి యీ 12871 పదములను పండితులు పునర్విమర్శనము చేసినారు.

18-10-1922 మొదలుకొని 1-4-1923 వఱకుఁ బునర్విమర్శితములై యచ్చునకు సిద్ధముగా నున్నతత్సమపదములసంఖ్య 11,490. (పునర్విమర్శనములోఁ బరిహృత మైనపదములు 3259. అదనముగాఁ జేర్చిన కృదంతాదిరూపములు 707) హ్రస్వకకారపదముల చివరవఱకు విమర్శన మైనది.

వాచస్పత్యము, ఆప్టి, విల్లియమ్సునిఘంటువు, సర్వశబ్దసంబోధిని, శబ్దరత్నాకరము, అమరకోశము, విశ్వనిఘంటువు, నానార్థరత్నమాల, ధన్వంతరినిఘంటువు, సర్వౌషధిగుణకల్పము, సాలగ్రామనిఘంటువు మున్నగుగ్రంథముల సాహాయ్యమున విమర్శనము జరుగుచున్నది.

### దేశ్యపదములు.

దేశ్యపదములవిమర్శన మింకను గావలసియున్నది. 1922-1923వఱకు సంకలిత మై విమర్శనమునకు సిద్ధముగా నున్నపదములసంఖ్య 129,730.

### ప్రాకృతాదిపదములు.

1922-23 వఱకు సంగ్రహింపఁబడినప్రాకృతపదములమొత్తము 1460. సిద్ధమైయున్న సజాతీయద్రావిడకర్ణాటపదములమొత్తము. 15,000

బ్ర॥ శ్రీ॥ పురాణపంట మల్లయ్యశాస్త్రిగారు కడువృద్ధులగుటచే నోపికలేక 7-6-1922-వ తేదీనుండి శ్రీసూర్యరాయనిఘంటుకార్యస్థానమునందలి యుద్యోగమును మానివేసినారు. వారి స్థానమున బ్ర॥ శ్రీ॥ పేరి వేరయ్యశాస్త్రిగారు నియుక్తులై 25-7-22-వ తేదీనుండి పని చేయుచున్నారు.

| వ్యయము. | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| జీతములు | 2752 | 6 | |
| ఇతరవ్యయము | 35 | 8 | |
| ఇంటిఅద్దె | 180 | 0 | |
| | 2967 | 14 | 1 |

రామయ్య

## అనుబంధము II.

1. ఆంధ్రభాష — ప్రకృతిశాస్త్రములు — ధేరం వేంకటాచలపతిగారు., బి ఎ. రాజమహేంద్రవరము.
2. అశ్లీలత్వనిరూపణము — చెదలువాడ సుందరరామశాస్త్రిగారు, చెన్నపురము.
3. ఆర్యభాషావిభాగము — మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు, విజయనగరము.
4. గోపాలునిరామకవి నన్నయభట్టారకునివంశకవియా — కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు. కాకినాడ.
5. రేఫద్వయవాదనిరాసము — నందగిరి వేంకటప్పారావుగారు, గుడివాడ.
6. ఆంధ్రసాహిత్యపరిషద్వార్షిక సభావృత్తాంతము.
7. స్వాగతోపన్యాసము,
8. అధ్యక్షోపన్యాసము.
9. వార్షికసభలోఁ జదువఁబడిన పద్యములు.
10. వేఁగినాఁటి శాలంకాయనుని రెండు క్రొత్తశాసనములు — కొ. వెం. లక్ష్మణరావుగారు. ఎం.ఎ.
11. దుర్మతిసంవత్సర కార్యనివేదనము.
12. పూర్వకవులు దేశమునకు భాషకును జేసిన యుపకారములు — మంచెలేముల సీతారామ శాస్త్రిగారు బొబ్బిలి.
13. వేమన — వంగోలు వేంకటరంగయ్యగారు., బి.ఏ., బి.ఎల్. నెల్లూరు.
14. అలంకారవిషయము — కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు.
15. నారసింహపురాణము — హరిభట్టు.
16. రెండవపులకేశి నూతన తామ్రశాసనము — కొ. వెం. లక్ష్మణరావుగారు ఎం. ఎ.,
17. రాజరాజనరేంద్రపట్టాభిషేకసంచిక.
18. పాఠశాలలలోని తెనుఁగు — కూచి నరసింహముగారు బి.ఎ.,
19. ప్రథమచాళుక్యభీముని అత్తిలి తామ్రశాసనము — కొ. వెం. లక్ష్మణరావుగారు ఎం. ఎ.,
20. సోముని హరివంశము — నడకుదుటి వీరరాజుగారు.

## అనుబంధము III.

పాలపూడి నరసింహశాస్త్రిగారు — హరపనహల్లి.

వంగూరి సుబ్బరావుగారు — చెన్నపురి.

నారాయణవరము వకుళాభరణశర్మగారు — చెన్నపురి.

కొ. వెం. లక్ష్మణరావుగారు — ఎం.ఏ., చెన్నపురి.

మానవల్లి రామకృష్ణకవిగారు — ఎం.ఎ., చెన్నపురి.

టి. రాఘవేంద్రరావుగారు — మైలాపూరు.

వేములవీడు భీమకృష్ణులు — జేవినహల్లి

## మనకు వచ్చుచున్న పత్రికలు.

1. అభినవసరస్వతి—జానపాడు.

3. ఆంధ్రపత్రిక—చెన్నపట్టణము
4. కృష్ణాపత్రిక—మచిలీపట్టణము.
5. హితకారిణి—ఏలూరు.
6. [illegible]—నరసాపురము.
   [illegible]
8. కర్ణాటసాహిత్యపరిషత్పత్రిక—బెంగుళూరు.
9. [illegible]—చెన్నపురి.
10. గోదావరిపత్రిక—రాజమహేంద్రవరము.
11. వైఖానసపత్రిక—ఈగావారిపాళెము చెంగల్పట్టు.
12. పంచాననం—సోంపేట గంజాము.
13. విద్యాభివర్ధని—వెంకటగిరి.
14. ఆర్యప్రభ—కాకినాడ.
15. ఆయుర్వేదవ్యాసమ్మేళనము—ఏలూరు.
16. తెలుగుదేశవాఙ్మయపత్రిక—తిరువళిక్కేణి.
17. కర్ణాటగ్రంథమాల—మైసూరు.
18. క్షత్రియపత్రిక—ఈగావారిపాళెము.
19. ఆంధ్రభాషావిలాసిని—చిత్రాడ.
20. నవ్వులతోట—బందరు.
21. మాతృసేవ—తాడిపత్రి.
22. శ్రీవైష్ణవపత్రిక—పెంటపాడు.
23. పినాకినీపత్రిక—అనంతపురము.
24. వర్ణాశ్రమధర్మసంస్థాపని—కావలి.
25. యాదవప్రకాశిక—అల్లిపూలగుంట.
26. బాలభారతి—కాకినాడ.
27. మీమాంస—తెనాలి.
28. సుఘోషభారతి—తెనాలి.
29. విద్యార్థి—బెజవాడ.
30. అనసూయ—కాకినాడ.
31. ఆంధ్రలక్ష్మి—బరంపురము.
32. హిందూయువతి—తిరువళిక్కేణి.

# ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటితగ్రంథములు.

## (1) విప్రనారాయణచరిత్రము.

పన్నిద్దరాళ్వారులలోఁ జేరిన తొండరడిప్పొడియాళ్వారు చరిత్రము. కవిత్రయములోని యెఱ్ఱాప్రెగడ చిన్నిమనుమఁడగు చెదలువాడ మల్లయకవిచే రచియింపఁబడిన యపూర్వగ్రంథము. సర్వవిధముల నుత్తమప్రబంధములలో గణింపఁదగినది. వైజయంతీవిలాసముకంటె భిన్నము. ౫ ఆశ్వాసములు. ౪౮ పుటలు. సవిమర్శనమైన ౧౮ పుటలపీఠిక. వెల, రూ. ౦-౮-౦.

## (2) జైమినిభారతము (ఆంధ్రవచనము)

రెండువందల సంవత్సరముల క్రిందట మధురాపురాధీశ్వరుం డగువిజయరంగ చొక్కనాథుని యాస్థానకవియు, సామాజికుండు నయిన సముఖము వేంకటకృష్ణప్ప నాయఁకునిచే రచింపఁబడినది. భాష సలక్షణము. శైలి మనోహరము. ధార యనర్గళము. అందఱును ముఖ్యముగాఁ జదువవలసినది. ౩౪౮ పుటలు. ఆంధ్రమునను, ఇంగ్లీషునను పీఠికలు గలవు. వెల, రూ. ౦-౧౪-౦.

1917-18 సం॥ ఇంటరుమిడియేటుపరీక్షకుఁ బఠనీయగ్రంథము.

## (3) కవిజనాశ్రయము.

వేములవాడ భీమకవిరచిత మగుఛందశ్శాస్త్రము. ఆంధ్రచ్ఛందోగ్రంథములలో మిక్కిలి పురాతనము. అనేక లిఖితపుస్తక పరిశోధనపూర్వకముగా మూలపాఠము నిర్ణయింపఁబడినది. పాఠభేదములు పుటలయడుగునఁ జూపఁబడినవి. సంస్కృతకర్ణాటాంధ్రఛందస్సుల భేదాభేదము లచటచటఁ బ్రదర్శింపఁబడినవి. కవినిర్ణయము, కాలనిర్ణయము, ఛందస్స్వరూపము మొదలగు విషయము లనేకములుగల విపులమయినపీఠికయు, విషయసూచికయు, ననుక్రమణికయుఁ గలవు. విద్యార్థులకును బండితులకును గూడ నుపయోగకరము. వెల, రూ. ౦-౧౦-౦.

## (4) యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము.

మ-రా-రా-శ్రీ, జయంతి రామయ్యపంతులు బి. ఏ., బి. ఎల్. గారిచే రచియింపఁబడిన సవిమర్శ పీఠికాపూర్వకముగాఁ బ్రకటింపఁబడినది. ఈశాసన మాంధ్రపద్యాత్మకము. నన్నయభట్టారకుని కాలముకంటె ముందుఁ బుట్టినది. ఆంధ్రభాషాస్వరూపము తెలియఁగోరువారల కత్యంతోపయోగకరము. 1917-1918 సంవత్సరములు బి. ఏ. పరీక్షకుఁ బఠనీయగ్రంథముగా నిర్ణయింపఁబడినది. వెల, రూ. ౦-౮-౦.

## (5) నీతిసీసపదశతకము.

తాళ్లపాక పెదతిరుమలార్య విరచితము. శ్రీవేంకటేశ్వరుల కంకితము. వెల, రూ. ౦-౪-౦.

## (6) జ్యోతిశ్శాస్త్రసారము.

వచనము. శ్రీమాన్ కపిస్థళము కృష్ణమాచార్యులు బి. ఏ., ఎల్. టి. గారిచే రచింపఁబడినది. ఖగోళవిషయముఁ దెలిసికొనఁ గోరువారి కిది యత్యంతోపకారకము. వెల, రూ. ౦-౮-౦.

## (7) A Defence of Literary Telugu, by J. Ramayya Pantulu Garu 0-8-0.

## (8) జ్ఞానప్రసూనాంబికాశతకము.

శ్రీకాళహస్తీశ్వరుని దేవియగు జ్ఞానప్రసూనాంబను స్తుతించుచు శిష్టు సర్వశాస్త్రి రచియించిన భక్తిరసప్రధానమైన పద్యశతకము. అనర్గళకవితాధార గలది. వెల, రూ. ౦-౪-౦.

# చంద్రభానుచరిత్రము

తరిగొప్పుల మల్లనకవి విరచితము.

మిక్కిలి ప్రౌఢప్రబంధము. వెల, రు. ౧-౦-౦.

# కావ్యాలంకారచూడామణి.

విన్నకోట పెద్దయకవిప్రణీతము.

ఇదివఱకు అచ్చుపడి ప్రచారములో నున్నదాని తరువాతి భాగము, ఛందోవ్యాకరణవిషయము. వెల, రు. ౦-౮-౦.

# చంపూరామాయణము.

ఋగ్వేదికవి వేంకటాచలపతికవిప్రణీతము. వెల, రు. ౧-౦-౦.

భోజరాజకృతసంస్కృతరామాయణచంపువునకు ప్రథమాంధ్రీకరణము. కార్వేటినగర సంస్థానమునం దున్న [illegible].

# శివరాత్రిమాహాత్మ్యము.

## (సుకుమారచరిత్రము)

శ్రీనాథమహాకవి. వెల, రు. ౦-౧౨-౦.

# కవిజనాశ్రయము

వేములవాడ భీమకవిఛందము. వెల, రు. ౦-౧౦-౦.

# ప్రాకృతభాషోత్పత్తి.

శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు రచించినది. రు. ౦-౧౨-౦.

# శివతత్త్వసారము.

మల్లికార్జునపండితారాధ్యులు రచించినది. వెల, రు. ౦-౧౨-౦.

# సర్వేశ్వరశతకము.

యథావాక్కుల అన్నమయ్యగారు రచించినది. వెల, రు. ౦-౩-౦.

కావలసినవారు ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శులకు, చెన్నపురి, వ్రాసికొని పడయఁగలరు.

---

Printed at the British Model Press, Choolai and published at the Telugu Academy Office, 39, Harris Road, Pudupet, Madras.

చందా సం॥ కు రూ. 3. విడిసంచిక అ. ౮.



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

సంపుటము ౧౨.

రుధిరోద్గారినామసంవత్సరము.
ఆశ్వయుజ—పుష్యమాసములు.

సంచిక ౪-౫.

## ప్రధానవ్యాసములు.



చెన్నపురి. ౧౯౨౪.

# విషయసూచిక.

---

విషయములు. పొరటలు.

ఆంధ్రసాహిత్య
పరిషత్పత్రిక

సంపుటము ౧౨. | రుధిరోద్గారినామసంవత్సరము. ఆశ్వయుజ—పుష్యమాసములు. | సంచిక ౪-౫.

శ్రీరామమూర్తిమహాశయునకు.

# హాస్యతరంగములు

## నాంది.

—————

శా. రత్నోపేతము లుంగ్రముల్ దొడిగి ధర్మన్యాయసంకల్పము
ద్యత్నం బొప్పఁగఁ జేసి ప్రాభవము ముద్రాయత్త మార్జించి ని
ర్యత్నం బైన ననామికాత్వమును బాయన్లేని ప్రే లట్టు స
ద్యత్నుం డయ్యె ననామకుం డయినసూర్యారావు నాలింపరే.

అతఁడు రౌద్రిఫాల్గునమాసములో దర్శమహాపుణ్యకాలమున దండకారణ్యాంతర్గతవీక్షారణ్యస్థ హృత్తాపనాశనీతీరసుప్రసన్నుం డైనవీరరాఘవస్వామిని సందర్శింపవచ్చిన భక్తవరులతో నిట్లు విన్నవించుచున్నాఁడు.

ఓభక్తాగ్రేసరులారా? భూతభవిష్యద్వర్తమానము లెఱింగినవారు, సమయ మెఱిఁగి జనసహాయము తగ్గియున్న నన్నుం గూర్చి యామహాత్మునకు నివేదింపరా! ఆపుణ్యాత్ముఁడు నూరకున్న నాలేఖిని మూలఁ బడవైచి పుస్తకసన్న్యాసముం జేసెదను.

నటి—(ప్రవేశించి) ఆర్య! మనకవిపరిదేవనమేనా యిది.

సూత్ర—శాంతము పాపము! ఇది పరిదేవనమా.

నటి—ఎప్పుడును లేదో లేదో యని.

సూత్ర—ఇం దసత్య మే మున్నది.

క. అందఱు దేశోద్ధారకు, లందఱు భాషాభిమాను లందఱు భాషా
సుందరికి మగల మందురు, పొందినదుర్దశలు దేశమును విడిచెనొకో.

నటి.—మాకే మన [illegible] గండపెండారము లెట్లు వచ్చినవి వచ్చినను దారిద్ర్య [illegible]

సూత్ర.—[illegible] రాజులు పండితులుఁ గూడి గండపెండారములు వేసిరి.

నటి.—[illegible] జనావరము తగ్గిన దనునే. అనావాకుఁ డెట్లు. ఎందులో నీ తనప్రసిది? ఏప్రసిది కీబిరుదములు.

సూత్ర.—సన్యాసియు సన్యాసియుఁ గౌఁగిలించుకొనిన బూడిద రాలినది.

నటి.—కవిరాజులు పండితులు—నిజమే వీరికి ధన మెక్కడిది.

సూత్ర.—కవిరాజు లనఁగఁ గవిరాజులు గారు.

నటి.—ఈ పండితులు నీకవిరాజులు వీని కేల బిరుదములం దొడిగిరో.

సూత్ర.—అట్లనుగుము.

ఉ. ముప్పదివర్షము ల్గాలెను ముక్కును మూలము లేని రోగముల్
ముప్పిరిగొన్న లోఁగ నసము ల్కవిరాజులు బేలుపోయి రీ
త్రిప్పుల వ్యాధులం దొలఁచు దివ్యభిషక్కుటి జానకీశుఁడే
తప్ప నొరుల్గలారె బిరుదంబులు నీకొక లెక్కలోనివే.

అయినను—

గీ. నిమ్ముఁ గాంచి యేనని కడంగి నిష్ఫల, యత్నులైన వైద్యరత్నములను
జనులు నవ్వకుండఁ జనకుఁ డాతనిదరి, కనుచు గుప్తగాఁగఁ గొనుము వీని.
అని కాలికి బిరుదములు తొడిగిరి.

నటి.—ఇదియా కారణము. వైద్యులచేతఁగాక వీరరాఘవస్వామికడియములం దొడిగిచూచిరా! ఇంక వ్యాధియుండదు. దారిద్ర్య మెల వచ్చినది.

సూత్ర.—గీ. దాంభికులు మోసపుచ్చి పుస్తకము లంది
కొని ప్రతిశ్రుతమీక చిక్కువఱుపంగఁ
జాతు రిది కొంత జనము విశుద్ధమేని
లేదు లే దని మొఱపెట్ట వేదుతేమి.

నటి.—అట్టిచో నిర్యత్నముగ నున్నకుండరాదా.

సూత్ర.—ఓసి వెఱ్ఱిదాన! ఎవ్వ రేపని చేసినను దేశోద్ధారమునకే కదా. దంభము లేక యొనర్చిన పనివలననే కదా—లోకము బాగుపడును.

నటి.—కవులలో భాషావిషయములో దంభము లున్నవా.

సూత్ర.—గీ. ఏట్టికథవ్రాసి యొకజగజెట్టిఁ గోరి
పీఠిక పదింతలుగ వ్రాయవేఁడి చేర్చి

పీఠిక ప్రశస్తిఁ జెప్పుచు వెనుకముందుఁ
జూడ రిది దాంభికులో వారు శుద్ధమతులొ.

నటి—అట్టిదానికి వా రంతపీఠిక యేల వ్రాసెదరు.

సూత్ర—వారిదంభము వారిది. పీఠిదంభము వీరిది.

నటి—జనులు చక్కగా మోసపోవుచున్నారు సంతమోసముగులే గాని చక్కని కృతులు చేయ రేల.

సూత్ర—మోసకృత్యమే జనులను సులభముగా నాకర్షించును.

గీ. లక్కవెట్టి కుండలమ్ములబంగారు, మక్కువెట్టి మంచిమ్రానిముక్క
తుక్కువెట్టి పటపుదూదిని విడియట్ల, ముక్కువెట్టి చర్మమును హరింత్రు.

నటి—లోక మంతయు మోసమే.

సూత్ర—స్వార్థపరు లం దెంకుగో గలుగ.

నటు—స్వార్థమేమి పరార్థమేమి.

సూత్ర—స్వార్థమున -

గీ. గ్రుడ్డికంటికిఁ దగిలించుకొనును గాజు, మొండిచేతికి 'రబ్బరు' మూఁత వెట్టు
కుంటికాళ్లకు 'బూడ్సు' దొడ్గును జనంబు, కలది కలయట్లుచూంప సుంకంబు గలదొ.

నటి—జనులు మోసములను బహుకాలమునుండి సత్యమని నమ్ముచున్నారు.

సూత్ర—చెప్పినను వినరు.

ఉ. గారడివాఁడు నాణెములు గా రచియించును మంటిపెళ్లఁ బం
గారుగఁ జేయు నంతయును గల్లయన న్గనుకట్టుటన్న ని
ష్కారణవైరకల్పనము గన్గొననోపవు వానిశక్తి యం
ద్రారయ రట్టి శక్తిగల యాతఁడు ముష్టికి వచ్చునే చెలీ.

నటి—వారొనర్చినవి మనచేతిలోఁ బడిన మాయమగును.

సూత్ర—నీకును వెట్టి - నాచేతి కిమ్మను - చూచెదను.

నటి—లోకములో మీరో నేనో యెవ్వరో మోసమునకు లోపడియున్నారము.

సూత్ర—దొరసానులకు మంచిగేదంగులు లేకనా గుడ్డగేదంగులు -

నటి—ఇది పరార్థము. చిన్ననాటకముల కింతపెద్దనాంది యేల - ఇది మీదంభముగదా.

సూత్ర—సభవారి యాజ్ఞ యిది.

నటి—ఎట్టివి ప్రదర్శింపఁగోరిరి.

సూత—ఒక్క నెలలో జరుగఁదగినప్రదర్శనము లొక్కొక్కగంటలోఁ బ్రదర్శింపఁగోరిరి.

నటి— దీని కుపాయ మేమి.

సూత్ర—ప్రదర్శించి తప్పులున్నఁ బ్రథమప్రయత్న మని మన్నింపఁగోరుట.

నటి—లోకము చేయుమోసములకు లొంగక - చేసినచేయి యూరకుండక మనమిత్త్రరత్న మేమైన సిద్ధికార్యములో మనకుఁ దోడుపడు ననునమ్మకము మీకున్నదా.

సూత్ర—ఉన్నది కావుననే నడుముకట్టి తాంబూల మందికొంటిని.

నటి—మనయాటకుఁ దగినపాటకాఁడు దొరకినాఁడు.

సూత్ర—ఇదియే యన్నింటికి నాందిగా నొకగాన మారంభింపుము.

నటి— చూడుఁడు గానము చేసెదను.

చ. తపమున శాంతి జంతువితతప్రియభావము సత్కృతోద్యముం
గుపితమనస్కతం గనుట క్రోధము దీఱఁగ వేఁడికొన్న న
చ్చపుఁగరుణాకటాక్షము భృశంబుగ మానులచర్య యెన్నఁగా
నుపచయగుం బ్రసక్తకథ కూర్జితసత్కృత్రిని జిత్తగించినన్.

సూత్ర—అగును - నీమాటలు వెంబడినే దుర్వాసోముని వచ్చును గనుము.

నటి—అమ్మయ్యో నాకుభయము! ఆయనపేరు సింహస్వప్నము.

సూత్ర—మఱి నీవు లోనికిఁ బొమ్ము.

నటి—దారిలో నాముని యెదురుపడు నేమో.

సూత్ర—నేను గూడ వచ్చెదను, పదపదము. ఆర్యులార! ఒక్కింత నాకు సెలవిండు.

(నిష్క్రమించుచున్నారు.)

శ్రీమదుమారమణాయః

# హ్రస్వరంగములు.

## ౧. క్రోధశాంతి.

(దూర్వాసుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

దూర్వా—(పర్ణశాలయెదుట) త్రి. త్రి. త్రి. రా. రా. డొక్కలు దించుకొని పోయినవి. దా. దా. త్రిట్. త్రిట్.

(లేడిపిల్ల ప్రవేశించుచున్నది.)

దూ—(చేత నివ్వరిధాన్యము చూపి) ఆఁకలిగా నున్నపుడు దగ్గఱకు రారాదా. యడుగరాదా. దా. దా.

లేడి—(వచ్చి తినుచున్నది)

దూ—బా. బా. తిను, తిను, భయము లేదు.

లేడి—(చనవున మునియొద్ద గంతులువేయును.)

దూ—ముందు రెండునోళ్లు తిను - గంతు లానక వేయవచ్చును.

లేడి—(చేతిలో నోరు వెట్టి - బెదరి దూరముగాఁ దొలఁగును.)

దూ—ఆఁ! దా. నాకు స్నానమువేళ యైనది. పెంకితనము తర్వాతఁ జేయుదువుగాని - ప్చు - ప్చు.

లేడి—(ఆకసమువంకఁ జూచి బెదరి పాఱిపోవును.)

దూ—(ఇటు నటు చూచి) ఆఁ! ఎవ్వఁడురా. నాబిడ్డలేడిని బెదరించినది. ఎవ్వరును గనఁబడరు! కారణము లేక యేల తిండిమానిపోవును. ఎవ్వఁడురా! నాతోఁ జరలాటమాడువాఁడు!!

క. ఇంద్రునకుఁ జిక్కయెదురు ను, పేంద్రునకుం బ్రక్కబెదరు ఋషిమండలపా
రీంద్రముఁ గడుపా చెఱువా, సంద్రముతోఁ జౌటిపడియసాటి నెదుర్పన్.

రారా; నాతో డాఁగుడుమూఁత లాడెదవు. ఎదుటవచ్చి నిలువుము. ఓరీ నీచుఁడా! ఒక్కనాఁడు నొక్కనికి నోడనివాఁడను - కృష్ణద్వైపాయనునితో నెదిరించి సమమైతిని గాని యీషన్మాత్రముఁ దీసిపోనివాఁడను.

శా. శాపం బీవఁ దన్న మానక మనస్సాంచల్యసాహిత్యదీ
క్షాప్రాప్తిన్ శపియించి కృష్ణసుతు రక్తప్రస్ఫురన్నేత్రతన్
దీపింపం గుపితుండుగాక నను స్తోత్రించెన్ యథావత్కథా
రూపం బాత్మకృతార్థవత్కథల సూరుల్మెచ్చ వ్యాసుం డొగిన్.

పాపిష్ఠ! నీవు నాజ్ఞాతివా! నీనాఁడుమ నేమైన నభియోగ మున్నదా! ఏమే నపకారము చేసితినా! నిష్కారణము దుష్కార్యమునకు విజృంభించితివి! నా దేమితప్పు!

శా. నోరు న్వాయును లేని లేఁడులకు వానుల్గూర్తు రత్యంతముల్
హారాభావభయప్రమాదముల నిత్యం బేమరక్షించునీ
సారంగార్భక మేమిచేసె నిను మెచ్చంబోవె, పోని మ్మెదు
ర్కోకాదో శాసింపరాదో నను నీకుం బౌరుషం బున్నచోన్

న్యాయకీర్తి నాతప్పు లెంచి తిట్టినను నే నోర్చికట్టెదను. అన్యాయముగ దుర్జనలక్షణం బగునీస్వేచ్ఛ బిచ్చుకపై బ్రహ్మాస్త్రప్రయోగము చేయుచున్నాఁడవా. మూర్ఖా! తులువా!

గీ. మేనకచలంబు కౌశికు మేటి కిన్క, కణ్వసద్బ్రహ్మతేజం బఖండమండ
లాధిపుం డగుదుష్యంతునాధిపత్య, మింత లెక్కింప మ్రుక్కడి వేమిలెక్క.

నీ వమర్త్యుండవా మర్త్యుండ వగుము. నరుండవా నిరుండుండ వగుము. గగనచారివేని భువనపతనంబు నిక్క మగును. నాగలోకవాసివేని ని న్నధఃపాతాళమున కణఁగఁ ద్రొక్కెదను. నాక్రోధంబు బారినుండి నిన్నుద్ధరింపఁ ద్రిలోకంబుల నొక్కరుండు గలఁడా! భద్రా! భద్ర! నాకమండలు వేది.

శిష్యుఁడు—(ప్రవేశించి) ఎవ్వరిమీఁదనో కోపదృష్టి నున్నవారు, (సమీపించి) నే నోలుకఁబోయ లేదు (నడఁకును)

దుర్వా—రెండవవాఁ డెక్కడ?

శిష్యు—సమిధలు తేఁబోయెను. (వడఁకుచు) నేను గమండలువును దాఁకనే లేదు. ఒట్టు. నే నోలుకఁబోయలేదు.

దుర్వా—నే నే మడిగితిని. నీ వేమి చెప్పుచున్నాఁడవు?

శిష్యు—గంధర్వునిశపించుటకుఁ గమండలూదక మడుగుచున్నారు.

దూ—గంధర్వుఁ డెవఁడు?

శిష్యు—బెదరి నాల్గుకాళ్లు గుప్పించి యెగిరినపుడు లేడిపిల్లవలననే కమండలువు తిరుగఁబడిపోయినది కావచ్చును.

దూ—ఏ విమానచారి యెవ్వఁడో గంధర్వుం జూచి రావలెనదా! ఆగంధర్వుని విమానమును వానిగర్వముతోడి మానమును గ్రిందికి దించెను. భద్ర! మఱి కమండలు వేది?

శిష్యు—ఉటజద్వారమున బోరగిలఁబడి యున్నది.

దూ—ఎవ్వరో లులకఁబోసిరో యెఱుఁగవా?

శిష్యు—నే నెఱుఁగను. నేను జూడనే లేదు.

దూ—నీవుగాక నేనుగాక మఱి యుటజములో నెవ్వ రున్నారు. ఒకవేళఁ గోపములో నొడలెఱుఁగక నేనే యొలుకఁబోసి బోర్లఁద్రోసితినా.

శిష్యు—అట్లయి యుండదు.

దూ—నాకుఁ దగినశిష్యుఁడవు - నీవుగాదు, నేనుగాదు, నీవుచూడ లేదు.

శిష్యు—భయపడి పరుగెత్తు లేడిపిల్ల కాలు జగిలి పడినదేమో.

దూ—(విని) ఆలాగా! పోనీ పాపము దాని కేమి తెలియును. ఆ! ఓరీ కష్టాత్మ! నామృగమే నీకంటెఁ బడినదా! నీవు నాకంటిమంటఁ బడియెదవు. భద్రా! గంధర్వుఁ డంటివిగదా.

శిష్యు—విమాన మొకటి గగనమునఁ బోవుచుండ భీతిచే -

దూ—ఆఁ! నానెత్తిమీఁదినుండి విమానమును నడపెనుగా. నీవుపోయి కుండిక కడిగి మంచినీరు త్వరగాఁ దెచ్చెదవా.

శిష్యు—ఆజ్ఞయైనఁ దెచ్చెదను.

దూ—పోనిమ్ము. నీరెందుకు, నోరు లేదా.

శిష్యు—ఆచమనమైనఁ జేయవలదా.

దూ—వీనికై యింతశాస్త్రవిధాన మక్కఱలేదు. కాని—ఏమని శపింపను? చెప్పుము.

శిష్యు—నాకు మొదటనే శాపమన్న భయము.

దూ—తపోభంగ మనియా? నేను గోష్ఠులలో నగ్నికెక్కినవాఁడ నైతిని. ఇఁక భయమేమి.

శిష్యు—ఆతఁ డీవృత్తాంత మెఱుఁగునో యెఱుఁగఁడో.

దూ—నేనిప్పుడు స్పష్టముగా నెఱిఁగించెదను. భద్ర! ఇందాఁక నాయెదుట నెవ్వరో నిలువంబడిన ట్లయినది?

శిష్యు—పాపము! నారదుఁడు లేడిపిల్ల పాఱిపోయినపిమ్మట వచ్చినాఁడు. ఆతఁడు కాఁడు.

దూ—అతఁ డేఁడీ! తప్పుకొని పోయినాఁడా. అతనితిండి నాకంటిలో నున్నది. నన్నాశ్రయించికొన్న నతనికి మృష్టాన్నము దొరకును. ఎవ్వఁడురా పుష్పకమెక్కితి నని గర్వించిన గంధర్వుఁడు. గర్వాంధుఁడు!

చ. ఒరుశకటంబు నెక్కి కడు నోరగిలంబడి నిక్కి చూచుచుం
దిరుగుడుగుర్ర్లుఁ, గాలిపయిఁ దీర్చినకాలును గాఁ బరిభ్రమిం
తురు పురిలోఁ దలోదరులతోడ మదాంధులు మిన్నుముట్టఁగా
నరిగెడు నీఖచారి కనునా వనవాసులకష్టసౌఖ్యముల్.

శిష్యు—స్పష్టముగా గంధర్వుఁడే - మగనాలుకూడఁ బ్రక్కనే యున్నది.

దూర్వా—ఎవ్వఁ డయియుండును! ఇపు డేవాఁ డేవంశమువాఁడో తెలిసికొనుట కష్టముగానే యున్నది. వత్స! గంధర్వులకుఁ బ్రక్కనే మగనాండ్రుండుట నీ కానవాలా.

శిష్యు—అదిగాక నరులు విమానము లెక్కుదురా.

దూ—నీ వెఱుఁగవులే - మఱి యీగంధర్వుఁ డెవ్వఁడందువు?

(తెరలో - ధ్వని) మహాత్మా! క్షమియింపుము. క్షమియింపుము.

దూ—(విని) ఎవ్వరది, మొదలు శాపమే లేదు. క్షమియించుట యెక్కడ.

శిష్యు—(తనలో) నారదుఁ డేమో చెప్పియుండును.

దుర్వా—ఎదుటంబడి ప్రార్థించువానిం గన్నఁ గోపము తగ్గును. శాపము పణముగాఁ బడదు. నారదుఁ డీప్రక్కలనే యుండును.

గీ. హరిణపోతంబునాఁకలి యారలేదు, నాదుకోపంబు చల్లాఱలేదు శాప
మీయులే దింతలో వచ్చురాయబారి, నారదునితోడ వీఁడు గంధర్వుఁ డకట.

మాటలే మంత్రములు, నీటితోఁ బనియేమి? వీరు నాయెదుటికి రాకమున్నె శపించెదను. గంధర్వుఁడే యైనచో -

క. ఎవ్వఁడు నామృగపోతము, నివ్వరులం దినెడువేళ నిలుగుచు నీర్ష్యన్
దవ్వుగఁ బాఱంద్రోలెనొ, యవ్వాఁ డిల మర్త్యజన్మ మంది కృశించున్.

(తెరలో) - మహాత్మా క్షమియింపుము క్షమియింపుము.

దూ—ఇపుడు రానీ చూతము. నాపరుగుఁ గలసికొమ్మను. ఏనారదుఁ డేమి చేయునో.

గంధ—(ప్రవేశించి) మహాత్మా! అజ్ఞానిని క్షమియింపఁదగును.

దూ—(తలయూఁచి) పాపము. అజ్ఞాని! వెన్న పెట్టినఁ దిననేర్చునా వ్రేలుపెట్టినఁ గఱవనేర్చునా.

గంధ—మహాత్మా! ఏమి మిమ్ము జూచనే లేదు. నాదానికి నేను బోవుచున్నా(డను. క్షమింపుము.

దూ—నాతలమీ(దినుండియేనా నీకుదారి.

గంధ—ఆశ్రమసమీపమని తెలిసికొనలేదు.

దూ—కన్నులు నెత్తిమీ(ద( బెట్టుకొంటివా.

గంధ—అశ్లేషమైనది; గర్వాంధు(డను.

దూ—అలితో విమానమెక్కి మమ్ము గేలిచేయుచున్నా(డవా.

గంధ—శివశివ! ఎంతపాపము! (పాదములపై( బడి) నామొదటితప్పు క్షమియింపవలయును.

దూ—ఎట్టా! పో, నాయొద్దకి రాకుము. ప్రథమాపరాధమును మన్నింపవలయునని యేరాజైన శాసనము చేసియున్నా(డా. పోపొమ్ము.

గంధ—రాజు లెంతటివారు; తాము మునిరాజులు శాసనములలో వార్తికములు చేర్పవలయును.

దూ—తల(గు తల(గుము. అజ్ఞానివి.

గంధ—సత్యముగా నజ్ఞానిని.

దూ—సత్యమే నీయజ్ఞానము నాకోపమును దెలిసికొనలేకపోవుటలో( గన(బడుచున్నది. లేడి, అందునను బిల్ల, చేరె(డుగింజలతో దానిపొట్ట నిండును, రెండుగింజ లందుకొననిచ్చితివా.

గంధ—ఆశ్రమమే చూడలేదు, లేడి నె ట్లెఱు(గుదును.

దూ—బెదరించుట మాత్ర మెఱు(గుదువు.

గంధ.—నేనేమి మీ లేడి నేమి బెదరించుట యేమి. క్రూరమృగమునా, మృగయు(డనా - వేట వెత్తిగల రాజనా.

దూ—నా లేడిప్రాణమునకు నీవు క్రూరమృగమవే. మావర్ణ్యలు నీకు(బరిహాసముగా( దో(పవచ్చును.

గంధ—మీతో( బ్రతివచనము లాడ(జాలను.

చ. అది గ్రహచార మాతరుణమందున( బుష్పక మబ్దమండలం
బుపరియ మీ(దికిం జనియె, భూమిని జూడను—

దూ—కాలము తారుమారైనది. సంస్కారములు మొండైనవి. ఋష్యాశ్రమము మీ(ద( గూడ నిరాఘాటముగా నేగుపుష్పకములు బైలుదేఱినవిగ. ఇంక నెన్నివింతలు గన(బోదుమో.

గంధ.- ఏరా చేయనిసను వలవాంచి యుండవలసినదియే.

చపలముగాఁ గుటీవసతి జల్లిదొ లేడిని మేపుమిమ్ము నె
య్యపుననుఁ జూడలేదు పరిహాసము సేయుఁగఁ గంవక్రొవ్వొకో.

అదియునుంగాక బ్రహ్మతేజోవిరాజితు లగుమునిరాజులయెదుట నాసిపోయిఁగుల
గంధర్వజాతి సిగ్గుమాలి నవ్వఁబోవుటా!

దూ—ఏల నామృగశాబకము ఇవనివలయును.

గంధ—నాదినములకొలఁదిఁ శెల్లక్రీడలలో నేవోయిబ్బ భయంకరాకారముగఁ
బరాకునసున్నపుడు కసఁబడియుండును.

దూ—అట్లయిన నేఁజెప్పినట్లు చేసెదవా.

గంధ—శ్రేష్ఠమిాఁద నిలువు మనిన నిలిచెదను.

దూర్వాసుఁడు—

గీ. బుద్ధిపూర్వకముగ లేడిబుడుతకీవు, ఇవవుపుట్టింప లేదటన్నది నిజంబ
యేని నాచేతినివ్వరు లింప పిలిచి, మేపు చూతము మఱి మిడిమేల మేల.

గంధ—(విని) హా! ఇదియేమి! సత్యముగా నే నేమియుఁ దెలియనివాఁడనే.
అయిన నపరిచితమృగము నేను బిలిచిన వచ్చునా. ఈలేడి నన్నుఁ బరీక్షిం
చుటకై వచ్చిన మాయామృగ మేమో—స్వామీ!

చ. కడుపునఁ గన్నబిడ్డ యొకకాలము తల్లియు మూఁడునాల్గునా
ళ్లెడవడి వచ్చి పిల్చిన మెయిం బుయిలోడును రాదు చేరఁగాఁ
జిడిముడిపాటునం బఱచి చేరఁగవచ్చునె క్రొత్తవాఁడ నేఁ
బిడికిట నివ్వరు ల్గొనుచుఁ బిల్చిన యత్నముచేసి చూచెదఁ.

దూ—భద్ర! కోపమునఁ జేతిలోని గింజ లెక్కడనో చల్లియుందును. పర్ణశాల
లోఁ బోఁకదొన్నెలోని గింజలు కొన్ని తామరాకులోఁ బోసి తెమ్ము.

శిష్యు—చిత్తము. (అని పోయి తెచ్చి గంధర్వునకిచ్చును.)

గంధ—(ధాన్యముం జూపి) ఓనారంగశాబమా.

గీ. ననుఁ బరీక్షింప నెంచిన త్రినయనుఁడవొ, తత్పరీక్షార్థసహకారి త్వన్మునీంద్రు
కోపహాసంబవో యెలగోలుజల్లు, గురియుమ కటాక్షశిశిరామృతరస మిప్డు
ఓ జింకబిడ్డ!

ఉ. నామొగి మెప్పఁడేఁ గనిన జ్ఞాపకమున్నదె నిన్ను నెప్పుడే
నేనుసినాఁడనో తెలుపు మేటికి నాకిటువంటిశిక్ష యీ

భామిని మేక లేడి యొక పోలికి మెత్తని జంతువు గ్గదా
గూమెయిఁ గ్రూరభావ మది హేతువు లేకయ సంభవించునో.

ఓశరణహరిణమా! నా. అకృత్రిమహృదయముతో నాయందుఁ గరుణామా పుము. బుష్యాశ్రమములో నెట్టియక్రమమునకు నెడము లేదు. అకల్మష భావముతోఁ బిల్చెదను. నాయొద్దికి నిష్కల్మషభావముతో రమ్ము. దా. దా. ట్రిక్. ట్రిక్. ప్పు. ప్పు. బాబా. నే నేనాఁడును లేడిని బెంచుట యెఱుఁగను. పిల్పుధ్వనులును నాకు రావు. కోడి నొకకతేని, పావురము నొక-ఫక్కిని బిల్లి నింకొకమాదిరిఁ గుక్క నొక్కలాగున దానిపిల్ల నింకొక్కలాగునఁ బిల్తురు. ఎన్నో భేదములు. పిల్పుశబ్దము లైనను నాకు రావు. విమానములో నున్న నాయిల్లాలు కొంతమేలు.

శిష్యు—పోయి పిల్చి తెత్తునా.

గంధ—నాయత్నము విఫలమైనప్పుడు గదా. దాదా ట్రిక్ ట్రిక్. ట్రిట్టుటు.

లేడి—(మెల్లఁగఁ దెరలోనుండి వచ్చి యిటునటుఁ జూచును.)

గంధ—నాయిష్టదైవము! నాకుఁ బ్రత్యక్షమైతివి. రారమ్ము. ట్రిట్. ట్రిట్.

లేడి—(సమీపించి - ముందంజలెత్తి గంధర్వుని మూఁపుపైఁ బెట్టి ముఖము మూర్కొని చేతిలోని ధాన్యముం దినును)

గంధ—(సగద్గదము) మానీంద్ర! నే నెవ్వఁడనో పరవశుఁడ నైతిని. (ఆశ్చర్యపడును.)

దూ—(తనలో) తెలిసినది. మేలు.

(ఆకాశమున—ధ్వని.)

సత్యము సత్యము. ఈగంధర్వుఁడు నిరాగసుఁడు. నిష్కపటి.

దూ—ఓనారద. నీమూలమున వచ్చినకలహమే యిది.

నార—(ప్రవేశించి) దుర్వాస! నీకోపము దీఱినది కావునఁ జెప్పెదను, నే నీశ్వరుని దర్శించి వచ్చుచు నీకీవృత్తాంతము దెల్పరాఁగా నాగవల్లితీఁగకు నావీణతంతి తగిలి మ్రోఁగినది. దీనికై లేడి బెదరియుండును.

దూ—మఱి యీతని కుపకృతి యేమి.

నార—ఇట్లు (అని చెవిలోఁ జెప్పును)

గంధ—క. ప్రారంభమునం దీతఁడె, కారణముం దెల్పఁ బిదపఁ గడసారి మునికా
సారంగము మెప్పించినఁ, దీరుపుచెప్పంగ వచ్చె, దివ్యముని బలే.

మార్గా—నీవు వచ్చినప్పటికే మిన్నుఁజూచి జెదరిన దని మాకీ ఋషివాఁడు చెప్పుచున్నాఁడు.

గంధ—(తనలో) అన్యాయ్యా! ఆశాపము నారదునకుఁ దగులదు. పోనీ.

మా—ఓ గంధర్వరాజ!

గంధ—(తన) మఱపిలువుతో నేను కృతార్థుఁడను. (ప్రకా) ఏమియానతి!

మా—కారణ మిది నారదుఁడు చెప్పెను.

గంధ—అంతేయు మిది యనుభావము.

మా—నిన్ను భూలోకమునఁ బుట్టి కృశింప ననుశపితిని.

గంధ—నిగ్రహానుగ్రహసమర్థు లెట్లాడిన నేమి.

మా—దానినే కొంతమార్చు చున్నాఁడను.

నార—ఈసభలో నేను సభ్యుఁడ నగుదునో కానో. నేనేమైన సభకీయవలసి యున్నదేమో. కాని మొదటితీర్మానములోని కృశించు ననుపదము తీసివేయవలయును.

మా—నీవు గౌరవసభ్యుఁడవు కావున నుపపాదింపవచ్చును.

నార—అట్లని "యిల" యనునది యుపర్యాప్తిం బొందినది. స్థలనిర్దేశము ముఖ్యము.

మా—ఈక్రిందితీర్మానమును సర్వజనాంగీకృతముగ నిర్ణయించి దీనిప్రతి నొకదానిని గంచిలో మానిడిచెట్టునకు వ్రేలాడఁగట్టవలయును. ఆలకింపుఁడు.

మ. సిరితోండం డనుజంగమార్చకగణశ్రేష్ఠుండవై కంచిలో
నిరతంబున్ శివభక్తులం దనుపుచున్ శ్రీకంఠదీక్షన్ మహో
ద్ధ్వరసాదృశ్యశివవ్రతంబున జగత్ప్రస్తావముం గాంచి కాం
తు రహిం గేవలకావ్యశైలనివసద్రుద్రప్రలీనం బొగిన్.

గంధ—ఇదినాకు శాపమా! వరము.

నార—ఈవరము నీవెట్లు కాపాడుకొందువో.

గంధ—మహాత్మా! దీనఁ గష్టమేమి గలదు. అరఁటిపండువలె నున్నది.

నార—అట్లు గాదు. నిన్నుఁ బరీక్షింపఁ గోరి యనేకులు కొంటెభక్తులు శైవులు వత్తురు.

గంధ—ఏమిభయము! శైవం బగుపని యెంతకఠిన మైనదైనను నాకు సంతసమే! నాతండ్రి యేకామ్రనాథుఁడు గలఁడు.

నార—ఏమో! జాగ్రత్త.

ఉ. ఆ లుడికించి పెట్టు మని ఆంపముతోఁ దలఁగోసికొమ్మటం
  చాలిని దెమ్మటంచు నిజహస్తమునం జెఱకాడి పానకం
  బోలిని ద్రావని మ్మనియు నొక్కకుమారుని జంపి కూరగాఁ
  జేలిచి యేకనం గుడువ విస్తరిలో నిడుమంద్రు చేసెదే?

గంధ—ఓహో! నన్నంతగఁ బ్రార్థించు నర్థివరులు వత్తురేని చరితార్థుండనుగదా!

దూ—ఈసత్యవంతుఁడు, నారదా, రెండవహరిశ్చంద్రుని దలపింపను.

గంధ—(తన) భవత్కరుణావిశేషమున నీదాసుఁ డెంతకైనఁ జాలఁగలఁడు.

నార—నీవును నీధర్మపత్నియు నీవిమానమునఁ గంచికిఁబొండు.

గంధ—చిత్తము! (అని నడచి చూచి) ఆహా! అద్భుతము! దారుణశాపాక్షరములు వినినంతనే నామగువ మూర్ఛ నడినది. ఇఁక వీరియానతి నెట్లు నడపెదనో! ప్రాణేశ్వరి! లెమ్ము. మునీంద్రునిప్రసాదమును బడసి వచ్చితిని. ఓ మునిరాజులార! ఈవిషమసంధి యెట్లు వచ్చినది.

నార—ఈశ్వరకల్పుఁడైన దుర్వాసోముని యాజ్ఞకు వైషమ్యముండదే.

దూ—ఏమిజరగినదో చూచివత్తము రండు.

(అని నారదుఁడు, శిష్యుఁడు రాఁ బరిక్రమించును)

గంధ—ప్రాణేశ్వరి! నన్ను విడిచి యొంటిగా నరుగకుము హా! (అని విమానముపైఁ బడియుండును)

దూర్వా—(చూచి) ఇది మూర్ఛ.

నార—ఈవిమానము నడపువా రెవ్వరు.

దూ—(ఆలోచించి) మంచిది. వీరి నిట్లే యుండనిండు. వీరిమానసములు కంచిలో నరాంశములం బొంది వృద్ధినంది కైలాసమున కేగఁబోవునపుడు వీ రీపుష్పకముమీఁదనే మరలఁ దేరుకొందురు.

నార—బాగుబాగు. గంధర్వులు నరు లగుటకు మంచిసులభోపాయము దొరకినది. మునివర నాకు సెల విమ్ము. మరల వీరితోనె వచ్చి పర్యవసానముం దెల్పెదను.

శిష్య—(తన) అంతవఱకు నాకీశవజాగరము తప్పదు.

దూ—తథాస్తు. కానిమ్ము.

ఇది క్రోధశాంతి యనుప్రథమరంగము.

## ప్రథమాంక ద్వితీయరంగము

(ఇద్దఱు రోగులు దంపతులు ప్రవేశింతురు.)

భర్త—వనితామణీ! నాకు ముప్పది, నీకిరువదియైదు. ఈయీడుననే మనయిరువురకు నేకకాలమరణము దైవము సంఘటించెనా.

భార్య—దైవవశమున కనాథత్వ మున్నదా. వయసునకా రేమి వృద్ధు లేమి.

భర్త—నీ కేమైనఁ గోర్కె లున్నవా?

భార్య—నాథా! నిన్ను వెంబడించుట యొక్కటే కోర్కె.

భర్త—నీవు కడకమ్మారయ జాలవు

భార్య—నన్ను విడిచి పోఁజాలుటలో మీహృదయము చాల మెత్తనిదా!

భర్త—అయిదేండ్లబుడుతఁడు, మూఁడేండ్లకూఁతురు, వీరిగతి యాలోచించితివా.

భార్య—నాకు పోసినవాఁడు నీకు పోయఁడా!

భర్త—పెద్దవారగునందాకు వారిని మనధనము నెవ్వరు రక్షించెదరు.

భార్య—దిక్కు లేనివారిని దేవుఁడే రక్షించును.

భర్త—వేదాంతము చాలును, దిక్కు లేకేమి, నీయన్నలు లేరా నాయన్న లేఁడా.

భార్య—మాయన్నలు చేరిరా ‹‹సర్వంనాశాయ మాతులః››. మీయన్నలు మీవారు, మీయిష్టము. లేనివారు బాగుపడుకాలము.

భర్త—జ్ఞాతిగుఱ్ఱు, అరఁటికఱ్ఱు.

భార్య—మీయన్నపై మీకు విశ్వాస ముండవలయును.

భర్త—బిడ్డల కేదో గంజిపోసి పెంచును; ధనము చెడ్డది. ఇంతదనుక నన్ను ధనప్రసంగమునకు దింపక కాలము గడపుచున్నాఁడు - ఆతనిబిడ్డ లెట్టివా రగుదురో.

భార్య—బావగారినే నమ్మవలయును. ఏమైనను బరులపై నాకు విశ్వాసము లేదు.

భర్త—అంతయే - నాయనా! రంగా! పెద్దయ్యను బిలిచికొని రమ్ము.

(అన్న రంగని నెత్తుకొని ప్రవేశించును.)

సేవకుఁడు—(పీఠము వెట్టును.)

అన్న—తమ్ముఁడా! ఏలరా! నన్నుఁ బిలిచితివి, నేఁ డెట్లున్నది.

తమ్ము—అన్నయ్యా! మాయిద్దఱస్థితియు నొక్క రీతిగా నున్నది.

అన్న—మీకు జంగ యెక్కువ. రోగులు లేరా, వైద్యులు లేరా, మీవంటి వారిం జూడము.

తమ్ము—రోగమునకైన జంగ లేదు.

అన్న—నుకి యేమిటికి జంగ. మనోవ్యాధికి మందు లేదు.

తమ్ము—తండ్రీ! రంగా! (కన్నీరు పెట్టుకొనుచు) చెల్లెలు వీధిలో నాడుచున్నది. దాయియొద్దికి నీవును బోయి యాడుకొమ్ము.

అన్న—(రంగనినాడించి దింపుచున్నాఁడు)

రంగ—(పోవుచున్నాఁడు)

అన్న—అబ్బ! యింత జెలలను జూడ లేదు.

గీ. పుట్టుకకు మున్నె తండ్రులు గిట్టినారు, పురుటిలోఁ దల్లు లెండలో మరణమంది
రేమి? వారలు బ్రతుకరో యింద్రభోగ, మనుభవింపరొ బిడ్డల కడలనేల.

తమ్ము—అన్నయ్యా! ఈకుఱ్ఱవాం డ్రీమార్గమున బ్రదుకుదు రని చెప్పుము?

అన్న—ఆయుర్దాయ మున్నవారికి గడిపటక యెట్లుగడి ంచును. మే ముం దుముగదా!

తమ్ము—అదియే నాశ్చర్యము.

అన్న—నీ కాధైర్యము లేదు. ఉన్నచో నిట్లు కృశింపవు.

తమ్ము—ధైర్యము లేక యేమి లే.

అన్న—అడవి రక్ష లేనియబలుండు వర్ధిల్లు.

తమ్ము—అట్టి యవశకునముమాట విన లేను.

అన్న—న న్నేల పిలిచితివి. నే నేమిచేయవలయును.

తమ్ము—నాబిడ్డలను బెంపవలయును.

అన్న—ఇది నీవు చెప్పవలయునా. నేను మొందైన నాబిడ్డలను నీవు పాఱ వైచెదవా?

తమ్ము—అట్టిమాటలే నేను విన లేను.

అన్న—సర్వవిధముల మీయిరువురకంటె నధికప్రేమమునఁ జూచెద.

తమ్ము—మీమఱఁదలిస్థితి వినుము.

గీ. నేను నవ్వినవవ్వుఁ గుందినను గుందుఁ, దిన్నఁదినుఁ బండఁబండుఁ జానున్నఁ జావ
నున్నయది బ్రహ్మహత్య నా కెన్నవచ్చుఁ, గవలపిల్లలతలనొప్పికరణి నుండె.

అన్న—మీయన్యోన్యానురాగ మట్టిది.

తమ్ము—కన్నబిడ్డలపైఁ గరుణ యుండవలదా.

౨౫. అనుప్రత పసతులలక్షణము.

తమ్ము—బ్రదుకనిమ్ము - చావనిమ్ము - నామాటవినుము.

గీ. వేయిగద్యాణములు నఱ వేయిటంక,ములును నొకలక్షదీనారములును గలవు
బిడ్డలిద్దఱు గృహమును బెద్దచేలు, గలవు నీవిది యెఱుఁగుదుగాదె మున్ను.

అన్న—ఎఱుఁగుదును. వీని నన్నిటిని బీఱుపోకుండ రక్షించెదను.

తమ్ము—గీ. కొమరితఁ బెంచి పెండ్లి యనుఁగుంబతితో నొనరించి వేయిహూ
న్యములను, నల్లువానికి సభాముఖమందున రెండువేలు ని
చ్చి, మిగుల వేడ్కగా నొకరిశేఖర మందు లగింప కంపునాఁ
డు మగున కిమ్ము గద్దె లోకఁడున్న అ వేయిని సారెచీరకుఁన్.

అన్న—ఇవి యన్నియు మీ చేతులతో మీరు చేసికొనవలసినవి. మీ కన్నులతో
మీరు చూచుకొనవలసినవి.

తమ్ము—మా కాయైశ్వర్యము పట్ట లేదు.

ఉ. లేమిని లేదు లే దని చలించెడుబీదలు కన్నబిడ్డలం
గోమున గంజిపానకము గొంగళి పట్టుగఁ బెంచి ముద్దుగా
రాములు చూపి యోగ్యమును బ్రాయము నారసి యుత్సవంబులం
దా మొనరించి సంతతముదంబున నుం ద్రది మాకు లేదగున్.

అన్న—మీ రేదో కొంత యానందించితిరి కుఱ్ఱవాండ్రే యేమియు నెఱుఁగరు.

తమ్ము—దానికే నేను విచారించుచున్నాఁడను.

అన్న—మీ రేదో తప్పుటర్థములోఁ దీసికొనవలదు. మే మెంతమంది యున్నను
మీరు కాముగదా.

తమ్ము—దేవుఁడు గాని మీరు గాని యట్లు కావలయును.

అన్న—దేవుఁడు పైవిచారణ చేయుచుండ నేను రక్షించెదను.

తమ్ము—గీ. లక్షదీనారములకు నెలకు నెలకును, వచ్చువడ్డిని నాల్గవవంతు నీవు
గొనుచుబిడ్డలఁ బ్రేమతోఁ గనుచుఁ బెనిచి,నునుచు నదినీకుఁ జెప్పఁగఁబనియు లేదు.

కాని—క. దైవము నీవును బాపలు, జీవించు నుపాయ మరసి చిరకాలము సం
భావనఁ బెంచుఁడు విధి గత,జీవులయినఁ దద్ధనంబు చెందును నిన్నున్.

అన్న—ఏల యట్టనెదవు. వారిబరు వెవ్వరు మోసికొందురు. ఇవు డా యొంటి
మాట యేటికి.

తమ్ము—ఓడో గట్టియో కీడెంచి మేలెంచుట.

# ఆంధ్రభాష—సంస్కృతము...

ఉ. ఘనులసంస్కృతాంధ్రకవికస్తులు ప్రోలి జగమ్ము నెల్లడిం
పావలఁగ బోధహీనులు పొంగి తోరంగఁ గఱాలి నస్యసం
పద లోపలన్ : ధీకృపి కమంకలికిం గవితానువృత్తులన్
ముదమొదవించు నాంధ్రకవిపుంగవమేఘములం దలంచెదన్.

మహాశయులారా!

“ముంజేతికంకణమ్మున కద్దమేల” యన్నట్లు సర్వజనవిదితమైనసంస్కృతాంధ్రములసంబంధముం దెలుప నుపన్యాసము చేయుట దినకరునిఁ గనఁ బఱుప దివ్వియఁ బెట్టుట యని యెంచెదను. అయినను, శ్రీరామనవమీ శ్రీకృష్ణజయంతీ త్యాదిపుణ్యదినంబులందు శ్రీరామకృష్ణాద్యవతారమూర్తుల జన్మకర్మాదిసంకీర్తనము శిష్టాచారమైనటు లాంధ్రభాషావర్ధంతిసందర్భమున నాంధ్రభాషాప్రశంసయు నసంగతవిషయము కాఁబో దని నే నీకార్యమునకుఁ గడంగుచున్నాఁడను. నాయజ్ఞానవిలసితముల మన్నింప మహాజనులను వినయమున వేఁడుకొనుచున్నాఁడను.

భాషాశాస్త్రతత్త్వజ్ఞులు కొన్నినియమముల ననుసరించి, ఆంధ్రభాషను సంస్కృతజన్యము గానిభాషావర్గములోఁ జేర్చి యున్నారు. అట్లన్యభాషాకుటుంబమున జన్మించిన దయ్యును, మన తెనుఁగుభాష తనయక్కచెల్లెండ్రగు తక్కిన ద్రావిడభాషలవలెఁ గాక, చిన్ననాఁటినుండియు, దేవభాష యనం బరఁగిన సంస్కృతముతో నెనఁగి పెనఁగి మెలఁగుచు వచ్చినది. ఎల్లబాసలకుఁ దల్లి యనఁదగు నాభాషామతల్లియుఁ దనకన్నబిడ్డలకన్న మిన్నగా మన్నించి యీ భాషాబాలికకు మాటలు మప్పినది: నడకలు నేర్పినది; దోసములు తొలఁగించినది; గుణములు కూర్చినది; అలంకారము లొసంగినది; సద్వృత్తులలవఱిచినది; ఉచితరీతు లుపదేశించినది; పాకముల పరిచయ మొదవించినది. వేయేల? తనజీవితము ధారవోసి, సర్వవిధములఁ దనయంతదానిం జేసినది. కన్నమోహముకన్నఁ బెంచినప్రేమ హెచ్చు గదా. మొదట మాట లెవ్వరు మప్పినదో చూతము.

ఆర్యు లార్యావర్తమునుండి దక్షిణాపథమునఁ బ్రవేశించినతఱి వింధ్య పర్వతపరిసరవాసు లయిన తొల్లింటియాంధ్రు లాయయ్యలతో నెయ్యమొనరించి, యొయ్యనొయ్యన వారుమాటాడు గీర్వాణభాషనుండి యున్న వున్నటులు కొన్నియుఁ, గొంతమార్పుతోఁ గొన్నియు లెక్కకు మిక్కిలియగు పదములు గైకొని తమమాటలతో మేళగించి భాషాభివృద్ధి గావించుకొనిరి. ఈయొక్క యంశమే యనన్యాదృశ మైనయాంధ్రుల గుణగ్రహణపరాయణత్వమును, అనుకరణకౌశలమును, శతముఖములఁ జాటుచున్నది. అట్లు వా రార్యభాషాపదముల నలవఱచుకొనుటయకాక, యంత శ్రుతిరంజకంబులు కాకుండుటంబట్టి కావలసినను, దమభాషయందలి తత్పర్యాయపదములు కొన్ని వాడుట బొత్తిగ మానివేసిరి. 'మనుష్యుఁ' డను సంస్కృతపదము తక్క, జనసామాన్యవాచక మాంధ్రపదము వాడుకలో లే కుండుటయే యిందుకు నిదర్శనము. 'మానిసి' యనునది తద్భవరూపము, 'మనిషి' గ్రామ్యము. ఇట్లే, దేశము, లోకము మున్నగు సంస్కృతసమములే వ్యవహారమం దున్నవి. తత్పర్యాయ దేశ్యపదము లంతరించినవి. దిగ్వాచకములలోఁ దూర్పు, పడమర పదములే యాంధ్రము లున్నవి. ఉత్తరము, దక్షిణము సంస్కృతసమములు. ఇట్టి సామాన్య విషయములం దెల్పుపదములే యాది నాంధ్రభాషలో లేకుండె నన వచ్చునా? ప్రాచీనులు వానిని విస్మరించి యుందు రని చెప్పక తప్పదు. కొన్ని సంస్కృత శబ్దములకుఁ బర్యాయపదములు దేశభాషయందు లభించుచుండినను, దఱచుగ మనవా రిప్పుడును సూర్యుఁడు, చంద్రుఁడు, భూమి, ఆకాశము, పుణ్యము, పాపము, లాభము, నష్టము, దీపము, కోపము, నయము, భయము, కాంతి, శాంతి, ధాన్యము, మాన్యము మొదలగుసంస్కృతసమములనె వాడుచున్నారు. సామాన్యసంభాషణమందు సైత మిట్టిపదములు నూటికి ముప్పదికంటె నెక్కువగ దొరలుచుండు నని తజ్ఞులు తలంచుచున్నారు. ఇప్పటివఱకుఁ దెనుఁగు నిఘంటువులలో నుత్తమ మనఁదగిన శబ్దరత్నాకరమందు సేకరింపఁబడిన 35055 పదములలో 14814 సంస్కృతసమము లున్నవని మ॥ రా॥ రా॥ చిలుకూరి నారాయణరావుగారు లెక్కించి చెప్పియున్నారు. ఇవికాక, ముఖ, మృగ, చంద్ర, సముద్రాది శబ్దములకు బదులుగ మొగము, మెకము, చందురుఁడు, సంద్రము మొద లగుమాటలు పెక్కు లాంధ్రమున కెక్కి యున్నవి.

మఱియు, క్రీస్తుశకమునకుఁ బూర్వ మించుమిం చిన్నూటేండ్లకుముం దాంధ్రరాజు లీదేశము నాక్రమించుకొని రమారమి నన్నూటేండ్లు రాజ్యము

చేసిరి. ఇప్పుడు ధరణికోట యనఁబడుచున్న ధాన్యకటకము వారి రాజధాని యైనను, వారికిఁ బ్రధానవాసస్థానము పాటలీపుత్రము. మతము బౌద్ధమతము, భాష గీర్వాణభాషకుఁ బ్రథమపుత్రిక యగు ప్రాకృతము. ఈ కాలమున రాజ భాష యగు ప్రాకృతమునుండి దేశభాషలోనికి యథాశ్రుతముగఁ గొన్నియు నీషద్భేదముతోఁ గొన్నియు సంక్రమించి యేవి తద్భవములో యేవి దేశ్యములో నిర్ణయించుటకుఁ బండితులు సైతము తబ్బిబ్బు పడునంతటి యైక్యమును బొందిపోయినవి. దీనికిఁ దార్కాణముగఁ జిన్నయసూరి దేశ్యమున కుదాహరణముగ, ఊరు, పేరు, కోట, పేఁట మొదలగు పదముల నుపయోగించియుండ, బహుజనపల్లి సీతారామాచార్యులు ప్రౌఢవ్యాకరణములో "కోట, పేఁటలు వైకృతంబులు" అని సూత్రించియున్నారు. సీతారామాచార్యులు తద్భవము లని తెల్పినవానిలోఁ గొన్నిటిని కొందఱు పండితులు దేశ్యము లనుచున్నారు. మన కిప్పుడా చర్చతో నంతపని లేదు గాని, మనము తెనుఁగు (దేశ్య) పదము లనుకొనువానిలో సైతము సగముకంటె నెక్కువగా సంస్కృతజన్యములో, తజ్జన్యజన్యములో నైనపదలే యగపడుచున్నవి. చిత్తగింపుఁడు.

మన కుగ్గుపాలతో నలవడిన అక్క, తాత, అమ్మ, మామ, బావ, వదిన మొదలగు మాటలు వరుసగా అక్కా, తాతః, అంబా, మామకః, వధూనీత్యాది సంస్కృతశబ్దములనుండి వెలువడినవే కదా. గృహోపకరణాదివాచకము లగు మంచము, కంచము, ఉగ్గము, పగ్గము, జల్లెడ, రోఁకలి, వత్తి, కత్తెర, పెమ్మె, నిచ్చెన, కుండ, పెట్టె, మున్నగుపదములును, నత్యంతపరిచితము లగుమృగపక్ష్యాదులం దెల్పునట్టి కుక్క, గొఱ్ఱె, కాకి, గ్రద్ద, గోరువంక, పావురము, చింత, పొన్న, పోఁక, జమ్మి, మల్లె, జాజి, కాఁకర, పొల్లు, అడవి, కొండ, గట్టు, పుట్ట, బావి, దారి మొదలగుపదము లన్నియు సంస్కృతసంబంధమును బడసినవే.

మనుష్యజాతి వాచకములలోఁ గుమ్మరి, కమ్మరి, గొల్ల, మాల, మాదిగ మున్నగునవియుఁ గృష్యాద్యుపయుక్తము లగు నాఁగలి, కావడి, గొడ్డలి మొదలగునవియు, ధాన్యవిశేషవాచకము లయిన సజ్జలు, కొఱ్ఱలు, సెనగలు, చామలు, మున్నగుశబ్దములును, కాలవిశేషవాచకము లగు గడియ, జాము, రేయి, వేసఁగి, ప్రొద్దు (సూర్యవాచకమును) లోనగునవియు, శరీరావయవవాచకము లయిన చెవి, బుజము, గోరు, జుట్టు మొదలగునవియు, లోహవిశేషవాచకము లయిన ఇత్తడి, రాగి, కంచు మొదలగునవియు, భక్ష్యాదివాచకము లయిన

శా. "తావుల్ గ్రేవలఁ జల్లు చెంగలువకేదారంబు తీరంబునన్
మావుల్ క్రోవులు పల్లిపల్లిగొను కాంతారంబునం బ్రేంకణ
గ్రావాకల్పితకామసూనజటిలప్రాసాదగుచ్ఛంబులం
బూవుందీవెల నొప్పు నొక్కభవనంబున్ గాంచె సోత్కర్షమున్." వసు.

ఈవిధముగ నాభాషామతల్లి మనభాషకు ముద్దులుగులుకు పలుకులు చెప్పినది. ఇఁక నడకల నెట్లునేర్పినదో కనుఁగొందము.

ఇప్పటివఱకు నుపలభ్యమాన మయిన యాంధ్రసారస్వతమందు మ. రా. రా. శ్రీ. జయంతి రామయ్యపంతులవారు పరిషత్పత్రికలోఁ బ్రకటించిన యుద్ధమల్లుని బెజవాడశాసనము ప్రాచీనతమము. మఱియొక శాసనము, అధికభాగము శిథిల మైనది, కల దని పరిశోధకు లిటీవలఁ బ్రచురించియున్నారు. ఈపరికరములనుబట్టి క్రీ. శ. తొమ్మిది పదిశతాబ్దములలో పాటలే యనఁదగు నక్కరలు మొద లయిన పద్యములు మాత్రము కలిగి, యాంధ్రకవిత మిగుల బాల్యావస్థయం దుండె నని తెలియనగుచున్నది. ఇట్లు తప్పటడుగులు పెట్టుచున్న మనకవితాబాలికకుఁ జేయూఁత యిచ్చి,

'వాచా మాంధ్రమయీనాం యః ప్రవక్తా ప్రథమోభవత్'
ఆచార్యం తం కవీంద్రాణాం వందే వాగనుశాసనమ్.

అనునార్యోక్తి చొప్పున సంస్కృతమునకు వాల్మీకివలె నాంధ్రమున కాది కవి యగునన్నపార్యుఁడు తనయుభయపాండితీప్రకర్షము మెఱయ సంస్కృతమునుండి తత్సమపదము లేర్చికూర్చినట్లె మనోహరము లయినవృత్తములు సైతము సేకరించి మనభాషకు మంచినడకల నలవఱిచెను. ఏకకవివిరచితము లయినను, నీక్రిందిపద్యముల నడకలం దెంతో భేదమున్నది.

మధ్యాక్కర. "అంగారములు గొనువేడ్కఁ బుష్పఫలావలీలలిత
తుంగద్రుమప్రకరంబుఁ గరుణావిదూరుఁడై కాల్చు
నంగారకారుఁ బోలంగ సమకట్టె నర్థలోభంబు
నం గుణకులహానికరుఁడు ధారుణీనాథ నీసుతుఁడు." భార. సభా.

మానిని. "ఏచి తనర్చి తలిర్చినక్రొవ్వుల నిమ్మగు తావుల జొంపములం
బూచిన మంచియశోకములన్ సురపొన్నలఁ బొన్నలఁ గేదఁగులం
గాచి బెడంగుగఁ బండిన యాసహకారములం గదళీతతులం
జూచుచు వీనుల కింపెసఁగన్ వినుచున్ శుకకోకిలసుస్వరముల్."

కొందఱు వృత్తములు సంస్కృతమునుండి తెలుఁగునకు వచ్చినవి కావు.

ఆంధ్రకవిత్వమున కన్నఁ దొమ్మనూఱేండ్లు ప్రాచీనమై క్రీ. శ. 138 ప్రాంత మున సమంతభద్రునిచే నారస్వతారంభముచు గన్న కన్నడమునుండి నారా యణభట్టు తోడ్పాటువలన నాంధ్రమున కవతరించిన వని చెప్పుచున్నారు. ఆకన్నడము కన్నను బ్రాచీనతరమై యెల్లరకును దల్లియిల్లయిన యార్యసాగ స్వతమునుండి కర్ణాటులు కైకొన్నట్లే, యాంధ్రులును వివిధవిషయములతోఁ పాటు వృత్తములను సైతము సంగ్రహించి రని చెప్పుట యే యుక్తతరము. తంత్రియాస్తి లోఁ దనయు లందఱకును స్వత్వ మున్నది కదా. సంస్కృతమునఁ బరినిష్ఠితము లయిన పృథ్వీ, శిఖరిణి, శార్దూలవిక్రీడిత, పంచచామర, స్రగ్ధరా, మాలినీ, తర ళాదులు సంస్కృతకర్ణాటాంధ్రములం దేకనామముతో నొప్పి యుండుటయు, సంస్కృతమందు నిరూపితములు కాని యంబురుహము, మత్తకోకిల, మానిని, కవి రాజవిరాజితము మున్నగువృత్తములు కర్ణాటాంధ్రములందు విభిన్ననామము లయి యుండుటయు మనయభిప్రాయమును బలపఱుచుచున్నవి. అంబురుహ వృత్తమునకు నాగరంజిత యనియు, మత్తకోకిలకు మల్లికామాల యనియు, మానినికి వనమంజరి యనియు, కవిరాజవిరాజితమునకు హంసగతి యనియుఁ గన్నడమున సంజ్ఞలు. కన్నడమునుండి కైకొన్నచోఁ గొన్నిటి కేకనామము లును, మఱికొన్నింటికి భిన్ననామములు నేర్పఱుచుటకుఁ గారణ ముండదుగదా! అట్లని ద్రావిడకర్ణాటభాష లాంధ్రకవిత్వమున కెట్టితోడ్పాటు నొసంగలే దని నాయభిప్రాయము కాదు. కవితాకన్య కమూల్యాలంకారము లనఁదగు యతి ప్రాసనియమములు వరుసగా నారెండుభాషలనుండి వచ్చినవే. ఇంకఁ దక్కిన విషయముల నించుక విచారింతము.

నన్నపార్యుం దొట్టి యాంధ్రకవు లెల్లరును సతలస్పర్శ మగు సంస్కృత పాండిత్యము కలిగినవా రగుటంబట్టి వా రెల్లవిషయంబులను సర్వలక్షణసమం చిత మైన సంస్కృతవాఙ్మయమునే యాదర్శముగాఁ గొని, పురాణకవులవలెనే మధ్యకవులును మధ్యకవులవలెనే ప్రబంధకవులును గావ్యరచనను గావించుచు వచ్చిరి. అందువలన సంస్కృతమునందలి రసము, భావము, ధ్వని మున్నగు కావ్యలక్షణము లన్నియుఁ దెనుఁగున కవతరించినవి. సంస్కృతమునందలి ధీరో దాత్తాదులే తెలుఁగునందును నాయకు లైరి. సంస్కృతమునందలి యుపమో త్ప్రేక్షాదులే తెలుఁగునందు నలంకారము లైనవి. సంస్కృతమునం దేవి కావ్య గుణము లని యెంచఁబడినవో, యవియే తెలుఁగునందును గావ్యగుణములు. సంస్కృతమునం దెట్టివి కావ్యదోషములని తలంపఁబడినవో తెలుఁగునందు నట్టి

వియే కావ్యదోషములు. సంస్కృతమునం దెట్టివృత్తు లెట్టిరీతు లెట్టిపాకములు నిరూపింపఁబడినవో తెలుఁగునందు నట్టివృత్తు లట్టిరీతు లట్టిపాకములు నిరూపింపఁబడినవి. ఈరీతిని సంస్కృతలక్షణము లన్నియు మన తెనుఁగు పుడికి పుచ్చుకొన్నది.

"అత్యంతసుకుమారౌ ద్వౌ శృంగారకరుణౌ మతౌ।

"యత్ర శృంగారకరుణా వతికోమలేన సందర్భేణ వర్ణ్యేతే తత్ర కైశికీ"

(శృంగారకరుణరసము లత్యంతసుకుమారములు:—వానిని వర్ణించుసుకుమారార్థసందర్భమునకు కైశికి యనిపేరు) ప్రతా. కావ్య.

"అత్యుద్ధతతరసౌ రౌద్రబీభత్సౌ పరికీర్తితౌ॥

"యత్ర రౌద్రబీభత్సా వతిప్రౌఢేన సందర్భేణ వర్ణ్యేతే తత్రారభటీ"

(రౌద్రబీభత్సము లత్యుద్ధతరసములు. వానిని వర్ణించుప్రౌఢసందర్భమున కారభటి యనిపేరు) ప్రతా. కావ్య.

ఈసంస్కృతవాఙ్మయలక్షణముల నాంధ్రకవు లెంతవఱకుఁ బాటించిరో కనుఁగొందము. తిక్కనసోమయాజి విరాటపర్వమందు—

సీ. లలితంబు లగుమట్టియల చప్పుడింపార హంస కైవడి నడ నల్లవచ్చి
యొడ మేనినెత్తావి సుడియంగఁ బయ్యెద సగము దూలించి పైమగుడఁ దిగిచి
సోలెడు నెలదీఁగె లీలఁ గ్రాలుచు వింత చెలువంబు దలకొనఁ జేరి నిలిచి
తెలికన్నుఁగవకు నెచ్చెలియైన లేఁతన వ్వొలయంగ సరసంపుఁబలుకు పలికి
మెఱయు చెయ్వుల రాగంబు మెయికొనంగ
నెడఁద సొగయించు మాటల నెలమి మిగుల
నిన్ను ననురక్తిఁ గొలుచు నన్నెలఁత లుండ
నీరసాకార సైరంధ్రిఁ గోరఁ దగునె॥

అని శృంగారరసము నెంతయింపుగఁ గూర్చినాఁడో చూడుఁడు.

కరుణరసమును వర్ణించుసందర్భమున శ్రీనాథకవి.

సీ. తల్లి మా దేకపుత్రిక పెద్ద కన్నులు గాన దిప్పుడు మూఁడుకాళ్లముసలి
యిల్లాలు గడుసాధ్వి యేమియు నెఱుఁగదు పరమపాతివ్రత్యభవ్యచరిత
వెనుక ముందర లేద నెనరైన చుట్టాలు లేవడి యెంతేని జీవనంబు
కానక కన్నసంతానంబు శిశువులు జీవనస్థితి కేన తావలంబు
కృపఁదలంపఁగదయ్య యోనృపవరేణ్య
యభయ మీవయ్య యోతుహినాంశువంశ

కావఁగదవయ్య యక్షాదికన్యకలను
నిగ్రహింపకువయ్య యో నిషధరాజ!

అని కైశికీవృత్తినే యవలంబించెను. ద్రౌపదీవస్త్రాపహరణఘట్టమున నన్నపార్యుఁడు క్రోధఘూర్ణితమానసుఁ డగుభీమసేనునిచే రౌద్రరసోజ్జృంభితము లయినభీషణభాషణము లారభటీవృత్తి నెట్లు పలికించెనో వినుఁడు.

మ. కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్ సూచుచుండ న్మదో
ద్ధురుఁడై ద్రౌపది నిట్లుచేసిన ఖలుం దుశ్శాసను న్లోకభీ
కరలీలన్ వధియించి తద్విపులవక్షశ్శైలరక్తౌఘముం
బ్రకట మ్మిస్సతి చూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్.

“ఏకధ స్సంశ్లిష్టపదతా శ్లేష ఇ త్యభిధీయతే” ప్రతాప. గుణ.

“ఇలసంధి గూడినపదములు, నెలకొని యొకపదముకరణి నిలిచినశ్లేషంబు” సరస.

ఈకావ్యగుణము నాంధ్రకవు లెట్లుపయోగించిరో క్రిందిపద్యమునఁ దెలిసికొనవచ్చును.

శా. “ఆకారుణ్యకటాక్షవీక్షణము లాయుంపంపు లేఁబ్రాయ మా
యాకారద్యుతి యాదరస్మితముతీ రామోముచక్కందనం
బాకెంజాయపదంబు లానడలయొయ్యారంబు లేవేల్పులం
దేకాలంబున లేదు లే దనుచు నే నెందేనిఁ జాటించెదన్.” కృష్ణకర్ణా.

ఆంధ్రకవితాపితామహుని యనన్యాదృశమైన వ్యంగ్యవైభవము కూర్పును ‘ఇంతులు కన్నులుండ’ నను పద్యమే బోధించుచున్నది.

తిక్కనసోమయాజి విరాటపర్వమునందు సంస్కృతసంప్రదాయము ననుసరించి యుపయోగించిన యాశ్లేషాలంకారమును జిత్తగింపుఁడు.

“చని వివేకరహితు హృదయంబునుం బోలెఁ దమోదూషితంబును విదగ్ధవనితాప్రాయంబునుం బోలెఁ దుర్నిరూపంబును - - - - - - నైన నర్తనాగారంబు ముఖమండపంబు సేరి”

ఇట్లొక్కొక్కయలంకారము నొక్కొక్కకావ్యమునుండి యుదాహరించుట కైన నిచటఁ దావుచాలదు.

ఇత్తెలుఁగున ముత్తెలుఁగులకవులును సంస్కృతమునం గలకావ్యాలంకారలక్షణము లన్నియు నాంధ్రవాఙ్మయమున కందఁజేసిరి. వీనిస్వరూపమును సంపూర్ణముగఁ దెలిసికొనుటకు సంస్కృతజ్ఞాన ముండిననే కాని నిర్వాహము

కాదు. ఇందుల కొకచిన్ననిదర్శనము. మొన్నటి విశ్వవిద్యాలయపరీక్షలో నాంధ్రప్రధానవిద్యార్థుల పట్టపరీక్షాపత్త్రమున—

"కాళిదాసుని రతివిలాపమునందు "పునఃపునర్దీప్తి" అనేరసదోషము కలదని మమ్మటుని యభిప్రాయము. ఇట్టి దేదైనను నన్నెచోడుని రతివిలాపమునందు కలదో లేదో సహేతుకముగా చర్చించవలెను" అని యొకప్రశ్న మున్నది. కాళిదాసునికుమారసంభవము, మమ్మటుని కావ్యప్రకాశికను జక్కఁగఁ జదివినఁగాని యీప్రశ్నకు సరియైన యుత్తర మీయనగునా?

ఆంధ్రమునం దకలంకమయిన పాండిత్యము కుదురవలయునన్న సంస్కృతసారస్వతపరిజ్ఞాన మెంతయావశ్యమో దీనివలన సువ్యక్త మగుచున్నది.

ఇఁక నీభాషాద్వయమునకు వ్యాకరణవిషయమునఁ గలసంబంధము నించుక వివరించెద.

"తజ్జా సమా చ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా భవతి"

అన్నట్లు లాంధ్రభాష తద్భవము, తత్సమము, దేశ్యము, గ్రామ్యము నని చతుర్విధ మైయున్నది. వీనిలోఁ దత్సమపదము లైదింట రెండుభాగములకుఁ బైఁబడి యున్న ట్లిదివఱకుఁ దెలిసికొంటిమి. ఈతత్సమములు వ్యస్తములు మాత్రమే కాక, విశేషించి సమాసఘటితము లయి తెలుఁగునఁ బ్రవేశించి యున్నవి. ఈసమస్తపదములందు సంధివశమున నేర్పడు వివిధరూపము లెఱుంగుటకు సంస్కృతవ్యాకరణపరిజ్ఞాన మపేక్షితము. సంస్కృతవ్యాకరణపరిజ్ఞానము లేనిచో—

'ధరణి నెవ్వాఁడు దానవద్ద్విరదదళన
విహృతిఁ దన కేసరకిశోరవృత్తిఁ దెలిపె.' నను.

ఇత్యాదిస్థలముల సంధిగతచమత్కారములు తెలియవచ్చునా? ఇచట, దానవ+ద్విరద, అని యొకయర్థమునను దానవత్ +ద్విరద, అని మఱియొక యర్థమునందును, బదవిభాగము. మొదటి పక్షమున "అనచిచ" ౮-౪-౪౭. అను పాణినీయసూత్రమువలన (అచ్చునకుఁ దర్వాతిది యగు యర్ నకు, అచ్చు పరమందు లేనపుడు ద్విత్వము వికల్పముగ వచ్చును) దానవశబ్దానంతరవర్తి యగు ద్విరదశబ్దాదిదకారమునకు ద్విత్వము కలిగినది. అట్లే 'రోదోంతరాళంబు నిండెఁగా' 'వియన్నదీతనయుఁడు' 'వియచ్చరానీకము' ఇత్యాదిసమాసపదములందుఁ బ్రత్యేకపదస్వరూపములు గ్రహించుటకును, దత్ప్రయుక్త మైన

తే॥ జోనవహ్న్యున్ శరజన్ముఁ గాంచి యలసీహారక్షమాభృత్కుమా
రీసాపత్న్యము గన్న—విజయవిలాసము.

"లం॥ కౌకస్సంచయకాళరాత్రి గళబద్ధోదగ్రకాలాహి." భా. రా.

"వ॥ నాకోర్ధ్వజమెఱుఁగవచ్చు నపుఁ జూపి తగన్." అథర్వ విరా.

"కేళిసరిన్నికటానేకవనప్రదేశముల దైతేయేంద్రకన్యా." ఉ. హ.

మొదలగు యతులగతుల నెఱుంగుటకును సంస్కృతవ్యాకరణజ్ఞానముండితీఱవలయును.

ఇట్లు ద్వీప, సమీప, నాక, నాస్తిక, స్వాంత, శుద్ధాంత, వాతాయన, రసాయన, నారాయణాది శబ్దములయతిభేదములు సంస్కృతవ్యాకరణజ్ఞానసాపేక్షములు.

"కుమారాయితశక్తిశాలి ధృతరాష్ట్రుఁడు రాజ్యముచేసె"

"భద్రాయితమూర్తియై హరిహరం బగురూపము దాల్చి".

ఇత్యాదిస్థలములందలి క్యజ్ప్రత్యయప్రయుక్తము లగుయతివిశేషములు సంస్కృతజ్ఞానములేక యవగతములు కావు.

"అభ్రంకషంబైన యాలపోతునితండు ద్రుంచినాఁడీతండు పెంచినాఁడు. ఉ. హ.

"ఓరి దురాత్మ నీవారముష్టింపచాభాస" భీమేశ్వరపురాణము.

"భారతగ్రంథగుంభనపండితమ్మన్య"

'లలాటంతపం బైన యాతపంబు'

అగదంకార, ఆత్మంభరి, పాణింధమ, ప్రియంవద, క్షేమంకరేత్యాది ముమాగమవిశిష్టకృదంతరూపములు

"కడుదయాళురు దేవతాగణము లెల్ల" భీమేశ్వరపురాణము. ఇట్టి ఆళుచ్ ప్రత్యయాంతములు.

"దితిసుతనిరాకరిష్ణున్, శ్రితపదనాలంకరిష్ణు జిష్ణున్ విష్ణున్" భాగ.
ఇట్టి ఇష్ణుచ్ప్రత్యయాంతములు మొదలగు కృదంతవిశేషరూపము లనధీతసంస్కృతవ్యాకరణులకు దుర్బోధములు. కృదంతములవలెనే తద్ధితాంతము లనేకములు సంస్కృతజ్ఞానాధీనము లై యున్నవి.

చిన్నయసూరి "తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబ యగు" నని యొక్కముక్కలో సాంస్కృతికసమాసము లన్నియుఁ జెప్పి విడిచెను. ఈవిషయమున నెంతవ్యాఖ్యానము చేసినను జాలదు. సామాన్యసమాసవిధులు, సమాసాంతకార్యములు, సమాసాశ్రయవిధులు

పెక్కులు తెలియవలసిన విక్కడఁ గలవు. ఏతాదృశవిషయముల జ్ఞానమునకు సంస్కృతవ్యాకరణజ్ఞాన మత్యపేక్షితము.

ఆంధ్రవాఙ్మయము నెన్నాళ్లు తిరుగవేసినను, ఈకృదంత తద్ధితాంత సమాసైకశేషాదుల కలగూరపు పట్టువడ నేరదు. సంస్కృతపరిజ్ఞానము లేమినే కదా మంచి కవితాధారకలిగి యుండినను "ఆకాలమున సన్యాసమున కత్యంతపూజనీయ ముండెను" (పూజనీయత) "ఈకృత్రిమపూఁదీవియలే సొగసు గులుకుచున్నవి" (కృత్రిమపుఁబూఁదీవియలే) "వారి రోషపూర్ణితచంద్రహాసదనమంటలజ్వాలలయందు" (చంద్రహాసానలజ్వాల) "అల్పయుద్దేశము" (అల్పోద్దేశము) మొదలగు దోసఁగులు పొసఁగుచున్నవి. సంస్కృతవ్యాకరణపరిజ్ఞానము పూజ్య మైనచో—భా. రా. లోని.

"యమునగంగము కృష్ణభానుదిల మజ్జాక్షన్నునవ్యంబు నీ
లమహీధ్రన్నిఖిలాచలావళి తమాలద్భూజ మిందీవర
త్క్యమునచ్ఛ్రేణి పికద్విహంగము తమస్తోమద్రహార్కప్రభా
సముదాయం బగుచుండె లోక మలఘుశ్యామాభ్రముల్ పర్విన౯."

ఇత్యాది వ్యాకరణవిశేషవిశిష్టరూపములం బ్రయోగించుట యటుండ నున్నవాని యర్థమును గ్రహించుటయైన సాధ్య మగునా?

ఇట్లు చాలవఱకు సంస్కృతవ్యాకరణనిబంధనల ననుసరించినను గొన్నియెడల నాంధ్రకవులు స్వాతంత్ర్యమును బూనకపోలేదు.

సంస్కృతవ్యాకరణమందలి "అనుస్వారస్య యయి పరసవర్ణః" ౮-౪-౫౮ అనుపాణినీయసూత్రమువలన 'అఙ్కః' అన్తః, అని యనుస్వారమునకు మాఱుగ పరసవర్ణానునాసికములు రావలసియుండఁగా,

ఉ. అంకముఁ జేరి శైలతనయాస్తనదుగ్ధము లానువేళ బా
ల్యాంకవిచేష్టఁ దొండమునవ్వలిచన్గబళింపఁబోయి యావంక-

ఉ. సింగంబాఁకటితో గుహాంతరమునం జేడ్పాటుమైనుండి మా
తంగస్ఫూర్జిత—మున్నగుస్థలములం దనుస్వార మంగీకరించిరి.

సంస్కృతమున—ఆనఙృతో ద్వంద్వే ౬-౩-౨౫ అనుసూత్రము ననుసరించి మాతాపితరౌ—అని యుండఁగాఁ దెలుఁగున 'మాత్రపిత' లనురూపమును సైతమొప్పి దానిని సూత్రబద్ధము గావించిరి.

సంస్కృతము ననుసరించి 'నదీసుత' యని కావలసియుండ, 'నదిసుత గురుకర్ణశల్యనాగపురీశులు' అని హ్రస్వశిష్టరూపమునకు సాధుత్వము కారికా బద్ధము గావించిరి.

సంస్కృతమున "అక్షౌహిణ్యాముపసంఖ్యానమ్" అను వార్తికము ననుసరించి, యక్షౌహిణి, అనియుండ దెసుఁగున, నక్షోహిణి యనురూపము నంగీకరించి ఛందోబద్ధముఁ గావించిరి.

సంస్కృతమున, "మృగనాభిర్మృగమదః కస్తూరీ" అనియుండఁగా "శ్రీవక్షోజకురంగనాభ మెదపైఁ జెన్నొందఁ" నని పెద్దనార్యుఁడు కురంగనాభ మని యకారాంతముగాఁ బ్రయోగించియున్నాఁడు. సంస్కృతము ననుసరించి 'గృహయాళు' 'కావలసియుండ' పెద్దన "యద్రిగ్రహయాళుభల్లుక' మని ప్రయోగించినాఁడు.

ఇట్టివిశేషరూపములతోఁ గూడ సమగ్రసంస్కృతపరిజ్ఞానము కలిగించు తత్సమవ్యాకరణగ్రంథమును రచియింపించి సాహిత్యపరిషత్తువా రాంధ్రభాష కొదవం దీర్చెదరుగాక!

ప్రయాగ వేంకటరమణశాస్త్రి.

శ్రీరస్తు.

ఆంధ్రసాహిత్యపరిషత్తు

# ద్వాదశవార్షికసభావృత్తాంతము.

ఆ. 1923 సంవత్సరము అక్టోబరు ది 13-14 తేదులు (శనివారము-ఆదివారము) తునిలో శ్రీరాజాగారిహైస్కూలుభవనములో సమావేశమైనది. ఆ సభకు విశాఖపట్టణమునుండి మ॥ రా॥ రా॥ శ్రీ॥ శ్రీమాన్ శ్రీవిక్రమదేవవర్మ బహాదరుమహాశయులును, (అధ్యక్షులు) కేతవరపు వేంకటశాస్త్రిగారు, యస్. యస్. అప్పలాచార్యులుగారు, (ఆయుర్వేదభూషణులు) పుప్పాల ఆనంద గజపతిదొరగారును, విజయనగరమునుండి, శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు, వింజమూరి హనుమంతరావుగారు బి. ఏ, గంజాముజిల్లా సిద్ధాంతమునుండి శ్రీత్రిపురాన వేంకటసూర్యప్రసాదరావుదొరగారును, త్రిపురాన తమ్మయ్యదొరగారును, నరసన్నపేటనుండి విద్వాన్ కట్టిసాంబమూర్తి శాస్త్రిగారు పార్వతీపురమునుండి ఆచంట వేంకటరాయసాంఖ్యాయన శర్మగారును, అనకాపల్లినుండి జనమంచి సీతారామయ్యగారును, ఎలమంచిలినుండి గొబ్బూరి వేంకటానందరాఘవరావు బి ఏ., గారును, కొరుప్రోలునుండి ఆయుర్వేదభూషణ వీటూరి వాసుదేవశాస్త్రిగారును, కాకినాడనుండి కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు, సుబ్బయ్యశాస్త్రిగారు, వింజమూరి లక్ష్మీనరసింహారావుగారు, శ్రీబుద్ధరాజు వేంకటరాఘవరాజుగారు, బి. ఏ., బి. ఎల్., వెంపరాల సూర్యనారాయణగారు, దినాకర్ల వేంకటావధానిగారు, ఆంధ్రపత్రికావిలేఖకులు, స్వరాజ్యపత్రికావిలేఖకులు, రాజమహేంద్రవరమునుండి ఉపాధ్యాయుల వేంకటరమణయ్యపంతులుగారు, ఆకొండి వేంకటశాస్త్రిగారును, బందరునుండి దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారును, కౌతా శ్రీరామశాస్త్రిగారు, జయంతిపురము జమీందారు శ్రీరాజా వాసిరెడ్డి దుర్గాసదాశివేశ్వరప్రసాదబహాదరుగారును, తణుకునుండి, ఏలూరిపాటి రామభద్రచయనులుగారును, ముమ్మిడివరమునుండి పండితారాధ్యుల నాగభూషణకవిగారు, చిత్రాడనుండి శ్రీకావ్యనిధి చెలికాని లచ్చారావుగారును, కొవ్వూరునుండి తల్లాప్రెగడసూర్యనారాయణరావుగారు, రాజోలునుండి, పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు, చిల్లరిగె

యోగానందయ్యపంతులుగారును, వెదురుపాకరాయపరమునుండి మలిరెడ్డి సత్తి రెడ్డిగారును, పిఠాపురమునుండి, పురాణపండ నల్లయ్యశాస్త్రిగారు, వేరి వేరయ్య శాస్త్రిగారు, శతావధాని ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారు, చింతలపూడి సీతారామయ్యగారు, దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి బి, ఏ. గారు గోరసనుండి శ్రీరావు వేంకటరావుగారును తునిప్రాస్తవ్యులు, శ్రీ రాజా వత్సవాయ వేంకటసూర్యనారాయణరాజు బహద్దరుగారు, (ఆహ్వానసంఘాధ్యక్షులు) శ్రీరాజా వల్లపరాజు మీర్జాసీతారామచంద్రరాజు బహదరుగారు, శ్రీరాజా వల్లపరాజు మీర్జా అచ్యుతరామరాజుగారు, శ్రీరాజా దాట్ల వేంకట సూర్యనారాయణరాజు బహద్దరుగారు, శ్రీరాజా వల్లపరాజు మీర్జా బుచ్చి వేంకటపతిరాజు బహద్దరుగారు, శ్రీదంతులూరి వేంకటనరసింహరాజుగారు, శ్రీదంతులూరి వేంకటరామమూర్తిగారు, శ్రీకవిరాజు వత్సవాయ వేంకట నీలాద్రిరాజుగారు, దేవులపల్లి లక్ష్మీపతిశాస్త్రిగారు, బోడపాటి రాజన్నపంతులు గారు, బి ఏ., (తునిదివాన్) శ్రీమాన్ నల్లానిచక్రవర్తుల సంపత్కుమార పెద రంగాచార్యులయ్యవార్లంగారు, శ్రీమాన్ నల్లానిచక్రవర్తుల వరద వేంకట రంగాచార్యులయ్యవార్లంగారు, ఇనుకూరి గోపీపతిరావుగారు బి. ఏ., కాశీ భట్ట ఉమామహేశ్వరరావుగారు బి. ఏ., భమిడిపాటి సూర్యనారాయణశాస్త్రి గారు, సామ్రాజ్యం శ్రీనివాసరావుగారు, కొండపల్లి జగన్నాధదాసుగారు, చల్లా వేంకటరమణయ్యగారు, బులుసు కామేశ్వరరావుగారు, మఱియు ననేకులు రాజకీయోద్యోగులు, పౌరులు, పాఠశాలోపాధ్యాయులు, బలువురు భాషాభిమానులును, భాషాకోవిదులువిచ్చేసిరి.

కవిరాజు శ్రీవత్సవాయ వేంకటనీలాద్రిరాజుగారి స్వాగతపద్యములతో సభ ప్రారంభ మైనది. ఆహ్వానసంఘాధ్యక్షులు తమస్వాగతోపన్యాసముం జది విరి. సభాధ్యక్షులు తమ ప్రారంభోపన్యాసముం జదివిరి. దివాన్‌బహదరు వి. రామభద్రనాయఁడుగారు (మధురజిల్లా వడగరై దొడ్డప్పనాయక్కనూర్ జమీందారులు) మొదలగువారు పంపిన తంత్రీవార్తలును, వడ్డాది సుబ్బరాయ కవిగారు మొదలగువారు వ్రాసిన లేఖలును జదువఁబడినవి. కొందఱు బాలికలు గీతములం బాడిరి.

ది 13 తేదిని, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు, రఘువంశౌచిత్యముం గూర్చి చదివిరి. నందిరాజు చలపతిరావుగారు, ఆంధ్రభాషావర్ణలోపవిమర్శన మును బోస్టులోఁ బంపిరి. దానిని క్రొత్తపల్లి సూర్యరావుగారిచేఁ జదివించిరి.

గొబ్బూరి వేంకటానందరాఘవరావు బి. ఏ., గారు, నన్నయభట్టారకుని వచన రచనంగూర్చి చదివిరి. ధేంం వేంకటాచలపతి బి ఏ., గారు పంపిన జ్యోతిష వ్యాసమును బ్ర॥ ఏలూరుపాటి రామభద్రయ్యనులుగారిచేఁ గొంత చదివించిరి. పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు భారతముం గూర్చినవ్యాసముం జదివిరి. కొత్తా శ్రీరామశాస్త్రిగారు (శారదాపత్రికాధిపతులు) శిల్పముగుఱించి కొంతయుపన్యసించిరి. కీ॥ శే॥ వ్యాసమూర్తిశాస్త్రిగారి వ్యాసభారతముంగూర్చి వారిపుత్రులు వేంకటశాస్త్రిగారు కొంతప్రశంసించిరి.

ది 14 తేదిని శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు, సంస్కృత భాషలోని రామాయణనాటకములు, శ్రీకావ్యనిధి చెలికాని లచ్చారావుగారు పూర్వాధునికవిద్యలయుపయోగము, నల్లానచక్రవర్తుల సంపత్కుమారవెద వేంకటశ్రీనివాసరంగాచార్యులయ్యవార్లుంగారు వారణాసి ధర్మాభట్టోజీ పాండిత్యాదులు ముచ్చటించిరి. భమిడిపాటి సూర్యనారాయణశాస్త్రిగారి నాటకవ్యాసము గుంటూరు దీక్షితులుగారు చదివిరి. కవిరాజు శ్రీ॥ న॥ వేం॥ నీలాద్రిరాజుగారు క్షత్రియకవులంగూర్చి స్వల్పముగాఁ బ్రసంగించిరి. ఏకుమళ్ల అచ్యుతరావు ఎం. ఏ, గారు, ప్రయాగ వేంకటరమణశాస్త్రిగారు పంపిన నారాయణకవి పంచతంత్రము, ఆంధ్రభాష—సంస్కృతసంబంధము ననువ్యాసములు వ్యవధి చాలనికారణమునఁ బ్రస్తావించినిల్పివైచిరి. విద్వాన్ సాంబమూర్తి శాస్త్రిగారు మాతృభాషంగూర్చి చదివిరి. చిల్లరిగె యోగానందయ్యపంతులుగారు తాము రచించిన రామాయణములోనికొన్నిపద్యములు చదివిరి. శ్రీత్రిపురాన వేంకటసూర్యప్రసాదరావుదొరగారు పరిషత్తును కీ। శే। లక్ష్మణరావుగారిని గుఱించియును, శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు, కీ। శే। లక్ష్మణరావుగారిని గుఱించియును. తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు, ఆంధ్రసాహిత్యముంగూర్చియుఁ బద్యములు చదివిరి. కొండపల్లి జగన్నాథదాసుగారు హిందూదేశచరిత్రమును బొబ్బిలిపాటరీతిగాఁ బాడియు, నక్షురమాలను హార్మోనీమీఁద వలె ననుకరించియు ముచ్చటించి నవ్వించిరి. యస్. రంగాచార్యులుగారు సాక్షిలోని భాషోపన్యాసముం గావించిరి. దివాకర్ల వేంకటావధానిగారు, వెంపరాల సూర్యనారాయణగారుఁ గొన్ని పద్యములం జదివిరి. శ్రీమాన్ చల్లానిచక్రవర్తుల సంపత్కుమారవరద వేంకట రంగాచార్యులయ్యవార్లుంగారు కొంతభాషావిషయకవాక్యములు చదివి కొన్ని పద్యములం బఠించిరి. శ్రీరాజా మీర్జా అచ్యుతరామరాజుగారు శ్రీతుసిరాణి

గారికిని శ్రీకుమారరాజావారికిని గలిగిన యుపస్థను దెల్పుచు హారిపక్షమునఁ సభకు విచ్చేసిన సభ్యుల నుపచరించిరి. సభాధ్యక్షులు సభ రెండుదినములలో జరగిన వ్యాసాదులపైఁ దమయభిప్రాయముల వెల్లడించిన పిమ్మట బ్ర॥ ఏలూరుపాటి రామభద్రచయనులుగారు (సారస్వతసర్వస్వపత్త్రికాధిపతులు) రాఁబోవు పరిషత్సభ తణుకులో జరుపవలయునని యాహ్వానించిరి. బ్ర॥ జయంతి రామయ్య పంతులుగారు సభాధ్యక్షులను, శ్రీ శ్రీతునిరాణిగారిని శ్లాఘించి సభనుజక్కగా నడపిన యాహ్వానసంఘమువారిని స్వచ్ఛందసేవకులు మొదలగువారి నభినందించిరి. ఆనాఁటి సభలోని తీర్మానములు.

1. దుందుభిసంవత్సరకార్యనివేదనము చదువఁబడి యామోదింపఁబడినది.

2. పరిషత్కార్యస్థానముఁ జెన్నపట్టనమునుండి సాధ్యమైనంతత్వరలోఁ గాకినాడకు మార్చుటకుఁ దీర్మానింపఁబడినది. పరిషత్ప్రతిష్ఠాపకులలోను, పోషకులలోను నొకరగు శ్రీ శ్రీ పిఠాపురము మహారాజావారిదినములలోఁ బరిషత్తునకుఁ జేసియుండిన మహోపకారములకుఁ గృతజ్ఞులై, యింతటినుండి పరిషత్పోషణభారము వహించుటకుఁ బరిషత్సభ్యులు శ్రీవారిని సవినయముగఁ గోరుచున్నారు.

3. తెనుఁగుభాషయొక్క యభివృద్ధియే ముఖ్యోద్దేశముగాఁ గలిగి నియమబద్ధముగాఁ గార్యములను నడపుచున్న ఆంధ్రసాహిత్యపరిషత్తుయొక్క (తునిలోజరగిన) వార్షికసామాన్యసమావేశసభవారు చెన్నపురివిశ్వవిద్యాలయము H. E. ఛాన్సలరుగారిని, ఆంధ్రభాషాపక్షమున సెనెట్‌లో నియమింపఁబడఁబోవు సభ్యుని నెన్నుకొనుట కీపరిషత్తున కధికారము నొసంగవలయునని వినయపూర్వకముగాఁ బ్రార్థించుచున్నారు. ఇట్లు చేయుటకు వీలులేక యీ సభ్యులను నియమించుట ఛాన్సలరుగారి యధికారములోనే యున్నయెడల, ఈ విషయములో, ఆంధ్రసాహిత్యపరిషత్తువారి యభిప్రాయముం దెలిసికొని తదనుసారముగా సభ్యునినియమింపవలయు నని ప్రార్థించుచున్నారు.

4. రుధిరోద్గారిసం॥ లోఁ బరిషత్తునకు ఆయవ్యయములు నిరుటివలెనే యుండవలయు నని తీర్మానింపఁబడియెను.

5. పరిషత్కోశాధ్యక్షులుగా నుండిన దివాన్‌బహాదరు కంచికృష్ణస్వామిరావుపంతులుగారును, కార్యదర్శులలో నొకనుగానుండిన కొమర్రాజు వేంకటలక్ష్మణరావుపంతులుగారును గాలధర్మము నొందుటవలన వారియకాలమరణమునకుఁ బరిషత్తు మిగుల వంత నొందుచున్నది.

6. పరిషత్తునకుఁ గార్యనిర్వాహకవర్గ మిప్పు డున్నట్లే యుండవలయు నని తీర్మానింపఁబడినది.

జయంతి రామయ్యపంతులుగారు - కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

రాయిసాహేబు గుమ్మిడూరి వేంకటరంగరావుగారు - కార్యదర్శి.

గౌ. న్యాయమూర్తి వేపా రామేశముపంతులుగారు. బి.ఏ.బి.ఎల్.<br>
దివాన్‌బహాదరు ధర్మవరము శేషాచార్యులుగారు. బి.ఏ.బి.ఎల్. } కోశాధ్యక్షులు.

క్రొత్తగా 5 గురు సాధారణసభ్యులు చేర్చుకొనఁబడిరి. కొందఱకు రైలు రాకపోకలవ్యయ మీయఁబడినది. ఆసభలోఁ జదువఁబడిన వ్యాసములు, పద్యములు మున్నగునవి పరిషత్పత్త్రికలోఁ గ్రమక్రమముగఁ బ్రచురింపఁబడును.

పరిషద్ద్వాదశవార్షికోత్సవ సభసమ్మాననసంఘాధ్యక్షుల

# స్వాగతోపన్యాసము.

(శ్రీరాజా వత్సవాయ వేంకట సూర్యనారాయణరాజు బహద్దరుగారు)

———

శ్లో. శారదా శారదాంభోజవదనా వదనాంబుజే
సర్వదా సర్వదాస్మాకం సన్నిధి స్సన్నిధిం క్రియాత్.

శ్లో. సభాకల్పతరుం వందే వేదశాఖోపజీవితమ్
శాస్త్రపుష్ప సమాయుక్తం విద్వద్భ్రమరశోభితమ్.

మాతృభాషాభిమాన మాననీయులారా!

శ్రీమచ్చెన్నరాష్ట్రపరిపాలకు లగు హెచ్. హెచ్. విల్లింగ్‌డన్ ప్రభువుగారివలన (Fairy God Mother) ప్రసన్నమాతృదైవత మనియు, దేశీయమహాసభాకార్యదర్శినర్గమువలన మహారాజ్ఞి యనియుఁ బండితకవిసార్వభౌములవలన భూలోకసరస్వతి యనియుఁ బ్రశంసింపఁబడినట్టియు, శ్రీ వత్సవాయిసంస్థాన ప్రభ్వీగా రగునట్టియు శ్రీ శ్రీ తుని మహారాజ్ఞిగారిపక్షమున శ్రీమదాంధ్ర సాహిత్యపరిషత్తు నాహ్వానించు భాగ్యము మాకుఁ జేకూరినందుకుఁ బొందుగ డెందంబుల నమందానందంబు నొందుచున్నారము. మహాకవి భట్టమురారి తన యనర్ఘరాఘవములో—

శ్లో. మధ్యేకృత్య ఘనం ధినోతి జలధి స్సైన్వ రంబుభి ర్మేదినీం
హన్తి స్వైః కిరణై స్తమిస్ర మరుణం కృత్వా స్తరాళే రవిః
త్వం రామాన్తరితశ్చ పాలయ నిజై స్సేవప్రతాపైః ప్రజా
మిక్ష్వాకోప్పి పరోపకారసుహృదా మేషస్వభావోహి సః.

అని చక్కఁగ వక్కాణించినఫక్కినే సత్కరుణాజలనిధియగు శ్రీ మహారాజ్ఞిగారు మమ్ము ఘనులఁ జేసి మాచే నీఘనకార్య మొనరింపించుట సర్వవిధముల సమంజసముగానే యున్నది. కాన, ఆంధ్రసారస్వతాభిమానము ప్రేరేప మాయాహ్వానము ననుసరించి యెండ యనక వాన యనక దూర మనక భార మనక యాంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వహణదీక్షాపరాయణు లై యీజాంగల ప్రదేశమునకు విచ్చేసియున్న మీ కభివందనపూర్వకముగా స్వాగత మొనరించుచున్నాము.

ఎచ్చట నిక్క మగుసారస్వతాభివృద్ధి యుండునో యచ్చట నితరాభివృద్ధు లన్నియు విరాజిల్లుచుండును. సారస్వతవైభవ మిహపరములు రెండిటిని గూ

ర్భుచు. అట్టి సారస్వతముయొక్క యభివృద్ధికై మనఃపూర్వకముగాఁ బనిచేయు చున్న మీరాయీపరిషద్వార్షికోత్సవము నేఁడు మా సంస్థానమునఁ గావింపఁ బూను కొనుటచే మే మెంతయు ధన్యులమైతిమి. మిమ్ము నాదరించు సంస్థానములకును లక్ష్మీస్థానములకును గొదవ యుండదు. కాని మాయందలికృపచే నేఁడు మా కీగౌరవమును మీరు కలిగించినందుకు హృదయపూర్వకవందనముల మఱి మఱి గావించుచున్నాము.

మా వత్సవాయిసంస్థానప్రశంస:—మా యీచిన్న వత్సవాయిసంస్థానము మొన్న మొన్నటివఱకు నించుమించుగా గోదావరీ, కృష్ణా, గుంటూరు మండలముల హెచ్చుగా వ్యాపించియుండి యాంధ్రదేశమునందలి సంస్థానములలో నెల్ల నన్నిటఁ బెద్దదై తద్దయు విరాజిల్లిన పెద్దాపురసంస్థానములో దైవకృపచే మిగిలియున్న యొకచిన్నభాగమైయున్నది. కావున మన మా సంస్థానముయొక్క పూర్వచరిత్రమునుబట్టి పెద్దాపురసంస్థానమని చెప్పుకొనుట కేమభ్యంతరమును లేదు. ఆదినుండియు మాసంస్థానము మనయాంధ్రసారస్వతాభివృద్ధికై మిక్కిలి సాయపడియున్నది. మాసంస్థానమునఁ జతుర్విధకవిత్వములును, దొల్లి శోభిల్లినవి. ఇందుకు నీసంస్థానమువా రొసంగిన మడిమాన్యముల ననుభవించుచు నీసంస్థానప్రదేశములలో నిప్పటికిని నివసించియున్న దిట్టకవివారు, శృంగారకవివారు, బంధకవివారు, నిమిషకవివారును దార్కాణముగా నున్నారు.

మా పెద్ద లీక్రిందికృతితల్లజములఁ గృతిపొంది సుకృతులైరి.

| కృతి. | కృతికర్త. | కృతిభర్త. |
|---|---|---|
| 1. శేషధర్మములు. | వెణుతురుపల్లి విశ్వనాథకవిగారు | చతుర్భుజ తిమ్మరాజబహద్దరుగారు. |
| 2. హరిభక్తశుభోదయము. | | రాయ జగపతిరాజుగారు. |
| 3. ద్రౌపదీపరిణయము. | ఏనుఁగు పెదలక్ష్మణకవిగారు. | సార్వభౌమతిమ్మజగపతిరాజుగారు. |
| 4. కిరాతార్జునీయము. | దిట్టకవి వేంకటాద్రికవిగారు. | బలభద్రతిమ్మజగపతిరాజుగారు. |
| 5. ధ్రువచరిత్రము. | ఏనుగు పెదలక్ష్మణకవిగారు. | జగన్నాథజగపతిరాజుగారు. 1. |
| 6. తుల్యామాహాత్మ్యము. | | 2. ,, |
| 7. చిత్రచమత్కారమంజరి | ఆణివిళ్ల వేంకటశాస్త్రిగారు. 1.<br>2. | తిమ్మజగపతి మహారాజుగారు. |
| 8. రామవిలాసము. | ఏనుఁగు చినలక్ష్మణకవిగారు. | గోపరాజుగారు. |

ఈరీతిఁ గృతుల నందినవారలె గాక తాము కవిరాజులై కృతిరాజముల నొనరించినవారలు గూడ మాపూర్వులలోఁ గలరు. శ్రీరాజా వత్సవాయ బలభద్రజగపతిరాజు బహద్దరుగారు రామశతకమును విరచించిరి. శ్రీరాజా రాయజగపతిరాజు బహద్దరుగారు భద్రాద్రిరామశతకమును, మఱికొన్నికృతులను విరచించిరి. మూఁడవతిమ్మజగపతిరాజు బహద్దరుగారు గొప్ప విద్వాంసులు, కవులునై బహుదేశలిపుల బహుదేశభాషల నేర్చి వెలసిరి.

ఇంకను మావారు మిక్కిలి భాషాభిమానులై బహుశాస్త్రవేత్త లగు పండితరాట్టుల ననేకక్షేత్రాగ్రహారశోభితుల సౌదార్యముమీఱఁ గావించిరి.

ఈక్రిందిశ్లోకరాజ మాయంశమును సూఛి చేయుచున్నది.

శ్లో. క్షేత్రం దాశరధేః ఖిలం నిజపదస్పర్శేన దోషోజ్ఝితం
తర్కజ్ఞస్య చ గౌతమీతటజుషో విప్రస్య సప్రత్యదాత్
గోదాసప్తకతీరసంతతజుషాం షడ్దర్శనీదర్శనాం
శ్రీతిమ్మక్షితిపో ఖిలం నిజకరస్పర్శేనదత్తే నిశమ్.

వీరు విద్వాంసుల కిచ్చినయగ్రహారాదికము లనేకములు గలవు గాని గ్రంథవిస్తరభీతిచే నిచ్చట నుదహరించుట మానినారము.

పెద్దసంస్థానము చాల నన్యహస్తగతమై స్వల్ప మగుతునిభాగము మిగిలియున్నకాలములోఁ గూడ మాచిన్నిసంస్థానము సాహిత్యవైభవాభివృద్ధి నొందించుటలోఁ బెద్దపేరునకుఁ దగిన రీతినే ప్రవర్తించుచున్నది ఇటీవలఁగూడ మాసంస్థానాధిపతు లనేకసత్కావ్యముల నందుకొనియు బహుపండితబృందమును సత్కరించియు మాతృభాషాపోషణ మొనరించుచున్నారు. శ్రీరాజా వేంకటసింహాద్రిజగపతిరాజు బహద్దరుగారు కువలయామోదము, జగత్పతిసుభాషితము, ప్రభావతీప్రద్యుమ్నము నను కావ్యములఁ గృతినొందిరి. మఱియు వీరియాదరణమునకుఁ బాత్రులైనవిద్వద్వరేణ్యులు మనభాషకుఁ గావించిన మహోపకారము వర్ణనాతీతము.

సంస్కృతాంధ్రములయం దసమానపాండిత్యము కలిగియుండి మన యాంగ్లప్రభువులచే మహామహోపాధ్యాయబిరుదమును బడసి సమస్తశాస్త్రములయందును గూలంకషప్రజ్ఞ కలిగి దిగంతవిశ్రాంతకీర్తిని వహించి కీర్తిశేషులైన శ్రీ పరవస్తు వేంకటరంగాచార్యు లయ్యవార్లంగా రీసంస్థానవిద్వాంసులై యుండి విశేషగౌరవమును బొందిరి. వీరు సమస్తశాస్త్రములందును నిరుపమానపాండిత్యము కలవారై మంజులనైషధాది మహాకావ్యముల గీర్వాణ

భాషలో రచించిరి. ఈమాన్యులు సంస్కృతమున శబ్దార్థసర్వస్వ మనుననన్యసాధ్యంబగుగొప్పనిఘంటురాజమును నిర్మించిరి. ఇది వాచస్పత్యాదినిఘంటువులకంటె గొప్పది. సులభక్రమమున సంస్కృతవ్యాకరణమును నొనర్చిరి. మఱియును వీరు తెలుఁగునకుఁ గూడ మహోపకారం బొనర్చిరి. సంస్కృత నాటకములఁ దెనిఁగింపమొదలిడినవారు వీరే. వీరు శాకుంతలము, ప్రబోధ చంద్రోదయమును దెనిఁగించిరి. వీరియాంధ్రీకరణములు పత్రికలలో నచ్చుపడుచు రాఁగా వానిం గని మఱికొందఱుకూడ శాకుంతలాదులఁ దెనిఁగింప మొదలిడిరి. ఇంగ్లీషుభాషలోని ప్రకృతిశాస్త్రముల మొట్టమొదటఁ దెనిఁగించినవారును వీరే. వీరు వస్తుతత్త్వశాస్త్రమును దెనిఁగించి పత్రికలలోఁ బ్రకటించి యాంధ్రలోకమునకు మహోపకారం బొనర్చిరి. వీరిం గని మఱికొందఱు నవనాగరకులు ప్రకృతిశాస్త్రములఁ దాముగూడఁ దెనిఁగింపఁ బ్రయత్నించిరి. వీరే మొట్టమొదట మనమతవ్యాప్తికై సభల స్థాపించి యందు బహువిషయములంగూర్చి బహుమహోపన్యాసము లిచ్చి వాని నన్నిఁటిని నచ్చొత్తించిరి. వివేకవర్ధని బయలుదేఱుటకుఁ బూర్వమే వీరు సకలార్థదాయని యను తెలుఁగు పత్రికను బ్రకటించి యందు నీతిమతాచారములం గూర్చియును విద్యావిషయమయ్యును మృదుమధురము లగువ్యాసములను వ్రాయుచు వచ్చిరి. నవనాగరికుల సులభశైలికి వీరిశైలి మాతృక. నిక్కము చెప్పవలసివచ్చిన గద్యతిక్కన యనుబిరుదమునకు వీరే యర్హులు. మఱియును వీ రుపనిషదర్థమును మనోహరము లగు కీర్తనములమూలముగా లోకమునకు బోధించిరి. ఛందశ్శాస్త్రముం గూర్చి యొకగ్రంథము వ్రాసిరి. తెలుఁగునకు వీరుచేసిన మహోపకార మన్యాయముగా నన్యులపా లగుచున్న దని తెలుపుట కెంతయు విచారముగా నున్నది. ఈమహనీయు లీమహాసభ జరుగుచున్న యీస్థలముననే నివసించెడివారు. వీరిపావనపాదరజస్స్పర్శముననే యీ ప్రదేశ మిప్పుడు విద్యాపీఠమై విరాజిల్లుచున్న దని విన్నవించుచున్నాము.

ఇంకను మావత్సవాయవంశమణు లై యీయాస్థానవిద్వత్కవిశిరోమణు లై యొప్పుచున్న శ్రీవేంకటనీలాద్రిరాజగారు మేఘసందేశము, శాకుంతలములోనుగాఁగల కాళిదాసకృతుల సరసముగను, సరిగను నాంధ్రీకరించి యున్నారు. వీరిశాకుంతలాంధ్రీకరణ మితరాంధ్రీకరణము లన్నిఁటికన్న మిన్నయై యున్న దనుట స్వభావోక్తియే కాని యతిశయోక్తి కానేరదు. ఇంకను వీరు శతావధానులై కవిరాజబిరుదాంకితులై వఱలుచున్నారు.

మఱియును విమర్శకాగ్రగణ్యు లని లోక ప్రసిద్ధినొందిన శ్రీయుత కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రులవా రీసంస్థానాదరణము నంది పెద్దాపురసంస్థాన చరిత్రాద్యనేకగ్రంథముల వ్రాసి భాషకు మహోపకార మొనర్చుచున్నారు. వీరు సద్విమర్శనమూలముగా నాంధ్రలోకమునకు గుణాగుణపరిజ్ఞానము హెచ్చునట్లు చేయుచున్నారు. ఇది భాషాసేవకు ముఖ్య మగువర్ణనీయోద్యమము.

ఈవిధముగా సహజ మగుమాతృభాషాభిమానముతో దాని యభివృద్ధికై సర్వదా పాటుపడుచున్న మా యీసంస్థానాహ్వానము నంగీకరించి యీ వత్సర మీవార్షికోత్సవ మిచ్చటఁ గావించుట సంభావ్యముగా నున్న దని భావింపనివా రుండ రని తలంచెదము.

ఇంకఁ గర్తవ్యాంశములం గూర్చి ముచ్చటించుకొందము. మాయాహ్వానసంఘ మొనరింపవలసిన ప్రధానకృత్యము మీకు వలయు పదార్థములఁ దెలిసికొని, మీకు రుచించుపాకముల నెఱింగి, మీ రంగీకరించు రసవిశేషముల గుర్తించి, మీర లామోదించు రీతుల నవగాహనము చేసికొని, వేయేల మీ మెప్పునొందు కృతుల బోధలోనికిఁ దెచ్చుకొని మీకన్నిఁట సదుపాయము సమకూర్చుట యై యున్నది. కావున నాయావిషయములం గూర్చి యించుక యీసభాస్థలిలోఁ బ్రప్రథమమున ముచ్చటించి మీవీనులకు విందొనరించుచున్నాము.

పదార్థవివేచనముంగూర్చి:—ఇక్కాలమునఁ బండితకవివరులకు రుచించుపదార్థము లేవని విచారింపవలసిన యవసరము నేఁడు కలిగినది. ఏ మన నిప్పటిపండితలోకములో నొకకొందఱు సారస్వతప్రియులు స్వీకరింపఁదగిన పదార్థవిచారములో భిన్నాభిప్రాయము కలవారు బయలువెడలుచున్నారు. సర్వసాధారణముగా విబుధవర్యు లందఱు ప్రాచీనార్యకృతవిధి నిషేధముల ననుసరించి విధివిహితపదార్థముల స్వీకరించి నిషిద్ధములఁ ద్రోసివేయుట సుకృతిలక్షణ మని తెల్పియుండఁగా మఱికొందఱు నవీనపండితులు లోకమునం గలసర్వపదార్థములు విధినిషేధములు లేక స్వీకరింపలయు నని వాదించుచున్నారు. ఇట్టి కలగూరగంపవాదము నిస్సార మైన దని మీ రెల్లరుఁ దలంచెదరని భావించెదము.

ఇట్లు పదార్థములఁ గలగూరగంపఁ జేయుదు మేని పాకము చెడు నని గ్రహించుకొనని వివేకు లుండఁబో రని మా నమ్మకము. ఆదిని రాజరాజనరేంద్రుఁడు రాజిలఁ జేయించిన యపూర్వవినిర్మలపాకమును బిమ్మట మనుమసిద్ధి

సిద్ధముచేయించిన నిరుపమానపాకమును, అటుపిమ్మటఁ గృష్ణదేవరాయ లా యుత్తముఁజేయించిన యుత్తమపాకమును దనివిదీర ననుభవించుచున్నవారికిఁ దుదకు గ్రామ్యపాకము రుచించు నని సద్వైద్యులకు లగువా రెవరు తలంపఁగలరు? విదేశపాకముల నించుక చవిగొని వానిరహస్యముల నైన బాగుగ గ్రహించుకొనఁజాలక తుదకు గ్రామ్యవాదములోనికి మనవారు గొందఱు దిగిరి. ఈయుద్యమము సారస్వతముయొక్క గౌరవము నంతను జెడఁగొట్టును. ఈగ్రామ్యవాద మనేకవిధముల నడచుచున్నది. కొందఱు యతిప్రాసల విడిచి పెట్టవలయు ననుచున్నారు. మఱికొందఱు వర్ణభేదము పాటించుట యనర్థదాయక మని యెంచి దానిసాంకర్య మొనరింపఁ బాటుపడుచున్నారు. ఇఁకఁ గొందఱు ఛందస్సులు వట్టిఛాందసత్వములను బెంచును గావున ఛందోనియమములఁ బోనాడవలయు ననుచున్నారు. వేఱొకకొందఱు భాషానియమ మక్కఱలేక సమస్తభాషాపదముల నిచ్చవచ్చినట్లు వాడవచ్చు ననుచున్నారు. ఇకనొకకొందఱు భాషాయోషను విధివిహితసూత్రవిహీనను గావించి నిరలంకృతను జేయవలయు నని భావించుచున్నారు. మొత్తముమీఁద విధి యేదియును నుండఁగూడ దనియు స్వేచ్ఛాసంచారమునకుఁ గావలసినంత యవకాశ ముండవలయు ననియు వీరు తలంచుచున్నారు.

చిక్కగనుండు విధుల నేర్చికొని కృతుల నొనరించుట యందఱికిని సాధ్య మగునా యందురేని నయ్యది యందఱకును సుకరము కానిమాట నిజము. కాని కావ్యనిర్మాణ మనునది యందఱును సమకూర్పఁ బాటుపడఁదగినదే కాదు. ఈశ్వరకటాక్షముచే లభ్యమైన ప్రతిభయును కావ్యశాస్త్రాద్యవేక్షణముచేఁ గలిగిన జ్ఞానమును నేధన్యులం దుండునో యాధన్యులే యుత్తమకృతుల నొనరింప నర్హు లగుదురు. కాని, ప్రతిమానవుఁడును నాపనికి సిద్ధము కావలసినది కాదు. భాషయొక్క గౌరవమును నిలుపఁదలఁచినవా రెల్లరును సంస్కారయుతము లగుసత్కృతులనే గౌరవించి సంస్కారవిహీనముల నిరసింపవలయును. ఈవిషయములో నీయాంధ్రసాహిత్యపరిషత్తిదివఱకుఁ జేసినపని చాల శ్లాఘనీయముగా నున్నది.

రసవిచారము:—మనలో నుత్తమకావ్యము లనేకములు పుట్టినను మొత్తముమీఁద నవి యన్నియుఁ జాలభాగము శృంగారరసప్రధానములై యున్నవి. మానవబుద్ధి నుద్దీపింపఁజేయు వీరాదిరసప్రధానము లగుకావ్యములును నీశ్వరభక్తి పుట్టించు శాంతరసప్రధానము లగుకబ్బములును జాలఁ దక్కువ. మన

యాంధ్రమునకు మాతృభాష యగుసంస్కృతమునను, సోదరభాష లగు నరవము లోనగువానియందును, పాలకభాష యగు నాంగ్లమునందును, వీరాదిరసప్రధానములై మానవుని మానవత్వము నభివృద్ధి నొందించు గ్రంథరాజములనేకములు కలవు. అట్లు మనభాషలోఁగూడ బయలు వెడలవలసియున్నది.

వస్తుప్రధానములగు కృతులు:—వస్తుప్రధానము లగుగ్రంథములు చరిత్రాదికములై యున్నవి. ఈయవి మనలో జాలఁ దక్కువ. ఇప్పుడు కొన్ని బయలు వెడలుచున్నవి కాని వానిని వ్రాయువారి యూహలు పరాధీనములై పరుల మతానుసారముగా బయలువెడలుచుండుటచే శ్రేయస్సునకు బదులుగా ననర్థము నాపాదించుచున్న వని తెల్పవలసి వచ్చినందుకుఁ జింతిల్లుచున్నారము. మనసాంప్రదాయములను, మనగమనికలను, మనమనోభావాదుల స్థితిగతులను, సరిగ గ్రహింపఁజాలని పరులు వ్రాసినవ్రాఁతలందుఁ గలనమ్మకము మనవారికి మనపెద్దలవ్రాఁతలయందు లేదు. ఇందు కొక యుదాహరణము నిచ్చుచున్నాము. నన్నయభట్టోపాధ్యాయసార్వభౌముఁడే మనయాంధ్రమున నాదికవి యని మనసారస్వతము నొక్కి వక్కాణించుచున్నది. మారన, కేతన, తిక్కన నన్నిచోడుఁడు, లోనగు నాదికాలకవు లెల్లరు నాతఁడే యాదికవి యని నొక్కి వక్కాణించుచున్నారు. అయినను వీరిమాటలఁ బాటింప నవసరములే దఁట. కాని నన్నయ యాదికవి యనుటకు నిప్పటి పాశ్చాత్త్యులు కొంద ఱంగీకరించుట లే దఁట! అందుమూలముచే నన్నయకు మనపూర్వు లిచ్చినపదవిని మనవా రిప్పుడు లాగివేయుదు రఁట. "ఇఁక వారికి మున్ను కవులుండి గ్రంథములు రచించి రనువిషయమున ననేకగ్రంథశోధకు లగుపాశ్చాత్త్యపండితుల యభిప్రాయ మీక్రిందఁ బొందుపఱచి నాను" అని యొకరు వ్రాసియున్నారు. మనప్రాచీనులు గ్రంథశోధకులు కారా? వారి వ్రాఁతలయం దేల నమ్మక ముండరాదు? మన దెల్ల యసత్యము పరులు వ్రాసిన దెల్ల సత్య మనువెఱ్ఱి భావము మన కున్నంతకాలము మనము బాగుపడఁజాలము. సద్విమర్శనముచే మనవారిలోపములను గాని పరులగుణములను గాని గ్రహించుట తప్పని మా మతము కాదు. అవిమర్శపూర్వకముగా మనపెద్దలు వ్రాసినదానిఁ దృణీకరించుట యనుచితము. తగిననిదర్శనములఁ జూపక యె మననవనాగరకులు తమ యూహలపై నాకాశహర్మ్యముల నిర్మించి వానియందు సత్యత్వభ్రాంతిని గలిగింప వ్రాయు పెడచేతివ్రాఁతలు విమర్శ లేక నంగీకరింపఁదగినవి కావు. అనాదిగా వచ్చుచున్న మనవర్ణభేదములం గూర్చియును బురాణపురుషులయు ప్రాచీన

గ్రంథములయుఁ గాలాదులను గూర్చియును నభిప్రాయముల నిచ్చుటలో మన నవనాగరకులు స్వప్రతిభనే ప్రమాణముగాఁ దీసికొని యిచ్చవచ్చిన వ్రాఁతల వ్రాయుచున్నారు. ఇట్టి వనేకములు కలవు. గ్రంథవిస్తరభీతిచే వాని నుదాహరించుట లేదు ఇట్టివానిని మనసాహిత్యపరిషత్తు గర్హింపవలెను గాని యామోదింపరాదు.

మానవాభివృద్ధిని గలిగించు ప్రకృతిశాస్త్రాదికము మనలోఁ జాల తక్కువగా నున్నది. అద్దాని నితరసారస్వతములనుండి తెచ్చుకొని మనభాషలో వ్రాసికొనవలెను. మనసారస్వతాభివృద్ధికై మనము స్వయముగ నొనరించుకొన వలసినకార్యము లెన్నియో కలవు.

ఆంధ్రవిశ్వవిద్యాలయము: — అట్లే మనప్రభువర్గమువారి సాహాయ్యమొంది చేయవలసిన కృత్యములును ననేకములు కలవు. మనకుఁ బ్రత్యేకవిశ్వవిద్యాలయ ముండినఁగాని మనయభీష్టము లన్నియు నెఱవేఱుట యెప్పటికిని సాధ్యముకాదు. కావున దానిని సాధ్యమైనంతత్వరలో సంపాదించుకొనవలెను. మనప్రభుత్వమువారీవిషయములో మనకు సాయ మొనరింపసిద్ధముగా నున్నారనుసంగతి మనమందఱ మెఱింగియే యున్నారము. ఇఁకఁ దగుకృషి సల్పుదుమేని మనకుఁ ద్వరలోఁ బ్రత్యేకవిశ్వవిద్యాలయము లభింపఁగలదు. మనకు విశ్వవిద్యాలయము వచ్చులోపల చెన్నపురి విశ్వవిద్యాలయములోని శిష్టసభలో మనయాంధ్రులసంఖ్య హెచ్చించుటకు మనము ప్రయత్నింపవలెను. ఇప్పుడది చాల తక్కువగానున్న దనుసంగతి మీకు విశదమే. ఈయేఁడు శ్రీపీఠికాపుర మహారాజావారుం గూడ నందులో సభ్యులుగాఁ జేర్చికొనఁబడి రని వినుట కానందముగా నున్నది. ఇయ్యది మనపీఠికాపురవార్షికోత్సవసభాఫలితార్థ మని యెంచవలసియున్నది. తగుశ్రద్ధతో నొనరించిన నుద్యమ మెప్పుడు నూరకపోదు. పైవిరెండును పరుల సాహాయ్య మపేక్షించునవి. మనలో మనము జాగరూకతవహింపవలసిన విషయము లనేకములు కలవు. మనసారస్వతాభివృద్ధిని గోరుదు మేని అందుకు విమర్శనము లత్యవసరము. గుణాగుణవివేచనము లోకు లందఱకును సరిగ నలవడదు. కొందఱికిఁ గావ్యనిర్మాణకౌశలము సహజముగాఁ గలిగినట్లే మఱికొందఱికి విమర్శజ్ఞాన మలవడును. కావున సారస్వతాభివృద్ధికి సద్విమర్శనములు ప్రత్యేకముగా నవసరమై యున్నవి. పెద్దనార్య మహాకవి చెప్పినట్లుగా నొప్పుత ప్పరయురసజ్ఞు లున్నప్పుడే కవికిఁ జక్కనికావ్యనిర్మాణ మొనరింప నుత్సాహ ముదయించును గాని వట్టి గ్రుడ్డిస్తోత్రపాఠకు

లున్నప్పుడు కాని వట్టిగ్రుడ్డియాక్షేపకు లున్నప్పుడు కాని కవికిఁ గావ్యనిర్మాణము నందుత్సాహము కలుగదు. ఇప్పుడిప్పుడు కవివలెనే సారస్వతాభివృద్ధికి విమర్శకుఁడును నవసరమనునూహలు పుట్టుచున్నవి గాని యింకను విమర్శనవిషయములో మనవారికిఁ గొంత యరుచి కలదు. మనపెద్దలొనర్చిన గ్రంథరాజముల విమర్శించుట మనవారిలోఁ గొందఱికిఁ గిట్టుట లేదు.

ఇది యసమంజసము. పెద్దలొనర్చిన గ్రంథరాజములందలి తప్పొప్పుల నెత్తి చూపుట యుత్పత్తిజ్ఞానము కోరువారి యుపయోగార్థమే కాని మహాగ్రంథముల నిరసించి వైచుటకుఁ గాదు. సర్వజనాదరణీయము లగుకృతులందలి తప్పులనె తప్పక యెత్తి చూపవలెను. ఏమన నాగ్రంథములఖ్యాతింబట్టి వాని యందలి తప్పులను గూడ నొప్పులుగ లోకులు భ్రమింతురు. ఆభ్రమ సత్యజ్ఞానమునకు నడ్డగును. కాన దురభిమాన మూని పూర్వగ్రంథము లందలి తప్పులఁ గప్పిపుచ్చుట గాని యొప్పులుగా స్తుతించుట గాని హానికి మూల మని పండితలోకమునకు విన్నవించుచున్నాము. గ్రంథవిమర్శమునకై మనసాహిత్యపరిషత్తువా రొకయుపసంఘమును బెట్టుట శ్లాఘనీయముగా నున్నది.

పరిశోధనములు:—భాషాభిమాను లొనరింపవలసిన ప్రధానకార్యము లింకను ననేకములు గలవు. ప్రాచీనగ్రంథశాసనాదిపరిశోధనమునకై తమ జీవధనముల ధారవోయువారు కొందఱుండవలెను. ఇప్పుడు మనలో ననేకులు కలరు. వారికిఁ దగుప్రోత్సాహ మీఁబడవలెను. ఈపరిశోధకులలోఁ గొంద ఱత్యావేశపూరితులై యేదో యొకపక్షమున గట్టి పట్టు పెట్టుకొని స్వవాదస్థాపనార్థమై, లేనిగ్రంథ శాసనము లున్నట్లును, నున్నవానిని లేనట్లును, బ్రకటింప జంకకున్నారు. ఇట్టివిపరీతపరిశోధన ముండుటకంటె లేకుండుటయె శ్రేయస్కరము. మఱికొందఱు ప్రాచీనులపేరుపెట్టి నవీనముగ దొంగగ్రంథములను వ్రాయుచున్నారు. ఇఁకఁ గొందఱు స్వవాదోపబలార్థమై ప్రాచీనగ్రంథములను శిలాశాసనాదులను నిచ్చవచ్చినట్లు దిద్దుచున్నారు. గద్యములను బద్యములు చేయుచున్నారు. పద్యముల గద్యములు చేయుచున్నారు. ఇవి యన్నియు శోచనీయము లగువ్యాపారములు; కాని సత్యరతితో పరిశోధించువారు లేకపోలేదు. ఈపరిశోధనము మూలంబడియున్న యనేకగ్రంథరాజములను శాసనములను బైకిఁదీసి సారస్వతమునకు మేలొనర్చుచున్నది. ఏమైననేమి, పరిశోధకులు బయటపెట్టు విశేషముల జాగరూకతతోఁ బరిశీలింపకున్న నొకానొకప్పుడు సత్యము మఱుంగుపడుట తటస్థించును. దాన హాని కలు

ను. మనపరిశోధకులు చేయుచున్న తప్పింకను నొకటి కలదు. వీర లాంధ్ర లోక మంతయుచేతను బ్రమాణముగఁ దీసికొనఁబడుచున్న సద్గ్రంథ రాజములందలి వ్రాఁతలకంటె నేయనామకుఁడో యెప్పుడో వ్రాసిన శిలాశాసనములందలి వ్రాఁతలకు హెచ్చగు గౌరవము నిచ్చుచున్నారు. శ్రీమదాంధ్ర భారతమునందలి యాదిపర్వత్రయమును నన్నయకృతమని యాగ్రంథరాజమునందలి గద్యాదు లును, తరువాతికవివరు లగుతిక్కనాదులును, నొక్కి వక్కాణించుచున్నను నేదియో దిక్కుమొక్కు లేనియిటీవలి శిలాశాసన మొకటి భారతము రాజ నరేంద్రకృత మని తెల్పుచున్న దనియు, దానిని నమ్మవలయు ననియు, మనవారు కొందఱు వాదించుచున్నారు. మనకవు లొనర్చిన మహాకావ్యములే ప్రమాణ ములు కానప్పు డేపద్యకారుఁడోవిరచించిన శాసనశకలము లెట్లు ప్రమాణము లగునో తెలియవచ్చుటలేదు. ఈపరిశోధకులం గూర్చి ముచ్చటించునప్పుడు సభాసదుల కొకవిచారకరవిషయము విన్నవింపవలసియున్నది. పరిశోధకాగ్రణి యై, మాతృభాషాసేవకై తమయమూల్యజీవితము నంతను ధారవోసిన కొమ ర్రాజు వేంకటలక్ష్మణరావుపంతులుగా రీనడుమ హఠాత్తుగా పరలోకప్రాప్తు లగుట మనసారస్వతమున కొకలోప మని విన్నవించుచున్నాము. వీరియాత్మకు శాంతి కలుగుఁగాక. అముద్రితగ్రంథముల సంపాదించి ప్రచురించువారు కూడ సారస్వతమునకు మహోపకారము చేయువారుగా నున్నారు. వీరిమూలముగ ననేకాముద్రిత గ్రంథములు ప్రతివత్సరమును బ్రాచుర్యము నందుచున్నవి. కాని యింకను బయటికి రాఁదగినవి యనేకము లుండును. ఈ విషయములో శ్రీపీఠికాపుర మహారాజుగారు వర్ణనీయ మగుకృషి సల్పి వేనవేలు వెచ్చించి యముద్రిత గ్రంథముల సంపాదించుచున్నారు. ఈకృషి యితరులుకూడఁ జేయఁదగినది. మఱికొందఱు పండితులు కవులచారిత్రములను వ్రాసి సారస్వత మున కమూల్యాలంకారమును గూర్చుచున్నారు. కాని యేకారణముననో సుప్రసిద్ధమహాకవులు కొందఱు కవులచరిత్రములం దెక్కలేదు. కీర్తిశేషు లైన పరవస్తు వేంకటరంగాచార్యులయ్యవారలం గా రాంధ్రమున నాటకాది మహా కావ్యములఁ బెక్కింటి విరచించి ఖ్యాతి నంది రని తెల్పియుంటిమి. వీ రాంధ్ర కావ్యకర్తలనుసంగతి కవిచరిత్రకారు లెఱుంగనిది కాదు. ఇట్లే కవిచరిత్ర కారులకు మిత్రులై ప్రబంధకర్తలై ఖలకర్ణవిషాణాదిప్రౌఢకావ్యము లొనరించి కీర్తిశేషులైన పన్నాల బ్రహ్మన్నశాస్త్రులవారు కవిచరిత్రములలో నెక్కలేదు. ఈ మహాకవి కవిచరిత్రకారునికోరికపై, ఆశువుగఁ జీపురుపుడకశతకమును విర

చించె, అది వివేకవర్ధనిలోఁ బ్రకటింపఁబడినది. ఇట్టివా రనేకులు కలరు. వీరి చారిత్రములఁ బరిషత్తువారు ప్రకటించుట మంచిది.

ఇట్టిలోపముల నన్నింటి నివారించుచున్నది యాంధ్రసాహిత్యపరిషత్పత్త్రికారాజము. ఈయది మాసపత్త్రిక యగుభాగ్యము పట్టుఁగాక యని కోరుచున్నాము. ఇప్పుడు మనమాతృభాషలో నాటకములు నవలలు చాల పుట్టుచున్నవి. అది చాల సంతోషదాయకముగా నున్నది. కాని వీనిలో ననేకములు సరసకళావిహీనము లయి మంచియాదర్శములు లేక సహృదయహృదయానందమును గూర్పఁజాలకున్నవి. పరిషత్ పత్త్రిక కళావిశేషములను ఆదర్శవిశేషములను బ్రచురించి కవిలోకమునకు సాయపడవలయును.

స్త్రీవైదుష్యమునుగూర్చి:—ఇఁక నొకయంశమును గూర్చి మాత్ర మిచట ముచ్చటింపవలసియున్నది. అది యేది యన స్త్రీవిద్యావిషయము. ఆధునికులు కొందఱు స్త్రీలకొఱకై పుస్తకములు వ్రాయుటకుఁ దామే మొదటివార మనియు నంతకుఁబూర్వ మవి లే వనియుఁ బ్రకటించుకొనఁ జొచ్చిరి. ఇది దబ్బఱ. మనదేశములో స్త్రీలకై మొదటిపుస్తకము వ్రాసినవాఁడు వ్యాసభట్టారకుఁడు. ఈతఁడు మహాభారతమును స్త్రీశూద్రద్విజబంధువులకొఱకై వ్రాసె. శిష్టు కృష్ణమూర్తికవి మున్నగుపూర్వులు తెనుఁగున స్త్రీలకొఱకై గ్రంథముల వ్రాసిరి. ఇటీవలివారు కొన్నిగ్రథములను విరచించుచున్నారు కాని స్త్రీలు ప్రత్యేకముగ నేర్చుకొనవలసిన శిశుపోషణము గృహపాలనము లోనగువిషయములంగూర్చి మంచిగ్రంథము లింకను బుట్టవలసియున్నవి. ఆదినుండియు మంచి కావ్యముల విరచించు కవయిత్రులును మనలోఁ గలరు. మొల్ల యేనాఁటిది. మోహనాంగి యేనాఁటిది. వెంగమ్మ యేనాఁటిది. రంగమ్మ యేనాఁటిది. ఇప్పుడును మంచికవిత్వము చెప్పఁగలవారు కలరు. తగు ప్రోత్సాహ ముండిన వీరిసంఖ్య హెచ్చగును. ఇందుకై యుదారస్త్రీలును బురుషులు నుద్యమింపవలసియున్నది. ఇట్టి యుద్యమముల నన్నిఁటిని బూనఁదగినది సాహిత్యపరిషత్తు కావున దానిని జయప్రదముగ సాగించుచున్న శ్రీ జయంతి రామయ్యపంతులు గారికిని సభ్యులకును శ్రీరాజ్ఞిగారిపక్షమునను మాయాంహ్వానసంఘము పక్షమునను మరల నభివందనపూర్వక స్వాగత మిచ్చుచున్నాము. క్రిందటివత్సరమున మన యాంధ్రసాహిత్యపరిషత్కార్యాలయము నాంధ్రదేశములోనికి మార్చుటనుగూర్చి చాల చర్చ జరిగినది, త్వరలో నద్దాని నాంధ్రకవితాసతి పుట్టినమం

దలముయొక్క ముఖ్యపట్టనమునకుఁ దెచ్చుట మంచిది. మేము భక్తిశ్రద్ధలతో మీ కాతిథ్య మిచ్చుచున్నారము.

సాహిత్యపరిషత్కార్య నిర్వహణార్థమై విచ్చేసియున్న మీకు మా నాథ్య మగు నంతవఱకు వర్ణభేధమును బాటించుచుఁ బాకశుద్ధియు రససమృద్ధియు నుచితరీతియుఁ గలుగు చందనాగరుకర్పూరపరీమళమిళితమృదుమధురపదార్థములతో నాదరింపఁ బ్రయత్నింతు మని విన్నవించుచున్నారము. మీసుక్లోకతను జంపకోత్పలమాలికలతో గౌరవింతుము. సుమనోమనోహరాలంకారముల నలంకరింతుము. ఇది మహోత్సవసమయము కావున నాటవెలఁదుల మృదుగీతముల మిమ్మానందింపఁ జేయుదుము. మాప్రమాదముల మన్నించి విధివిహితధర్మానుసారము లగుమాసత్కృతుల నంది మమ్ము సుకృతులఁ గావింపుఁడు. భక్తవత్సలుం డగుపరాత్పరుండు మన యీమహాసభకు జయముఁ గలిగించుఁగాక.

శ్రీరస్తు.

# మహాభారతచరిత్రము.

అగ్రాసనాధిపాద్యార్యసత్తములారా! భారతీయవాఙ్మయమునందు స్మరణ దర్శన లేఖన పఠన పాఠనాదులచేఁ బురుషార్థము నర్థుల కొసఁగునది మహాభారత మని యార్యులు నుడువుదురు. రామాయణ మహాభారతగాథ లాసేతుహిమాచలపర్యంతము పెక్కువిధముల నాబాలగోపాలము గానముచేయఁదగిన సర్వరససంపత్తి కలవై యున్నవి. రామాయణమహాభారతములు పాశ్చాత్యభాషలలోనికిని భాషాంతరీకరింపఁబడియున్నవి. అందు మహాభారతమే మనయాంధ్రభాషను మొదట నలంకరించినగ్రంథము. మహాభారతరసాస్వాదమునకుఁ జొక్కి యనాగరకులు గాఁ దలంపఁబడు "మలయద్వీపగణ" వాసులును ఈగ్రంథరాజమును దమద్వీపములకుఁ గొంపోయిరి. అందు "కవి" భాషలోనికిఁగూడ ననువదింపఁబడిన దనినపు డీగ్రంథప్రాశస్త్యము వేఱునుడువ నవసరము లేదు. రామాయణమహాభారతగాథ లించుమించువీరులయొక్కయు దుర్మార్గులయొక్కయుఁ బతివ్రతలయొక్కయుఁ జరిత్రలతోఁ గూర్పఁబడుటచేతను నాయికానాయకులచరిత్రములు దేవమహిమలతోను సత్యముకొఱకుఁ గష్టపరంపరలతోఁ గూడి తుదకు మహాయుద్ధములలో జయమునొందుటచేతను అన్నిరకములవారికి నింపగునితివృత్తములు కలవైనవి.

రామాయణమహాభారతములను రచించినకవులుకూడ నద్వితీయప్రతిభాశాలులు. ఒకఁడు కవికులగురువు నింకొకఁడు "భారతీవంశవివర్ధనుఁడు". కాని రామాయణమువలె భారత మంతయు శిష్టులచేఁ బారాయణము చేయఁబడుటం గానము. భారతములో నద్వితీయభాగముగా నెన్నఁబడు భగవద్గీత మాత్రము దేశదేశములయందు మహోన్నతగౌరవము నొంది పూజింపఁబడుచున్నది. రామాయణమును రచించి వాల్మీకి చింతించినటులు గానము. కాని మహాభారతమును రచించి వ్యాసుఁడు చింతించె ననియు నాచింతాశాంతి కొఱకు నారదోపదేశముచే భాగవతమును రచించె ననియు భాగవతాదియందుఁ గలదు. మహాభారతమును రచించి చింతించుటకుఁ గారణ మేమై యుండును? మహాభారతము పవిత్రాంశములతోఁ గూడియుండలేదా? ఆలోచిం

తము. రామాయణ మహాభారతములు పాశ్చాత్యవిద్యాపద్ధతి ననుసరించి బహిరంగపరీక్షకు లోనగుచున్నవి. (బహిరంగపరీక్ష యనఁగాఁ గవికాలము గ్రంథరచనావిశేషములు గాథయొక్క విశేషములు మొదలగువానిని విమర్శించుట) అంతరంగపరీక్షకంటె బహిరంగపరీక్ష జనసామాన్యదృష్టి నాకర్షించి విశేషవివాదములకుఁ గారణ మగుచున్నది. కాని ఈవివాదములవలన గ్రంథావలోకనము విశేషముగఁ గలుగుటయను ఫలము కలుగునుగాన నాశక్తికొలఁది బహిరంగపరీక్షచే మహాభారతమును క్లుప్తముగ విమర్శించుచున్నాఁడను. సహృదయులు తప్పులను మన్నింతురుగాక. గాథావిమర్శనమునకు ముందు గాథ జరిగినకాల మెపుడు? ఆగ్రంథ మెపుడు రచింపఁబడెను? అనునంశములను స్వల్పముగా విమర్శించెదను.

మహాభారతయుద్ధకాలము:—మహాభారతగాథ క్షాత్త్రకాలమున జరిగె నని చారిత్రకు లూహించుచున్నారు. మహాభారతనాయకులలో నగ్రగణ్యుఁడును బాండవంశవర్ధనుఁడు నగునర్జునుని పౌత్త్రుఁడు పరీక్షిత్తుని ప్రశంసయు నాతనిరాజ్యవిశేషమును, అథర్వవేదమునందుఁ గలవు. పరీక్షిత్తనయుఁ డగు జనమేజయుని ప్రశంసయు అశ్వమేధయాగకర్తలలో నాఁతఁ డెన్నఁదగినవాఁ డనియు నైతరేయబ్రాహ్మణమునఁ గలదు. జనమేజయునియందు నాఁటివారికి విశేషగౌరవ ముండుటచేత నాతఁడు మృతి నొందినతరువాతను జనమేజయుఁ డే లోకమున నుండె నని శకునములఁ గూడ నడుగుచుండిరి. చూడుఁడు. బృహదారణ్యకోపనిషత్తునందలి 5-3-1 లో లాహ్యాయని భుజ్యుఁడు యాజ్ఞవల్క్య నడిగినప్రశ్నను. పాణిన్యాచార్యులు మాత్రము ధర్మజకృష్ణార్జునాదులనందులఁ బ్రశంసించెనే కాని వైదికగ్రంథములు కురుపాండవులఁ బ్రశంసించినటులు గానరాదు. అయినను జనమేజయుని ప్రపితామహు లగుపాండవులు క్షాత్త్రకాలారంభమున నుందురు. కలియుగము 36 సం॥ రములకుఁ బ్రవేశించు ననఁగా మహాభారతయుద్ధ మాయె నని భాగవతవిష్ణుపురాణములచేఁ దెలియనగుచున్నది. కలి ప్రవేశించుచున్నది గాన ధర్మవిప్లవము జరుగుచున్న దని శల్యపర్వమునందు శ్రీకృష్ణుఁడు బలరామకోపోపశమనకాలమునందును గలిప్రవేశించె నని మహాప్రస్థానికపర్వమున సహదేవధర్మజవాక్యములందును సూచింపఁబడుటచే పైభాగవతవిష్ణుపురాణవాక్యములు దృఢపఱుపఁబడుచున్నవి. శ్రీకృష్ణుఁ డుండఁగనే కలిప్రవేశించెను, కాని, శ్రీకృష్ణుమహిమచే నది తనమహిమలఁ గనఁబఱుపలే దని భాగవతద్వాదశస్కంధమునఁ గలదు. కలియుగమునందు 653 సం॥

రమున కురుపాండవు లుండిరని కల్హణకృత "రాజతరంగిణి" లోఁ గలదు. అనేకగ్రంథముల నవలోకనముచేసిన లోకమాన్య "తిలకు" మహాశయుఁడు గీతారహస్యమునందు క్రీ. పూ. 14 శతాబ్దప్రాంతమున మహాభారతయుద్ధ మయియుండు నని వ్రాసియున్నాఁడు. పరీక్షిజ్జననము మొదలు నందపట్టాభిషేకమునకు 1115 కాని 1150 సం॥ రములు కాని యైయుండు నని విష్ణుపురాణభాగవతములలోఁ గలదు. నందుని క్రీ. పూ. 320 సం॥ ర ప్రాంతమున మౌర్యచంద్రగుప్తుఁడు చంపెను. అంతకుఁ బూర్వము 50 సం॥ రములు నాఁడు నందపట్టాభిషేక మైయుండును. కాన 1115+50+320=1485 సం॥ ర ప్రాంతమునఁ గురుపాండవయుద్ధ మాయె నని తలంపవలసియున్నది. శ్రీకృష్ణచరిత్రము వ్రాసిన "ధీరేంద్రనాథపాలు" గారు క్రీ. పూ. 16, 15 శతాబ్దముల మధ్య శ్రీకృష్ణుఁ డుండె నని వ్రాసియున్నారు. కాన మహాభారతయుద్ధము క్రీ. పూ. 15 శతాబ్దమున జరిగియుండును.

మహాభారతరచనాకాలము:— మహాభారతమునందే వ్యాసులవారు యుద్ధానంతరము 3 సం॥ రములకు భారతగాథను గ్రంథముగా రచించె నని కలదు దానికి "జయ" మని పేరు. అందువలననే—

శ్లో. నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాస్తస్తతో జయ ముదీరయేత్ ॥

అనుశ్లోకము పుట్టియుండెను. వ్యాసులవారు జయమును రచించి శుక వైశంపాయన జైమిని నారదాదులకు నాయాలోకములయందు భారతగాథను వినిపింపఁ బంపె నని కలదు. భారతయుద్ధమైన వెంటనే పుట్టి 36 సం॥ రములకుఁ బట్టాభిషిక్తుఁ డై 60 సం॥ రములు రాజ్యముఁ జేసిన పరీక్షిత్తునికుమారుఁడును, పరీక్షిన్మరణకాలమున బాలుఁడు నైనజనమేజయుఁడు, శతానీకశంకుకర్ణలనుకుమారులను అశ్వమేధదత్తనుపౌత్రునిఁ గనినపిమ్మటను సర్పయాగముఁ జేసి యది విఘ్నముకాఁగాఁ దత్కాలాగతుఁ డగువైశంపాయనుఁడు కురుపాండవులచరిత్రను జనమేజయునకుఁ జెప్పె నని కలదు. అనఁగా మహాభారతయుద్ధానంతరము సుమారు 150 సం॥ రములకు జనమేజయునికి వైశంపాయనుఁడు వ్యాసవిరచిత "జయ" మనుగ్రంథమును వినిపించెను. వైశంపాయనుఁడును వ్యాసులవారు పాండవధార్తరాష్ట్రభేదకారణము మొదలు, ఉపపాండవవధాంతము వఱకు రచించిన గ్రంథమునే కాక యయాతి దుష్యంతాదులచరిత్రమును మధ్యమధ్య జనమేజయుఁ డడుగుచుండిన భీష్మవిదురవ్యాసాదుల జన్మ

వృత్తాంతమును నశ్వత్థామార్జునుల బ్రహ్మశిరోనామకాస్త్రప్రయోగోపసంహారాదులు స్త్రీ, శాంతి, ఆనుశాసనిక, అశ్వమేధాదిపర్వములలోఁ గల పాండవుల చరిత్రను సంపూర్ణముగా జనమేజయునకుఁ జెప్పియుండెను. ఉపపాండవవధాంతమునఁబడకే వ్యాసవిరచిత మనుటకుఁ గలకారణము భాగవతములో వ్యాసుల వారు భారతమును రచించుటకుఁ జింతించి నారదోపదేశముచే భాగవతమునుఁ జెప్పఁ దొడంగుచు నుపపాండవవధానంతర మశ్వత్థామ నర్జునుఁడు జయించిన "సైషీకపర్వ" గాథనే ప్రారంభముగాఁ జేయుటయే; అందువలనను, ఆదిపర్వమునందలి పాండవధార్తరాష్ట్రభేదకారణములలో వైశంపాయనుఁడు జనమేజయునితోఁ బాండురాజు మరణానంతరము పాండవులు హస్తిపురికిఁ జేరి విద్యాభ్యాసముఁ జేయునపుడు కౌరవు లోర్వలేక భీముని నీటిలోఁ ద్రోయుట మొదలుకొనియే చెప్ప నారంభించుటచే వ్యాసవిరచిత "జయ" మనుగ్రంథము పాండవులు హస్తిపురికిఁ జేరినది మొద లుపపాండవుల నశ్వత్థామ వధించువఱకే యని స్పష్ట మగుచున్నది. తక్కిన పాండవులగాథతోఁ గూడినట్టియు జనమేజయుని ప్రశ్నల కుత్తరముగా వైశంపాయనుఁడు చెప్పినట్టియుపగాథలును వైశంపాయన విరచిత మై "భారత"మను పేరుగల గ్రంథ మయి యున్నది. వైశంపాయనుఁడు జనమేజయునకుఁ జెప్పినపుడు విని పిమ్మటఁ గొంతకాలమునకుఁ బెద్దవాఁడై పూజ్యుఁ డైన "ఉగ్రశ్రవస్సు" నైమిశారణ్యమున శౌనకాదులకుఁ బౌష్య పౌలోమ ఆస్తికపర్వములను శ్వేతకేతు వృషితాశ్వాదిగాథలుఁ గల యాదిపర్వాంతర్గాథలను, అరణ్యపర్వమునందలి పెక్కుగాథలను నించుమించు శాంత్యనుశాసనికపర్వములలోఁ గల యన్నిగాథలఁ గలిపి మహాభారతముఁ జేసి చెప్పెను. వ్యాసవిరచిత "జయ" మనుగ్రంథము 24 వేలగ్రంథ మని యాదిపర్వము మొదటి యధ్యాయమునం గలదు. తక్కిన 76 వేలగ్రంథము వైశంపాయన రోమహర్షణులకృతమే యనుట నిశ్చయము. వైశంపాయనుని శిష్యుఁ డగు యాజ్ఞవల్క్యుఁడు పెద్దవాఁ డైనపిమ్మట జనకుని (వశి) తో నైనసంవాదమును నా యాజ్ఞవల్క్యునితో జనకసభలో వాదమునం దోడిన (ఈగాథ బృహదారణ్యకమునఁ గలదు) ఉద్దాలకునికుమారుఁడు శ్వేతకేతువుగాథయు శ్వేతకేతుకుమారుని గాథయుఁ గూడ మహాభారతమునందుఁ గలదు. ఇందువలన నుగ్రశ్రవస్సు శౌనకాదులకుఁ జెప్పినగాథలే కాక పిమ్మట నైన గాథలుకూడ మహాభారతమునఁ గాలాంతరమునఁ గూర్పఁబడినవి. అయినను వ్యాసవైశంపాయన రోమహర్షణులే "జయభారత మహాభారత" గ్రంథకర్త లైరి. కవిత్రయకృత మగు

సంస్కృతమహాభారత మాంధ్రీకరణమునఁ గూడఁ గవిత్రయకృత మగుట యాశ్చర్యకరము. ఆంధ్రభారతమునందుఁ గవిత్రయగ్రంథమును విభజించినటులు సంస్కృతమహాభారతములో నెవరిగ్రంథ మేదో స్పష్టముగా విభజింపలేము. సంస్కృతమహాభారతమునందుఁ బునరుక్తిదోషములే కాక యసందర్భగాథలును గలవు. చూడుఁడు:—ఆదిపర్వమునఁ గర్ణునిజన్మవృత్తాంతము కలదు. అందుఁ గర్ణుఁడు సద్యోగర్భజనితుఁడుగా వర్ణింపఁబడెను. ఆగాథ యచట నిష్ప్రశ్నముగాఁ జెప్పఁబడెను. ఆరణ్యపర్వాంతమునందు జనమేజయునిప్రశ్నవలన వైశంపాయనుఁడు చెప్పుచుఁ గర్ణునిఁ గుంతి పదిమాసములు గూఢముగా మోసియే కనినటులు చెప్పెను. ఆరణ్యపర్వాంతర్గతరామాయణగాథలోఁ గుంభకర్ణుని లక్ష్మణస్వామి వధించినటులు చెప్పఁబడెను. ఇది రామాయణగాథకు విరుద్ధము. ఇట్టివనేకాసందర్భములు మహాభారతమునఁ గాన్పించుచుండుటఁ గనిపెట్టి నేఁడు దృశ్య మగుమహాభారతము క్రీ. పూ. ౫ వందల సం॥ రములనాఁటికి సంపూర్తిగఁ జెప్పఁబడియుండు నని తిలకమహాశయుఁడు వ్రాసియున్నాఁడు. నేఁడు మన భరతఖండమునఁ గాన్పించు ముద్రితాముద్రితమహాభారతప్రతులలోఁ బెక్కుపాఠభేదములు కాన్పించుచున్నవి. నేను జూచిన యొకప్రతిలో ద్రౌపదీవివాహానంతరము దుర్యోధనాది దుష్టచతుష్టయము కృత్రిమముగా ద్రుపదపురము పైకి దండెత్తఁగా భీమార్జునులు కౌరవులను డీకొని కర్ణునిసోదరు నొకనిఁ జంపినటులును గౌరవులు పలాయితు లైనటులును గలదు. ఈగాథ తెనుఁగున ముద్రింపఁబడిన ప్రతిలోఁ గాని యాంధ్రీకృతమహాభారతమునఁ గాని కాన్పింపదు. యుద్ధముఁ జేయఁ గృత్రిమాలోచనను గర్ణాదులు చేసినట్టు మాత్రము తెనుఁగుదేశపుసంస్కృతప్రతిలోను నాంధ్రీకృతమహాభారతమునను గలదు. సంస్కృతమహాభారతములోని యీకాసటబీసటలు కాళిదాసమహాకవినాఁటికే కలిగియున్న వని యుఁ గాళిదాసు దిద్దఁ బ్రయత్నించె ననియు నొకకథ కలదు. కడచిన "యూరపు" యుద్ధమునకుఁ బూర్వము జర్మనీదేశమున సంస్కృతమహాభారతమును సంస్కరింపఁ బ్రయత్నము జరిగెను. అందుకు మనపరిషదుద్ధారకులలో ముఖ్యు లగుశ్రీపిఠాపుర మహారాజావారు కూడ ద్రవ్యసహాయముఁ జేసియున్నారు. యుద్ధకారణముచే నాయుద్యమము విరమింపఁబడెను. కాని, పునాలోని "భాండర్కారు పరిశోధకసంఘమువా" రిపు డామహాభారతసంస్కరణమునకుఁ బూనుకొనిరి. మన దేశపు ధనికులు మహారాజులు నీపుణ్యకార్య

మునకు విశేషసహాయముం జేయుచున్నారు. అచిరకాలమునఁ బరిశోధిత సంస్కృతమహాభారతముం జూచుభాగ్యము మనకు లభించుఁగాక.

భారతగాథకుఁ బూర్వము జరిగిన సంఘోపప్లవము:—శ్రీమద్రామాయణగాథ జరిగినకాలమునం దార్యజాతి స్వల్పవ్యాప్తి కలదై నిష్కళంకమై యున్నది. ఆర్యజాతీయు లనార్యజాతిస్త్రీల నుద్వాహ మగుట కూడ స్వల్పముగా నుండెను. సీతాజననవృత్తాంతము తప్ప రామాదులజన్మాదికము ప్రకృతిశాస్త్రవిరుద్ధజన్మలు కలదిగా వర్ణింపఁబడలేదు. అనార్యులలో మాత్రము విరుద్ధోత్పత్తులు వర్ణింపఁబడెను. వాలి సుగ్రీవ హనుమదాదులు వాన యెండ గాలి దేవతల కుద్భవించినటులు వర్ణింపఁబడెను రావణుని పదితలలవృత్తాంతమును గతపరిషద్వత్సరోత్సవకాలమునందుఁ బరబిభీషిక కటులు రావణుఁడు కొన్నిసమయములలో ధరించువాఁ డని నుడివియున్నాను. తనభార్యపై నణుమాత్రాపవాదము మోపంబడినంతనే శ్రీరామచంద్రుఁడు సీతను ద్యజించె ననుటచే నార్యజాతి స్వపవిత్రత నెట్లు గాపాడుకొనఁ బ్రయత్నించినదియు స్పష్ట మగును. మహాభారతగాథ జరుగుకాలమునకు నీయార్యజాతి సంకరసంతానములతోఁ గూడి మహోపప్లవములకుఁ గారణ మైనది. మహాభారతములోని యాది శాంతిపర్వములలో మూఁడుగాథ లిందుఁ కుపబలముగా వ్రాయఁబడినవి. మఱియు బ్రహ్మాండపురాణములోని సగర పరశురాముల చరిత్రముకూడ సంకరసంతానాభివృద్ధిచరిత్రకు మార్గదర్శక మైనది.

రామాయణయుద్ధమునకుఁ బూర్వమే పరశురామదిగ్విజయ మై యుండును గాని నాఁటి కింకను సంఘోపప్లవము కలుగలేదు. మిశ్రక్షత్రియు లనఁదగిన హైహయ తాళజంఘ క్షత్రియులు భృగువంశబ్రాహ్మణులను, ఇక్ష్వాకువంశక్షత్రియులను బెక్కుబాములఁ బెట్టిరి. అందు భృగువంశబ్రాహ్మణులనేకాక వారిభార్యలయొక్క గర్భములఁగూడ ఛేదించి రని యాదిపర్వాంతర్గత చైత్రరథపర్వమునం గలదు. ఇక్ష్వాకువంశస్థులను జాల బాధించి రని బ్రహ్మాండపురాణమునం గలదు. హైహయుల విజృంభణము గడచిన జర్మనీవిజృంభణము వంటి దనవచ్చును. హైహయుల విజృంభణము నౌర్వపరశురాములును దాళజంఘులవిజృంభణమును సగరుఁడు నణఁచివైచిరి. ఆయుపప్లవకాలమునందు క్షత్రియవీరు లీషదూనముగ నశించిరి. పురుషులు నశించుటచే స్త్రీలు నాఁటికాలమున దోషయుక్తము కా దని తలంచిన నేమి కామపరతంత్రతచే నేమి యన్యజాతిపురుషులం గలిసి సంకరసంతతిం గనిరి. నాఁటిదేశకాలపరిస్థితులం గనిపెట్టి

స్మృతికర్తలు ద్వాదశవిధసంతానమును దమగ్రంథముల కెక్కించిరి. నేఁ డింగ్లాండునందుఁ గానీనాదిసంతతి సంఘమున నెట్టిగౌరవమున కాస్పద మైయుండెనో నాఁడు మనదేశమునను గానీనాదులు గౌరవాస్పదు లైరి. కాలాంతరమున రచింపఁబడిన గ్రంథములలో నాకానీనాదులు దేవవరప్రసాదసముద్భవులుగా వర్ణింపఁబడిరి. గూఢోత్పన్నాదులు నదులకుఁ గుండలకు రెల్లునను గుఱ్ఱమునకుఁ బరలోకమునందలి యమ వాయు వర్షదేవ వైశ్యదేవతలకు, అగ్నికుండమునకుఁ బుట్టినట్టులు వర్ణింపఁబడి గౌరవపాత్రు లైరి. వీరే వ్యాస కర్ణ గాంగేయ కుంభసంభవ శారద్వత, అశ్వత్థామ ధర్మజ మారుతి ఇంద్రజ ఆశ్వినేయ ధృష్టద్యుమ్నాదులు. భారతయుద్ధకాలమునకు రహస్యముగ బిడ్డలం గనుట దోషము కాదు; అది మనుష్యసాధారణధర్మమే యని వ్యాసులవారే యంగీకరించిరి. ధృతరాష్ట్రాదు లరణ్యమున నుండఁగా వ్యాససహితు లై పాండవులు కుంత్యాదుల దర్శించునపుడు కుంతి కర్ణుం దలంచి విచారించుచు వ్యాసులవారితో నిట్లు చెప్పి పశ్చాత్తాపపడినది.

ఆశ్రమవాసపర్వము. ౩౦. అధ్యాయము.

శ్లో. కుంతీ—తతోహ మంతర్భవనే పితృవృత్తాంతరక్షిణీ ।
గూఢోత్పన్నం సుతం బాలం జలే కర్ణ మవాసృజమ్ ।
నూనం తస్యైవ దేవస్య ప్రసాదా త్పున రేవతు ।
కన్యాహ మభవం విప్ర యథాప్రాహ స మా మృషిః ।
స మయా మూఢయా పుత్రో జ్ఞాయమానో ప్యుపేక్షితః ।
త న్మాం దహతి విప్రర్షే యథా సువిదితం తవ ।
యది పాప మపాపం వా తదేత ద్వివృతం మయా ॥

తాత్పర్యము. (దూర్వాసునివలన మంత్రోపదేశము నొందుట మంత్రపరీక్షకై సూర్యు నారాధించుట మొదలగుగాథం జెప్పి కుంతి యీసంగతులును వ్యాసులవారితోఁ జెప్పుచున్నది) నే నంతఃపురమునందు గర్భమును ధరించి కర్ణునిఁ గని పితృగౌరవమును రక్షించుదాననై గూఢోత్పన్నుఁ డగుబాలుని నీటియందు వదలితిని. నిశ్చయముగా నాసూర్యదేవునిమహిమచేఁ దిరిగి కన్యకగానే యుంటిని. ఎట్లాఋషిపలికెనో యట్లు జరిగెను. మూఢురాల నగునాచేఁ బుత్త్రుఁడు తెలిసికొనఁబడియు నుపేక్షింపఁబడెను. ఓవ్యాసా! అదియే నన్నుఁ జాల బాధించుచున్నది. ఇది పాప మైనను బాపము కా కుండినను నీకు నిజముఁ జెప్పితిని.

శ్లో. ఇత్యుక్తః ప్రత్యువాచేదం వ్యాసో వేదవిదాంవరః ।
సాధు సర్వ మిదం భావ్య మేవ మేత ద్యథాత్థమాం ।
అపరాధశ్చ తే నాస్తి కన్యాభావం గతాహ్యసి ।
దేవాశ్చైశ్వర్యవంతోవై శరీరాణ్యావిశంతి వై ।
మనుష్యధర్మే వర్తంత్యా స్తవమోహో నవిద్యతే ।
ఇతి కుంతి విజానీహి వ్యేతు తే మానసోజ్వరః ॥

తాత్పర్యము:—పైప్రకారము కుంతి చెప్పఁగా వ్యాసులవారిట్లు చెప్పుచున్నారు. నీవు నాతోఁ జెప్పినమాటలు మంచివే, నీవపరాధముఁ జేయలేదు. (బిడ్డనుఁగనినపిమ్మట) కన్యాభావము నొందితివి. దేవత లణిమాద్యైశ్వర్యవంతులు గాన శరీరములఁ బ్రవేశింతురు - - - మనుష్యధర్మమునందుఁ బ్రవర్తించు నీకుఁ దప్పు కాన్పింపదు. ఓకుంతీ నేను జెప్పినది బాగుగా గ్రహింపుము. నీ కా చింత యుండఁ గూడదు—పైయోదార్పును జేయుటకును గూఢముగాఁ గని శిశువును బాఱవేయుట ధర్మవ్యతిరేకము కాదనుటకును సర్వవిధముల వ్యాసుఁడే తగినవాఁడు. కారణ మే మనఁగా వ్యాసునితల్లి కూడఁ గుంతి చేసినటులు జేసియే వ్యాసునిఁ గని కన్యాత్వమునకు దోషము లేకుండఁగఁ బ్రవర్తింపలేదా? ఒకవేళ వ్యాసుఁడు కుంతీ నీవు చేసినది తప్పనినచో వ్యాసు నెవరైన మీ యమ్మ చేసినది యెట్టి దని ప్రశ్నించిన వ్యాసు లే మనఁగలరు? అందువలన రహస్యముగ బిడ్డఁ గనుట దోషము కా దని వ్యాసులవారు ధర్మశాస్త్రముఁ జెప్పిరి. అట్టిది వేదవ్యాసులే చెప్పిన నెవ రడ్డఁగలరు? యుద్ధములవలనఁ గులములు నశించుచున్న వనియుఁ గులస్త్రీలు చెడుచుండి రనియు నందువలన సంకరసంతానోత్పత్తి కలిగి జాతిధర్మములు చెడుటనుఁ జూచుచుంటి మనియు నర్జునుఁడు శ్రీకృష్ణునితోఁ జెప్పిన యీక్రింది భగవద్గీతావాక్యములు నాఁటి కాలపువారికి స్వానుభవములే కాని వేఱుకావు. (గీతలు వ్యాసవిరచిత మూల భారతములోనివే యని లోకమాన్యుఁడు పరిశోధించి వ్రాసియుండుటచేఁ గల్పితములును బిమ్మట నిముడ్పఁబడినవియును గా వని నానమ్మకము.

శ్లో. కథం నజ్ఞేయ మస్మాభిః పాపా దస్మా న్నివర్తితుం ।
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన ॥ ౩౯
కులక్షయే ప్రణ　　　కులధర్మాః సనాతనాః ।
ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోభిభవ త్యుత ॥ ౪౦
అధర్మాభిభవా త్కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః

స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః ॥ ౪౧
సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ ।
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః ॥ ౪౨
దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః ।
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః ॥ ౪౩. భగవద్గీత.

తా॥ ఓకృష్ణా కులక్షయకృత మగుదోషమును బాగుగాఁ జూచుచున్న మనచే నీపాపమునుండి నివర్తించుట యెటులో తెలిసికొన శక్యము కాకున్నది. కులక్షయమగుటచే సనాతనకులధర్మములు నశించుచున్నవి. కులధర్మము నష్టమగుటచే నధర్మ మభివృద్ధి యగుచున్నది కదా? అధర్మవృద్ధివలనఁ గృష్ణా-కులస్త్రీలు దోషయుక్తురాండ్రగుదురు. స్త్రీలు దుష్టురాండ్రగుటచేతను వర్ణసంకర మగుచున్నది. వర్ణసంకరము కులమునకుఁ గులఘ్నులకు నరకముకొఱకే యగుచున్నది. వీరల పితృదేవతలు లుప్తపిండోదకక్రియలు కలవారై యధోగతు లగుచున్నారు. కులఘ్నుల వర్ణసంకరకారకము లగునీదోషములచే జాతిధర్మములును శాశ్వతము లగుకులధర్మములును నశింపఁజేయఁబడుచున్నవి.

మహాభారతము రచింపఁబడిన చాలకాలమునకుఁ గాని వ్యాసులు దానిని బ్రకటింపలేదు. పిమ్మట వైశంపాయనాదులు కూడఁ గథలను దేవతామహిమలఁ జొప్పించి యిచ్చవచ్చినరీతిని బెంచిరి. అందువలన వ్యాసవిరచితగ్రంథము వలెనే గాథలయొక్క సత్యవృత్తాంతమును గనుఁగొనుటకు శక్యము కాకున్నది. గాథలలో దేవతామహిమ లిముడ్పఁబడుటకును నొకటి రెంటిని బ్రస్తుత వ్యాసమునకుఁ జాలనఱకు సంబంధించిన శ్రీకృష్ణవృత్తాంతమునుండి చూపుచున్నాఁడను.

దేవతామహిమలు:—శ్రీకృష్ణభగవానుఁడు విష్ణువుయొక్క యపరావతార మని భాగవతములో దశమద్వాదశస్కంధములలోఁ గలదు. కాని ద్వితీయస్కంధమునను మహాభారతముయొక్క యాదిపర్వమునందు రెండుచోటులను శ్రీకృష్ణుఁడు నారాయణుని నల్లవెండ్రుకయొక్క యవతార మని చెప్పఁబడియున్నాఁడు. శ్రీకృష్ణుని "పూతన" యనురక్కసి వధింపఁరాగా దానినే శ్రీకృష్ణుఁడు వధించె నని కలదు. పూతన రక్కసి కాదు. చిన్నపిల్లలకు వచ్చుపీడ యనియు దానికి బలివిధానాదు లవసర మనియు "సుశ్రుతసంహిత యుత్తరభాగము 27 అధ్యాయమునందు వర్ణింపఁబడి యున్నది. రోగనిదానమును -ప్ర దుదాహరించుచున్నాను.

ప్రస్తాంకః స్వపితి సుఖం దివా రాత్రౌ
విడ్భిన్నం సృజతిచ కాకతుల్యగంధః ।
ఛర్ద్యార్తో హృషితతనూరుహః కుమార!
స్తృష్ణాలు ర్భవతిచ పూతనాగృహీతః ॥ (10)

తా. బాలుఁడు ప్రస్తాంకుఁ డై రాత్రియుంబవల్లు నిద్రలేనివాఁడై. కాకి వాసన వేయుచుండిన పలుచని విరోచనమును విడుచుచుండును. వమనములు కలవాఁ డై నిక్కవొడుచుకొన్న రోమములు కలవాఁడై దాహము కలవాఁ డై యుండును. ఇవి పూతనాగ్రహము సోఁకినవానిలక్షణములు. ఈరోగనివారణో పాయమయి గ్రంథవిస్తరభీతిచే వ్రాయ లేదు. ఇట్టిరోగమే శ్రీకృష్ణునికిఁ గలిగి యది నివృత్తికాఁగా పూతన యనురక్క.సిని శ్రీకృష్ణుఁడు చంపె నని కాలాంతర మున రచింపఁబడిన గ్రంథములలోని కెక్కింపఁబడెను. దానికి వన్నెలు చిన్నెలు భాషాంతరీకరణమునఁ బ్రవేశించెను ఒక్కపూతనావధమాత్రమే కాక శకటా సురవధ, యులూఖలబంధనము "శంఖచూడుఁడను" గుహ్యకుని వధయు "కేశి" యనురాక్షసుని వధయుఁ గూడ మృష యనియు నవి రోగములే యనియు శిశు సాధారణ మగుబాలగ్రహములే యనియు "హారదత్త" భాష్యములో మంత్ర పన్నములఁ జదివిన పిమ్మటను నాకుఁ దోఁచినది. చూడుఁడు. మంత్రపన్నము లం దెటు లున్నదో—

మంత్ర. శండేరథ శ్శండికేర ఉలూఖలః । చ్యవనో నశ్యతా దితిస్వాహా ॥
అయశ్శండో మర్క ఉపవీర ఉలూఖలః । చ్యవనో నశ్యతా దితిస్వాహా ॥
కేశినీ శ్శ్వలోమినీః ఖజాపో జోపకాశినీః । అపేత నశ్యతా దితిస్వాహా ॥
మిశ్రవాససః కౌబేరకా రక్షోరాజేనప్రేషితా । గ్రామగ్ం సజానయో గచ్ఛం తీచ్ఛంతో పరిదాకృతా స్స్వాహా॥—ఏకాగ్నికాండ - 2-13.

తా. శండేరథుఁడు, శండికేరుఁడు, ఉలూఖలుఁడు చ్యవనుఁడు నశించుఁ గాక. (అని హోమముఁ జేయుచున్నాఁడు) అయశ్శండుఁడు, మర్కుఁడు, ఉప వీరుఁడు, ఉలూఖలుఁడు, చ్యవనుఁడు నశించుఁగాక (అని హోమముఁ జేయు చున్నాఁడు) కుక్కరోమములవంటి రోమములుగల కేశినీగ్రహము, ఖజాపగ్రహ ము, అజోపకాశినీగ్రహము నశించుఁగాక (అని హోమముఁ జేయుచున్నాఁడు.)

మిశ్రవాసస్సులుః గలిగి రక్షోరాజగు కుబేరునిచే నంపఁబడి భార్యలతోఁ గూఁడుకొని గ్రామములఁ గూర్చి తిరుగుచు ననుపనీతబాలుర నపేక్షించు గ్రహములు నశించుఁగాక (అని హోమముఁ జేయుచున్నాఁడు.)

ఈమంత్రములు "జాతకర్మ" సమయమున నేఁడును జెప్పఁబడుచున్నవి. ఫలీకరణహోమము చేయఁబడుచున్నది.

భాగవతాదులయందు పూతనరోగము రక్కసిగా వర్ణింపఁబడినది. శండే రథుఁడు "శకటాసురుఁడు" గా వర్ణింపఁబడినాఁడు "ఉలూఖలుఁడు" ఉలూఖలబంధముగా వర్ణింపఁబడెను. "శ్వలోమిని" యగు "కేశిని" "కేశి" గా వర్ణింపఁబడినాఁడు. "కౌబేరక" రక్షోగ్రహ మేదియా "శంఖచూడుఁ" డను గుహ్యకుఁడుగా వర్ణింపఁబడినాఁడు. పైగ్రహములను శ్రీకృష్ణుఁడే వధించినచో నేఁడు మనయిండ్లలో జాతకర్మ (ఉపనయనములో జాతకర్మ నిపు డేకరుపెట్టు చున్నారు) సమయమున పైహోమాదుల కవసర ముండదు. అవి పిల్లలకుఁ గలుగు "శ్వోకుఁడు" రోగములనుగా గ్రహింపవలసి యున్నది. ఆరోగములు శ్రీకృష్ణునకుఁ గలుగఁగా వానినుండి శ్రీకృష్ణుఁడు తేరికొనియె ననియే నిశ్చయార్థము. ఇట్లే భీమునిఁ గౌరవులు గంగలోఁ ద్రోయఁగా నాగులు తీసికొనిపోయి రక్షించి రనియు నచట నెనిమిది కలశముల రసమును బానముఁజేయించి రని యు నెనిమిదిదినములు శరీరస్మృతి లేక నిద్రించి మహాజవసత్త్వసంపన్నుఁ డయ్యె ననియు సంస్కృతభారతమునఁ గలదు. భీముని నీటిలోఁ ద్రోయఁగా నాగజాతి పురుషులు రక్షించి యేరసమునో యిచ్చిరనియు నెనిమిదిదినములు శరీరస్మృతిలేని జ్వరము నొందె ననియే తలంపవలెను, గాని, పాతాళలోకమున కాతఁ డేగె నని చెప్పుట యుక్తము కాదు. "నాగులు" నాఁటికాలమునం దాసేతుహిమాచల పర్యంతము వ్యాపించిన మిశ్రజాతీయులు. నాగకన్యకలు నాఁడును నేఁడును భోగినులే (వేశ్యలలో నాగజాతివారు నేఁడును గలరు) శ్రీకృష్ణుఁడు కాళియుఁ డను నిట్టి నాగరాజునే పాఱఁదోలెను. అర్జునుఁ డశ్వసేనాది "నాగులను" వధించెను. సర్పయాగమునందున నిట్టినాగులే జనమేజయునిచే వధింపఁబడిరి. పరీక్షిత్తు నిట్టినాగుఁడే చంపెను. అర్జునుఁడు వరించిన యులూపి యిట్టినాగకన్యకయే. నాగకన్యకకు వైధవ్యదోషము కూడ లేనటులు వర్ణింపఁబడెను. నాగీగీతములు నాఁడును నేఁడును సరసులకు రమ్యములే కదా? ధర్మరాజాదుల పుట్టుకకుఁ గారకు లగుయమాదులవృత్తాంతములు కూడ నిట్టిదేవతామహిమలు కలవియే. వానిని బిమ్మట వ్రాసెదను. భీముని దుర్యోధనుఁడు గంగలోఁ ద్రోయఁగా నాగరాజగు "వాసుకి" నాదౌహిత్రుఁడగు "ఆర్యకుని" దౌహిత్రుఁ డీభీముఁ డని గౌరవించె నని కలదు. కుంతిభోజుని ద్వారా యీసంబంధము కల దని వ్యాఖ్యాత వ్రాయుట గమనింపఁదగినది.

మహాభారతగాథావిశేషములు:—మహాభారతయుద్ధమునకు దుర్యోధనాదుల యసూయయే ముఖ్యకారణ మని స్థూలదృష్టిచే భారతపాఠకులకుఁ దెలియనగును. భారతపాఠకులు కౌరవులు దుర్మార్గు లనియుఁ బాండవులు సన్మార్గు లనియుఁ దలంతురు. భారతమును సూక్ష్మదృష్టిని విమర్శించి చదివినచో సత్యము తేలఁగలదు. భారతపాఠకు లీక్రిందిప్రశ్నలను మనస్సునం దుంచికొని చదువవలయును.

1. దుర్యోధనాదులకుఁ బాండవులపైఁ గోపము కలుగుటకుఁ బ్రథమకారణ మేది?

2. పాండవులజన్మవృత్తాంతము నాఁటివారి కిష్ట మైనస్థితి కలదా?

3. పాండవపక్షముగాఁ బనిఁజేయు భీష్మ ద్రోణ కృపాదులకు దుర్యోధనునిపైఁ గ్రోధకారణము పాండవుల నాతఁడు విరోధించుటచేతనేనా?

4. భీష్మాదులు కేవలము నర్థసంబంధముచేతనే దుర్యోధనున కూడిగముఁ జేయునంతటి స్వార్థపరులా?

5. కేవలము నర్థముచేతనే యూడిగమున కొడంబడినవా రైనచో ధర్మరాజింద్రప్రస్థమున రాజ్యముఁ జేసిన 23 సంవత్సరములలోను వారేల ధర్మరాజుకడ నుండ లేదు? దుర్యోధనుఁ డిచ్చినంత వేతనమును ధర్మజుఁ డీయ లేఁడా?

6. యుద్ధకాలమునందు భీష్మ ద్రోణ కర్ణ శల్యుల ప్రవర్తనము యుక్తముగా నున్నదా?

7. అభిమన్యువధ కాక (సౌప్తికవధ విడిచి) మహాయుద్ధమునందు దుర్యోధనుఁ డన్యాయముగ నెందఱఁ జంపించెను? దుర్యోధనుఁ డేయన్యాయములఁ జేసెను?

8. భీష్మ భగదత్త భూరిశ్రవస శ్రుతాయు సైంధవ ద్రోణ దుశ్శాసన దుర్యోధన కర్ణులవధలలోఁ బాండవులప్రవర్తన మెట్టిది? వీరులకు యుక్తమగు రీతిగాఁ బ్రవర్తించిరా?

9. ఘటోత్కచవధకుఁ గృష్ణుఁ డిష్టపడుట యుక్తమా?

10. శ్రీకృష్ణుని తనయులు గాని యతనిసంబంధీకులు (సాత్యకి తప్ప) గాని పాండవులకుఁ దోడు రాకుండుటకుఁ గారణ మేమి?

11. ధర్మజ సుయోధనులకు సమానజ్ఞాతులును బాహ్లీకదేశమును స్వతంత్రముగా నేలుచుండినవారు నగుబాహ్లీక సోమదత్త భూరిశ్రవసులు ధర్మజుని

పక్షమునకు రాకపోవుటకుఁ గారణ మేమి? ధర్మజుని పినతల్లి కుమారు లగు విందానువిందులు కౌరవపక్షముగా నేల వచ్చిరి.

12. ప్రకృతివిరుద్ధముగా జన్మించిన వారలలో నెందఱు దుర్యోధనుపక్షమున యుక్తముగాఁ బోరాడిరి? ఎంద అయుక్తముగాఁ బోరాడిరి? అట్టివారు యుక్తముగా నెందఱు పాండవులపక్షమునఁ బోరాడిరి.

13. కుంతీ గాంధారుల ప్రవర్తన మెట్టిది? ద్రౌపదీప్రవర్తన మెట్టిది?

14 ధృతరాష్ట్రుఁడు తనకుమారుల కపార్థములుకలుగు దుర్యోధన దుశ్శాసన దుష్ప్రహ దుర్ధర్షణ దుర్ముఖ వికర్ణ దుర్మద వికటానన బహ్వాశి కుండాశ్యాది నామముల నుంచి యుండునా?

15. యుద్ధానంతరమున దుర్యోధనసంబంధీకులను బాండవు లెటులు చూచిరి?

పైప్రశ్నలవలన నీక్రిందియంశములు తేలఁగలవు.

1. దుర్యోధనుఁడు ముందుగఁ బాండవుల నసహ్యించుకొనలేదు. ధృతరాష్ట్రుఁడు తనసుతులను బాండుసుతులను సమానముగాఁ బెంచుచుండెను. ఆకాలమున భీముఁడు శరీరబలము కలవాఁ డగుటచే మదించి దుశ్శాసనాదుల "నాటలనెపమున మిగుల బాధించువాఁడు" ఆచర్యల నన్నయభట్టెటులు వర్ణించెనో చూడుఁడు.

క. వదలక పెనఁగి పదుండ్రం, బది యేవురఁ బొక్కపెట్ట పట్టి ధరిత్రిం
 జెదరఁ బడ నైచి పవనజుఁ, డదయుం డయి వీఁపులొలియ నందఱ నీడ్చున్ ॥

సీ. కూడి జలక్రీడ లాడుచుఁ గడఁగి యాధృతరాష్ట్రతనయుల నతులశక్తి
 నెక్కించియుఁ బదుండ్ర నొక్కొకభుజమున నెక్కించుకొని వారి నుక్కడంగఁ
 గొంచక నీరిలో ముంచుచు నెత్తుచుఁ గారించి తీరంబు సేరఁ బెట్టుఁ
 గోరి ఫలార్థులై వారలయెక్కిన మ్రాఁకుల మొదళ్లు వీఁకఁ బట్టి

ఆ. పడిఁ గదల్చుఁ బండ్లు దడఁబడి వారల, తోన ధరణిమీఁదఁ దొరఁగుచుండ
 నిట్టిపాట గాడ్పుపట్టిచే దుశ్శాస, నాదులెల్ల బాధితాత్ములైరి ॥ ఆదిపర్వ.

ఇట్టి దుష్టచర్యలఁ జేయునాఁటికి భీముఁడు చిన్నపిల్లవాఁడై యుండలేదు. హస్తినాపురినిఁ బాండవులు కుంతితోఁ బ్రవేశించునాఁటికి ధర్మరాజునకు 16 భీమునకు 15 అర్జునునకు 14 మాద్రేయులకు 13 సంవత్సరముల వయస్సు కల దని యాదిపర్వమునందు స్థలాంతరమునఁ గవి చెప్పియున్నాఁడు. ఈదుష్టచేష్ట

లను భీముఁడు చేయునాఁటికి వయస్సు 16, 17 సంవత్సరములకుఁ దక్కువ యుం డదు. భీముని దౌర్జన్యమే దుర్యోధను నసూయాపరుఁ జేసెను.

2. పాండవులపుట్టుక దేవవరప్రసాదమువలన నైన దగియే కాని "యమా"దుల కుద్భవించినటులు కుంతి కాని మునులు కాని హస్తినాపురియం దెవరికిని జెప్పలేదు. "అనిలజేత్యాది" వాక్యములు వ్యాసుని కవిత్వములో నిముడ్పఁబడి యుండు నే కాని పౌరులకుఁ దెలిసియుండవు. పాండురాజు పోయిన చాలకాలమునకుఁ బాండవులు పుట్టియుందు రని కూడఁ బౌరులు హస్తినాపురికిఁ బాండవులు వచ్చినపు డనుమానించిరి.

శ్లో॥ తైస్తైర్నివేదితాన్ దృష్ట్వా పాండవాన్ కౌరవాస్తదా ।
శిష్టాశ్చ వర్ణాః పౌరా యే తేహర్షా చ్చుక్రుశు ర్భృశం ॥
ఆహుః కేచి న్నతస్యైతే తస్యైత ఇతి చాపరే ।
యదా చిరం మృతః పాండుః కథం తస్యేతి చాపరే ॥ ఆదిపర్వం.

తా. ఆయాబుషులచేఁ దెలుపుడు చేయఁబడిన పాండవుల నపుడు కౌరవులు పట్టణమునందలి యన్నివర్ణముల వారలుఁ జూచి సంతసముచే నాక్రోశించిరి. కొందఱీబాలురు పాండురాజు కుమారులు కా రనిరి. మఱికొంద ఱగుదు రనిరి. మఱికొందఱు పాండురా జెపుడో చాలకాలముక్రితము మృతినొందెనే యెటు వీ రతనిబిడ్డ లనిరి. కుంతియొక్క ప్రవరనము యుక్తమైనది కాదు. ఆమె పెండ్లికాకుండఁగానే కర్ణునిఁ గని గంగపాలు చేసినది. విమానముపైని వచ్చిన యమునకును మృగముపై నెక్కివచ్చిన వాయువునకును బ్రార్థింపఁగా వచ్చిన శక్రునకును మొత్తమునకుఁ బరులకే ధర్మసంతానముపేర నల్వురఁ గనినయది. తన సవతి తన్ను నాక్షేపింపకుండఁగా నిరువుర నామె కంటఁగట్టినది. పౌరులనుమానించినటులు నీధర్మసంతతిని బాండురాజు పోయినపిమ్మటనే కనినదేమో? పాండవులస్వభావములుఁ జర్యలుఁ గౌరవులకు భిన్నమైనవి. వీరు నేఁటి "తిబేతు" దేశమునం గల శతశృంగపర్వతములలోఁ బుట్టి 16 సంవత్సరము లచటనే యుండిరి. ఆదేశాచారములు భాష వారి కబ్బియుండెను. ద్రౌపదీస్వయంవరసమయమున ద్రుపదుఁడు మీ రేవురు నొక్కవనితఁ బెండ్లియాడుట యుక్తమా యిదేటియాచార మనఁగా ధర్మరా జేమనెనో చూడుఁడు.

ధర్మజః శ్లో. సూక్ష్మో ధర్మో మహారాజ నాస్యవిద్మో వయం గతిం ।
పూర్వేషా మానుపూర్వేణ యాతం వర్త్మా నుయామహే ॥

తా. ఓద్రుపదమహారాజా ధర్మము సూక్ష్మమైనది. దీనిగతిని మే మెఱుఁగము (మాయొక్క) పూర్వులు వెళ్లినదారినే మేముఁ బోవుచున్నాము. అనఁగా ధర్మమేమో మాకుఁదెలియదు గాని పూర్వికులు పోయినదారిని బోదు మని చెప్పుచున్నాఁడు. కౌరవవంశమునందు ధర్మజునకుఁ బూర్వు లెవ్వరైన నొకస్త్రీని పెక్కండ్రు వరించిరా? లేదు. ధర్మజుని పూర్వికులు "త్రివిష్టప" దేశీయులు వారిలో నతిప్రాచీనకాలమునుండియు నేఁటివఱకు నొకతెకు ననేకులు భర్తలుగా నుండుట సాంప్రదాయసిద్ధ మై యున్నది. ఆయాచారమునే ధర్మరాజు మాకు సాంప్రదాయసిద్ధ మని చెప్పుట; అనఁగా నీతనిపితరులు "టిబెటీయు" లనియు 16 సం॥ రము లీతఁ డచటఁ బెరుఁగుటచే నాయాచారము లీతనికి సంపూర్ణముగా నంటియున్న వనియుఁ దలంపవలసి యున్నది. ఇట్టివిజాతీయులును విజాతిసాంప్రదాయములుగల పాండవులపై హాస్తినాపురవాసులకును దుర్యోధన బాహ్లిక సోమదత్త భూరిశ్రవనాదులకు రోఁతపుట్టియుండును. విజాతీయులై విజాత్యాచారముల నవలంబించి భాగస్వాముల మని కౌరవులలోఁ దూఱుటయే కాక భీముఁ డాశ్రయ మిచ్చిన ధృతరాష్ట్రసూనులను బాధించుచుండుటచే వారికిఁ (దుర్యోధనాదులకు) గాలాంతరమునం దసూయ హెచ్చి పాండవుల కపకృతిం జేయ బుద్ధి పుట్టుటయే కాక వారినందఱ నున్మూలించుట కుద్దేశము కలుగుటలో మనుష్యసాధారణధర్మమునకు విరుద్ధము కాదు. పాండవుల జన్మాదిక మనుమానింపఁబడుచుండుటచేతను వారిసాంప్రదాయములు భారతీయసాంప్రదాయవిరుద్ధసాంప్రదాయము లగుటచేతను వారియందు నాఁటివారికి విశేషించి ప్రాచీనాచారపరులకు నసూయ మిగులఁ గలిగియుండెను.

3. దుర్యోధనుపక్షమున నుండియు నతని నసూయించుకొనువారలలో భీష్ముఁడు విదురుఁడు ద్రోణుఁడు కృపుఁడు ముఖ్యులు. పైవారలు దుర్యోధన ద్రవ్యముచేతనే జీవించుచుఁ బాండవుల నభిమానించుటకుఁ గలకారణము కేవల పాండవులయోగ్యత దుర్యోధను నయోగ్యతచేతనే కాక పాండవులు తమవలె తలోకరికిఁ బుట్టిన సంకరులై విశేషప్రజ్ఞావంతు లగుటచేతనె కాలాంతరమునఁ బాండవుల దౌర్జన్యమునకు నొకతె ననేకులు పరిణయ మగుట యనుధర్మవ్యతిరేకప్రవర్తనమునకు రోసిన దుర్యోధనునిపై నసూయ నొందుచుండిరి. మంచి మాటలచేతను ద్రౌపదీవివాహానంతరము చేసినధర్మకార్యములచేతను ధర్మజుఁడు భీష్మాదులమనస్సును మిగుల నాకర్షించి దుర్యోధనునిపైఁ గల యసూయను ద్విగుణీకృతము చేసెను. తమతో సమాన మగు గూఢోత్పన్నతచేతనే భీష్మా

దులు పాండవులపై నభిమానము కలవారైరి. విదురుఁడు రాజ్యమునందుఁ దన కేమియు హక్కు లేకపోవుటచేతను తను నతిగా గౌరవించు ధర్మజునిపై మిగుల నభిమానము కలవాఁ డయ్యెను. ధర్మజుఁడు రా జైనచోఁ దనకు మహాగౌరవ పదవి యబ్బు నని విదురుఁడు తలంచియుండును. ద్యూతకాలమునఱకు దుర్యో ధనున కంతగా విదురుఁడు బహిరంగవ్యతిరేకముఁ జేయలేదు. ధర్మజుఁడు యుద్ధా నంతరమున విదురు నంతగా గౌరవింపలేదు "క్షత్త" (దాసికొడుకా) యని యగౌరవముగానే పిలుచువాఁడు. ఈయగౌరవము ధృతరాష్ట్రునితోపాటు తన కుఁగూడ సమాన మగుటచేతనే ధృతరాష్ట్రుని వనవాసోన్ముఖునిగా విదురుఁడే ప్రేరేపించెను. భీష్మాదులు జీవించియుండినచో వారికి నీగతియే పట్టియుండును. తనపై నభిమానము గలకృపాచార్యునిఁ గూడ విశేషముగ గౌరవింపలేదు. సంజయుఁ డనినటులు ధర్మజుఁడు మెత్తనిపులి, యొరులవలనఁ దనకార్యములఁ జక్కఁ బెట్టుకొని పిమ్మట వారిని నిరాకరించుటలో నద్వితీయుఁడు.

4. భీష్మ ద్రోణ కృపులు యుద్ధముఁ జేయునవసరమున ధర్మజుఁడు నమస్క రించి యుద్ధమున కనుజ్ఞఁ నడుగఁగా ముగ్గురు నిట్లు చెప్పిరి.

శ్లో. అర్థస్య పురుషో దాసః దాస స్త్వర్థో నకస్యచిత్ ।
ఇతి సత్యం మహారాజ బద్ధో స్మ్యర్థేన కౌరవైః ।
అత స్త్వాం క్లీబవద్బ్రూయాం యుద్ధా దన్య త్కిమిచ్ఛసి ।
యోత్స్యామి కౌరవస్యార్థే తవాశాస్యో జయో మమ ॥

తా. అర్థమునకుఁ బురుషుఁడు దాసుఁడు. అర్థ మెవరికిని దాసుఁడు కాదు. మహారాజా యిది సత్యము. కౌరవులచే నర్థముచే బంధింపఁబడితిని కనుక నీతో నపుంసకునివలె మాటలాడుచున్నాఁడను. నీపక్షమున యుద్ధము చేయుటకంటె వేఱు నీకేమి కావలెను? కౌరవపక్షమున యుద్ధము చేయుచు నీకు జయమునుఁ గోరుచుందును.

శల్యుఁడు నట్లే చెప్పియున్నాఁడు. ధర్మజుఁడు దుర్యోధనపక్షమున యుద్ధ ముఁ జేయుచుఁ దనకు జయమునుఁ గోరుటయే యుక్త మని చెప్పియున్నాఁడు. పైనలువురలోఁ గృపుఁడు తప్పఁ దక్కినముువ్వురు సర్వసైన్యాధిపత్యమును వహిం చినవారే. సైన్యాధిపతు లెదుటివారి జయమును గోరుచు యుద్ధముఁ జేసిన స్వపక్షమున కెటులు జయము కలుగును? భీష్మాదులు స్వార్థపరులై దుర్యోధను పక్షమునం దుండి నీచత్వమున కొడంబడి పాండవులకు జయముఁ గోరుచు దుర్యోధనునకు ద్రోహముఁ జేసిరి. భీష్ముఁడు పదిదినములు యుద్ధముఁ జేసినను

పేరుగలవారిలో విరాటుని తమ్ము నొకనినే చంపెను. కృపాచార్యులు సుకేశుఁ డనుపాంచాలకుమారు నొకనిని శల్యుఁ "డుత్తరుని" మాత్రమె చంపెను, గాని యతిరథ మహారథుల నెవరి నీముప్పురు చంపలేదు. ద్రోణాచార్యులు, నశ్వత్థామ మాత్రము వీరాధివీరులఁ బొలియించిరి. పరశురాముని శిష్యుఁ డగుటచే ద్రోణుఁడు క్షత్త్రియనిర్మూలనముఁ జేసెను. విరాట ద్రుపద చేకితాన వసాతి దృష్టకేతు "మాగధసహదేవాదు" లీతనిచేతనే చచ్చిరి. అశ్వత్థామ చేసినది దొంగపని. కాని దుర్యోధనపక్ష మనుపేరుతోఁ దండ్రిపగను సాధించియున్నాఁడు. మొత్తమునకు భీష్మాదులు నైచ్యమున కొడంబడి రని చెప్పవలసియున్నది.

5. ధర్మజుఁ డింద్రప్రస్థమున నుండునపుడు భీష్మాదులు ద్రౌపదీపరిణయవిధిచేఁ బాండవుల ప్రవర్తనమునకు రోసియే పాండవులయండఁ జేరలేదు. వారి ననాగరకతాప్రదేశమగు ఖాండవప్రస్థమునకుఁ బంపునపుడు భీష్మాదుల యనుమతితోనే ధృతరాష్ట్రుఁడు పంపినటులు మహాభారతమునఁ గలదు. ఇంద్రప్రస్థముఁ జేరినది మొదలు పాండవులు దిగ్విజయములఁ జేసి రాజసూయాధ్వరము చేయుటచే భీష్మాదులమనస్సులు తిరిగి పాండవపక్షమైనవి. తమతో సమానజన్మలు గలపాండవు "లధికప్రఖ్యాతివంతు" లగుటకూడ వారిపైఁ బక్షమూనుటకుఁ గారణ మగును. రాజసూయానంతరము ధర్మజ రాజ్యపతన మగుటచే భీష్మాదు లచటికిఁ జేరునవకాశము కలుగలేదు కాని లేకుండిన ధర్మజుకడకుఁ జేరియుందురు.

6. యుద్ధకాలమున భీష్మాదు లక్రమముగా సంచరించి దుర్యోధనపరాజయమునకుఁ గారకులైరి. భీష్ముఁడు పదిదినములు యుద్ధముఁ జేసి పేరుగలవాని నెవనిని జంపకుండుటయే కాక తా నెట్లు పడిపోవునో యారహస్యముఁ గూడ ధర్మజునకుఁ దొమ్మిదవనాఁటిరాత్రి రహస్యముగఁ జెప్పియున్నాఁడు. అంపశయ్యపైఁ బడిననాఁడు రాత్రి కర్ణుఁడు రాఁగా నీవు కౌంతేయుఁడవు గానఁ బాండవులలోఁ గలియు మని యుపదేశించి యున్నాఁడు. చూడుఁడు భీష్మపర్వం 124-20-21-శ్రీకృష్ణునియొక్కయుఁ గుంతియొక్కయు బోధనలచే నంతకుపూర్వమే మెత్తనైన కర్ణునిమన మిపుడు ద్రవప్రాయ మగుటలో వింత యేమున్నది. బంధువుల నెటులు వధింప నని విషణ్ణచిత్తుఁ డగునర్జునునకు శ్రీకృష్ణుఁ డెటులు బోధించెను? యుద్ధానుజ్ఞం గొనుటకు వచ్చిన కర్ణునకు భీష్ముఁ డెటులు బోధించెను? ద్రోణుఁడు భారతకాలపు పరశురాముఁడు; శత్రుపక్షపురాజులఁ జంపుటయే కాక స్వపక్షక్షత్త్రియులు చచ్చుటకుం గూడఁ గారకుఁడై "వీరహా

ణుఁడు" (వీరునిం జంపినవాఁడు మహాపాపి యని వేదమునం గలదు) స్వామి ద్రోహి మిత్రద్రోహి కూడ నైనాఁడు "సైంధవ" వధనాఁడు ముందుగ బాఱి పోయి ప్రాణములఁ గాపాడుకొన నిచ్ఛయించుచున్న సైంధవున కభయ మిచ్చి నొప్పియొడ్డన మొడ్డి యర్జునుని సాత్యకిని గూడ వదలవలె ననియే వదలి నాఁడు. సాత్యకిని వదలుటలో ద్రోణుఁడు పరమనైచ్యమున కొడిగట్టినాఁడు. అర్జునుఁ డనుజ్ఞాతుఁ డై వ్యూహముఁ జొచ్చుటను సాత్యకి యెఱుఁగఁడు. వ్యూహముఁ జొచ్చుటలో నాయాజ్ఞ లేనిదే నీగురువు పోలేదు సుమా యని సాత్యకికిఁ ద్రోణుఁ డెట్లుచెప్పెనో చూడుఁడు.

శ్లో. తవాచార్యో రణం హిత్వా గతః కాపురుషో యథా ।
యుధ్యమానం చ మాం హిత్వా ప్రదక్షిణ మవర్తత ॥
త్వంహి మే యుధ్యతో నాద్య జీవన్ యాస్యసి మాధవ ।
యది మాం త్వం రణే హిత్వా నయాస్యాచార్యవద్ద్రుతం ॥
ద్రోణపర్వము—113 అధ్యాయము—

తా. ఓసాత్యకీ నీగురు వగునర్జునుఁడు కుత్సితపురుషునివలె యుద్ధమును విడిచి పోయెను. యుద్ధమునుఁ జేయుచుండిన నన్ను విడిచి ప్రదక్షిణమును జేసెను, ఓసాత్యకీ నీవు నన్ను విడిచి నీగురువువలె వేగముగాఁ బోకుంటి వేని యుద్ధము చేయుచుండిన నాకు నీవు జీవించి వెళ్లవు.

ఇట్లు స్పష్టముగాఁ జెప్పినపుడు సాత్యకి యేవిధముగాఁ గార్యసాధనముఁ జేసికొనఁడా? ఇట్లే భీముఁ డర్జునునకుఁ దోడ్పాటు గావింప నేగునపుడును సూచించెను. కాని భీముఁ డట్టివీరానౌచిత్యవిధానమునకు నొడంబడలేదు. అర్జునాదుల విధాన మెట్టిదైనను సర్వసైన్యాధిపత్యమును వహించి సైంధవున కభయ మిచ్చి మిత్రద్రోహమునకు స్వామిద్రోహమునకు ద్రోణుఁడు పాల్పడెను. ఇంతియె కాదు, ద్రోణునకు సైన్యాధిపత్యము నిచ్చినకాలమున ధర్మజు నర్జునుఁడు యుద్ధరంగమున లేనియెడల పట్టుకొని దుర్యోధనున కిచ్చెద నని ధర్మజుఁ డొకటిరెండుసారులు దొరుకుటకు సమీపించినను గ్రహింపక విడిచి ప్రతిజ్ఞాభంగముఁ జేసికొనెను.

కర్ణుఁడు కృష్ణరాయభారమునకుఁ బూర్వము సంపూర్ణముగా దుర్యోధనపక్షమునఁ బనిచేయుచుండినను గృష్ణుఁడు నీవు కౌంతేయుఁడ వని చెప్పుట చేతను గుంతి యర్జునునిఁ దప్పఁ దక్కినపాండవులఁ జంపకుండ వరముఁ గొనుట చేతను భీష్ముని తుదివాక్యములచేతను ధర్మజుఁడు రెండుసారులు భీమనకులసహదేవు లొక్కొకసారియు దొరికినను వధింపక విడిచెను. కర్ణుఁడు వధించినవారల

లోఁ బేరుగలవాఁడు ఘటోత్కచుఁ డొక్కఁడే. పాండవులకు (అర్జునుఁడుకాక) శ్రేయస్సుఁ గోరుచుఁ బోరాడిన కర్ణుఁ డను దొంగ పైని, అర్జునునిఁ గాపాడుట కొఱకు శల్యుఁ డనుదొంగను ధర్మజుఁ డేర్పఱుచుట వింతలోనివింత. తాను యుద్ధముఁ జేసినన్నినాళ్లు భీష్ముఁడు శీఘ్రక్రోధి యగుకర్ణుని నుడికించి యుద్ధ రంగమునకు రాకుండఁ జేసినాఁడు. కుంతీకృష్ణులవాక్యములచే నర్జునునిఁ జంపిన పిమ్మటను దాను పాండవులలోఁ గలిసి రాజ్యాధిపత్యమును వహింపవలె నని కోరిక కర్ణున కుండుటలో దోష ముండునా? శల్యుఁడు—శల్యసారథ్యము లోక విదితము. శల్యుఁడు పాండవులలో మాద్రేయులకు మాతులుఁ డైనను దుర్యో ధనునిలోఁ గలియుట కుద్యోగపర్వమునం జెప్పిన దుర్యోధనుని సేవచేత కా దని తలంపవలసి యున్నది. అరణ్యపర్వమునందే శల్యుఁడు మనకుఁ బగవాఁ డని ధర్మరాజు భీమునితోఁ జెప్పుచున్నాఁడు భీష్ముఁ డతిరథ మహారథ నిరూపణములో శల్యుఁడు శ్రీకృష్ణునికి విరోధి యగుటచే నీలోఁ గలిసియున్నాఁ డని చెప్పి యున్నాఁడు. వేదకాలమునందును మద్రదేశీయులు పవిత్రచారిత్రులు. మాద్రిని పాండురాజునకు వివాహముఁ జేయుటకు భీష్ముఁడు యుద్ధసన్నాహముతో శల్య పురి కేగె నని మహాభారతమునఁ గలదు. సంకరజాతివాఁ డగుపాండురాజునకు మాద్రి నిచ్చుట కిష్టము లేనివాఁ డై భీష్మునియౌద్ధత్యమునకు జడిసి మాద్రి నిచ్చినట్లు లాప్రకరణము సూచించుచున్నది. సంకీర్ణజాతివా రగుపాండవులు మేనల్లుం డ్రయినను బూర్వాచారపరత్వమున శల్యుఁడు పాండవులతోఁ గలియ లేదు కాని ధర్మరాజుయొక్క మాయమాటలకు లోపడి కర్ణుని మోసముఁ జేసి యున్నాఁడు.

7. యుద్ధకాలమునందు దుర్యోధనుఁ డధర్మముగా నెవరిని జంపింపలేదు. అభిమన్యువధలోఁగూడఁ బదుం డ్రొక్కనిపైఁ గవిసి విరథునిఁ జేయుట తప్ప వే ఱన్యాయము కానరాదు. తుద కభిమన్యుం జంపినవాఁ "డనామకుఁ" డగు దుశ్శాసనపుత్త్రుఁడు. అభిమన్యుని విరథునిం జేయుటకుఁగూడ ద్రోణుఁడే కార కుఁడు. ఆతనియాలోచనచేతనే కర్ణుఁడు వెనుకనుండి ధనుస్సునుఁ గొట్టెను. "ఊరికీశు వీరిసెట్టినిం గొట్టుకొని పోయినది" అను సామెతప్రకార మర్జునుని యొక్కయభిమన్యువధదుఃఖము సైంధవవధకుఁ గారణమాయెను. భాసమహా కవికాలమునకు (B. C. 8 శతాబ్దము) దుర్యోధనుఁడు నేఁటివలె దుష్టుఁడు కాఁడు. పంచరాత్ర, ఊరుభంగనాటకములలో నాతఁ డెటులు దుర్యోధను వర్ణించెనో చూడుఁడు.

సౌప్తికవధకు దుర్యోధనుఁడు కారకుఁడు కాఁడని యిదివఱలోనే వ్రాసి యుంటిని. యుద్ధకాలమునందు దుర్యోధనుఁ డన్యాయముగాఁ బ్రవర్తించినటులుఁ గానరాదు. వెనుకను వ్రాసినరీతిని భీముని బండతనపు చేష్టలకుఁ గినిసి జలములం ద్రోయుట విషము నిడుట పాములం గఱపించుటచేసియుండెను. పాండవుల జన్మాదివృత్తాంతము తెలియుటచేతనో యేకచ్ఛత్రాధిపత్యేచ్ఛచేతనో లక్కయిండ్లలోఁ బెట్టి తగులఁబెట్టించెను. ద్రౌపదీవివాహానంతర "యర్ధ" రాజ్యము నిచ్చుటలో నంతగా నడ్డలేదు కాని రాజసూయముఁ జూచినపిమ్మటఁ బాండవులపై నసూయాగ్రస్తుఁ డాయెను. మయసభఁ జూచునపుడు కాలు జాఱి పడఁగా ద్రౌపదీభీములు హేళనముఁ జేయుటచే నసూయ పెరిఁగి ద్యూతముగాఁ బరిణమించినది. ద్యూతకాలమున దుశ్శాసనుఁడు ద్రౌపది జుట్టు పట్టుకొని యీడ్చి వస్త్రము లొలుచుటలోఁ గొంతయతిశయోక్తి కాన్పించుచున్నది. వీరవనిత యగు ద్రౌపది సభకు వచ్చుటకు వీలు లే దని దిరాయించినపుడు కొప్పు పట్టుకొని భావోద్రిక్తుఁ డగుదుశ్శాసనుఁడు లాగుకొని వచ్చియుండును. వస్త్రాపహారణము మాత్రము మృష. వస్త్రాపహారణసమయమున దేవతామహిమ లారోపింపఁబడి సభలోఁ గుప్పలుగాఁ బడియుండె నని చెప్పుటలోనే యబద్ధ మున్నదని నాతలంపు. ఇంతియె కాదు. శ్రీకృష్ణరాయభారసమయమున ద్రౌపది కృష్ణునితోఁ జెప్పినపుడు వస్త్రముల నొలిచినట్లు చెప్పలేదు.

శ్లో. సాహం కేశగ్రహం ప్రాప్తా పరిక్లిష్టా సభాం గతా ।
పశ్యతాం పాండుపుత్రాణాం త్వయి జీవతి కేశవ ॥ ఉద్యో 81 అ.

తా. అట్టియున్నతకులసంభూత నగునేను, ఓకృష్ణా పాండవులు చూచు చుండఁగా నీవు జీవించియుండఁగాఁ గేశగ్రహణము నొందితిని. మఱి కొన్ని స్థలములయందు నిట్లే చెప్పఁబడెను, గ్రంథవిస్తరభయముచే వ్రాయలేదు. ప్రాచీనకవులలో మహాభారతగాథను తు చ తప్పకుండఁగఁ గ్లుప్తముగ వర్ణించిన వాఁడు "క్షేమేంద్రుఁడు." ఆతఁడు ద్రౌపదీహారణము నెటులు వర్ణించెనో చూడుఁడు.

శ్లో. కూటాక్షకుపితాశేషకోశసైన్యపరిచ్ఛదః ।
పణం భ్రాత్యా నథాత్మానం కృష్ణాంచ విదధే నృపః ।
దుశ్శాసనకరాకృష్టకేశీ మథ రజస్వలాం ।
కృష్ణాం ద్యూతజితాం దాసీం ఆనినాయ సుయోధనః ।

తతో౽పా దకరోద్భీమః ప్రతిజ్ఞా మూరుభంజనే।
యుధి దుర్యోధనస్య సృక్పానే దుశ్శాసనస్యచ॥
(దశావతారచరిత్ర—కృష్ణావతారఘట్టము.)

తా. ధర్మజుఁడు మాయాద్యూతమునం దోడ్డఁబడిన సమస్తకోశసైన్యాదికము కలవాఁడై సోదరులను తనను ద్రౌపదిని గూడ నోడ్డి యోడెను. దుర్యోధనుఁడు దుశ్శాసనునిచేఁ లాగఁబడిన కేశములు కలిగి రజస్వలయై ద్యూతమునఁ గెలుఁబడిన దాసిఁగా ద్రౌపదినిఁ జేసెను. ఆకోపమువలన భీముఁడు దుర్యోధనుని తోడలఁ బొడిసేయుటకును దుశ్శాసనుని రక్తముఁ ద్రావుటకును ప్రతిజ్ఞం జేసెను.

దీనిని గోరంతలు కొండంతలుగాఁ గవులు వర్ణించి యున్నారు. ద్రౌపదీమానరక్షకుఁ డని కృష్ణున "కపూర్వబిరుద" మీయఁబడెను. దుర్యోధనుఁడు వ్యక్తిపరముగా భీమునికిఁ జేసినయపకృతులు మూఁడు, పాండవు లందఱికిఁ జేసినవి రెండు; లక్కయిండ్లు దుర్యోధనుఁడు తగులంబెట్టింప యత్నించెనే కాని యగ్గిపెట్టినవాఁడు భీముఁడే. కాని దుర్యోధనుఁ డగ్గిపెట్టించె ననునప్రతిష్ఠపాలైనాఁడు.

8. పాండవులు భీష్మని బలిమాలి మొగమోటపెట్టి చంపిరి. భీష్మవధలో స్వామిద్రోహము భీష్మునకును మిత్రద్రోహము పాండవులకు ఘటించియున్నది. భీష్ముని మిషపెట్టి కొట్టుట కర్జునుఁడు చాల విచారించియున్నాఁడు. అర్జునుఁడు బాలుఁ డైనపుడు బూడిదలో నాడుకొనుచుండఁగా భీష్ముఁ డెత్తుకొని పాండురాజుం దలఁచికొని విచారించుట యర్జునునకుఁ జ్ఞప్తికివచ్చి ఖేదాధికము కలిగెను. కాని కృష్ణు నానతి దాఁటలేకపోయెను; ద్రోణాచార్యవధ లోకవిదితము. కర్ణునివధకు శల్యుని నెట్లు కారకుఁ జేసినదియు జగత్ప్రసిద్ధమే. రథచక్రము క్రుంగిపోఁగా దాని నెత్తుచుండినకర్ణుపై బాణములను వేయ నర్జుననిఁ బురికొలిపి కృష్ణుఁడు చంపించెను. దుర్యోధనవధ యన్యాయ మని బలరాముఁడు కోపపడ నన్నయ్యా కలియుగము రాఁబోవుచున్నది, యిఁకను న్యాయములు నిలుచునా యని కృష్ణుఁడు సమాధానముఁ జెప్పినాఁడు. తలఁ దన్నుటకును దొడలఁ గొట్టుటకు నన్యాయ మనివిచారించు ధర్మజుని శ్రీకృష్ణుఁడు మొండితనముగా సమాధానపఱిచెను. అపుడు దుర్యోధనుఁడు శ్రీకృష్ణునితో ననిన మాటలు చదువఁదగినవి. దుర్యోధనుఁడు పుట్టినపుడు దేవతలు పుష్పవర్షముఁ గురిపింపక

పోయినను దుర్యోధనుఁడు శ్రీకృష్ణునిఁ దూషించినవాక్యములకు సంతసించి దేవతలు పుష్పవానఁ గురిపించి రని మహాభారతమునఁ గలదు. అపుష్పవర్షముచే దుర్యోధనపక్షము సత్య మనియు ధర్మజపక్షము దురన్యాయ మనియు మనకే కాక ధర్మజునకునుఁ దోఁచి మిక్కిలి ఖేదము నొందఁగా శ్రీకృష్ణుఁడు భీష్మాదుల నన్యాయముగాఁ జంపినది సత్య మనియు వారిని న్యాయముగాఁ జంపలేక నేనే యట్లు చంపించితి ననియు నందు భీష్మ ద్రోణ కర్ణ దుర్యోధనుల నెవరును జంపలేనందున ధర్మవ్యతిరేకముగా వారిం జంపించుటలో ముఖ్య బాధ్యత తనదే ననియుఁ జెప్పియున్నాఁడు. శల్యపర్వమునందలి యాఘట్టము గ్రంథవిస్తరభీతిచే వ్రాయలేదు. సైంధవవధను ద్రోణుని మొగమోటపెట్టి చేసిరి. భూరిశ్రవసు నన్యాయముగాఁ జంపించిరి. భగదత్తుఁడు వేసిన శక్తి శ్రుతాయువు వేసిన గద యర్జునునకుఁ దగిలిన నర్జునుఁ డేమగునో. సారథ్యము తప్ప వేఱుపనిని జేయనని చెప్పినశ్రీకృష్ణుఁడు భగదత్తశ్రుతాయువుల యాయుధములు తగులకుండ నడ్డుకొనియున్నాఁడు. దుశ్శాసనవధ లోకగర్హితమైనది. గాంధారివాక్యములకు భీముఁ డేమిసమాధానముఁ జెప్పెనో స్త్రీపర్వమునం జూడఁ గోరెదను. భీష్మాదులయుద్ధములలోఁ బాండవులు వీరులవలెఁగాక మోసగాండ్రవలెఁ బ్రవర్తించిరి. భీష్మాదులవలనఁ గావలసినపనులఁ జేయించుకొని వారిని వధించుటచేఁ బాండవులు మిత్రద్రోహులైరి. ఈమిత్రద్రోహపాపమునకుఁ జంకియే యర్జునుఁడు కృష్ణా మిత్రద్రోహపాపముకూడ వచ్చుచున్న దని విషాదము నొందియున్నాఁడు. చూడుఁడు భగవద్గీత 1 అధ్యాయము 30 శ్లోకము.

9 పాండవులు విశేషించి శ్రీకృష్ణుఁడు శత్రుపక్షమువారినే గాక తమ పక్షమువారినిఁగూడఁ దమకు వ్యతిరేకు లగుదు రనినపుడు వారిచావును గోరి సంతసించి రనుటకు ఘటోత్కచవధయే నిదర్శనము. ఘటోత్కచుఁడు చచ్చుట తనకుఁ బరమానంద మని కృష్ణుఁ డర్జునునితో ననియెను. ఘటోత్కచుఁడు తమ కెదురుతిరుగువాఁ డనియే యాతనిచావును గృష్ణుఁడు కోరెను. నిజమునకు యుద్ధానంతరము ఘటోత్కచుఁడే యుండినచోఁ బరీక్షితున కెట్లు రాజ్యము వచ్చును. కష్టముల కోర్చి సంపాదించిన రాజ్యమును భీముఁడు తన కొడుకున కీయుమనఁడా? యుద్ధానంతరము భీమునాజ్ఞ లేనిదే రాజస్వములో నొకగవ్వయైన వ్యయపఱుప వీలు లేకపోయెను. వనవాసమునకుఁ బోయెదను. చచ్చినవారికి హిరణ్యశ్రాద్ధముఁ జేయవలె నని ధృతరాష్ట్రుఁడు ధర్మజుకడకు విదురు నంపఁగా భీముఁ డెట్లుపలికెనో చూడుఁడు.

శ్లో. భీమసేనస్తు సక్రోధః ప్రోవాచేదం వచ స్తదా।
వయం భీష్మస్య దాస్యామః ప్రేతకార్యంచ ఫాల్గున
సోమదత్తస్య నృపతేః భూరిశ్రవస ఏవచ।
బాహ్లికస్యచ రాజర్షే ర్ద్రోణస్యచ మహాత్మనః।
అన్యేషాంచైవ సర్వేషాం కుంతీ కర్ణాయ దాస్యతి।
శ్రాద్ధాని పురుషవ్యాఘ్ర మాప్రాదా త్కౌరవో నృపః।
ఇతిమే వర్తతే బుద్ధి ర్మానో నందంతు శత్రవః।
కష్టాత్కష్టతరం యాంతు సర్వే దుర్యోధనాదయః॥

తా. (విదురవాక్యములకు ధర్మజార్జునులు ద్రవ్యము నిచ్చుట కంగీకరింపఁగా భీముఁ డంగీకరింపక యర్జునునితో ని ట్లనుచున్నాఁడు) ఓయర్జునా మనము భీష్ముని శ్రాద్ధమునకు బాహ్లీక సోమదత్త భూరిశ్రవస ద్రోణుల శ్రాద్ధములకు ద్రవ్యమునిత్తుము. కర్ణుని శ్రాద్ధమునకుఁ గుంతి స్వంతధనమునుండి యిచ్చును. ధృతరాష్ట్రుఁడు శ్రాద్ధములఁ జేయ నక్కఱలేదు. ఇది నానిశ్చయబుద్ధి. శత్రువు లేమనుకొనినను సరియే దుర్యోధనాదులు (పరలోకమునందు) కష్టాత్కష్టతరము నొందుదురు గాక.

ఇట్లు భీముఁ డనుటచే రాజద్రవ్యము శ్రాద్ధముల కిచ్చుటకు వీలులేక యుధిష్ఠిరార్జునులు తమద్రవ్య మిచ్చి ధృతరాష్ట్రునిచే శ్రాద్ధముం జేయించిరి. అట్టిస్థితిలో ఘటోత్కచుఁడే యుండినచో భీము ఘటోత్కచు లేకమై యర్జున సంతతికి రాజ్యము రానిత్తురా? మొదటఁ గృత్రిమము లేకుండినను గృష్ణునియాలోచనచొప్పున నర్జునుఁడుకూడఁ గృత్రిముఁడై "తేలుకుట్టినదొంగవలె" నూరకున్నాఁడు, లేకుండిన నభిమన్యువధకు జరిగినంత యాడంబరము ఘటోత్కచవధకుఁ గూడ జరగవలసినదే. ఒకరు చెప్పినఁగాని తెలిసికొనలేని మూఢుఁడగు భీమున కీకృత్రిమము తెలియదు. ఘటోత్కచవధలోఁ గృష్ణార్జునులు బహునీచత్వమున కొడంబడి రనక తప్పదు.

10. కురుపాండవయుద్ధమునందు మహావీరు లగుయాదవులలో సాత్యకి కృతవర్మలు కాక మిగిలినవా రెవరును యుద్ధమునకుఁ దోడు రాకపోవుటకుఁ గారణ మేమి? యాదవులలోఁ గృష్ణునిపలుకుబడి పాండవయుద్ధకాలమునకు క్షీణించినట్లు గాన్పించును, బలరామునకు సత్యభామకుఁ గృష్ణుఁడు జంకుచుండువాఁడు. సత్రాజిత్తుం జంపి "శతధన్వాదులు" శ్యమంతకమణి నపహరింపఁగా సత్యాప్రేరణముచే శ్రీకృష్ణబలదేవులు శతధన్వుతో నూఱామడ పరుగిడి శత

ధన్వుఁ గలిసికొనిరి. ముందుగ శ్రీకృష్ణుఁడు శతధన్వు నరణ్యమునం దఱిమి వధించి వానివస్త్రాదికముఁ బరిశోధింప మణి లభింపలేదు. మణి లభింప లే దని బలరామునితోఁ జెప్పఁగా "వెన్నతోడనే" దొంగతనము నభ్యసించిన శ్రీకృష్ణునిమాటను బలదేవుఁడు నమ్మక నీవే దీని నపహరించితి వని కినిసి మిథిలాపురమునం దాగ్రహముచే మూఁడేండ్లు కాఁపుర ముండెను. అక్రూరుఁ డామణిని గొంపోయి కాశికాపురిలోఁ గాఁపురముండుటఁ బిమ్మట శ్రీకృష్ణుఁడు తెలిసికొని వానిని రప్పింపఁగా మణిని కృష్ణున "కక్రూరుఁ" డిచ్చెను. ఆమణి పిత్రార్జితముగాన సత్యది, శతధన్వవధకుఁ దోడ్పడుటచే బలదేవునకు భాగ మున్నది. తనకు భాగ మున్నది. దీనిని బలదేవున కిచ్చిన సత్య పాదతాడనముఁ జేయఁ గలదు. సత్య కిచ్చినఁ ద్రాగుబోతగుబలదేవుఁ డేమిచేయునో యని జంకి తన గొప్పతనము నిలువఁబెట్టుకొనుటకు శ్రీకృష్ణుఁ డందఱిలోను, అక్రూరా నీవే పుచ్చుకొ మ్మని యక్రూరున కిచ్చినాఁడు. ఇందు స్వార్థత్యాగముతోఁ గాక సత్యాబలదేవులకు జంకియే యట్లు చేసినటులు విష్ణుపురాణమునందును హరివంశమునందును గలదు. పాండవపక్షము న్యాయము కా దనియే బలదేవుఁ డుద్యోగాదియందుఁ జెప్పియున్నాఁడు. అందువలననే యాదవులలో మహావీరులగుసాంబప్రద్యుమ్న, అనిరుద్ధగదాదులు యుద్ధమునం బాండవులకుఁ దోడు రాలేదు. సాత్యకి గురు వగునర్జునునకుఁ దోడగుట విధి యని వచ్చినాఁడు. శ్రీకృష్ణుని కృత్యములకు రోసియు సుయోధనుపక్షము న్యాయ మని నమ్మియుఁ గృతవర్మ కౌరవులకుఁ దోడ్పడ నేగెను. బంధువు లగు పాండవులకు వ్యతిరేకముగా యుద్ధము చేయుట యుక్తము కా దని కౌరవులకును నన్యాయముగాఁ గౌరవులను గృష్ణప్రేరణమునఁ జంపుదు రని కౌంతేయులకును బ్రద్యుమ్నాదులు తోడ్పడలేదు.

11. ధర్మజ సుయోధనులకు సమానజ్ఞాతులును బాహ్లికదేశమును స్వాతంత్ర్యముగాఁ బరిపాలించువారు నగుబాహ్లిక సోమదత్త భూరిశ్రవస్సులే కాక పాండవులకుఁ బినతల్లి యగురాజాధిదేవి కుమారులును, అవంతిదేశాధీశులు నగు విందానువిందులును బాండవులకుఁ దోడురాక కౌరవులలోనే కలియుటకుఁ గారణమేమి? పాండవులపుట్టుక ప్రవర్తనము సంకరవ్యవహారములతోఁ గూడుకొనుటచేతనే పైవారు పాండవులవైపునకు రాలేదు. కుంతికి నలువురు చెల్లెండ్రు కలరు. శిశుపాలుఁడు దంతవక్త్రుఁడు విందానువిందులు కుంతికిఁ జెల్లెలుకొడుకులే; వా రందఱు పాండవుల శ్రీకృష్ణు నసహ్యించుకొనువారే; శిశుపాలాదు

లుండిన దుర్యోధనుపక్షమునకు రాఁగల రని తలంచియే వారి నందఱ నెట్లో కడ తేర్చితి నని కృష్ణుఁ డొకసారి యర్జునునితో ననియున్నాఁడు.

12. ప్రకృతివిరుద్ధముగా జన్మించినవారలలో దుర్యోధనుపక్షమున నెవరును యుక్తముగాఁ బోరాడలే దనవచ్చును. భీష్మ ద్రోణ కృపా శ్వత్థామ కర్ణులు ప్రకృతివిరుద్ధజాతులే. వారందఱుఁ గృత్రిమముతోడనే పోరాడి సుయోధనునికే గాక యాతనివంశమునకు న్యాయ మగునాతనిపక్షమునకు నాశమునుఁ దెచ్చిపెట్టిరి. దుర్యోధనుమరణమువఱకు లేనితీవ్రమును నతఁడుపడినపిమ్మట నశ్వత్థామ కనఁబఱిచెను. కారణము తనకు మర్యాదను బాండవు లీయ రనియె. సుయోధనుమరణముతోఁ బాండవుల యన్యాయము బయలుపడి తననుఁగూడ పాండవులు మోసపుచ్చెద రని యశ్వత్థామ పూర్తిగ నమ్మియుండును. పాండవపక్షమునఁ బ్రకృతివిరుద్ధముగా జన్మించిన ధృష్టద్యుమ్నాదులేకాక నీచజాత్యుత్పన్నులుగాఁ దలంపఁబడు విరాటమత్స్యధ్వజాదులు సంకరసంజాతు లగుపాండవులజయముఁ గోరుచుఁ బ్రాణముల కాశపడక పోరాడి పాండవులకు జయము నిచ్చిరి. గొల్లవాండ్ర నాయకుఁ డగుశ్రీకృష్ణునిచర్యలు వర్ణనాతీతములే గదా? కలియుగారంభమున జన్మించిన యాతనిచర్యలు కలిచర్యలు కావా? ఇంతమాత్రమె కాదు, న్యాయ మన్యాయముగా నన్యాయము న్యాయముగాను గురుపాండవచరిత్రము వ్రాసి లోకమును మోసపుచ్చిన వ్యాసుఁడుకూడఁ బల్లెదానికి బ్రాహ్మణునకుఁ బుట్టినవాఁడు. నీచజాతిస్త్రీకి బ్రాహ్మణునకు జన్మించినవానిని మనువు నిషాదుఁ డని వ్రాసియున్నాఁడు. ఈసంకరుఁడే తండ్రిమహిమచే విద్యావంతుఁ డై యోగ్యులచరిత్ర నయోగ్యముగాను సంకరసంజాతుల చరిత్రను బవిత్రముగాను వ్రాసియున్నాఁడు. ఈనిషాదు నుత్తమక్షత్రియస్త్రీలకుఁ దల్లి యంటఁగట్టినది. ఉత్తమక్షత్రియకాంత లగు "నంబికాంబాలిక" లీరోఁతకంపు మిడిగ్రుడ్లు చిట్టవెండ్రుకలు కొఱివివంటి దేహకాంతియుఁ గలవానిఁ జూచి యసహ్యించుకొనుట వింతకాదు. నీచజాతివాఁ డుత్తమక్షత్రియకాంతల నొంది నందులకు ఫలిత మేమైనది? గ్రుడ్డివాఁడుఁ బాండురోగియుఁ బుట్టిరి. ఆనిషాదుఁడే దాసిం గూడినపుడు యుక్తసంతానముగాఁ దలంపఁదగిన విదురుఁడు పుట్టెను. వ్యాసుఁడు సంకరసంతతివా రగుపాండవుల కనేకస్థలములను సహాయముఁ జేసెను. వారిపెండ్లికిఁ జాల తోడ్పడెను. దుర్యోధనాదులభార్యలకు ధర్మజుఁడు "భరణము" నీయనక్కఱలేకుండఁగ వారల నందఱను గంగాప్రవాహముపాలు చేసెను. తుదకు "జయ" మనుగ్రంథముఁ జేసి పాండవులయన్యా

యములను గప్పిపుచ్చి సుయోధనునిదే యన్యాయ మని లోకమునకుఁ జాటెను. ధృతరాష్ట్రునియందుఁ దండ్రిగుణములకంటెఁ దల్లిగుణము లెక్కుడుగా వ్యాపించినటులు గాన్పించును. వ్యాసుఁడు తండ్రియైనను దనకుమారులవృత్తమును వ్యతిరేకముగా వ్రాయుట కంగీకరింపఁడనియే యుద్ధానంతరమున మూఁడేండ్లకుఁ బూర్తిచేసిన "జయ" మనుగ్రంథమును ధృతరాష్ట్రునిమరణాంతరము కాని వెల్లడిచేయలేదు. చూడుఁడు. మహాభారతము—ఆదిపర్వ.

శ్లో. మాతుర్నియోగా ద్ధర్మాత్మా గాంగేయస్యచ ధీమతః।
క్షేత్రే విచిత్రవీర్యస్య కృష్ణద్వైపాయనః పురా।
త్రీ నగ్నీ నివ కౌరవ్యాన్ జనయామాస వీర్యవాన్।
ఉత్పాద్యధృతరాష్ట్రంచ పాండుం విదుర మేవచ।
జగామ తపసే ధీమాన్ పునరే వాశ్రమంప్రతి।
తేషు జాతేషు వృద్ధేషు గతేషు పరమాం గతిం।
అబ్రవీ ద్భారతంలోకే మానుషేస్మి న్మహానృషిః॥

తా. తల్లి గాంగేయుఁ డనుమతింపఁగా విచిత్రవీర్యునిభార్యలయందు వ్యాసుఁడు మూఁ డగ్నులంబోలు ధృతరాష్ట్రాదులను మువ్వురం గని తపస్సుకొఱకు వనమున కేగెను. ఆధృతరాష్ట్రాదులు పుట్టి పెరిఁగి పెద్దవారై చనిపోయిన పిమ్మటను మనుష్యలోకమునం దీభారతముం బ్రకటించెను. చనిపోయిన వారి చరిత్ర నెవ రెటులుచెప్పినను గాదనువా రుండరుగదా? ఇపుడు నేను వ్యాసుని చరిత్రను దూషించినను వ్యాసుఁ డడ్డురాఁడు. నేఁటికాలమునం దుద్భవించిన గవరయ్యగారి వివాహచట్టప్రకారము వ్యాసులు ధృతరాష్ట్రాదులు పుట్టుదురేమో? భారతకర్త యగువ్యాసుఁడు వేదవిభాగకర్తయు వేదాంతసూత్రకర్తయుఁ గాండఋషియుఁగూడఁ గాఁడు. అనేకవ్యాసు లుండినటులు గ్రంథాంతములలోఁ గలదు. వేదవిభాగకర్త కృతయుగపురుషుఁ డని భారతమునసే కలదు. గాన నిషాదవ్యాసుని దూషించుటచే నాకు దోషము లే దని తలంచుచున్నాను. వ్యాసుఁడు దుర్యోధనాదులపత్నుల నెటులు మోసపుచ్చి గంగలోఁ ద్రోసెనో గ్రంథవిస్తరభీతిచే మూలరహితముగా నాశ్రమవాసపర్వమః నందలి 32, 33 అధ్యాయములగాథను వ్రాయుచున్నాఁడను.

(ధృతరాష్ట్రాదులు వనమున నుండఁగా ధర్మరాజాదులు వారిం జూడనేగిరి. అపుడు వ్యాసుఁడును ప్రత్యక్షమై మీయందఱ కిష్టమైనది యేదో దానిం జేతు ననెను. ధృతరాష్ట్రాదులు యుద్ధమృతులం జూడ నపేక్షింపఁగా సాయంకాల

మైనపిమ్మటం జూపుదు నని) గంగాతీరమున సాయంకాల మైనపిమ్మట రాష్ట్రాదులఁ గూర్చుండఁ బెట్టి తాను గంగలోనికి దిగి యుద్ధమృతుల నందఱ నాహ్వానము చేయఁగా నాయాలోకములనుండి కురుపాండవయోధు లందఱు బిలబిలలాడుచుఁ బ్రత్యక్షమైరి. వారు కురుపాండవసేనలలో నేయే వేషములతో నేయే యాయుధములతో నేయే వాహనములతో నుండిరో యట్లే భీష్మద్రోణాదులతో సుయోధనాదులు ప్రత్యక్ష మైరి. వా రందఱు భాసురతేజులై చిత్రపటమునం దుండినరీతిగా నుండిరి. అత్యాశ్చర్యముగ నుండిన యీయుత్సవమును ధృతరాష్ట్రాదులు చూచి మునియొక్క మహిమ కత్యద్భుతము నొందిరి. (ధృతరాష్ట్రునకు వ్యాసుఁ డీసమయమున దివ్యదృష్టినొసఁగెను) పరలోకమునుండి ప్రత్యక్షమైన యాకురుపాండవవీరులు కల్మషరహితులును విరోధములేనివారుఁగా నుండిరి. ఇట్లారాత్రియంతయుఁ గడపిరి. ఆరాత్రి యచటివా రందఱికి స్వర్గసుఖము కలిగె; తెల్లవాఱుసమయమునఁ బరలోకాగతు లగునావీరు లన్యోన్యామంత్రణముఁ జేసికొని వ్యాసుఁడు విసర్జింపఁగా గంగాముఖమునఁ దమతమ లోకములకుఁ బోయిరి. వారందఱుఁ బోయినపిమ్మటను గౌరవులకు హితముఁ జేయఁగోరి వితంతువు లగుదుర్యోధనాదుల భార్యలను మీభర్తలతోఁగూడ వారిలోకముల కేగఁదలఁచిన స్త్రీలు వచ్చినయెడల వారినందఱ భర్తలతోఁ గూడఁ బంపఁగల ననఁగా ధృతరాష్ట్రాదులయనుజ్ఞం గొని దుర్యోధనాదుల భార్యలు గంగలో నవగాహనముం జేసి భర్తలలోకమున కేగిరి. ఇట్లావితంతుస్త్రీ లంకఱుఁ గ్రమముగాఁ బరలోకగతులైరి—

ఈగాథావిశేషముఁ జూడ “సినీమా”వంటిదానిం జూపి వ్యాసుఁ డావితంతువుల నందఱ గంగలోఁ ద్రోసియుండె నని తలంపవలసియున్నది. ఇది పాండవులహితముఁ గోరి చేసినటులే స్పష్టము గాఁగలదు. గంగనుండి విద్యుత్తునుఁ దీసి సినీమాను జూపించె నని నానమ్మకము. ఆవచ్చినవారు భాసురతేజులు చిత్రపటమునం దుండినవారు నగుటయు రాత్రి యీప్రదర్శకము జరుగుటయు సినీమా నాఁడు కలదని నానమ్మకము. “పాతాళనూతులు” (ఆర్టిజన్ వెల్సు) భీష్మద్రోణపర్వములలో వర్ణింపఁబడెను. స్వల్పముగా విమానప్రశంస కలదు. సర్వవిధముల భారతయుద్ధకాలమునందు మనదేశము నేఁటిపాశ్చాత్యదేశనాగరకతను సంపూర్ణముగాఁ బొందియున్నది. నైతిక సాంఘిక రాజకీయ యుద్ధవిధులు స్త్రీలమర్యాదలు నేఁటిపాశ్చాత్యదేశపు పద్ధతినిఁ బోలియున్న వని యీసందర్భమున వ్రాయుట యయుక్తము కాదు

వ్యాసుఁ డావిచిత్రవీర్యుని సంపినఁ జంపిన పాపమునకుఁ బోయెనో లేదో కాని ధర్మరాజునకు భరణాశ్రయము లేకపోవుటయు మనదేశమునకు సంకర సంజాతులు పిస్సుట లేకపోవుట యనునుపకృతులం జేసినందుకు మాత్రము వందుఁడే.

13. కుంతీప్రవర్తనము బహుసూచకమై యున్నది. ఈమె కుంతిభోజునకు దత్తత నీయఁబడుటచే నచటియలవాట్లు కలిగె నని తలంపవలసి యున్నది. కుంతి భోజుఁడు నాగులవంశస్థుఁడు. నాగులు బోగమువారం డ్రని యిదివఱలో వ్రాసి యుంటిని. వేశ్యాకులమునఁ బెరిఁగిన కుంతి పెండ్లి కాకుండఁగ బిడ్డను గనుట కును బెండ్లైనపిమ్మట ననేకులకు బిడ్డలం గనుటకును దగియున్నది. కుంతిభో జుఁడు నాగులసంబంధికుఁ డని యాదిపర్వము 128-వ యధ్యాయమునం గలదు. తన జారత్వవిశేషములను యోగ్యురా లగుమాద్రికి నేర్పినది. తాను నలు వురతోఁ బోవుటకుఁ గోడ లాక్షేపింపఁగల దని ద్రౌపది కేవురం గట్టిపెట్టినది. ద్రౌపది కైదుగురు భర్త లగుటకుఁ గుంతియే ముఖ్యకారకురాలు. కుంతియొక్క యీయాక్రమచర్య తనకు ధర్మజునకుఁ గూడఁ గిట్టక శాప మిచ్చె నని శాంతి పర్వమునం గలదు. యుద్ధానంతర మామెను ధర్మజుఁడు గౌరవింపలేదు అందు వలననే ధృతరాష్ట్రాదులతో వనమున కేగి మృతినొందినది. గాంధారి కుంతికి విరుద్ధ మగురీతి కలది. మహాపతివ్రత; సత్యమునందు ధర్మమునందు మిగుల నాద రము కలది. పవిత్ర మగుగాంధారులవంశమునం బుట్టినది. భర్తకు నేత్రములు లేనందునఁ నర్ధాంగికాన దానుగూడ నేత్రేంద్రియసుఖము ననుభవింప నిచ్ఛలేక గంతలు కట్టుకొనినది కాని యీపతివ్రత, కుంతి బిడ్డలఁ గనుచున్నది, తనకు వేగ ముగఁ గలుగలే దని యుదరతాడనముఁ జేసికొని మాంసఖండముఁ గనినటులు భారతమున వర్ణింపఁబడెను. కాని యది వ్యాసునికల్పిత మని తలంతును. కారణ మేమనఁగా, తనకుమారుఁ డగుసుయోధనుఁడు యుద్ధమునకుఁ బోవుచు జయము నొంద నాశీర్వదింపు మనఁగా "యతో ధర్మ స్తతో జయః" (ఎక్కడధర్మమో యక్కడ జయము) అని ధర్మమునే నమ్మిన సతీమతల్లిక; తోడికోడలింజూచి కడుపు బాదుకొనునా? కాన నిది కవికల్పిత మని తలంతును. గాంధారి పాతివ్రత్యవిశేషములు లోకవిదితములు గాన దానిని గుఱించి వ్రాయనవస రము లేదు.

ద్రౌపది—భారతమునందలి వర్ణనలం బట్టి చూడఁగా నేఁటిపాశ్చాత్య దేశపువనితకును ద్రౌపదికి నించుకంత యైన భేద ముండ దని నాతలంపు.

దేహబలమునందు భీమున కీడైనది. సైంధవుని కీచకుని బోరగిలఁ ద్రోసి కీచుమని పించినది. ద్యూతసమయమున సభలోనికి వచ్చుటకుఁ బెంకితనము చేయుట చేతనే దుశ్శాసనుఁడు "ప్రాతిగామి" ద్రౌపదినిఁ దీసికొని రాలేఁ డని తాను జుట్టు పట్టుకొని లాగుకొని వచ్చెను. నేఁడును "జలంధరు" మహాకన్యావిద్యాలయములోని పాంచాలకన్యకలు మానసంరక్షణ కనువగుసాముగరిడీలను నేర్చుచుండుట పాంచాల్యనుకరణముగాఁ దలంపవచ్చును. ద్రౌపది మహావిద్యావతి ధర్మశాస్త్రప్రశ్నలచే ద్యూతసభలో భీష్మాదులను నిరుత్తరులఁ జేసినది ద్రౌపదీసత్యాసంవాదములో ద్రౌపది శ్రీరంగనీతులు చెప్పుటలోఁ బాండవుల కనుసన్నను మెలఁగెద నని చెప్పినది కాని పాండవులే ద్రౌపదియొక్క కనుసన్నను మెలఁగి రనవచ్చును.

ద్రౌపదియొక్క మానవతీత్వము ద్యూతసమయమునను, కీచకసంహార సమయమునను కృష్ణరాయభారప్రయాణసమయమునను బాగుగఁ జిత్రింపఁ బడెను. శ్రీకృష్ణుఁడు సంధికిఁ బోవునపు డెట్లు పలికెనో చూడుఁడు.

ఉద్యోగపర్వము 81 అధ్యాయము.

శ్లో. పునరుక్తంచ వక్ష్యామి విశ్రమేణ జనార్దన। కానుసీమంతినీ మాదృక్
పృథివ్యా మస్తి కేశవ॥ సుతా ద్రుపదరాజస్య వేదీమధ్యా త్సముత్థితా।
ధృష్టద్యుమ్నస్య భగినీ తవ కృష్ణ ప్రియాసఖీ॥..సాహం కేశగ్రహం ప్రాప్తా
పరిక్లిష్టా సభాం గతా। పశ్యతాం పాండుపుత్త్రాణాం త్వయిజీవతి కేశవ....
ధిక్పార్థస్య ధనుష్మత్తాం భీమసేనస్య ధిగ్బలం। యత్రదుర్యోధనః కృష్ణ
ముహూర్తమపి జీవతి॥ యది భీమార్జునౌ కృష్ణ కృపణౌ సంధికాముకౌ।
పితా మే యోత్స్యతే వృద్ధః సహపుత్త్రై ర్మహారథైః। పంచచైవమహావీరా
పుత్త్రా మే మధుసూదన। అభిమన్యుం పురస్కృత్య యోత్స్యంతే కురుభిస్సహ।
దుశ్శాసనభుజం శ్యామం సంభిన్నం పాంసుకుంఠితం।
యద్యహం తు నపశ్యామి కా శాంతి ర్హృదయస్య మే॥

తా. (ద్రౌపది కృష్ణునితో ని ట్లనుచున్నది.) ఓకృష్ణా సావకాశముగాఁ దిరిగి చెప్పుచున్నాను. నావంటియాఁడు దీభూలోకమున నెవతె కలదు. ద్రుపద రాజునకుఁ గూఁతురను వేదిమధ్యమందు జన్మించితిని. ధృష్టద్యుమ్నునకుఁ దోఁ బుట్టువను నీకు స్నేహితురాలను....అట్టి నేను నీవు జీవించియుండఁగాఁ బాండవులు చూచుచుండఁగా జుట్టుపట్టుకొనఁబడి సభామధ్యమున కీడ్వఁబడి కష్టము నొందితిని. ఇఁక ముహూర్తకాలము దుర్యోధనుఁడు జీవించియుండినను నర్జునుని

ధనుర్ధరత్వము కాల్పనా? భీముని బాహుబలము కాల్పనా? - - - పార్థులు దీనులై సంధిని గోరెద రేని వృద్ధుఁ డగు నాతండ్రి మహారథికు లగు కుమారులతోఁ గూడి కౌరవులతోఁ బోరాడఁ గలఁడు. మహావీరు లగు నాయైదు గురుకుమారులు నభిమన్యునిఁ బురస్కరించుకొని కౌరవులతోఁ బోరాడఁగలరు. - - - - తెగిపోయి నల్లనై బూడిదలోఁ బొరలుచున్న దుశ్శాసనుని చేయి చూడ నంతకాలము నాహృదయమునకు శాంతి యేది.

ఇట్టి ద్రౌపది పాండవుల కనుసన్నల మెలఁగునా? శ్రీకృష్ణుఁడు సంధి కేగినపుడు కర్ణునితోఁ బాండవులలోఁ గూడు మని చెప్పుచు నీవు పాండవులలోఁ గూడినచో ద్రౌపది యాఱవకాలమున నిన్నుఁ బొందఁగలదు సుమా యనెను. ఇందువలన ద్రౌపదీపాతివ్రత్యము శంకిత మగుచున్నది. సర్వవిధముల నాలోచించి చూడఁగ సీతామహాదేవికి ద్రౌపదికి సామ్యము నాలోచింపరాదు. ద్రౌపది కలికాలమునకుఁ దగినది అమెరికాలోనో యూరపులోనో యామె జన్మింపఁదగినది. సీతను వర్ణించిన నోట నామెను వర్ణించుట కర్హత కలదా?

14. ధృతరాష్ట్రుఁడు తనకుమారుల కపార్థములిచ్చు దుర్యోధనబహ్వాశ్వాదిశబ్దములఁ బెట్టియుండఁడు కాని వ్యాసుఁడే సుజాతులును పూర్వాచార పరాయణులు నగువారిపై ననూయచే నట్టినామములను దనగ్రంథమునఁ జొప్పించియున్నాఁడు. అందువలననే "జయ" మును ధృతరాష్ట్రుఁడు చనిపోయిన పిమ్మటఁ గాని ప్రచురింపలేదు.

15. ధర్మజుఁడు తనపని తీరిపోయినపిమ్మటను యుద్ధరంగమున భీష్మాదులఁ గడతేర్చెను. విదురాదులను నిరాకరించెను. దుర్యోధనాదుల శ్రాద్ధమునకు భీముఁ డంగీకరింపకపోఁగా యెటులో తనద్రవ్య మిచ్చెను. విగతంతువు లగు దుర్యోధనాదులభార్యలకు భరణ మీయనక్కఱ లేకుండఁగ వ్యాసుఁ డావనితలఁ గంగలోనికిఁ ద్రోసి యుపకృతిం జేసెను. ధృతరాష్ట్రునికి వైశ్యాపుత్రుఁ డగు యుయుత్సుఁడు పాండవులలోఁ గలిసిన తన కేదో మేలు కలుగు నని తలఁచి పాండవులయండఁ జేరెను గాని వాని కేమియు లాభింపలేదు. న్యాయమునకు వానికి రాజ్యభాగము రాదా? తమకంటెఁ దక్కువపుట్టుక కలవాఁడు కాఁడు. అయినను బాండవులు వానికి మొండిచేయి చూపిరి.

ధర్మరాజు రాజసూయముఁ జేసియుండును గాని యశ్వమేధయాగముఁ జేయుట సందేహాస్పదము. ఐతరేయబ్రాహ్మణమునం దెనిమిదవపంచిక నాలవ యధ్యాయమునందు, అశ్వమేధయాగముఁ జేసినమహారాజులపేరులు, అధ్వ

ష్యుని పేరుతోఁగూడ నుదాహరింపఁబడియున్నవి. అందు ధర్మజుని పేరు గాని యశ్వమేధమున కధ్వర్యముఁ జేసిన వ్యాసుని పేరు గాని యుదాహరింపఁబడలేదు. పరిక్షిత్తుకుమారుఁడు జనమేజయుఁడు "కావషేయుఁ" డధ్వర్యముఁ జేయ నశ్వమేధముఁ జేసినటులును ధర్మజునికిఁ బూర్వికుఁడగు దౌష్యంతి యగు "భరతుఁ" డనేకము లగునశ్వమేధములను "మామతేయుఁ" డధ్వర్యముఁ జేయఁ జేసినటులును గలదు. ధర్మజుఁ డశ్వమేధమునైనఁ జేయలే దని కాని నిషాదవ్యాసుఁ డధ్వర్యముఁ జేయ సంకరసంజాతుఁ డశ్వమేధముఁ జేయుట నాఁటిఋషుల కిష్టమైన లేకుండిన దనికాని దీనివలన నూహింపఁదగి యున్నది. మొత్తమునకు దుర్యోధనవధసమయమునందు బలరాముఁ డనినటు లర్థకామములకొఱకు ధర్మము పాండవులచే నిర్బంధింపఁబడెను. పాండవు లధర్మముగ యుద్ధముఁ జేసినవారును దుర్యోధనుఁడే ధర్మముగ యుద్ధమునుఁ జేసినవాఁడు నని సంస్కృతభారతమునంతను బరిశీలనగాఁ జదివినఁ దోఁచును గాని లోకమునందు పాండవులు న్యాయయోద్ధలు కౌరవు లన్యాయయోద్ధలు నని ప్రఖ్యాతిఁ గనుట యాశ్చర్యకరము. మహాభారతములోని భగవద్గీత తప్పఁ దక్కినగ్రంథము శ్రీమద్రామాయణమువలెఁ బవిత్రగ్రంథము కాదు. అన్యాయపు చరిత్ర నసత్యకల్పనలతో వ్యాసుఁడు రచించుటచేతనే చింతించినటులు దోఁచును. కాని మహాభారతమునం దచటనచట ననేకపవిత్రేతిహాసములును నేఁటికాలమున కక్కఱకువచ్చు నీతిబోధలును గలిగియుండుటచే జగద్విఖ్యాతి నొందుచున్నది. వ్యాసుఁడు పాండవులు ద్రౌపదియు వాల్మీకి శ్రీరాముఁడు సీతవలెఁ బవిత్రచరిత్రలు కలవారు కా రని శ్రీ సీతారాములయం దుండినభక్తిగౌరవములచే నుడువ సాహసించుచున్నాఁడను. నానుడువులయందలి దోషములను క్షమింప వేఁడుచున్నాను.

పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి.

[ఈవ్యాసము నీపత్త్రికలోఁ బ్రకటించుటచే నిందలి సిద్ధాంతము లన్నియు మాకు సమ్మతములే యని పాఠకు లెంచకుందురు గాక. ప. అ.]

పై హేతువులంబట్టి విచారింపఁగాఁ బ్రస్తావమున నున్నవచనము నెవ్వరో రచియించి సోముని యితరాశ్వాసాంతపద్యముల నేర్చి కూర్చి ప్రథమాశ్వాసము ముగియునట్లు చేసిరని తేలుచున్నది.

ప్రథమాశ్వాసాంతమునఁ గన్పట్టు నిట్టిబూటకపువచనము సోమునిదను, కొని శ్రీశర్మగారు 'పెద్దవచనమున నాడంబరముగ వర్ణించినాఁ' డని భ్రాంతి నొందినారు!

ఆవచనమున 'జటిలపదయుక్తము లగుదీర్ఘసమాసములు' లేవు. 'అనుప్రాసాదులు' లేవు. 'ఇంచుమించుగ నేకార్థకము లైనసమానార్థకపదములు' లేవు. ఏమి లేకున్నను సోమునివచన మన్నం జాలును గాఁబోలు!

ఇక్కైలాసయాత్రాఘట్టమును బాధించువిషయములు రెండు ముద్రితమగుసోమునిహరివంశమునఁ గానవచ్చుచున్నవి. ఎట్లన,

1. నరకాసురుని దుశ్చేష్టలను గృష్ణునితో విన్నవించుటకై దేవేంద్రుఁడు, సకలయాదవరాజన్యపరివేష్టితుఁ డై వసుదేవనందనుండు కొలువు దీర్చియుండ నచటికి వచ్చెను. అప్పుడు,

క. "వాసవుఁ డేనుఁగు దిగి సిం, హాసనమున నుండి డిగి జనార్దనుఁ డన్యో
న్యాసక్తిఁ గౌఁగిలింపఁగ, నాసభవారలకు ముదము నచ్చెరు వయ్యెన్".

వ. ఇట్లు పరస్పరపరిరంభణం బాచరించిన యనంతరంబ జంభాంతకుండు.

శా. "రాముం గౌఁగిటఁ జేర్చి యాహుకుని నాప్రద్యుమ్నుఁ దత్పుత్రునిం
బ్రేమం బారఁగఁ గౌఁగిలించి వరుసం బేర్వేఱ భోజాంధక
స్తోమం బెల్ల వయోవిశేషగతి రాఁ దోడ్తోఁ బరీరంభలీ
లామాధుర్యమునన్ సుఖాంబునిధిఁ దేలం జేసె నెయ్యంబునన్".

సో. హ. ప్రథ. 127.

పైపద్యములవలన దేవేంద్రుఁడు, మున్నుగ శ్రీకృష్ణదేవుని పిమ్మట, బలరాముని, ఆహుకుని, ప్రద్యుమ్నుని, అనిరుద్ధునిఁ గౌఁగిలించికొని, తరువాత భోజాంధకసమూహమును వరుసం గౌఁగిలించికొనె నని తేలుచున్నది. దీనిం బట్టి నరకాసురవధమునకుఁ బూర్వమే శ్రీకృష్ణునకుఁ బ్రద్యుమ్నకుమారుఁడే కాక యనిరుద్ధపౌత్రుఁడు కూడ నున్నట్లు స్పష్ట మగుచున్నది! నరకవధానంతరము కృష్ణుఁడు, ద్వారవతిని సుఖించుచు, రుక్మిణి పుత్త్రునిఁ గోరఁ దత్పుత్త్రలాభమునకై కైలాసమునకుఁ దపము సేయఁ బోయి ప్రద్యుమ్నుని శివునివలనఁ బడసె నని ద్వితీయాశ్వాసమున నున్నది గావునఁ బూర్వోత్తరవిరోధము గలుగు

చున్నది. ఇంతస్పష్టముగఁ గనఁబడుచున్న వైరుధ్యమును గవి యేల పాటింపలే దని ప్రతులం బరీక్షింపఁ బాఠభేదము లనేకములు గానవచ్చెను.

"రాముం గౌఁగిటఁ జేర్చి యాహుకుని నాప్రద్యుమ్నుఁ దత్పుత్త్రునిన్".
(శ్రీపీ. పం. ముద్రితప్రతి.)

" " (శ్రీవావిళ్లవారి ముద్రితప్రతి.)

"రాముం గౌఁగిటఁ జేర్చి సాత్యకిని నాప్రద్యుమ్ను నక్రూరునిన్".
(శ్రీజయంతి రామయ్యపంతులవారు, ఆ. సా. ప. కార్యస్థానమునుండి శ్రీపీఠికాపురసంస్థానమున కంపించిన వ్రాఁతప్రతి.)

పైని నేను వ్రాసిన (కూచి. తిమ్మ.) ప్రాఁతవ్రాఁతప్రతిం జూడ నం దిట్లున్నది.

"రాముం గౌఁగిటఁ జేర్చి సత్యకసుతున్ రాజేంద్రు నయ్యాహుకున్".

ఇన్ని ప్రతులం దిన్ని పాఠభేదములతో నీపాద మున్నది గదా యని మూల మ్ముం బరీక్షింప నం దిట్లున్నది!

శ్లో. "సోవతీర్య గజాత్తూర్ణం పరిష్వజ్య జనార్దనమ్
సస్వజే బలదేవం చ తంచ రాజాన మాహుకమ్
వృష్ణీ నన్యాన్ సస్వజేచ, యథాకాలం యథావయః
పూజితో రామకృష్ణాభ్యాం ఆవివేశ సతాం సభామ్". హరి. విష్ణు. అ, 63

(ఆహా! సర్వజ్ఞుని కథాసంవిధానమహిమ! మఱియు నాతఁ డీశ్లోకముల నెట్లు తెలిఁగించెనో పైపద్యములను బరిశీలింపుఁడు!)

పైపద్యభాగము నష్టమగుటచేఁ గాఁబోలు లేఖకులు మూలమునను, సోముని గ్రంథమునందును లేని ప్రద్యుమ్నుని యతిస్థానమునఁ బ్రవేశ పెట్టినారు!

2. నరకాసురునిచేఁ బరిభవింపఁబడిన బదరికాశ్రమవాసులు వానిదుండ గములను జెప్పికొన శ్రీకృష్ణసందర్శనంబునకు వచ్చినసందర్భము, ఈక్రిందిపద్య మున నిట్లున్నది.

మ. "చని వా రంతటఁ దేవతారచిత పంచస్థాధరాంతస్థలం
బున నొప్పారెడు వీడు చొచ్చి మన ముప్పొంగన్ సుధాశాఖ నా
వినుతిం బొందుసభన్ నిషణ్ణులగుచున్ వేవేగఁ బ్రద్యుమ్నుఁ డా
సనపాద్యాదిసపర్యలం దనుపఁ గా సంప్రీతచేతస్కు లై". ప్ర. 108 ప. (వీరే)

ఇక్కడను బ్రద్యుమ్నుఁడే ప్రత్యక్ష మైనాఁడు!

తక్కినపూర్వపుస్తకములవలెనే సోముని గ్రంథము నానావిధములఁ జెదరి పోవుటయే కాక దొరంకినదే యనేకసంస్కరణముల పాలయినది; కొన్నియక్షరములు పదములు పద్యపాదములు, పద్యములు నష్టములై పోయినవి. వ్రాయసకాండ్రు తమయిచ్చ వచ్చినరీతిని జేసిరి.

పై పద్యము వావిళ్లవారిప్రతియం దిట్లున్నది.

"చని వా రందఱు ...... ...... ......
...... ...... ...... మన ముప్పొంగంగ దాశార్హనా
వినుతిం బొందుసభన్ విపణ్ణులగుచున్ వేవేగఁ బ్రద్యుమ్నుఁ డా
నన పాద్యాదినపర్యలన్ .................."

శ్రీరామయ్యపంతులుగారు పంపించిన పై ప్రతియం దిట్లున్నది.

"చని వా రందఱు ...... ...... ......
మన ముప్పొంగంగ దాశార్హనా
వినుతిం బొందుసభన్ వి(ని)షణ్ణు లగుచున్ వేవేగ ప్రద్యుమ్నుఁడా
...... ...... ...... ...... ...... ......

వేగశబ్దము కళ గావున నిప్పటివారే రెవ్వరో 'వేవేగ ప్రద్యుమ్నుఁ' డని సవరించి రని తలంచెద. పై పద్యము పైని నేను వ్రాసిన వ్రాఁతప్రతియం దిట్లున్నది. (దీనిని యథామాతృకముగా వ్రాసెదను.)

చ. చని వా రంద్దరు దెవతారచితపంచ్చమ్మాధరాంత్తస్తలం
బ్బున నొప్పారుపురంబ్బు జొచ్చి—దాశార్హినా
వినుతిం బొంద్దు సభన్నివిష్టు లగుచుం విచ్చెయశైనెయుండా

(పై పాఠములయం దొక్కటియుఁ దృప్తికరముగా లేదు;)—ఇట్లు గీచినచోట నక్షరములు విడిచిపెట్టఁబడి యున్నవి. నాలవపాదము లేనేలేదు. ఈపద్యము సోముఁ డెట్లువ్రాసెనో యెవ్వరు చెప్పఁగలరు? కాని పైవ్రాఁత ప్రతిలోని శైనేయశబ్దము మాత్రము సోమునిదే యని యూహము గలుగుచున్నది. ఏమనఁగా విచ్చేయ శైనేయ ఇట్టి చిన్నిచిన్ని శబ్దాలంకారము లాతని కిష్టములు. ఈపద్యమునకు మూల మెట్లున్నదో చూడవలయు నని యత్నింపఁగా వంగదేశ (బెంగాలీ) దేవనాగరలిపులయందును దెలుఁగులిపియందును ముద్రింపఁబడియున్న సంస్కృతహరివంశపుఁ బ్రతులలో నీఘట్టమే లేదు. ఆంధ్రపరిశోధకమహామండలివారి ప్రతిలో నీభాగము లేదు. బొబ్బిలి నగరమున

నున్నప్రతియందును చెన్నపురిప్రాచ్యలిఖితపుస్తకభాండాగారపుఁ బ్రతులయందును నీభాగ మెట్లున్నదో యొకసారి పోయి చూచి దీనిం గూర్చి మఱియొకప్పుడు వ్రాసెదను. ఎట్లయినను సోమనాథు డీయల్పవిషయమునఁ బూర్వోత్తరవిరోధమునకుఁ దనగ్రంథమునఁ జోటిచ్చి యుండఁ డనియే నిశ్చయింపవచ్చును. శర్మగారే "ఇందు సోమునకు బలమైనసందేహము గలిగిన"దని పైని వారు వ్రాసిన యాక్షేపమునందు సూచించియే యుండిరి. మఱియు నతఁడు 'విషయము మార్చినను దొందర యుండ దని తలఁచె' ననియు వ్రాసియున్నారు. ఇట్టివాఁడు తనవ్రాఁతకుఁ బూర్వోత్తరవిరోధము లేకుండునట్లు (శైనేయుఁ డని) వ్రాసియుండు ననుట కేమి సందియము?

ఆక్షే. "ఇంతియ కాదు. శ్రీకృష్ణుఁడు శివుఁడును గలిసికొన్నవేళ హరిహరాద్వైతసిద్ధాంతమును స్థాపింపఁగోరి శక్తినంతయు వినియోగించి యచటి మునుల స్తోత్రవ్యాజమున నితఁడు వ్రాసిన యీసీసముం జూడుఁడు.

సీ సారసంబున లేవ నీరసంబునఁ జావఁ బద్మాసనుఁడు వీరిపాలఁ గనియె
సూపుగంటఁ జెలంగఁ జూపుమంట నలంగఁ బంచబాణుఁడు వీరిపాలఁ గనియె
వరములు వడయంగ శిరములు గెడయంగఁ బంక్తికంఠుఁడు వీరిపాలఁ గనియె
గేహరక్ష నటింప దేహశిక్ష ఘటింపఁ బాణాసురుఁడు వీరిపాలఁ గనియెఁ

---

గనియెచిత్రంబులకువీరుగలసియుండి, మనుపఁజెఱుపంగఁ జెఱుపంగమనుపనేర్తు
రెల్లలోకంబులకు దైవ మేక మగుట, హరిహరాత్మక మెఱిఁగితి మనిరి మునులు.

శివుఁ డింకను వరమీయనే లేదు. ఇచ్చినపిదపఁ బ్రద్యుమ్నుఁడు జనియించి ........రతిని బెండ్లాడి, యాయమయం దనిరుద్ధుఁ గాంచి యాయని రుద్ధుఁడు ప్రాయమును బొంది, యనేకస్త్రీలం బెండ్లాడి—యింతయు నైనతరువాత నడుచుబాణాసురకథ నింత మొదలుగ ప్రాసములతో వర్ణించు మహర్షుల యోగదృష్టికిని, వారితో వర్ణింపఁ జేసిన సోమునిసర్వజ్ఞత్వమునకును మన మెంత విస్మయపడి కొనియాడినను దీరదుగదా! (అని యాక్షేపము)

ప్రత్యు. ఆర్యధర్మముల నెఱింగిన శ్రీశర్మగా రిట్టియాక్షేపమును జేయుట విచారకరము. ఏమన,

శ్రుతి. సూర్యాచన్ద్రమసౌ ధాతా యథా పూర్వ మకల్పయత్,
దివఞ్చ పృథివీఞ్చాన్త రిక్షమథోస్వః (సువః") ఋగ్యజుర్వేదములు.

ప్రతికల్పమునందును సూర్యచంద్రాదులను, ఆకాశమును, భూమ్యంతరిక్షాదులను బ్రహ్మ యథాపూర్వముగ సృజించె (సృజించు) నని దీనిభావము.

వేదముల ననుసరించి పురాణములును నైవిషయమునే వివరించుచున్నవి. ఏపురాణమును బరికించినను సృష్టిక్రమమునకు మొదట నీవిషయమునే వ్రాయఁబడి యుండును. అన్నిపురాణములనుండియు గ్రంథవిస్తరభీతి నుదాహరణము లియ్యక హరివంశపురాణమునుండి— అందును, ఎఱ్ఱనహరివంశమునుండి యొక యుదాహరణము నిచ్చెదను.

మ. ''విను సర్గంబు లయంబు భూతములు కుర్వీనాథ! నిత్యంబు లెం
దును జన్మింతురు దక్షుఁ డాదియగు నాద్యుల్ సర్వకల్పంబులన్.

పూర్వభాగము. ప్ర

ఒకసృష్టియం దేయేకార్యము లెట్లెట్లు జరిగినవో యెల్లసృష్టులయందును నట్లే జరుగుచుండునని వేదపురాణములమతము దాని ననుసరించియే భగవల్లీలలు సుప్రసిద్ధము లగుటచే ముందువెనుకలతోఁ బనిలేకుండ దేవుని మహిమలను, అవతారలీలలను కవులు వర్ణించుచుందురు. ఈవిషయమున వ్యాసుఁడే నిలువఁబడెను! తక్కినవారిలెక్క యేమి? ఇందుకు గ్రంథములయం దిట్టివి వేలకొలఁది గలవు. అతివిస్తరమేల? సోమునికన్న నధికు లని యొకరిద్దఱిచేఁ దలంపఁబడుచున్న శ్రీనాథప్రబంధపరమేశ్వరుల గ్రంథములనుండియే యొకొక్క యుదాహరణమిచ్చెదను!

1. నిషధేశ్వరుం డగునలుఁడు శ్రీకృష్ణుని స్తుతించినట్లు నైషధమునఁ గలదు. నలుఁడు రెండవచక్రవర్తి. ఆఱవచక్రవర్తి యగుకార్తవీర్యునిఁ జంపిన పరశురాముని తరువాత నవతరించిన శ్రీరామునిపిమ్మటఁ బుట్టినవాఁడు శ్రీకృష్ణుఁడు. ఇక్ష్వాకునిర్ణయము పౌరాణికగాథలతోఁ జేరదన్నను శ్రీకృష్ణుఁడు నలునితరువాతివాఁ డని యొప్పక తప్పదు. ఏమన, శ్రీకృష్ణుఁడు ధర్మరాజునాఁటివాఁ డనుట సుప్రసిద్ధవిషయము. ధర్మరాజునకు బృహదశ్వమహాముని ''నరనుతుఁడు తొల్లి నలుఁ డనుధరణీశుఁడు.......'' అని నలోపాఖ్యానముఁ జెప్పెను. కావున శ్రీకృష్ణునికంటె నలుఁడు పూర్వుఁడు నైషధమున నాద్వితీయచక్రవర్తి శ్రీకృష్ణునిమహిమల నెన్నిటినో పొగడినాఁడు. ఆమహిమ లన్నిటితో మనకుఁ బనిలేదు. బాణాసురునికథను సయితము నలుఁ డెట్లుగ్గడించినాఁడో కనుఁడు!

తే. గీ. ''శైశవమునాఁడు కర్పూరశకలపాళిఁ, దెచ్చి కాళిందితరఁగలఁ ద్రెవ్వవైతు
భావిబాణభుజాదండభంజనమున, కభ్యసన మయ్యె నీ కవి యజ్ఞనాభ!''

8 ఆ. 132.

నలునినాఁటికి శ్రీకృష్ణుఁ డింకను జన్మింపనే లేదు! నలుని యోగదృష్టికిని, నాతనితో వర్ణింపఁ జేసిన శ్రీనాథుని ప్రౌఢమనోహరకావ్యరచనాకౌశలమునకును

నెంతపొగడికిం దీటగును? శ్రీనాథుం డనౌచిత్యంబు పరిహరింప మూలము నేల మార్చెనో!

౨ ప్రహ్లాదుండు కీలావతీదేవిగర్భమునుండి జనించినపిమ్మట, నాతని నెఱ్ఱన యిట్లు వర్ణించినాఁడు!

సీ. పసిపాపఁడై తాను బవళించుకాలంబు వటపత్త్రశయను భావంబుఁ దెలుపఁ
జెలువొందఁగా బోరగిల శయ్యఁ దడవెడుతఱిఁ గూర్మమూర్తిఁ జిహ్నము వనిలుపు
రెండుమూఁడడుగులొండొండఁ దట్టాడునప్పుడు త్రివిక్రమలీలఁ బుట్టిచూచు
తోలుత వెన్నలుఁ బాలుఁ ద్రావెడునాఁడు గోపాలసంస్కృతిఁ గూర్చునాత్మ

ఎఱ్ఱన లక్ష్మీనృసిం. 3 ఆ. 147 ప.

నృసింహావతారమునాఁటివాఁడు ప్రహ్లాదుఁడు! త్రివిక్రమావతారము పిమ్మటిది! శ్రీకృష్ణుఁడో తరువాతియుగమువాఁడు! ఆతని వెన్నలుఁ బాలుఁ గ్రోలుటను బ్రహ్లాదుఁ డెఱుంగుట చిత్రముకాదా? సర్వజ్ఞశిరోమణు లగుకవిత్రయము వారిలో నొక్కఁ డగు నెఱ్ఱాప్రెగ్గడయు నిట్లు వ్రాసెనే! ముక్కుపచ్చ లాఱని శంభుదాసుని ప్రహ్లాదునకే యింతజ్ఞాన ముండినప్పుడు, వయస్సు చెల్లి యాఱితేఱిన సర్వజ్ఞుని మహామునీంద్రులకు నెంతయోగదృష్టి యుండునో!

భగవల్లీలలను వర్ణించుటకు ముం దేమి? వెనుక యేమి? అట్లు వర్ణించుట కవిసమయము. కావున సోమనాథునిగ్రంథమునఁ బూర్వోత్తరవిరోధ మున్న దనుట న్యాయ్యము కాదు. (ఇట్టివి మనదేశమునందలి సంస్కృతాంధ్రగ్రంథము లన్నిటియందును గలవు.)

శ్రీశర్మగారు సోముని కైలాసయాత్రాఘట్టమునఁ బూర్వోత్తరవిరోధము గల దని నమ్మకొనియే కాఁబోలు నీక్రిందివిధముగ వ్రాసినారు!:—

"ఇట్లు తనప్రమాదము (పూర్వోత్తరవిరోధము) నే యెఱుఁగలేనికవిని మహానుభావు లగుకవిత్రయమువారికన్న నెక్కువ యని వాదించువారి యభిప్రాయ మేమియై యుండునో" అని.

పై చర్చవలన సోమునియెడ నట్టిదోషము లేదని తేలినది. ఎఱ్ఱాప్రెగ్గడ గ్రంథమున నున్నవానిలో నీఘట్టమునందే యున్నపూర్వోత్తరవిరోధము నొక దానిని జూపి, పిమ్మట నన్నయభట్టారకుని యట్టిదోషము నే యొకదానిని విన్నవించెదను.

పదిమంది కొడుకులను, ఒకకూఁతును గన్నరుక్మిణి వేలకొలఁది బిడ్డలను గన్నశ్రీకృష్ణు నిట్లు వర మడుగుచున్నది.—

*క. "తనయులఁ బ్రద్యుమ్నసమానులఁ, గనియుండని యుదాత్తకీర్తు లగుటను నానా ధనరాసులఁ బొందనిసిన, జనములు భువిఁ గలరె యిది నిజంబు మహాత్మా!

వ. "ఇట్లగుటం జేసి సాహసియు, బలియుండును విద్యాన్వితుండును శ్రీమంతుండును నై తేజంబున నిన్నుం బోలుపుత్త్రు నింక నొక్కనిఁ గోరెద ననిన నల్లన నవ్విభుండు".

(ఇదివఱకుఁ బుట్టినవారిలోఁ బ్రద్యుమ్నుఁ 'డబ్జాత్మసోలిక' యని కవి వెనుకఁ జెప్పియున్నాఁడు. ముందు వర మిచ్చుఘట్టమున శివుఁడు, "ప్రద్యుమ్నుండు సర్వగుణంబుల నిన్నుం బోలు కుమారుండు" అని వ్రాసిన యెఱ్ఱన కీవచనము జ్ఞప్తియందు లే దేమో') పిమ్మట.

క. "విను మఖిలలోకసుఖములు, ననంతములు పుత్త్రసంతతు లగుపుణ్యులకున్; దనయవిహీనులు దుఃఖులు, తనూజలాభంబు పరమధన మని రాజన్యుల్."

గీ. "పతియు చూవె భామినియందుఁ బట్టి యునఁగఁ
బుట్టుఁ బదియగునెలఁ బుత్త్రభూతిఁ దనియు
వాని కింద్రుఁడుఁ గాఁడు నెవ్వారలైను
వెఱవఁ డాత్మజోపేతుఁడు మెఱుఁగుఁబోఁడి".

(ఇవి, సంతానము లేనివా రనుకొనుపలుకులు గాని, అంతమంది బిడ్డలను గన్నవా రనుకొనునవా?)

క. "నీ వడిగినట్టిపుత్త్రుని, నీవచ్చు లతాంగి! తొల్లి హిమగిరిఁ దపమే గావించి కంటి నుత్తను, భావునిఁ బ్రద్యుమ్నుఁ దోలుతిపట్టి నుదాహేన్."

ఈపద్యముం బట్టి శ్రీకృష్ణుఁడు తొల్లి ప్రద్యుమ్నునికొఱకు ఘోరతపం బొనర్చినాఁ డనుట తెల్లము. ఏమన, పుట్టనిపుత్త్రునికొఱకే (ఈఘట్టమున) పంద్రెండేఁడులు ఘోరతపము చేసినవాఁడు, ఫాలాక్షునిచే దహింపఁబడిన యనంగుని సంపాదించుటకై యెన్నియేఁడు లయినఁ దపముచేసి యుండును. ఈఘట్టముననే శివుఁడు ప్రత్యక్షుఁడై, పూర్వ మధికతప మొనర్చి ప్రద్యుమ్నునిం గంటి వని శ్రీకృష్ణునిఁ బొగడినాఁడు. కావునఁ బ్రద్యుమ్నునికొఱకుఁ గృష్ణుఁడు చిరకాల తపంబు నొనర్చి యుండు ననుట నిర్వివాదవిషయము. ఐనను, మన యెఱ్ఱాప్రెగ్గడ తనహరివంశము నుత్తరభాగమునందలి తృతీయాశ్వాసమున,

వ. "రుక్మిణీవివాహానంతరంబున........ననతిచిరం బగుకాలంబున"

* ఆదిపర్వము 5 అశ్వా. 119 ప. "ధనమునవిద్యను సంతతి........" అనుదానినిజూడుఁడు.

క. "పురుషోత్తమున గ్రసుహిమ...... ప్రద్యుమ్నునిఁ గనియె,

నని వ్రాసియున్నాఁడు. అనతిదినకాలమునఁ బుట్టిన ప్రద్యుమ్నుని కొడుకునకుఁ బౌత్రకాలతిపముచు శ్రీకృష్ణుఁ డెట్లానర్చెను? ఎట్టి తాత్పర్యము ననుక నేనిట్లు వ్రాసితి నని చూచుకొనలేదు గాఁబోలు! పూర్వోత్తరవిరోధము సోమునినుండి తప్పి పోయి ప్రబంధపరమేశ్వరునిపైఁ బడినది!

ఇది, మూలమున నున్నదాని నున్నట్లుగను వ్రాయక, సోమునివలె స్వాతంత్ర్యమునైన వహింపక, "మూలమున లేనిమాటలను వ్యాఖ్యానమునకై తెచ్చి, తేలుకొనుట" వలనఁ గలిగిన యనర్థ మని స్పష్ట మగుచున్నది. (ఇప్ప ట్టున వ్యాసునిమూలమే కొంత మేలు!)

ఇఁక నన్నయభట్టారకుని గ్రంథములోని పూర్వోత్తరసందర్భమును గూర్చి యొక్క యుదాహరణము నిచ్చుచున్నాను.

అర్జునుఁడు మత్స్యయంత్రమును దెగఁ గొట్టఁగానే, సప్త. 187.

క. "చెలఁగె సురదుందుభిస్వన, ములు మొదమున భూసురోత్తములు పయిపుట్టం
బులువీచివీచి యార్చిరి, వెలయఁగ నరుమీఁదఁ బుష్పవృష్టియుఁ గురిసెన్."

అని మూలము ననుసరించి వ్రాసి, పిదప నన్నయ యిట్లు వ్రాసెను.

వ. "అయ్యవసరంబున ధర్మనందనుండు నకులసహదేవానుగమ్యమానుండై నిజని వాసంబునకుం జనియె నిట ధృష్టద్యుమ్నసహితుం డయి యజ్ఞసేనుండు మహాసేనతో నర్జునునకు సహాయుం డయి నిలిచె నంత."

పిమ్మట యుద్ధము జరిగెను. మూలమున ధర్మరాజాదులు దుర్యోధనాదుల నోడించిన ట్లున్నది గాని నన్నయభారతమున భీమార్జునులు మాత్రమే పర రాజులతోఁ బోరినట్లు గలదు. మఱియు భీమార్జునులకంటె మున్నె వారు తల్లి యొద్దకుఁ బోయినట్లు నన్నయ యీక్రిందివచనమున వ్రాసెను.

"అట్టియవసరంబునఁ దల్లియొద్దకు ధర్మరాజును గవలవారును మున్న వచ్చియున్నఁ దదనంతరంబ భీమార్జునులు ద్రౌపదీసహితు లయి చనుదెంచి ." సప. 210.

దీనింబట్టి ధర్మరాజాదులు పైయుద్ధరంగంబున లేనియట్లు తేలినది. పిమట సప్తమాశ్వాసమున, దుర్యోధనునితో నాతనిచారులు "కర్ణు నోడించినవాఁ డర్జునుఁడు; శల్యుఁ ద్రెళ్లవైచినవాఁడు భీముఁడు......" అని చెప్పిన ట్లాకసీస మున వ్రాసి, నన్నయభట్టారకుఁడు తర్వాత నిట్లు వ్రాసెను.

చ. “అని మొన నట్లు దాఁకినమహారథులన్ ధృతరాష్ట్రరాజనం
దనుల బలాఢ్యులన్ దళితదర్పులఁ జేసినవారు ధర్మనం
దనయాము లుగ్రవీర్యు లని తద్విధ మంతయు నేర్పడంగఁ జె
ప్పిన విని కౌరవప్రభుఁడు పెల్కుఱి తద్దయు దుఃఖితాత్ముఁడై.” అష్ట. 11 ప.

ఈపద్యమున మూలానుసరణమే కలదు. అప్పుడు ధర్మరాజాదు లింటికిం బోయి రనియు, నిప్పుడు యుద్ధ మొనర్చి రనియుఁ జెప్పుట కుపపత్తి గానరాకున్నది. మూలమునకు భిన్నముగ వ్రాయుటచే నిట్టివైరుద్ధ్యము పొసఁగె నని తోఁచుచున్నది. ఎట్లయిన నేమి? నన్నయ భారతమున ననివార్యమైన యీ పూర్వోత్తరసందర్భరాహిత్యము గానవచ్చుచున్నది. (ఇట్టి వింకను గొన్ని గలవు)

ఇవి మొదలగువానిం దలంచియే కాఁబోలు “సోమునికవిత్వము కవిత్రయములోననేకులకవిత్వముకంటె నెక్కువ” యని కొందఱు తమయభిప్రాయము నిచ్చియున్నారు!

సోమునియుషాపరిణయఘట్టమును గూర్చిన కొన్ని యాక్షేపములు.

X ఆక్షే. (a) “ఇందుధరుం డొకనాఁడు దైతేయేంద్రకన్యాసఖీనికురుంబంబులతోఁ గూడి, పార్వతియుఁ దాను నుద్యానవనమున యథేచ్ఛ విహారములఁ జలుపుచుండెను. ఆసముదాయములోఁ జేరిన యుషాదేవి యాదంపతుల విలాసవైభవము లన్నియుఁ గన్నారఁ జూచి, తనమనసులో నిట్లు తియ్యని యాలోచనఁ జేయుచున్నది.

సీ. “సల్లాపనవసుధాసారంబు చెవిఁ గ్రోల్వఁ జెలికత్తెఁ బుచ్చి మెచ్చించువారు
నానందమకరంద మందంద పైఁజింద గడకంటిచూపులఁ గప్పువారు
ఘర్మాంబుబిందుముక్తావిభూషణము లుప్పతిలంగఁ జేచేతఁ బట్టువారు
మఱపుమున్నీటిలో మానసంబులు దేల బిగియారఁ గౌఁగిటఁ బెరయువారుఁ
బొలయలుకఁ బాసి తేల్చినఁ బొందువారుఁ, జతురతరవిహారంబున నలుపువారుఁ
బ్రథమజన్మంబునం దెంతభాగ్యవతులొ, మగలు మన్నింపఁ బెంపారుమానవతులు

“ఇంతటితో నూరకున్నదా? చెలికత్తెలతోఁ దనతలంపు వెడలనాడిన దఁట? ఎట్లో పార్వతీదేవి యీమాటలు విన్నది. ఎట్లు విన్నదో యెఱుఁగము!” అని యాక్షేపించిరి.

ప్రత్యు. ఉషాకన్య పార్వతీదేవిచెంతనే యున్నది. పైపద్యము వెనుక నున్న వచనముం గనుఁడు.

“మఱియునుం గొండఱు దెఱవలు పలుదెఱంగులం గఱకంఠుకైవడి విడంబించు నెడ మృడాని ముఖవికాసంబు విలాసంబునకు వికాసం బొసంగ నెసంగిన యాసపాటుచే నాసన్నసమాసీనయై బాణాసురకన్య యగునుషా కాంత యిట్లని వితర్కించు.”

ఆక్షే. (b) “(పార్వతి) తనకు మనుమరా లగునీకన్నియను చెలీ! యని సంబోధించి ‘నీతలంచినయట్లే మనోభవుని పట్టము గట్టికొనంగఁ జాలుజాణని మగనిం గవుంగిట ననారతముం గొనియాడెదవు. ఇంత వంత యేల?” అని యాయమ్మ యనుగ్రహించినది.’ ఉద్రేకము తలకెక్కిన యుషకు నీమాత్రమున మనసు తృప్తి యగునా? కావున నాకన్నియ మొదటిచెలెఁ జెలికత్తెల మాధ్యస్థము నైనను గోరక చక్కఁగ నాయవ్వనే ‘నాకోరినమగనిపొం దెన్నఁడు సమకూఱునో చెప్పుమమ్మా’’ అని యడిగిన దఁట! ఆతల్లియు నీకన్నియ సిగ్గుమాలిన ‘వలరాచవేగిరము’ నకు రోఁతపడక “చెలంగి నవ్వుచు” “వైశాఖశుక్లద్వాదశినాఁటి సాయంసమయమునఁ నిన్ను సురతకేళిఁ గలయువాఁడు నీమగఁడగు” నని వర మొసంగిన దఁట! మోమోటము లజ్జయు లేక యావఱకు నిలిచి నిర్భయముగ మాటాడిన చిన్నికన్నియ పాప మీమాట విన్నవెంటనే యెదుర నిలువలేక ‘తొలఁగం జని సంతసిల్లె నఁట! ఇది సోమనాథుని వ్రాఁత.”

ప్రత్యు. పైయాక్షేపమున వీరు మూలమున లేనిమాటలను గొన్నిటిని జదువరులకు భ్రాంతి గలుగుటకై వ్రాసినారు. సోముని పద్యముల నిచ్చట నిచ్చుచున్నాను. వానిం గని యం దేమి యనౌచిత్యము గలదో యోజింపుఁడు. (పైయాక్షేపములోని సీసముం గంటిరి గదా! దానితరువాతిపద్యములు.)

వ. అని విచారించి చెలికత్తెలతోఁ దనతలంపు వెడలనాడుటయు. (పంచమా 74)

చ. విని చలిగొండచూలు గడువేడుకచూపుల గారవించి య
ద్దనుజతనూజతోఁ నభిమతం బొడఁగూడెడు నింతవంతకుం
బనిగలదే మనోభవుని పట్టము గట్టికొనంగఁజాలు జా
ణని మగనిం గవుంగిట ననారతముం గొనియాడె దోచెలీ!

ఉ. “నావుడు నాసరోజముఖి నమ్మికతోడ భవాని కి ట్లనుఁ
దేవి! మదీయవాంఛితము తెల్లముగా నొడఁగూడు నంటి; నా
కావిధ మెన్నఁ డబ్బునొ దయామతి నానతి యి మ్మనంగ నా
రా! వలరాచవేగిరము రామకు నంచుఁ జెలంగి నవ్వుచుఁ.

వ. “అద్దేవి యి ట్లనియె,

గీ. కడఁగి వైశాఖశుక్లపక్షంబునందు ద్వాదశిదినాంతవేళ సౌఘంబులోన
మదనకేళికిఁ గలలోనఁ గదియు నిన్నుఁ, నెవ్వఁడాతండ మగఁడా నీకిందుపదన.

క. అన విని మనమునఁ జెనఁగొను, మనోరథము చేరినట్లు మానిని దొలఁగం
జనిసంతసిల్లె................." ఉ. హ. ౫౦. 79. ప.

పార్వతి 'చెలీ!' అన్న దని శంకించిరి. 'చెలీ' అనునది స్త్రీవాచకము కదు (బాలా! అనుట) 'ఉద్రేకము తలకెక్కిన' దనిరి. ఎట్టిన యూష కెక్కినయుద్రేకమును దీనికిని నెక్కించిరి. పైపద్యములం గనుఁడు! చెలికత్తెల మాత్సర్యస్థ మేని గోరలే దనిరి. 'సముఖమున రాయబార'మనునది యిట్టిదే కాఁబోలు! "నా కోరిన మగనిపొం దెన్నఁడు సమకూరునో చెప్పు మమ్మా!" అని యున్న దని యాక్షేపించినారు. పైపద్యములలో న ట్లున్నదా? 'ఆవిధ మెన్నఁ డబ్బునో' అన్నది గాని య ట్లన లేదు. దేవి 'వలరాచవేగిరము' అనె నని నిందించిరి. మనుమరాలిని, అవ్వ య ట్లనుటయందు దోషము గానరాదు 'ఔరా! తత్కాంత!' అని భావము. పైయాక్షేపములోని కడపటివాక్యముల భావ మిందు లేదు. అవ్వయొద్ద మనుమరాలి కామాత్రపుఁజనవు చెల్లదా?

పిమ్మట శర్మగా రెట్టినవ్రాఁత నిట్లు మెచ్చికొన్నారు.

శర్మగారు—"ఎట్టినమాటలం దిలకింపుఁడు. ఉద్యానవిహారమునంతయుఁ బ్రమథదంపతులఁ గూడి ముగించి పార్వతీపరమేశ్వరు లేకాంతవిహారముఁ గోరి స్థలాంతరమునకుఁ బోయిరి. అచ్చోట, ...... ...... ...... ......

"కడఁకఁ బరమేశ్వరుఁడు తన్నుఁ గౌఁగిలింప,నతని నోర్ధ్వసరసి నోలాడుచున్న ఘనతరస్తనచక్రవాకముల నలరు,నంబ నను కేంద్రకూఁతు రింపారఁ గనియె.

"ఉమాదేవి కింకను "గన్నియతనము" అందును "ముగ్ధమానసము." కావుననే నిశ్చయతాంబూలము లగునాదంపతు లేకాంతస్థలంబున నున్నను బొంచిచూడ సాహసించినది ముఖ్యముగఁ దాను జూచినది 'అంబ'నే యైనను, తలిదండ్రుల శృంగారలీలలఁ జూచిన బిడ్డలమనసు వికృతినొందుట సహజము గాకున్నను ,,ముగ్ధమానస" కావున మన సెంత బిగఁబట్టినను నాకోర్కు లంకురించినవి. సోముని యువకునివలె నొక్క మాఱునఁ గాక మనసిజరాగమువలనఁ గలిగినహాగ "గాఢ్యాన" నెక్కినది! ఆపై భ్రాంతి తనుఁ బాదివినది. కావుననే వెనుక ముందులు యోజింపక తటాలున ని ట్లాలోచించినది.

క. "తగుమగని బడసి కౌఁగిట, సొగియఁగనుట గాదె యరయ జోటికి నధికం
బగుభాగ్యఫలము, నా కిం,పుగ నింకెన్నఁడొకో యిట్టిపోఁడిమి గలుగున్."

పెకిలెని శరగా రెఱక ద్రాంతను సమర్థించిరి

సోమునికంటె నెఱన. సుకన్నతపీఠమున నెక్కించఁదలం పున్నది గావున పీరు, ఎఱ్ఱనయుష 'అంబ'ను దొంగిపనాముటను 'కన్నియతన' మని సమర్థించి నారు. సోమునియుష యట్టిపాఱపని చేయకపోయినను నాపెకు సిగ్గులే దన్నారు. 'కన్నియతన' మంట' వయసువచ్చిన తరువాత కన్నియ యైన నేమి?— పార్వతీపరమేశ్వరులు తలిదండ్రులంట తలిదండ్రులను మాత్రము రహస్యక్రీడా సమయమున నీవు వచ్చి దబిస్సు పొంచి చూతువచ్చునా? పిమ్మట నెఱ్ఱనయుష యుదస్థంజూడుఁడు.

క. "కని కోప్కు లంకురింపఁగ, మనసిజరాగమున ముగ్ధమానసమున నొ[వఁగ."

యవ్వఁబోగ లెక్కఁగఁగన్నియ, తనమున నెంతయును భ్రాంతితనుఁ బొదివికొ

సోమునియుషకుఁ బోగ రొక్కమూ ఉక్కిన దన్నారు. పైసోమునిపద్య ములయం దీవిషయమే లేదు ఎఱ్ఱనయుషకు 'ఒయ్యన నెక్కిన' దంట! ఇట్టి వాని నింతకంటె నెక్కుడుగ విమర్శించ నేల? ఇద్దఱయుషలపద్యములును బైనే యున్నవి. పాఠకులు విమర్శింతురు గాక!

(c) (తరువాత) "పార్వతి సర్వజ్ఞుని యర్ధాంగి గావున వెంటనే తన మనుమరాలిచింతను దనలో నెఱింగినది. చెలికత్తెలతో ఘంటాఘోషముగఁ దనతలంపును వెడలనాడి నప్పుడు, పార్వతి విన్న దనుటయందును, మనసులోఁ గలయాలోచనను పార్వతి యెఱింగిన దనుటయందును గలయౌచిత్యప్రకర్ష మును జదువరు లాలోచింతురుగాక!" అని శర్మగారు వ్రాసిరి. ప్రత్యుత్త సోముని యుష 'ఘంటాఘోషము, వీరి కెక్కడనుండి వినఁబడినదో దీని కేమి? "ఉష తనతలంపును జెలికత్తెలతో వెడలనాడుటను బార్వతి యెట్లు విన్నదో యెఱుఁ గము!" అని వెనుక వ్రాసిన వీరు "ఘంటాఘోషముగఁ దనతలంపును వెడల నాడినప్పుడు పార్వతి విన్న" దని యెట్లు వ్రాసిరో! "వెనుక నేమివ్రాసితి నని చూచుకొనుట సోమునిపని గా" దని మాత్రము సులభముగ వీరు వ్రాసిరి! ఈవిషయమునఁ బార్వతి దివ్యదృష్టి, యంతయౌచిత్యప్రకర్షమును జూపఁజా లదు ఇదిసామాన్యవిషయము. ఉష తన్నుఁ బొంచి చూచినప్పుడు లేనిదివ్య దృష్టియం దిప్పు డతిశయ మేమి గలదు? సోమునియుషాపార్వతులసంభాషణము గలపైపద్యములను గంటిరిగదా! ఇప్పట్టున నెఱ్ఱనపద్యములం గనుఁడు. (పార్వతి యుషతో ని ట్లనుచున్నది)

# ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటితగ్రంథములు.

## (1) విప్రనారాయణచరిత్రము.

పన్నిద్దఱాళ్వారులలోఁ జేరిన తొండరడిప్పొడియాళ్వారు చరిత్రము. కవిత్రయములోని యెఱ్ఱాప్రెగడ చిన్నిమనుమఁడగు చెదలువాడ మల్లనకవిచే రచియింపఁబడిన యపూర్వగ్రంథము. సర్వవిధముల నుత్తమప్రబంధములలో గణింపఁదగినది. వైజయంతీవిలాసమునకంటె మిన్న. ౫ ఆశ్వాసములు. ౨౮ పుటలు. సవిమర్శనమైన ౧౮ పుటలపీఠిక. వెల, రూ. ౦—౮—౦.

## (2) జైమినిభారతము (ఆంధ్రవచనము)

రెండువందల సంవత్సరములక్రిందట మధురాపురాధీశ్వరుం డగువిజయరంగ చొక్కనాథుని యాస్థానకవియు, సామాజికుండు నయిన సముఖము వేంకటకృష్ణప్పనాయఁడునిచే రచింపఁబడినది. భాష సలక్షణము. శైలి మనోహరము. ధార యనర్గళము. అందఱును ముఖ్యముగాఁ జదువవలసినది. ౩౨౮ పుటలు. ఆంధ్రమునను, ఇంగ్లీషునను పీఠికలు గలవు. వెల రూ. ౦—౧౨—౦.

1917-18 సం॥ ఇంటరుమిడియేటుపరీక్షకుఁ బఠనీయగ్రంథము.

## (3) కవిజనాశ్రయము.

వేములవాడ భీమకవిరచిత మగుఛందశ్శాస్త్రము. ఆంధ్రచ్ఛందోగ్రంథములలో మిక్కిలి పురాతనము. అనేక లిఖితపుస్తక పరిశోధనపూర్వకముగా మూలపాఠము నిర్ణయింపఁబడినది. పాఠభేదములు పుటలయడుగునఁ జూపఁబడినవి. సంస్కృతకర్ణాటాంధ్రఛందస్సుల భేదాభేదములు చటచటఁ బ్రదర్శింపఁబడినవి. కవినిర్ణయము, కాలనిర్ణయము, ఛందస్స్వరూపము మొదలగు విషయము లనేకములుగల విపులమయినపీఠికయు, విషయసూచికయు, ననుక్రమణికయుఁ గలవు. విద్యార్థులకును బండితులకును గూడ నుపయోగకరము. వెల రూ. ౧—౧౦—౦.

## (4) యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము.

మ-రా-రా-శ్రీ జయంతి రామయ్యపంతులు బి. ఏ. బి. ఎల్. గారిచే రచియింపఁబడిన సవిమర్శ పీఠికాపూర్వకముగాఁ బ్రకటింపఁబడినది. ఈశాసన మాంధ్రపద్యాత్మకము. నన్నయభట్టారకుని కాలముకంటె ముందుఁ బుట్టినది. ఆంధ్రభాషాస్వరూపము తెలియఁగోరువారల కత్యంతోపయోగకరము. 1917-1918 సంవత్సరములు బి. ఏ. పరీక్షకుఁ బఠనీయగ్రంథముగా నిర్ణయింపఁబడినది. వెల రూ. ౦—౮—౦.

## (5) నీతిసీసపద్యశతకము.

తాళ్లపాక పెదతిరుమలార్యవిరచితము. శ్రీవేంకటేశ్వరుల కంకితము. వెల రూ. ౦—౨—౦.

## (6) జ్యోతిశ్శాస్త్రసారము.

వచనము. శ్రీమాన్ కపిస్థలము కృష్ణమాచార్యులు బి.ఏ. ఎల్.టి. గారిచే రచియింపఁబడినది. ఖగోళవిషయముఁ దెలిసికొనఁ గోరువారి కిది యత్యంతోపకారకము. వెల, రూ. ౦—౮—౦.

## (7) A Defence of Literary Telugu, by J. Ramayya Pantulu Garu 0-8-0.

## (8) జ్ఞానప్రసూనాంబికాశతకము.

శ్రీకాళహస్తీశ్వరుని దేవియగు జ్ఞానప్రసూనాంబను స్తుతించుచు శిష్టు సర్వశాస్త్రి రచియించిన భక్తిరసప్రధానమైన పద్యశతకము. అనర్గళకవితాధార గలది. వెల రూ. ౦—౨—౦.

## (9) సర్వేశ్వరశతకము.

యథావాక్కుల అన్నమయ్యగారిది. వెల, ౦—౩—౦.

# చంద్రభానుచరిత్రము

తరిగొప్పుల మల్లనకవి విరచితము.

మిక్కిలి ప్రౌఢప్రబంధము. వెల, రు. ౧-౦-౦.

# కావ్యాలంకారచూడామణి.

విన్నకోట పెద్దయకవిప్రణీతము.

ఇదివఱ కచ్చుపడి ప్రచారములో నున్నదాని తరువాతిభాగము, ఛందో వ్యాకరణవిషయము. వెల, రు. ౦-౮-౦.

# చంపూరామాయణము.

ఋగ్వేదికవి వేంకటాచలపతికవిప్రణీతము. వెల, రు. ౧-౦-౦.

భోజరాజకృతసంస్కృతరామాయణచంపువునకు ప్రథమాంధ్రీకరణము. కాశ్మీరసార సంస్థానమునందు దుష్కులిల్లినది.

# శివరాత్రిమాహాత్మ్యము
## (సుకుమారచరిత్రము)

శ్రీనాథమహాకవి. వెల, రు. ౦-౧౨-౦.

# [illegible]

వేములవాడ భీమకవిఛందము. వెల, రు. ౦-౧౦-౦.

# ప్రాకృతభాషోత్పత్తి.

శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు రచించినది. రు. ౦-౧౨-౦.

# శివతత్త్వసారము.

మల్లికార్జునపండితారాధ్యులు రచించినది. వెల, రు. ౦-౧౨-౦.

# ఆర్యభాషావిభాగము

శ్రీమాన్ - మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు. వెల, రు. ౦-౮-౦.

Printed at the British Model Press, Choolai and published at the Telugu Academy Office, 39, Harris Road, Pudupet, Madras.

చందా సం॥ కు రూ. 3. విడిసంచిక అ. ౮.



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

సంపుటము ౧౨. రుధిరోద్గారినామసంవత్సరము. మాఘ ఫాల్గునమాసములు. సంచిక ౬

## ప్రధానవ్యాసములు.



చెన్నపురి. ౧౯౨౪.

# విషయసూచిక.

-౦౦-

[illegible]

రుధిరోద్గారినామసంవత్సరము
సంపుటము ౧౭ మాఘఫాల్గునమాసములు.

ఆంధ్ర సాహిత్యపరిషద్వార్షికసభ—తుని

# అధ్యక్షోపన్యాసము

మహాశయులారా!

[illegible]

హ్వానించినందులకుఁ దమకు వందనశతంబు సమర్పించువాఁడను.

సభాధిపతి ప్రారంభమున నుపన్యసింపవలె ననెడి నియమమును బాటింప నే నిప్పు డిక్కడ నిలువఁబడ సాహసించితిని. అంతేకాని, తా రెఱుంగనివానిని జెప్పి తమ మెప్పును బడయఁ గలనను నాసతో నేను నిలుచుండలేదు. స్పష్టముగా నుచ్చరింపంజాలని చిలుకనోటినుండి స్వీయవాక్యలనే నాగరికులు విని సంతోషించుచుందురన్నట్లు వ్యక్తపఱుపలేని నావలన నిజభావములనే యూహించి తామును మురి మొందుదురను విశ్వాసమే నాకీప్రోత్సాహమునకుఁ గారణము.

పండితకవివరులారా!

ఉపన్యాసంబుల నొనర్చుటకును వినుటకును గాలాతిక్రమణ మయినదనియును కార్యానుష్ఠానసమయ మాసన్నమయి యున్నదనియును నానమ్మకము. కనుక నాంధ్రభాషాభివృద్ధికొఱకు నాకుం దోఁచెడు కర్తవ్యకర్మములను మాత్రమే నివేదింతును.

ఆంధ్రభాషాయోష రాజమహేంద్రునికాలమందును కృష్ణదేవరాయల సమయమునను మహోన్నతపదవిఁ గాంచుటకును బిమ్మట దీనదశ నొందుటకును గలకారణము రాచమన్ననయ యనుటకు సందియము లేదు. తలయుఁ దోఁకయు లేనిదియును నిన్నఁగాక మొన్నఁ బుట్టినదియు నగు నుర్దూభాష

యిప్పుడు శ్రీనిజాముగారి యాదరమును బడయుచుండుటంబట్టి యత్యున్నతపథమున కేగుచున్నది. శాస్త్రాదుల యనువాదములకొఱకు శ్రీనిజాముగారు ప్రతిసంవత్సరమున వెచ్చించుచుండు రూపాయ లేఁబదివేలు. అందువలననే హైదరాబాదనగరము బి. ఏ. శ్రేణిగల కేవలోరుదూకలాశాలచేతనే కాక, ఉస్మానియావిశ్వవిద్యాలయముచేత సైతము విరాజితమగుచున్నది. కొలఁది కాలమునకే యాకళాశాలయందు ఎమ్. ఎ. శ్రేణినిగూడ నుంతు రని విని మిగుల నానందించితిని. అట్లయినను రాచమన్ననను బొందనికతన భాష వృద్ధినొందఁజాల దని చెప్పలేము. ఈశ్వరచంద్రవిద్యాసాగరునికాలమువఱకును శైశవమును విడిచెనో లేదో యను సందియంబునకు గుఱిగా నుండిన వంగభాషాయోషామణి యిపుడు పూర్ణయౌవనమును దాల్చి సర్వాంగసుందరి యయి యొప్పుచుండుటయే కాక, రవీంద్రనాథునివంటి పుత్త్రరత్నములఁ గనఁ గలుగుటకుఁ గారణములు వంగపండితులయధ్యవసాయమును దద్దేశవాసులప్రోత్సాహమును. రాచమన్నన యంతగా లేకున్నను వంగదేశవ్యాప్తకారణద్వయమయిన నిచట నుండిన నాంధ్రవాణి వంగవాణితోఁ దులఁ దూఁగ కుండునా? ఇప్పుడయినను ధీనిధుల రగు వారు యుక్తగ్రంథరచనను బ్రారంభింప వలెను; మఱి జనసాధారణము మిమ్ముఁ దగురీతిఁ బ్రేరేపింపవలెను.

బాగు పఱుచుటకుఁ బూర్వమోగులను బాఱఁదోలవలెను. కనుక నాంధ్రభాషయందు నెలకొనియున్నదోషములను సంస్కరించుట ప్రథమకార్యము. ఇప్పటి పాఠశాలలయందలి పాఠ్యపుస్తకములందున్న తప్పులను బుధవరేణ్యు లగు బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు నిజాధ్యక్షోపన్యాసమున నుగ్గడించి యుండుట తా రెఱుంగుదురు. కావున నేను మఱికొన్ని తప్పులను బేర్కొని కాలహరణము సేయను. కాని, "వాచకము" లని వాడఁబడుచున్న పొత్తములలో "ఆనందవాచకములు" కొంత కొఱంతను దొలంగించె నని చెప్పఁగలను. అయిన నవి చాలవు. కనుక సలక్షణములును విజ్ఞానప్రదములును శ్రేణ్యనురూపములు నగు పాఠ్యపుస్తకములు మఱికొన్ని ప్రకటింపఁబడవలెను; మఱి తగువారే పాఠ్యపుస్తకనిర్ణేతలుగా నుండునట్లు చేయవలెను.

దేనికయినను నియమ ముండవలె ననియును నియమము నతిక్రమించుట పండితభూషణము కాదనియును మన మెఱింగి యుండుటవలన మనభాషకు నియమ మావశ్యక మని యనుకొన నక్కఱ లేదు. మనకున్నలక్షణగ్రంథములును వ్యాకరణములును యుక్తముగా రచింపంబడియుండ లేదనియును వాని

యందుఁ జాలినన్ని సూత్రములు లేవనియు నందఱకుం దెలియును. అంతే కాక, వాడుకలో నున్న భాష పెరుఁగు చుండుటవలనఁ బూర్వగ్రంథనిబంధనముల నప్పుడప్పుడు పండితులు సంస్కరించు నాచారమును గలదు. కావున నాంధ్ర భాషకుఁ దగువ్యాకరణ మొకటి రచింపఁబడుట యత్యావశ్యకము. తత్ర్ప చయితలనేకులుగాను సంస్కృతాంధ్రభాషాద్వయాభిజ్ఞులుగా నుండవలెను. మఱి యది యీ పరిషత్తుయొక్క సమ్మతిని బడయవలెను గ్రహింపఁబడియుం డని శబ్దరూపములలోఁ గొన్నింటిని దానియందుఁ జేర్పవచ్చును. కాని యొకా నొక ప్రాచీనకవి ప్రాసము కొఱకో వళికొఱకో గణముకొఱకో కక్కుఱితిపడి యక్రమముగాఁ బ్రయోగించి యున్నపదమును మాత్రము చేర్పరాదు. ఏల యనఁగా నట్టిదానిని మహాకవిప్రయోగ మనుచు నితరులు ప్రయోగింపరు అందులకు నిదర్శనమును గనుఁడు.

క. "జ్ఞానము కేవలకృపన, జ్ఞానికి నుపదేశవిధిఁ బ్రకాశము సేయం
　గానది సకల ధరిత్రీ, దానంబునకంటె నధిక తరఫలద మగున్."

అని శాంతిపర్వమున నున్నట్టు లుదహరించి దీనినే లక్ష్యము చేసికొని యప్పకవి యొక నూతనయతిని సృజించి లక్షణము వ్రాసినది ప్రౌఢకవి సమ్మతంబు కాలేదు. ఉపర్యుక్తపద్యమందలి "ప్రకాశ" మను పదమునకు మాఱుగా "ప్రచారం" మని కాని ముద్రితప్రతులయందు నున్నట్లు "ప్రజనిత" మని కాని మహాకవియయిన తిక్కన సోమయాజి ప్రయోగించి యుండ నోపు. అట్లు కాదేని యతండును మనుష్యుండే యగుటవలనఁ బొరపడి యుండనోపు. ప్రదీయతాం దాశరథాయ మైథిలీ" అని యాదికవియయినవాల్మీకి ప్రయో గించినంతన దాశరథిశబ్దమును అకారాంతముగా వ్యవహరింతుమా? ఇట్లు నాకుఁ దోఁచిన రెండుపలుకులను బలికితిని. అంతేకాని గ్రాహ్యాగ్రాహ్య శబ్ద నిరూపణ మనునది పండితులకార్యము: పండితులను సమకూర్చి యొక యాంధ్ర వ్యాకరణమును ద్వారగా రచియింపించుటవలన స్వభాషకు మేలుచేసి శాశ్వత కీర్తిని గనుట యీపరిషత్తుయొక్క కార్యము

సకల కలాశాస్త్రపురాణేతిహాస కావ్యనాటకాదులతోఁ గూడినదే సాహిత్య మనుట తెల్లమేకదా. అవన్నియు లేని యాంధ్రభాష సాహిత్యముగలది యగునా? మూఁడు నాలుగు శాస్త్రములలోమాత్ర మొకటి రెండేసి పుస్తకము లున్నంతన యాంధ్రభాషయందు శాస్త్రములు గల వని ధారాళముగా నుడువఁ జాలము. పూర్వకవులదృష్టి పురాణములచేతనే మధ్యకవులదృష్టి ప్రబంధ

ములచేతనే యాధునికకవులదృష్టి నవలానాటకములచేతనే యాకర్షింపఁ బడుట వలన నాంధ్రభాషయందుఁ గలలును శాస్త్రములు ననువాదితము లగుటకుఁ గాని యుత్పన్నము లగుటకుఁ గాని వీలు కలుగ దయ్యెను. విజ్ఞానచంద్రికా మండలి కొన్ని శాస్త్రములను బ్రకటించి మననందనములకుఁ బాత్రమయి తగు ప్రోత్సాహము లేకుండుట నిపుడు విశ్రాంతి నొంది యున్నది. దానికి యుక్తసాహాయ్య మొనర్చి యిది మఱి కొన్ని శాస్త్రములను బ్రకటింపఁ గలుగు నట్లు చేయుట యాంధ్రులకర్తవ్యకార్యము. కలలయొక్కయు శాస్త్రముల యొక్కయు జ్ఞానముండినంగాని దేశ మభివృద్ధి నొందదు. దానికై యాంధ్రులందఱును సంస్కృతాంగ్లభాషల నేర్చుకొనుట యెన్నఁటికిని జరుగదు. కనుక జనసామాన్యముయొక్క జ్ఞానాభివృద్ధికొఱకు శాస్త్రములయనువాదముగాని రచనగాని చేయుటయే పండితులకు ధర్మము. రచయితలకనువాదమే సుకర మగుటంజేసి ముందుగా సంస్కృతాంగ్లభాషల యందున్న శాస్త్రముల నన్నింటి ననువదింపవలెను. ఆంగ్లాదిభాషలనుండి యనువదింపఁబడు శాస్త్రములకు వలయు సాంకేతిక పదములను వంగదేశమునఁ బ్రకటితమయియున్న శాస్త్రీయ పదనిఘంటువునుండియే గ్రహించుట సమంజసము. అట్టి నిఘంటువు వంగదేశమునందుఁ బ్రకటింపబడియున్నట్లు నాస్నేహితు లొకరు నాకుం జెప్పియున్నవారు. శాస్త్రవిషయము గ్రహించుటకుఁ గష్టముగా నుండును శైలి కఠినమగు నేని యది గ్రహించుటకుఁ గష్టతరమగును. కావున శాస్త్రముల శైలి సులభముగా నుండవలెను. పర్యాయపదముల నధికముగా వాడుచుఁ గఠినశబ్దములతో నింపుటయే కవిత కుండు సొంపని కొందఱు తలంతురు. కాని, మృదుపదములను గలిగి భావము బాగుగాఁ బ్రకటింపఁబడిన కవితయే మిగుల సొగసుగా నుండు నని యట్టివారు గ్రహించుట యుక్తము. శాస్త్రములు శ్రేణ్యానుకూలముగా ననఁగాఁ బిల్లలకును బెద్దలకును బనికివచ్చునట్లు రచింపఁబడవలెను మఱియు జనుల సత్ప్రవర్తనాభివృద్ధికై యుదారస్వభావుల జీవితములును నీతిహాసములును బ్రకటింపఁబడవలెను.

వంగభాషనుండి కొన్నినవలలు మాత్ర మిప్పటికి ననువదింపఁ బడియున్నవి. ఆభాషయందు మంచిగ్రంథము లెన్నియో కలవు. అవి యనువాదితము లగుట లెస్స.

ఆంగ్లనవలానాటకముల ననుసరించి జనించి యున్నవియును స్వతంత్రముగా వెలసియున్నవానిలో ననేకములును రసభావరహితములయి యప

శబ్దములతోడను విగతార్థపదములతోడను నిండి సంస్కృతభూయిష్ఠములగుచు శ్రుతికటువులుగానున్నవి; మఱియును సంభాషణవాక్యములుకేవల గ్రాంథికాదుల వచన శైలిని ధిక్కరించుచున్నది పరికింప నట్టివి భాషాభివృద్ధి కరములు గావు; తద్వ్యతిరిక్తములే యగును. కనుక సామర్థ్యము చాలనివారలు "మౌనమే భూషణము మూఢమానవులకు" అను పద్యపాదమును స్మరించుకొని మౌన మూనుటయే మేలు.

భాషాభివృద్ధికి విమర్శనగ్రంథములు మిక్కిలి సహకారులు. వాదప్రతివాదముల నేర్పు తప్ప విమర్శన మన నెట్టిదో మనపండితులకుఁ దెలియదనుటయే కాక, తద్విధానమును వారాంగ్లవిమర్శనగ్రంథములనుండి నేర్చుకొన వలసి యున్నదని చెప్ప సాహసించి నందులకు నన్ను వారు మన్నింతురుగాక. "అక్కడక్కడఁ గొన్ని తప్పులున్నను మృదుమధురపదభూయిష్ఠమయి మొత్తముమీఁద గ్రంథము సలక్షణముగానే యున్నది" అనువాక్యము తోడఁగాని యున్నవో లేనివో కొన్ని దోషములను నిరూపించుచుఁ గవిని దిట్టుటతోడఁ గాని విమర్శనము సరిపోవు నని మనపండితుల యభిప్రాయము. అది సరికాదు. కవిచతురుఁడయి యుండఁగా విమర్శకుఁడు చతురతరుఁడు గావలెను. ఇంక "పండితా స్సమదర్శినః" అను నుడికిఁ దార్కాణముగా విమర్శకులగువారు నిష్పక్షపాతబుద్ధి గలవారయి గ్రంథకథితపాత్ర పోషణాదులను క్రమముగా వెల్లడించుచు నంతలి గుణాగుణములను జూపింపవలెను అట్టి విమర్శనములే భావికవులకు మార్గదర్శకము లగును. కనుక సద్విమర్శనగ్రంథము లాంధ్రభాషయందుఁ గలుగునట్లు చేయువలెను.

కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగారి పరలోకగమన మాంధ్రదేశమునకుఁ దీఱనిలోటును గలిగించెను. అందుల కందఱమును వంత నొందుచున్న వారము. మనవంతకుఁ బ్రతీకార మాయన ప్రారంభించిన "విజ్ఞానసర్వస్వ" మచిరకాలంబున ముగియునట్లు చేయుటయే.

శ్రీసూర్యరాయనిఘంటువును వెసఁ జూడవేడుక గలవార మని మన మనుకొన నక్కఱ లేదుకదా!

నేను వచించిన వాక్యములలోనికఠినపదములకుఁ గల కారణము నాకున్న భాషాభిమానమే యగుటవలన నన్ను మన్నించి వానియందున్న గుణలేశములనే గ్రహింప మిమ్ము వేఁడుచు విరమింతును.

శ్రీ విక్రమదేవవర్మ.

(పరిషత్సభలోఁ గొందఱు కవీశ్వరులు చదివిన పద్యములు.)

౧. శ్రీ త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు.

తే. తొలుతఁ బేరాస వహియించి తుది నిరాశఁ
జెందినది పోలెఁ గరము విన్నందనమ్ము
గదుర నెమ్మోముతోఁ గన్పెదురఁ దోఁచె
దాంధ్రభాషామతల్లివే యంబ నీవు 1

చ. కనుఁగవఁ గ్రమ్మి చెక్కులఁ దిగంబడి యశ్రులు జాలువాఱఁగాఁ
బనవుచు నేఁడు దేలఁ బ్రియబంధులఁ బాసినమాడ్కి నో నవున్
నిను వెతముంపకున్నె జననీకృతలక్షణుఁడైన లక్ష్మణుం
డనుఁగుసుతుండు నిన్విడిచి యక్కట స్వర్గపదంబుఁ జేరఁగన్ 2

క. జీవితమంతయు నీపద, సేవకునై ధారవోయు స్థిరమతిఁ బాయం
జేపట్టి కలఁచినట్టులు, గావుట యబ్బురమె కన్నకడు పెటులోర్చున్ 3

తే. నీకు సర్వస్వమై భువిన్ నెగడఁదగిన
భూరివిజ్ఞానసర్వస్వవారిరాశిఁ
గడవ నీఁదులాడుచు దేవుకడన మునిఁగె
యకట దుఃఖాబ్ధి నినుముంచె నమ్మ కొడుకు 4

సీ. కార్యదక్షుని బాసి ఘనశోకమున నాంధ్రసాహిత్యపరిషత్తు జాలిఁ బడియె
సంపాదకుని బాసి సంతాపమున మున్గి విజ్ఞానచంద్రిక విన్నఁబోయెఁ
జారిత్రకుని బాసి జగతి దుర్జ్ఞేయమౌ నాంధ్రదేశచరిత్ర యార్తిఁ జెందె
దేశభక్తుని బాసి తేజం బెడలి యాంధ్ర దేశమాతయుఁ గడున్ దీనయయ్యె
సోదరులమైన మేమెల్ల శోకజలధిఁ, బడితి మాపైని నీమాట నుడువనేల
జగతిఁ దనలేమి లేమిగా వగవఁజేయు, నామహాత్ము జన్మమె జన్మమగుఁ గదమ్మ.

చ. అడలకుమమ్మ లక్ష్మణునియాత్మకు శాంతినిగోరుమమ్మ నీ
యెడ లుడుపంగఁ జాలెడు మహాత్ములు నీయభివృద్ధిఁ గోరి తా
రుడుగక యెప్డు నిన్గొలుచుచుండెడు భక్తులు సర్వశక్తులీ
పుడమిఁ గలారు తల్లి పరిపూర్ణమహోన్నతిఁ గాంతు వింతటన్.

సీ. ఇప్పించినావు మహామహేంద్రులచేతఁ గోరినచో నగ్రహారములను
గుప్పించినావు సద్గుణనాయకస్ఫూర్తి నలరారు కృతిరత్నహారములను
మెప్పించినావు సన్మృదులోక్తికలన విద్వత్కవిప్రభుమహాస్థానములను
దప్పించినావు విద్వత్సు దారిద్ర్యమన్ సామెత నీవేలుస్థానములను

సతమునిన్నుఁ గొల్చెడుపూర్వసత్కవులకు, నీవొసంగని యభిమతంబేది గలదు
తొంటియా పెంపునుగుల బొందుదువు నేఁడు, జాలి నీకేటి కాంధ్రభాషావధూటి

సీ. ఆంధ్రభాషను మాటలాడుచే నడఁదోస మనిపించినట్టి దుర్దినము లరిగె
నాంధ్రకావ్యము హస్తమందుఁ బూనుట దూష్యమనిపించినట్టి దుర్దినములరిగె
నాంధ్రంబు బడులలో నభ్యసించుట వ్యర్థమనిపించినట్టి దుర్దినము లరిగె
నాంధ్రుండఁ జూవె నేనని చెప్పికొనుట తప్పనిపించినట్టి దుర్దినము లరిగె
నిప్పుడిప్పుడు నీదు పెం పెఱిఁగి తగిన, సేవలం జేయకున్నను జేయవలయుఁ
జేయవలయు నటంచును జెప్పికొందు, మమ్మ నీకు శుభోదర్క మదియ కాదె.

ఉ. వేలకువేలు నీదునభివృద్ధికి వెచ్చము సేయఁ బూని నీ
పాలిటి కల్పకంబులగు భవ్యకృతుల్ రచియింపఁ జేసి నీ
జాలికి జాలినొందు గుణశాలులు సూర్యనిభుల్ గలారు భూ
పాలురు తల్లి కుంకుమము పాటిలు నీకిఁక వైభవోన్నతుల్. 9

చ. ఇలఁగల రాజులం దఱు నేటికి మాటికి నీదుపుత్రకుల్
వల కొకటాక నీకొఱకు దానము చేసినఁ దీఱకున్నె యీ
యలజడి కట్ట లేదు ప్రజలం దటువంటియుదారబుద్ధి చిం
తిలకు మదంబ నీకొఱఁత దీఱెడుకాలము వచ్చుచుండెడున్. 10

తే. మెఱుము లుఱుములు గడుమేరమీఱి తుదకుఁ
జినుకొకటి లేని యీయేఁటి ఘనము లట్లు
సభలఁ బలికి యేమియుఁ జేయఁ జాలకున్న
నిజసుతులఁ గన్న వెతగాదె నీకు మాత. 11

ఆ. కడుపు గట్టికొనుచుఁ గావ్యముల్ రచియించి
నీదు సేవ సేయు పేదకవుల
కచ్చుపనుల కయిన యప్పుదీఱక వెతం
బడఁగ వలసె బ్రతుకు మాట కేమి. 12

తే. పదియు రెండేండ్లబాల మాపరమదంబ
నీదు నెచ్చెలి దీని కేఁడాది కొక్క
పూఁట యాతిథ్యమిడు బుద్ధి పుత్రులందుఁ
గొనకుఁ గలవయ్యె నఁట చెప్పికొనిన సిగ్గు. 13

ఉ. నీసుకుమారతాగరిమ నీసుధఁ జిల్కెడు ముద్దుఁబల్కులున్
నీసొగసుందనంబు మఱి నీమదసింధురమందయానమున్

నీపరిసత్త్వముం గలుగునే పెఱబాస వెలందులందు హా
దోసముఁ జెందకే నియతితో నినుఁ గొల్వని యాంధ్రపుత్రకుల్. 14

తే. తోడి బాసలలోన నీపోఁడి యిపుడు
కొఱఁత వడియుంట దెలిసె నీకొమరులకును
నింక నీయభివృద్ధికై యెల్లగతులఁ
బూని యున్నారు నీకింక పొగులనేల. 15

తే. సత్కృతులు ప్రాయముఁగల కవీశ్వరులు గలరు
సత్కవులఁ బ్రోవఁగల మహీశ్వరులు గలరు
గ్రంథములు వ్రాయ వ్రాయింపఁ గడఁగు టొకటె
కొదవ యది దీఱెనంత నీకొదవుఁ బెంపు. 16

సీ. అజ్ఞానతిమిరసంహారియౌ నిర్బంధ విద్యావిధానమ్ము విస్తరిల్లు
సకలవిద్యావిజ్ఞానసంపాది యగునాంధ్ర సర్వకళాశాల సంఘటిల్లు
దేశసంఘాభివృద్ధిప్రదాయక మైన ప్రత్యేకరాష్ట్రంబు పరిఢవిల్లు
నౌన్నత్యకరమైన యభినవాఖిలశాస్త్ర వితతార్థసంపత్తి యతిశయిల్లు
నాంధ్రమహి నెల్ల నీనయంబై వెలుంగ, నెందునేలోపమును లేక యేపెసంగి
జగతి నీపెంపె పెంపుగా నెగడఁగలవు, వలదు మాయమ్మ యూవంత వంతనీకు.

ఉ. మాపరిషద్వతంసము సమస్తవిధమ్ముల నీకుఁ దోడునై
పనిసేయ బాసవారలందఱిలోఁ గడు వన్నెవాసి యుం
బ్రోవును బ్రాపునుం గలిగి పొంపిరివోయెడు నిన్నుఁ జూచి మే
మేపునఁ బొంగ నాంధ్రజగ మేలెడు కుందకుమమ్మ నెమ్మదిన్. 18

తే. ఆంధ్రపరిషత్తునకుఁ దదధ్యక్షునకును
సభ్యజనులకు మముఁ బిల్చి సత్కరించి
నట్టి శ్రీతునిరాజ్ఞికి నఖిలశుభము
లిచ్చుఁ గావుత నెప్పుడు సర్వేశ్వరుండు. 19

౨. వెంపరాల సూర్యనారాయణమూర్తిగారు.

శ్లో. సారగ్రాహి మహీశ్వరోత్తమతతే స్సంమోహనాస్త్రాయితా
సద్ధ్రీచీనమృదూక్తిమందహసితా హైమాంధ్రభాషాంగనా
ఔత్సుక్యం వితనోతు సంతత మిదం సాహిత్యకృత్యే సతాం
విజ్ఞానప్రదశోచనంచ కలయ త్వేషాం రసాస్వాదినామ్. ౧

శా. అమ్మా! నీది యదృష్టమన్నఁ దొలి కృష్ణాధీశముఖ్యోర్వీపుల్
సమ్మానం బొనరించినా రిపుడొ యాస్థాన్ శ్రీశుభద్రాంబపు
ష్పమ్ముల్ పూజ నొనర్చుచుండె నిదు డోజం బీరికాధీశు ది
వ్యమ్మా పూజలఁ గాంచి తట్టు పరిషత్పాథోజపత్రేక్షణా. ౨

ఉ పూవులలోనఁ బెట్టి నృపముఖ్యులసన్నిధిఁ గూర్చి వారి పూ
జావిధ నిన్నుఁ దన్పి సరసంబగు నీమృదువిభ్రమంబు లా
హా వెలయించుచుండిన జయంతికులీనుని రామయాఖ్యు నీ
వేవిధిఁ జేయుదో పరిషదిందుముఖీ చరితార్థుఁగా నికన్. ౩

శా ప్రత్యబ్దం బొంకభూపతీంద్రుసభలో బ్రహ్మాండమౌ పూజ నీ
కత్యాప్యాయనచిత్తుఁడై కలుగఁజేయం జాలె రామయ్య మున్
నిత్యమ్మొక్కమహీంద్రుఁడే కొలుచుఁ గానీ యిందఱన్ జూచి నీ
వత్యానందము నెన్నఁడే నెఱుఁగుదమ్మా యాంధ్రభాషాంబికా. ౪

సీ. అంత దానిని నిన్ను నింతగాఁ జేసిన యలరాజరాజేంద్రునపుడు గాని
పల్లకీ నెక్కించి బహుదేశములఁ జూపు నలరెడ్డిరాజులయపుడు గాని
యస్త్యోపాఖ్యము లిచ్చి యారాధనము సేయు నలకృష్ణరాయలయపుడు గాని
కవిపూజ స్వయముగాఁ గవులఁ బూజించిన యలతిమ్మజగపతియపుడు గాని
యాంధ్రదేశమ్ము నేఁ డేట నవనిపతుల, యొక్కరొక్కరి సభల కత్యుత్సవముగఁ
బిలువఁ జేసి భవల్లీలఁ దెలిపినావె, యొక్కనాఁ డిట్టులాంధ్రభాషోజ్జ్వలాంగి.

ఉ. శ్రీయుతవత్సవాయికులశేఖరు లెల్లరుఁ దొల్లి నిన్ను స
ద్గియ నొనర్చి రుత్తమకృతిగ్రహణంబునఁ గైతచేత న
ట్లే యిపు డీసుభద్రధరణీశ్వరి గూడఁ గులక్రమంబుమై
సాయముగా నొసంగెఁ బరిషల్లలితాంగిరొ పాణిపద్మమున్. ౬

సీ. సుమనోభిరామవిశుద్ధశయ్యఁ దలిర్చి మృదుశిరీషముఁ బోలుపదము లొప్పి
పటురసజ్ఞాస్వాదపాకనైపుణి గల్గి సులలితగతుల రీతుల నెసంగి

భావపూర్ణవ్యంగ్యభాషణంబులఁ గాంచి యనుపదకలకలధ్వనుల నడచి
గంగాఝరాభ వాగ్ధారల నలరారి లలితసువర్ణాలంకృతుల నెసంగి
షోడశకళాప్రపూర్ణనై సుకవిచంద్ర, జిహ్వలను దాండవముసల్పు చిత్రచరిత
సాహితీ దేవి యాంధ్రదేశమ్ము నందు, వెలసితివి తల్లి గీర్వాణవినుతవగుచు.

మ. అనుఁగుంగూఁతురు స్వర్గతిం బడయ నీవత్యంతదుఃఖంబునన్
మునుఁగన్ నిన్నుఁ బరామృశింపఁగఁ దలంపుం బొంది నీచెంతఁ జే
రిన యీసాహితికన్యఁ బెంచుకొని ప్రేమన్ జిత్తవైకల్యమం
తను బోనాడి యశంబుఁ గాంచుము సుభద్రారాజ్ఞి యెల్లప్పుడున్. ౮

సీ శ్రీరస్తు భాషావిశేషపోషణసక్తహృదయాంబుజాతసహృదయగేయ
విజయోస్తు మార్గణవితతివాంఛాపూర్తికరణైకభూలోకకల్పలతిక
యైశ్వర్యమస్తు దివ్యాపగాఘనరసన్యక్కారరచనావిమలాత్మచరిత
యురుకీర్తిరస్తు సుస్థిరసత్తసంతానసంస్థాపనోత్సవస్థానహృదయ
భవదఖండాభివృద్ధి శుభంబు నొసఁగు, దేశభాషలకును మాతృదేశమునకుఁ
గాన నిన్నిట్లు దీవించినాను సుమ్మి, భవ్యగుణనికురుంబ సుభద్రమాంబ. ౯

3. దివాకర్ల - వేంకటావధానిగారు.

శ్లో. కల్యాణం నస్సగాత్రీ కలయతు కృపయా ప్యన్యదేశాధివాసై
స్సంసేవ్యా మానసాబ్జే సతతవిహరణం కుర్వతీ సర్వతశ్చ
వాణీ త్రైలింగదేశే స్థిరతరవసతిః సాహితీసంపదామ
ప్యధ్యేతౄణాం తద్వృద్ధిప్రవణమహీభృతాం తత్రసజ్జోత్తమానామ్.

మ. మును శ్రీనాథుఁడు సర్వదేశముల సమ్మోదంబుమైఁ ద్రిప్పి నిం
దనుకం దిర్పతివేంకటేశు లవనీంద్రశ్రేణిఁ జూపింప న
ప్పనము ల్గాచింతి వీజయంతికులవిద్వాంసుండు రామయ్య క్ర
న్నన భూమీశుల నీకుఁజూపుచును నున్నాఁ డాంధ్రసాహిత్యమా.

మ. అలగాంగేయతరంగరంగదమలవ్యాహారయై సౌరభో
జ్జ్వలయై యొప్పుశిరీషపేశలతనూప్రస్తావ్యయౌ సాహితీ
లలనారత్నము వృద్ధిఁ జెందెడుఁ ద్వదాలంబంబు నార్జించి ని
స్తులయై రామయపండితాగ్రణి భవత్పుణ్యం బగణ్యం బహో.

ఉ హూణం బిప్పటిరాజభాషయని పెంపొప్పంగ నేర్పింతు గీ
ర్వాణం బన్నను దేవభాషయని యర్చం జల్పుచున్నావు వి

న్నాణెం బొప్పెడు మాతృభాష గదయాంధ్రం బీవు నాంధ్రాగ్రనీ
మాణిక్యంబవు నీకుఁ దప్పు దలరింపన్ శ్రీశుభద్రాంబికా.

సీ. మేదినీనాథు లర్థిలిజోహారులుసేయ నానాఁట నీనాఁట నలరితమ్మ
పండితోత్తములు నీప్రతిభఁ గీర్తింపఁగ నానాఁట నీనాఁట నలరితమ్మ
నవనవాలంకృతుల్ కవిపుంగవులు గూర్ప నానాఁట నీనాఁట నలరితమ్మ
భాషాభిరతులు నీపదరజమ్ము ధరింప నానాఁట నీనాఁట నలరితమ్మ
నీసుకృత మెంతయనుచు వర్ణింపఁగలను, బుట్టు టాదిగ నిందాఁక భూమివరుల
నిండుకొలువుల నీపుట్టినిండు లయ్యె, సరసగుణపేటి యాంధ్రభాషావధూటి.

సీ. వేల్పుటావుంబోలి వెలలేనిసంపదల్ తాండవాఖ్య నదీమతల్లి యీయ
సోమనాథాదినిస్తులపండితేంద్రులు సతతంబునీకు విజ్ఞాన మొసఁగ
నీలాద్రికవిరాజమౌళిప్రభృతులు నీ కీర్తిచంద్రికల దిగ్వితతి నిలుపఁ
బుండరీకాక్షుం డఖండవత్సలత నీ ప్రాభవం బభివృద్ధిపఱుచుచుండ
సకలసామంతనృపులు నీజయముఁగోర, మాతృభాషాభివృద్ధికి మార్గమగుచు
నరయు మోయమ్మ దైనందినాభివృద్ధి, శ్రీసుభద్రాంబికాదయాశ్లిష్టహృదయ.

# ఉపసంహారము.

మహాశయులారా!

వాగ్దేవీకృపవలనను దమసానుభూతివలనను నీసభాకార్యములు యుక్తముగా నెఱవేఱె నని నుడువుట కెంతయు సంతోషించువాఁడను.

మనము వినిన యుపన్యాసములపై నాకుఁ గలిగినయభిప్రాయములను వెల్లడించుట నాకు విధికార్యమే యయినను, నే నట్లు చేయుటకుఁ బూనుదునేని యీయుపన్యాసములకై పట్టినకాలములో నాలుగవవంతయినను గావలసియుండుటవలనను నందుకు నిప్పుడున్న సమయము చాలకుండుటవలనను నే నాపనిని మానుకొని యీయుపన్యాసములను విమర్శించుకొనుకార్యమును దమ సరసహృదయములకే సమర్పించితిని.

మన మిక్కడకు వచ్చినది మొదలుకొని యెట్టియిక్కట్టును జెందక నిజమందిరనివాసముకంటె నెక్కుడుసుఖముల నందుచున్నట్లు చేయుచున్న దీయాహ్వానసంఘమే యగుటవలనఁ దత్సంఘమునకు మనవందనశతంబుల నర్పించువాఁడను. ఆహ్వానసంఘము ప్రేమముతోఁ బనులను జేయుచున్నను సమస్తవ్యయములను భరించి వలయుసాయములను జేసి మనలను సుఖులనుగా నొనర్చి మనకర్తవ్యకార్యములను మనచేత సమంజసముగా నెఱవేర్పించిన శ్రీరాణిగారికి మనవందనములలో ననేకములు చెందకమానవు. దేశక్షేమమునే కోరి తదభివృద్ధికొఱకు ననేకసత్కార్యముల నొనర్చి యధికఖ్యాతిం గాంచిన నిజభర్తగారి యాశయమును బాటించుటయే కాక వారిపనులకు మెఱుంగు వెట్టునట్లెన్నియో సత్కార్యములను జేయుచు "సహధర్మిణి" పదమును సార్థకము చేసిన శ్రీరాణిగారికిఁ జిరాయువు నొసంగఁ దమపక్షమున జగదీశుని బ్రార్థింతును.

స్వీయకార్యములను విడుచుకొని భాషాభిమానమే మనమున నిడుకొని జీతము గొనుచున్న నౌకరులకంటె నెక్కుడు శ్రద్ధాభక్తులతో మనకార్యములను బాగుగా నొనర్చిన స్వేచ్ఛాసేవకసంఘమునకు మనవందనముల నర్పింతును.

పండితకవీశ్వరులారా!

తా రధికవ్యయప్రయాసములకు లోనై యిక్కడకు విచ్చేసి యీసభకార్యములను రెండుదినములలో సుచారురూపముగా నెఱవేర్చినంతన తమ బాధ్యత తీఱె ననుసంతోషముతోఁ దారు నిజనివాసముల కేగకుఁడు. చెన్న

పురిరాజధాని గెజెటును మనము చూచునప్పుడు ప్రత్యేకాక్షరముల ముద్రింపఁబడి ప్రకటింపఁబడునట్టియు శిలీంధ్రసంచయమును దెగడునట్టియుఁ బొత్తములపట్టికను మనము గనినంతనే మనయానందమునకు మితియుండదు. కాని, బాగుగాఁ బరిశీలించినచో నానందించుటకు మాఱుగా మనము వంతనొందుటయే యుక్తము. ఏలయనఁగా గ్రంథము లధికము గా రచింపఁబడుచుండు నంతమాత్రమున నాంధ్రసాహిత్య మభివృద్ధి నొందుచున్న దనం జాలము. ఇపుడు రచింపఁబడుచున్న పొత్తములలో ననేకములు యుక్తముగా రచింపఁబడమి నాంధ్రసాహిత్యాంగము శోభారోగయుక్తునితనువువలె బలియుచున్నది. అంతేకాని మల్లుని మేనువలె బలియుచుండుటలేదు. రామాయణమహాభారత భాగవతములను గొన్ని ప్రబంధముల నెంతప్రీతితో మనము చదువుచున్నవారమో, అంతప్రీతితో భావిజనులు చదువఁదగెడి పుస్తకము లేఁబదివత్సరముల నుండి రచింపఁబడి యుండలే దనిన నత్యుక్తికాదు. ఒకప్పు డట్టిపొత్తములు పుట్టియున్నను నవి లెక్కకు మిక్కిలి తక్కువగా నుండుటవలన లేవనుటయే యుక్తము. కావునఁ దారు బాగుగా నాలోచించి యిప్పటివారికేకాక ముందు జనింపఁబోవు వారికి సైతముపయోగించునట్లు దేశక్షేమకర గ్రంథరచనకుఁ బూని యాంధ్రసాహిత్యకళేబరమును సుస్థము చేయుదురుగాక.

నే నిక్కడకు వచ్చునట్లును దమయందఱిదర్శనలాభమును బొంది సంతసించునట్లును నాకొనర్చినట్టియు మన్మిత్రు లగునట్టియు బ్ర॥ మ-రా-రా-శ్రీ జయంతి రామయ్యపంతులుగారి కనేక నమస్కారముల నర్పించుచు నీసభ ముగిసె నని నుడువువాఁడను.

శ్రీవిక్రమదేవవర్మ.

# దూబగుంట నారాయణకవి పంచతంత్రము.

మల్లికార్జునరాయలు విరూపాక్షరాయలు:— ప్రౌఢదేవరాయలుతరువాత నతని మొదటిభార్యకుమారుఁ డగుమల్లికార్జునరాయలు సింహాసనమెక్కి క్రీ. శ. 1447 మొదలు 1465 ప్రాంతమువఱకు రాజ్యముఁ జేసెను. అతనికాలములో విజయనగరరాజ్యము విస్తరింపకపోయినను బగతురచేఁ గేవలజీర్ణదశకు రాలేదు. కటకపురిముఖ్యస్థానముగు కళింగదేశపురాజైన కపిలేంద్రగజపతి విజయనగరరాజ్యముపై దండెత్తి మల్లికార్జునరాయలుతో ఘోరయుద్ధముఁ జేసి పరాజయము నొందెను. మల్లికార్జునరాయలమరణానంతరమున క్రీ. శ. 1465 లో నతనిసవతితమ్ముఁ డగువిరూపాక్షరాయలు రాజ్యమునకు వచ్చెను. అతఁడు స్త్రీలంపటుఁడును, విషయలోలుఁడును, మద్యపానప్రమత్తుఁడు నగుటచే రాజ్యము క్షీణదశనొంది పరరాజుల హస్తములఁ బ్రాంతభాగము లన్నియుఁ జిక్కికొనియుండెను.

కపిలేంద్రగజపతికొడుకగుపురుషోత్తమదేవుఁడు సమయముఁజూచి విజయనగరరాజ్యముపై దాడివెడలి విరూపాక్షరాయల నోడించి కొంతదేశము నాక్రమించుకొనెను. విరూపాక్షరాయలతరువాత నతనిపెద్దకుమారుఁ డగురాజశేఖరుఁడును తరువాత రెండవకుమారుఁ డగువిరూపాక్షరాయలును నామమాత్రముగ రాజ్యముఁజేసి సంగమవంశమును నంత మొనర్చిరి.

ఉదయగిరిరాజ్యము:—విజయనగరసామ్రాజ్యమందలి తూర్పుభాగము (ప్రాఙ్నాడు) ఉదయగిరిరాజ్య మనుపేరఁ నుదయగిరి ముఖ్యస్థానముగ సామంతరాజులచేఁ బరిపాలింపఁబడుచుండెను. ఈయుదయగిరిరాజ్యమునందుఁ గొంతకాలము ప్రధానిత్వము చేసిన వెన్నెలగంటి సిద్ధనమంత్రికి, జక్కనకవి తనవిక్రమార్కచరిత్రమునుఁ గృతియిచ్చిన ట్లిదివఱలో వింటిమి. విజయనగరసామ్రాజ్యవంశములోనివా రగుకంపభూపతి మొదలగువారు రాజప్రతినిధులుగ నుండి ఉదయగిరిలోఁ బ్రజాపాలనముఁ జేయుచుండిరి. విజయనగరరాజ్యమందలి కేంద్రస్థానము బలహీనముకాఁగా మాధవవర్మవంశోద్భవుఁడైన బసవభూపాలుఁ డీతూర్పునాఁడునకు రా జగుటయుఁ దటస్థించెను.

పూసపాటిమాధవవర్మ:—మాధవవర్మ సూర్యవంశజుఁ డగుక్షత్రియోత్తముఁడు. అతనిఁగూర్చి కవి యిట్లు పలికె.

"మును బెజవాడదుర్గఁ దనముగ్ధతనంబున మెచ్చఁజేసి పెం
పున రథదంతివాజిభటభూరిబలంబులచేఁ గళింగభూ
జనపతిఁ ద్రుంచి చేవఁ దనసంతతికై మహిఁ బాడిసల్పి క్ర
మ్మనఁ జిరకీర్తులం గనియె మాధవవర్మ తదన్వయంబునన్."

ఈమాధవవర్మయే, ప్రస్తుతము కళింగదేశమందలి విజయనగరరాజు లగు పూసపాటివారు తమమూలపురుషుఁ డనిచెప్పుకొనుట కలదు. ఎట్లనిన.

సీ. మా. "అలఘువిక్రముఁడు కోసలజయాదిత్యుండు దక్షిణవిజిగీష దాడి వెడలి
నిగమాంతపారగుఁ డాజిభీష్ముండు శ్రీదేవవర్మ సైన్యాధిపతిగ
నఖిలసీమలవిజయ స్థంభములు నాటి దివికేగెను; త్రిలింగదేశభూరి
వాహినీపతి దేవవర్మ ప్రభుండయ్యె; నడ్డూరిసీమ పేరాజిలోన
వల్లభు నోడించి వైభవంబులమించి సార్వభౌమపదంబు జగతిగాంచె
అతనిసుతుండు బుద్ధావనీశుఁడు రాచతబిసియై గాంచెను ధర్మనృపుని
తనయులాతనికి బుద్ధయదేవవర్మలు, బుద్ధరాజందుఁ బ్రసిద్ధుఁడయ్యె
అతనితనూజుఁ డాతతబలోన్నతుఁడు మాధవవర్మనృపతిముత్తాఁతబోలి
జనకునాజ్ఞను సప్తశతిసాంగముగ రామదేశికుచే నుపదేశమంది
కనకదుర్గా కటాక్షప్రాప్తవిభవుఁడై మళయసింగని బోర మ్రందఁజేసి,
చౌబళహత్త మల్ల బలాధిపునిరక్తధారచేఁ బరదేవతనుభజించి
వసుదిగింద్రియశకవత్సరంబుల జయవాటికాదుర్గవైభవము గాంచి
గగనవాణీవాక్యగౌరవంబునఁ బూసపాటిభూమిని పురీవరముగట్టి
వాసిగాంచుటఁ బూసపాటివారను నింటిపేరు గాంచిరి రాచపెద్దఱికము
అమలరాజాదిగా ప్రముఖులు మావారు తద్గృహనామంబు దాల్చివెలసి"
. (విజయనగరము మహారాజకళాశాలాపత్రికనుండి యుద్ధృతము.")

పూసపాటిబసవరాజు:—ఈపూసపాటి మాధవవర్మవంశములో నాఱవ పురుషుఁడుగా బసవక్షితీంద్రుఁడు జనించెను. ఈబసవభూపాఁడు క్రీ. శ. 1460 సం॥ ప్రాంతములలో రాజ్యముచేసి రణరంగభైరవుఁ డనియు, రశికశిఖామణియనియు, మహావిద్వాంసుఁ డనియు మనుచరిత్రప్రియుఁ డనియు నిం కేమేమో యనేక సుగుణములకు నెలవనియుఁ గవులచేఁ బ్రస్తుతింపఁబడినవాఁడు. ఈతఁడు కళింగ భూపతు లగుగజపతులకుఁ గుడిభుజముగా నుండి వారిదుర్గములకు వజ్రపుక వాటముఁగా నుండెనఁట. ప్రథమమున విజయనగరసామ్రాజ్యములో సామంత రాజుగానుండి యొకవంకఁ 'దనప్రభువుల దౌర్బల్యావస్థయు మఱియొకవంక గజ

పతుల నిరాఘాటాటోపమును జూచి గజపతుల పక్షమునఁ జేరి వారి *కుదయగిరిరాజ్యము స్వాధీనపఱిచి తాను బలమైన సహాయుఁడుగా నుండె" నని తలంచుట సరియైన దని తోఁచుచున్నది.

బసవభూపాలుఁడు విద్వత్ప్రియుఁడును, కవీశ్వరులకుఁ బట్టుఁగొమ్మయు నగుటచే నతనికాలమునం దాంధ్రకవిత్వము బాగుగ విలసిల్లినది. తనరాజ్యాంగం దొకచిన్నయుద్యోగిగా నుండి యాంధ్రకవిత్వవిశారదుఁ డగుదూబగుంట నారాయణకవి గీర్వాణభాషలో నున్న పంచతంత్రమును దెనుఁగుభాషలో రచించి తనయేలిక కంకిత మొనర్చెను.

దూబగుంట నారాయణకవి. (C. 1460 A. P.)

జన్మస్థానము:—ఈకవి తనగ్రంథములో ‹దూబగుంటపురిశాసను నారయనామధేయునికి' అని తన్ను గుఱించి చెప్పికొనుటచే నెల్లూరిజిల్లా ఉదయగిరి తాలూకాలో నున్న దూబగుంటగ్రామవాసియుఁ దద్గ్రామాధికారియు నైనట్లు గనఁబడుచున్నది. ఈతనితండ్రి బ్రహ్మయమంత్రి. తల్లి నాగమ్మ. ఆంధ్రమహాకవు లగుతిక్కనసోమయాజి, ఎఱ్ఱాప్రెగ్గడ మున్నగువారికవితాసౌరభములచే సువాసితమైన దేశమునఁ బుట్టి పెరిఁగి యాంధ్రకవిత్వపటుత్వము నుగ్గుఁబాలతోఁ గ్రోలి యుండెను. వారియుగ్రంథములు బాల్యాదిఁ బఠనము చేసియుండుట నిస్సందేహము. కావునఁ దన కవిత్వమందలి శయ్యాపాకరీతులు కొంతవఱకు వీరిగ్రంథములనుండి యలవరించుకొనె నని చెప్పుట యస్వాభావికము గాదు. ప్రాయశః ఎఱ్ఱప్రెగ్గడకవివరుఁడు తన కిరుగుపొరుగుతాలూకాలోనే జీవించియుండుటచే శంభుదాసునికవిత్వ మితనికి మార్గదర్శి యయ్యె నని చెప్ప సాహసింపవచ్చును. గ్రంథాదిని జేసిన కవిస్తుతియం దాంధ్రకవీశ్వరులలోఁ గవిత్రయమువారిని దక్కఁ దదితరుల నీకవి పేర్కొని యుండమి గుర్తింపఁదగినవిషయము.

‹నన్నయభట్టారకునకు మ్రొక్కి, తిక్కనసోమయాజుల నతిస్తుతులఁ గొలిచి, శంభుదాసుని మదిలోన సంస్మరించి" - - - - -

ఈకవియొక్క గురువు కొండయమంత్రియెఱ్ఱయకుఁ గూరిమినందనుండును, త్రికాలములందు నీశ్వరారాధనతత్పరుఁడు నగునాగనార్యుఁడను బ్రాహ్మణశ్రేష్ఠుఁడఁట.

హరిహరారాధన:—మహనీయమహిమాఢ్యుఁ డగు తిక్కనసోమయాజి యాదిగా నెల్లూరిప్రాంతమందలి ప్రాచీనకవులయం దొకవైచిత్ర్యము గాన

* ఈయుదయగిరి ప్రస్తుతము నెల్లూరుజిల్లాలో నున్నది.

అట్టిసుస్థిరమతులును, సనాతనధర్మానుష్ఠాననిరతులును, వేదశాస్త్రపారంగతులును, శాంతిశీలవ్రతులు నగుమహాత్ములలో నొకరు తిక్కనసోమయాజి. ఈ మహనీయుని స్థితి యనన్యసామాన్యమైనది. ఆంధ్రదేశమందుఁ దత్కాలమందే కాక యింక నెల్లకాలములకును నాంధ్రకవిశ్వేశులలో నత్యుత్తమస్థాన మలంకరించుచు లౌక్యరాజకీయవ్యవహారములలోఁ దన యేలికయైన మనుమసిద్ధియొద్దఁ బ్రధానామాత్యుఁడుగా నుండి యుభయభాషాప్రపంచము నుద్ధరించుచు హిందూసనాతనమతగౌరవమును సంస్థాపించుచుఁ దనజీవితము నన్నివిధముల దేశసేవాదీక్ష కర్పించినవాఁడు. శ్రీశంకరులవారు నెలకొల్పిన స్మార్తమతమందుఁ బుట్టి శాశ్వతారాధనతత్పరుఁడై యజ్ఞములఁ జేసి సోమయాజియై నిశ్చలాద్వైతబుద్ధిని హరిహరాత్మక మగుపరమాత్మను ధ్యానించుచుండెను.

శ్రీయన గౌరినాఁ బరఁగు చెల్వకుఁ జిత్తము పల్లవింప

(భారతవిరాటపర్వము)

ఆకాలమందు శైవులకును వైష్ణవులకును గల కలహకల్లోలములు తన దేశమం దెక్కుడుగ వ్యాపింపకపోయినను దానోరుగల్లు పోయి ప్రతాపరుద్రుని యాస్థానమునఁ గొంతకాల ముండినతఱి శ్రీరామానుజ బసవారాధ్యమతములకుఁ గల ఘోరవైషమ్యములఁ బ్రత్యక్షముగఁ జూచినవాఁ డయ్యెను. అట నన్యమతములవారితో వాదప్రతివాదప్రౌఢి నెఱపి తనజ్ఞాన విజ్ఞానప్రతిభా తేజమున నచ్చటివారియుల్లంబుల సనాతన హిందూమతముయొక్క యనాదిజ్యోతిని వెలిఁగించి హరిహరాద్వైతమున నెప్పటికంటె నెక్కుడు విశ్వాసమును బట్టుదలయుఁ గలవాఁ డయ్యెను.

అట్టిమహాపురుషుఁడు హరిహరారాధనఁ జేయఁ గడంగు టొకవింతయే! కావున నభేదరహిత మైనసనాతనమతమును శాంతిస్థాపనకొఱకును, హిందూమతమునకుఁ గీటురాయివలె నున్నయద్వైత పరమసిద్ధాంతమునుఁ బునర్నిర్మాణము గావించుటకొఱకును నీ మహానుభావుఁ డుద్యమించె నని చెప్పుట సత్యమని తోఁచుచున్నది.

ఈప్రకారము నిర్ణయించుటయే సత్యమైనయెడల హరిహరనాథుఁడను దేవతావిగ్రహము నెల్లూరిలో నుండెనా లేదా యని యీనడుమ జరిగిన వాదప్రతివాదములకుఁ బ్రత్యుత్తరము కూడఁ జేకూరుచున్నది. అనేకవిధములఁ జూడఁగా హరిహరాత్మక మగునద్వైతతత్త్వోపాసన మొనరించుటయే కాని తన్నిధానముకొఱకు నెలకొల్పఁబడిన విగ్రహరూప మైనదేవత నారాధించి

యుండవలే నని తెలుచున్నది. అట్టివిగ్రహము గలదేవ [illegible] గాని యాప్రాంతమందలి మఱియొకస్థలములోఁ [illegible] నద్వైతనిత్యోపాసి యగుతిక్కనమనీషి వర్ణింపకపోయినను కేవలము కవులుమాత్ర ముగనే పరిగణింపఁబడిన యతనిశిష్యులును భక్తులునైనను వర్ణించియుండరా?

నారాయణకవివలెఁ బంచతంత్రమును దెనుఁగుబాస రచించిన వస్నిత్తి రాజు వేంకటనాథుఁడు తనగ్రంథమును హరిహరనాథున కంకితమొనర్చుచు వ్రాసినభాగము ప్రస్తుతవిషయమునుఁ గొంతవనుక ద్యోతకపఱుచుచున్నది గావున దానిని నిటఁజేర్చెద:—

“అని యిష్టదేవతానుతియును బురాతనకవిస్తుతియు నాచార్యపురస్కృతియుఁ గుకవితిరస్కృతియుఁ గావించి యే నొక్కనాఁడు పంచతంత్రం బాంధ్ర భాషం జంపూప్రబంధంబుఁ జేయం బ్రారంభించి యేతత్కావ్యకన్యకాంతున కనుకూలవల్లభుం డేదేవుండొకో యని విచారించి శయ్యాతలంబున శయనించిన:—

శ్లో. హ్యాన్నిత్యయాచ రమయా హ్యుమయా ప్రభాత్వం
వాళీతుపారఘృణినా జగతాం గురుత్వమ్
సందీపయ న్నభసి కోపి మహా న్పుమా న్మే
స్వప్నే శుభేఽసితసతద్యుతి రావిరాసీత్.

క. కలలో నలుపుం దెలుపుం, గలవేలుపుదొర యగణ్యకారుణ్యరసం
బొలయ ననుఁజూచి ద్రాక్షా,ఫలమధురప్రణయపూర్వభాషలఁ బలికెన్.

క. నను హరిహరనాథునిగా, మనమునఁ దలపోయు నృపకుమారకవిద్వ
జ్జనసేవ్యము నీకావ్యము, దనకి మ్మభిమతవరప్రదాతకు భక్తిన్.

వ. అని యానతిచ్చి యావేల్పు విచ్చేసిన నానందకందళితపులకవంశితుండ నై మేలుకొని

క. ఏచనువుగలదు హరిహర,సాచివ్యము నొంద నన్యజనులకు మదినా
లోచింపఁ దిక్కయజ్వకు,నాచనసోమునకు మఱియు నాకుం దక్కన్.

.. .. .. .. .. .. .. .. .. .. .. ..

ఈ స్వప్నవృత్తాంతమునకును భారతములో నున్న తిక్కనసోమయాజి స్వప్నవృత్తాంతమునకు నెక్కుఁడు వ్యత్యాసము గానిపింపదు. కావున భారత మందలి హరిహరనాథుఁడే యేదో యొకస్థలమందుఁ బ్రతిష్ఠింపఁబడిన దేవతా ప్రతిమ గాక కేవల ముపాసనదైవ మని నమ్మవచ్చును. ఈహరిహరారాధ [illegible]

యంతయుఁ బ్రస్తుతవిషయము కాకపోయినను సందర్భానుసారముగ వచ్చిన చరిత్రాంశము గాన నొకింతుక విపులముగఁ జర్చించితిని. సుహృదయులు మన్నింతురుగాక.

పంచతంత్రము:—విష్ణుశర్మచే సంస్కృతమునఁ బంచతంత్రము రచింపఁబడినది. ఈగ్రంథము చిత్రవిచిత్రకథలతో పిల్లలను నాబాలగోపాలము నకు నీతిబోధకముగా నుండి ముఖ్యముగా రాజనీతిఁ బ్రకటించుచున్నది. కాలక్రమమున భరతదేశమందంతటను దేశభాషలలోఁ బరివర్తన మొందుటయేగాక, అరబ్బీ, పారశీకభాషలద్వారా పాశ్చాత్యప్రపంచమునకుఁ గూడఁ బ్రాఁకినది. పాశ్చాత్యభాషలలో నిది 'బిల్పై (లేక) బిడ్పై కథ'లనునామాంతరమునఁ బిలువఁబడుచుండెను. బిల్పై (లేక) బిడ్పై యనుమాట 'విద్యాపతి' లేక 'విద్యాపతి' అనుసంస్కృతశబ్దముయొక్క యాభాస మని రైసుదొరగారు తమకన్నడకవాఙ్మయచరిత్రములో వ్రాసియున్నారు. ఈ నిర్వచన మంతసాధు వని నాకుఁ దోఁపదు. 'విద్యాపతి' శబ్దముకంటె 'విష్ణు'శబ్దభవమగు 'విఠ్ఠు' శబ్దమునుండి పుట్టినట్లు నాకుఁ గాన్పించుచున్నది. ఏలయన గ్రంథకర్తనామ మగు 'విష్ణుశర్మ' యందు 'శర్మ' శబ్దము గౌరవసూచక మగుటచే దని యెల్లరెఱిఁగినవిషయమే కావున మొదటిభాగ 'విష్ణు' లేక 'విష్ణప్ప' కుఁ గన్నడమహారాష్ట్రభాషలలో 'విఠ్ఠు' లేక 'విఠ్ఠప్ప'యని గ్రామ్యవ్యాహృతి గలదు కదా. ఆకారణముననే పంఢరపురములో నున్నవిష్ణుదేవునకు విఠ్ఠలదేవుఁడని నామాంతరము గూడఁ గలదు. 'విఠ్ఠప్ప' యొక్కయాభాసము 'బిఠ్ప' లేక 'బిడ్పై' యనియు దాని కన్యదేశరూపాంతరము 'బిల్పై' యనియు నూహింప సమంజస మని తోఁచుచున్నది.

విష్ణుశర్మ 'పంచతంత్రము' అనేకగ్రంథములకు మాతృక. కొన్ని కేవలము భాషాంతరీకరణములు. కొన్ని కొలఁదిమార్పులతోఁ జేరినయనువాదములు. కొన్ని నామాంతరముఁ బొందిన నిజప్రకృతులు. మఱికొన్ని పుట్టినబిడ్డలు. ఇట్లు వేఱువేఱువిధములుగ వేఱువేఱు గ్రంథకర్తలచే నీగ్రంథరాజము చాల కాలమునుండి యన్నిదేశములందు వెల్లడి యగుచున్నది. సంస్కృతభాషలోనే 'హితోపదేశ' మను నామాంతరమున నారాయణభట్టనుకవి దీనినే కొలఁది మార్పులతో వ్రాసినాఁడు. ఆభాషయందే క్షేమేంద్రకవి విరచితమైన మఱియొకపంచతంత్ర మున్నట్లును నీరెంటికిని సామ్యముకంటె భేద మెక్కుడుగా నున్నట్లును దెలియవచ్చుచున్నది.

ఇంక దేశభాషలలోని పరివర్తనములఁ గూర్చి చెప్ప నవసరము కాదు. కన్నడ మందు 12-వ శతాబ్దమున దుర్గసింహుఁ డనుకవివరుఁ డంపూ ప్రబంధముగా వ్రాసెను. ఆంధ్ర వాఙ్మయమునందుఁ బంచతంత్రమును భాషాంతరీకరణముఁ జేయుటలో నీనారాయణకవియే ప్రథముఁడు. ఈతనితరువాత వేఱు వేఱు శతాబ్దములలో వేఱు వేఱు గ్రంథకర్తలచేఁ బద్యమునఁ గాని, గద్యమునఁ గాని యీ గ్రంథము వ్రాయఁబడినది. 15-వ శతాబ్దముననే నెల్లూరిప్రాంతము వాఁడైన పద్వేటి రాజు వేంకటనాథుఁ డనుక్షత్రియకవివరుఁడు దీనినే పద్యగ్రంథముగా రచించెను. దీని గ్రంథమునకును నారాయణకవిదానికిని గలనామ్యభేదములను, గుణావగుణములను స్థలాంతరమునఁ జర్చించెదను. ఇదిగాక కడచిన శతాబ్దమున, అనఁగా 19-వ శతాబ్దమునఁ బంచతంత్ర మనేకులచేఁ దెనిఁగింపఁబడినది కారణము విద్యనార్వజనీనిక మగుటచేఁ బాఠశాలలలో దేశభాష నేర్పుటకుఁ గాను సులభమైనట్టి వియు రుచ్యమైనట్టివియుఁ గథలు కావలసివచ్చెను. అట్టివి పంచతంత్రమందు వందలకొలఁది యుండుటచే నాంధ్రగ్రంథకర్తృవిశారదు లగువారు కొందఱీ గ్రంథమును గద్యమునఁ గాని పద్యమునఁ గాని వ్రాసిరి. అధునాతనంబున నాంధ్ర వచనరచనయందుఁ బ్రథమమార్గదర్శి యనిచెప్పనొప్పు పరవస్తు చిన్నయసూరిగారు నీతిచంద్రిక యనుపేర నీగ్రంథమందలి కొంతభాగము నొకించుకమార్పులతో వచనగ్రంథముగ వ్రాసిరి. అందలిశైలి పండితుల కాహ్లాదజనక మగునట్లుగా భాషాప్రౌఢిమను నెఱపుచున్నను సామాన్యజనావళికి సులభభేద్యము గాక రుచింపఁజాలదు. ఈకొఱఁత దీర్చుటకో యన బహుళాంధ్రగ్రంథనిర్మాత యగు కందుకూరి వీరేశలింగముగారు సూరిగారివల్ల శేషింపఁబడిన భాగమునుఁ దన సహజమృదుమధురగంభీరశైలి ననువదించిరి. ఇంతియ కాక చిన్నయ్యసూరిగారికిఁ బ్రత్యర్థిగా మెలఁగుచు వచ్చిన శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారు కూడ నీగ్రంథమును దెనిఁగించిరఁట. అది నాకులభ్యము కాలేదు. కావున నది పద్యమో గద్యమో చెప్పఁజాలను. మఱియు ఉల్లంగి రామచంద్రరావుగారను నెల్లూరిపౌరుఁడు దీనిని బద్యగ్రంథముగా వ్రాసెను. ఇట్లే యింకను ననేకము లుండవచ్చును. మొత్తముమీఁద నీకాలమందుఁ బంచతంత్రము చాలవఱకు బాలురవిద్యావిధానమున కుపయోగ్యమయ్యె నని యొప్పుకొనక తీఱదు.

కథాభాగము:—రాజనీతియందుఁ జేరిన యయిదుతంత్రములఁ గూర్చి వ్రాయఁబడినది గాన నియ్యది పంచతంత్ర మనుపేరఁ బరఁగుచున్నది. ఆయాతంత్రము లేవన:—మిత్రభేదము, మిత్రలాభము, సంధివిగ్రహము, లబ్ధనాశము,

అసంప్రేక్ష్యకారిత్వము వీనిలో సంధివిగ్రహమునకు కాకోలూకీయ మను వేఱు నామమునఁ గూడఁ గొన్ని ప్రతులయందుఁ గానవచ్చెడి. ఈతంత్రము లైదును పాటలీపుత్త్రరాజగు సుదర్శనుని కుమారులకు విష్ణుశర్మచే రాజనీత్యుద్బోధకముగాఁ జిత్రకథారూపమునఁ జెప్పఁబడియె.

భాషాంతరీకరణము:—నారాయణకవి యనువాదము గాని తదితరులవి గాని మాతృకకు శబ్దప్రతిశబ్దపదములు గావు మూలగ్రంథమందలి కథాభాగముల ముఖ్యాంశముల మాత్రము గైకొని మిగిలినవిషయములలో యథేచ్ఛావిహారముగా వ్రాయఁబడినవి. హేతువివరణ సంభాషణాదులలోఁ బ్రతి గ్రంథకర్తయుఁ దనయిచ్చవచ్చినట్లు వ్రాయుటయే గాని మాతృకకు విధేయుఁడై యుండలేదు. నారాయణకవియు నటులే యొనర్చెను. మఱియొక భేదము. మాతృకయందలి యాంతరకథలను యథారూపముగా నైనను దీసికొనఁబడలేదు. కొన్ని కేవలము విడిచిపెట్టఁబడి వానిస్థానమునఁ గ్రొత్త కథలు కల్పింపఁబడినవి. మఱికొన్ని కొలఁదిమార్పులతో స్వీకరింపఁబడినవి. కావున భాషాంతరీకరణము నిర్భిన్నమాతృకానుయాయి గాక కించిద్యథేచ్ఛావిహారిగా నుండెను.

నారాయణకవియు, వేంకటనాథుఁడును:—మూలగ్రంథములో నున్న దంతిలునికథయు, కౌలికునికథయు నుభయకవులచేఁ బరిత్యక్తము లయ్యె. బహుశః రెంటిలో రాజస్త్రీల యనులోమవ్యభిచారవిషయిక మగువృత్తాంత ముండుటచేఁ బరిత్యజింపఁబడియెఁ గాఁబోలు. అటులే నీలితొట్టెలోఁ బడిన నక్కకథయు—దీనిని విడుచుటకుఁ గారణము మృగ్యము. దండనాథునకు వాని కొడుకునకు సమానబంధకి యగుగొల్లదానికథ విసర్జితమై యాస్థానమందు జారత్వకళంకరహిత మైన వేఱొకకథ గాన్పించుచున్నది. ఈకృశంబు లగు భేదంబుల నారయ నా కొండు రెండభిప్రాయములు పొడసూపుచున్నవి. ఇట్టి కథలు లేని గీర్వాణమాతృక యొకటి యుండుటయో లేక యాంధ్రకవులే యాకథలను నీతిబాహ్యము లని విడుటయో కానోవు. నాకుఁ జిక్కినగీర్వాణ మూలగ్రంథము లన్నిటిలో నీకథ లున్నవి. బహుశః రెండవయూహయే సరియని నమ్మవచ్చును.

ఇఁక వర్ణన సంభాషణాదికములలో నుభయకవులును నచ్చటచ్చట మూలగ్రంథముకంటె భిన్నమార్గములనే త్రొక్కిరి. నారాయణకవి వర్ణనలయందును సంభాషణలయందును జాల హ్రస్వభావము నగపఱిచెను. వేంకట

నాథుఁ డట్లుగాక సమయోచితసన్నివేశములతోను రసపూరితములగు సంభాషణల తోను దనగ్రంథము నలంకరించి సాహిత్యప్రపంచమునకు మిగుల నుపకరించెను. స్థాలీపులాకముగా నీయుదాహరణములఁ జూడుఁడు:--

1. హంసకచ్ఛపముల కథ:—

i. మూలగ్రంథమున "కస్మింశ్చిజ్జలాశయే" యని మాత్ర మున్నది. నారాయణకవి దాని నిట్లు పెంచెను.

ii. "నిరంతరసౌఖ్యాడంబర మగునొకకొలనం"

iii. వేంకటనాథుఁడు దాని నే.

క. "కేలెత్తి యిసుముఁ జల్లిన, రాలని యొకకానలో మరాళీనికర న్నాళీకమధూళీమ, త్తాళీనాళీభురాళియగుకొల నొప్పున్."

వ. అది సముగ్రశరంబును సమరసారంగభాసురంబును స్వచ్ఛసత్త్రరుచిరం బును నై సంగ్రామంబును సనిమిషకులాధారంబును - - - బుసుడించు - -

2. సూచీముఖ మనుపిచ్చుకకథ:—

i మూలగ్రంథము. "కదాచిత్ హేమంతసమయే అతికఠోరవాత సంస్పర్శ వేపమానకళేబరం తుషారవర్షోద్ధతప్రవర్షఘనధారానిపాతసమాహతం కథంచిత్ శాంతిమగమత్. అథ కేచి ద్వానరాః" దీనికి నారాయణకవి.

సీ. "ప్రాలేయభూధరప్రాంతకాంతారప్రదేశభాసురసరిత్తీరములను దాలతమాలతక్కోలహింతాలాది రాజితానేక మహీజములను - - - - - - సొరిదివిహరించుఁ గపులొకచోటఁ గూడి - - -

ii. వేంకటనాథుఁడు:—(*P.* 66.)

ఉ. అంత నితాంతశైత్యకరమై కర మొప్పువహించి మించు హే మంతము సేవమానలసమానబకౌఘువిశిష్టశాఖలా శాంతముపాంత - - - - - - - - - - - - -

iii. జోలిమాలినపనికిఁ బోయి ప్రాణముఁ గోల్పోయిన క్రోఁతి కథ:—

i మూలగ్రంథము :—"కస్మింశ్చిన్నగరాభ్యాసే కేనాపి వణిక్పుత్రేణ తరుషండమధ్యే దేవతాయతనం కర్తు మారబ్ధం తత్ర చ యేకర్మకరాః స్థపత్యా దయః తే మధ్యాహ్నవేలాయాం మాహారార్థం నగరమధ్యే గచ్ఛంతి అథ కదాచి త్తత్రానుషంగికం వానరయూథ మితశ్చేతశ్చ పరిభ్రమ దాగతం - - - -"

ii. నారాయణకవి.

చ "ఒకనగరంబుచేరువ మహోన్నత దేవగృహంబు జీర్ణమై
వికలతనొంది యర్థము భావింపఁబడి యుండఁగ దానిఁ జూచి యా
త్మకనుతి నొక్క వైశ్యుఁ డది తొల్లిటి యందము నొందునట్లుగా
నకుటిలవృత్తిఁ జేయుఁ డని యర్థిమొసంగిన శిల్పకారులున్"

iii. వేంకటనాథుఁడు:—

ఈ స్వల్పవిషయము శృంగారరస ప్రాధాన్యముతో అతి బహువిస్తారముగఁ బెంపఁబడినది. అది యెట్లన,—ఉజ్జయినీపట్టణమందొక వేశ్యాంగన యుండెను. ఆమె సౌందర్యలావణ్యము లతిశయనీయములు. విటులయిల్లంబుల నామె కొల్లగొట్టుచుండెను. ఇట్లుండ నొకానొకరాత్రి యామె యథాపూర్వముగా దేవాలయమున నాట్యసేవ యొనర్చి యింటికి నడచి వచ్చుచుండఁగా నొకనాగుఁబాము ఆమెను గఱచెను. అనేకవిధములఁ జికిత్సఁ జేసినను నామె మృతినొందెను. ఆమె బంధువులు దహనసంస్కార మొనర్చుటకుఁ బూర్వ మాకళేబరమును దేవాలయమునకుఁ గొనిపోయి దుర్గాసాన్నిధ్యమున నుంచి తమబంధువురాలు పునర్జీవిత యయ్యెనేని యామహాశక్తి కొకమంటపము గట్టించెద మని మ్రొక్కుకొనిరి. అంత నత్యద్భుతముగ నావారాంగన పునర్జీవిత యయ్యె. తరువాతఁ దాము చేసిన ప్రతిజ్ఞ చొప్పున మంటపము గట్టుటకు వలయు తరుకాండములు వారు సమకూర్చిరి. - - - - ఆతరువాయి మామూలుకథ.

ఇట్లు గ్రంథపరివర్తనములో నారాయణకవికంటె వేంకటనాథుఁడు పిచ్చి పిచ్చికల్పన లల్లియు, నద్భుతవర్ణనలఁ జేసియు గ్రంథమును జాలపటుకుఁ బెంచెను.

నారాయణకవికవిత్వము:—ఈయన కవిత్వ మంతయు మృదువుగాను మధురముగా నుండును. సంస్కృతశబ్దభూయిష్ఠమైన దీర్ఘసమాసములు సామాన్యముగాఁ గానరావు. విద్వత్ప్రౌఢిమతో వెలిపించు కఠినపదములను నద్భుతపాండిత్యముతోఁ గలవరించు కథాసంప్రదాయములను జిగిబిగిగాఁ జొప్పించియుండలేదు. గ్రంథ మంతయు సులభమైనదియు స్వాభావికమైనదియు నగు శైలినే వ్రాయఁబడినది. సామాన్యముగా దేశీయపదముల నెక్కువగాఁ గవి వాడినాఁడు. ఈవిషయములో నయితము తిక్కనసోమయాజి వర్గమునే కవి పోలినట్లు చెప్పవచ్చును. ధారాశుద్ధి చాల నిరర్గళమై యనంతామాత్యునిదివలె నిరాడంబరమై సహజమనోజ్ఞతను గనఁబఱచుచున్నది. భావసంపుటియందును భావనావిస్తృతియందును నెక్కువగఁ బ్రతిభాగాంభీర్యములు కాన్పింపవు.

ఉ. చెప్పిన నాకవిత్వము రుచింపనిత్రావులు చూచి చెప్పఁడీ
తప్పులు లేనిచో నవుగదా యని తిర్పఁడు మాటిమాటికిం
జెప్పకుఁ డొప్పుఁ దప్పరుచుఁ జెప్పఁగ నేర్చినవాని కొక్కచోఁ
దప్పులు లేకమాన వని తద్జ్ఞు లెఱుంగుదు నీకు మ్రొక్కెదన్.

ఇదియు నిజమైన సౌహార్దకతయు వివేకతయు. ఈతనికవనశైలియందలి మాధుర్యమును గాంభీర్యమును దెలిపెడు పద్యములు లెక్కకు మిక్కిలి గలవు గాని యిందు రెంటిమాత్ర మిటఁగూర్చెద.

మ. హాలికుం డోపి సమస్తబీజములు నయ్యైవేళలం జల్లుచో
నెలమిం బుట్టిన కోమలాంకురముల న్వీక్షించి మున్మున్న తాఁ
దెలియుఁ గా సస్యఫలంబు లాకరణి నర్థిన్ బుద్ధిమంతుండు మ
స్త్యల మాకారము సూచి నిశ్చయము సేయుం [illegible]న్. (మి. భే)

ఉ. మారుతముల్ వనంబులను మానుగ షట్పదపంక్తి పువ్వులన్
హారివిహారిచారుకలహంసము లంబువుఁ బక్షు లంబరా
ధారము గోరునట్లు ప్రమదంబుగ నేనును నిన్నుఁ జూడఁగాఁ
గారణమాటఁ జేసి ఫలకాంక్షలఁ జేరితి మిత్వధంబునన్. (సుహృల్లాభము)

ఉ. హారపటీరహీరరజతాద్రితుషారధరాధరేంద్రమం
దారమరాళరాజహరనారదపారదకుందచంద్రికా
క్షీరమృణాలశంఖసురసింధురఫేనఫణీశకాశక
ర్పూరసమానకీర్తివరభూషణ సజ్జనలోకపోషణా. (సంధివిగ్రహము)

క్రిందిపద్యమునఁ బారుష్యము లేనినిష్ఠురవాక్యపరంపరలనుజూడుఁడు.

సీ. కలకంఠిగర్భంబు గ్రాఁగిపోయిన మేలు పుట్టినప్పుడ మృతిఁబొందమేలు
తగ ఋతుకాలంబు దప్పిపోయిన మేలు కన్యయైనను నంతకంటె మేలు
కాంతుఁడు పరదేశగమనుఁడైనను మేలు మగువ గొడ్రాలైన మఱియు మేలు
పల్లవాధర పతి నొల్లకుండిన మేలు పడఁతుక తెగులుచేఁ బడిన మేలు
గాక శాస్త్రపరిజ్ఞానఘనులు గాని, సుతులు గల్గినఁ దండ్రికి సొంపుగలదె
రూపబలవిక్రమాద్భుతాటోపులైన, నధికధనవంతులైన నయ్యర్థము లేల.

స్వభావవర్ణన మెంతమధురముగా నున్నదో చూడుఁడు. గ్రంథఫలశ్రుతి:—

చ. [illegible] లోకహితకార్యము లెల్లను దోఁచు మూఢులై
చదువనివారికిం దెలివి చాల నొనర్పదు నీతిసంపదా
స్పదమగు నీప్రబంధము విశాలగుణోన్నతి నెల్లనాఁడు న
భ్యుదయముఁ జేయు భక్తి వినుచుండినఁ బాఠముచేయుచుండినన్.

లేకుమళ్ల - అచ్యుతరావు.

శా. "బాలా! నీతలఁ పొప్పుఁ గన్నియలకున్ భావంబు నిత్యంబు నా
లోలంబై పతిలాభలోభ మనుకల్లోలంబులం దేలుటన్;
రేలెల్లన్ హరుఁగూడి యే నటులు నిర్నిద్రప్రమోదక్రియా
లీలన్ సోలెద నట్ల నీకును బ్రియాశ్లేషంబు వే చేకుఱున్

వ "అట్టి కల్యాణంబునకుఁ గారణంబు విను మెఱింగించెద వైశాఖశుక్లద్వాదశి నాఁటి నిశాసమయంబున సమున్నతసౌధతలంబున నీవు నిద్రించుచుండఁ గలలోన వచ్చి యెవ్వఁడు నిన్నుఁ గలసె నతండు నీకుం బతియయ్యెడుం బొమ్మనిన సిగ్గుతోడి విలాసంబు దృగ్విలాసంబు నలంకరింప నింపారు మ్రొక్కున నక్కపర్దికుటుంబినిని వీడ్కొని వేడ్కలు పిక్కటిల్లు నుల్లంబుతో మరలె నప్పుడు.

క. "చేసఱచి నవ్వుచుం బరి, హాసోక్తులు మెఱయుచుండ నాయుగ్మలు లి
చ్ఛానరణిం బరమేశ్వరి, చేసినకృప తెఱఁగు ప్రణుతిచేసిరి నెమ్మిన్."

మహేశ్వరునితో నేకాంతస్థలంబునఁ దాను క్రీడించుటను బొంచిచూచి, మొదటనే, పాగ రొయ్యన నెక్కియున్న యయ్యుషకు, నిప్పు డంబ యగు పార్వతి, మరలఁ దాను హరునితో రేలెల్లఁ గూడి సోలుచుండుటను జెప్పి, యామె యవస్థ నభివృద్ధి నొందించినది. కావుననే యయ్యుష, "వేడ్కలు పిక్కటిల్లు నుల్లంబుతో మరలినది. దీనికిఁ దోడుగ 'నాయుగ్మలులు చప్పటలు గొట్టి పరిహాసోక్తులు కూడ నాడి, యామెకు బాగుగ జ్ఞప్తియుందు నక్కోర్కి యుండునట్లు చేసిరి. (ఇట్టియుష, కలలోఁ దనకు భర్తృసమాగమ మైనయప్పుడీకోర్కులు, నివ్విధము నెట్లు మఱచెనో! సోమునియుషకు నాస్వచ్ఛికముగఁ గలిగి యప్పుడే యణఁగి పోయినకోర్కి గావున నామె యవ్విధమును మఱచుటయం దబ్బుర మేమియు లేదు.) ఇరువురిపాత్రములు తారతమ్యము సరయుఁడు. ఇరువురుకవులును పార్వతి చేత "వైశాఖశుక్లద్వాదశినాఁడు కలలోఁ గలయువాఁడు నీకు భర్త" యగునట్లు వర మిచ్చె నని వ్రాసిరి. (నిశాసాయం సమయములను గూర్చి పిమ్మట విమర్శించెద.) పిదపఁ గలలో ననిరుద్ధసమాగమము నడిచెను.

xi. ఆక్షే. ఇందు సోముఁడు కలలోని విచారము వర్ణించి ప్రయోజనము లే దని కాఁబోలు 'కలలోఁ గుమారుఁ డొకఁ డేమో చేసె' నని యొకపచ్చి ప్రయోగించి తేల్చివైచెను."

ప్రత్యు. ఇది పచ్చిమాట యంట! సంస్కృతమున 'రమయామాస' (రమించెను) అని యున్నదానిని సోముఁ డిట్లు వ్రాయఁగా నెట్టిన యెట్లు వ్రాసెనో మాకుఁ దెలియదు!

"కాముని హాఁతుక, ఒం టెందుఁ గసి సుఖోచితనిద్ర యొలర్చియుండఁగా."

"వనకుళికీరుఁ కైవపుగవాక్షముల మారసమానుఁ డిమ్ములన్"

సీ. "కలలోన నయ్యింతిఁ గదిసి మోహమున నవ్వ నలుకొత్తఁ దియ్యనిపలుకు పలికి
కెంగేలితోఁ గేలు గీలించి నెమ్మేను మేనును బెరయించి మెలపుతోడ
బిగియారకౌఁగిట బిగియించి మనసులు రెండును గదిసి యొక్కండుగాఁగ
నేకోక్క లేమిటి కెనసిన వానికి జుట్టిన మాఱత్తై చొప్పడంగఁ
బతురసంభోగరసములు చవులవెంట, సిద్ధలును బ్రత్తగాఁ గని యేపుమిగిలి
నట్టిచందంబు గావించి యాత్మకురాత్రి, యబలతలఁపున నచ్చొత్తినట్లు చేసె"

ఎట్టన యిట్టొక్కఁ గొంచె మధిముగ వర్ణించె, నని శర్మగారు వ్రాసిరి.

ఎట్టన వర్ణించిన, నది 'కొంచె మధిమము' కాదుఁ డుచితముగ వర్ణించి నను నది యత్యధికమును, ననుచితమును! 'ఏమా ,, ననునది పచ్చి! ఏమి ధర్మాని కారము! ఏకోక్కయుఁ గలంపున లేక మూర్ఛమానసముతో నేకాంతస్థలంబున నిద్రించుచుండఁ, గలలోఁ గుమారుఁ డొకఁ డెమో చేసె నని తాల్చి పిం పేవం దిగ్గన మేలుకాంచి నయనోద్దీప్తాశ్రుసిక్తాస్యయై తనకిన్యకాత్వ మాఱడి వోయెననియుఁ, గులము దూషిత మైన దనియు దుఃఖిల్లు సోముని యుషకును, "పసనారెడుజవ్వనముతోడను, 'రసంబు పెన్నింటలఁ గూర్చు కానుముతోడను, 'ఒంటికిఁబోక భర్తృరతి కువ్విళులూరు మనంబు' తోడను సౌధంబున నిద్రించుచుఁ గలలోఁ దన్నుఁ గదిసిన కుమారునికి నెదురొత్తు లిచ్చియు, మేలుకాంచిన పిమ్మటఁ గులము వీటిఁబోయె" నని వగచు నెట్టనయుషకును గలతారతమ్య మును గ్రంథవిస్తరభీతి నిట వ్రాయ మానితి.

"(మైకొని నేర్చిన) ఉషకుఁ జిత్రరేఖ పార్వతీవరమును జ్ఞప్తికిఁ దెచ్చి వెఱవ వలదని యూఱడించెను."

xii ౨. ఆశ్వా. ౨. తన మఱచిపోయిన మనోరథము నాకస్మికముగ ఫలిం చుట నెఱింగిన వెంటనే సోముని యుషకుఁ దిక్క తల కెక్కినది—

ప్రత్యు. తిక్క వెంటనే తల కెక్కినట్లు సోముఁడు వ్రాయ లేదు చూడుఁ డీ పద్యవచనములను.

ఆక్షే. c. "చెలికత్తెలతో మాటాడుచున్నట్లే నిద్ర పోవు తామసగుణ మీఁదానవరాజకుమారికిఁ దప్పని దేమో! కావుననే కాఁబోలు 'దినాంతవేళ నీకలలోఁ గలయువాఁడు నీమగఁ డగు' నను పార్వతి యానతిచ్చుట!" అని యాక్షేపించినారు.

ప్రత్యు "దినాంతవేళ నీకలలోఁ గలయువాఁడు నీకు మగఁ డగు" నని సోముని యుషకును, "నిశాసమయంబున - - - - - - - నీకుఁ బతి యగు" నని యెట్టిరయుషకును బార్వతీదేవి వరము నొసఁగినట్లు వారివారిపోత్తములలో నున్నది. దినాంతవేళ=సాయంసమయము; నిశాసమయము=రాత్రివేళ (నడు రేయి యని భావము.) ఇం దేది యుచితమో కనుఁగొందము. రాక్షసులు నిశాచరు లను నామము గలవారు. వారు రాత్రులు సంచరింతురు. పగలు నిద్రింతురు. కావుననే, "వ. - - - దివాచరంబు లగు జంతుజాలంబునకు విశ్రాంతిసమయంబును, రాత్రిచరంబు లగు ప్రాణిసంతతులకు సుబోధసమయంబును - - -" అని సాయంకాలమును గవులు వర్ణింతురు.

ఇదియునుగాక సాయంసమయమును 'అసురసంధ్యావేళ' యని పెద్దలు పలుకుదురు. సంధ్యలలోఁ బ్రాతస్సంధ్యయే ముఖ్య మైన దని కొందఱమతము. త్రిమూర్త్యాత్మకుండును, ద్యుమణినుండును నగుభాస్కరభగవానుఁ డుదయింపఁబోవునదియు, లోకములఁ బ్రకాశింపఁజేయు సమయమునకుఁ గారణ మగునదియుఁ గావున ప్రాతస్సంధ్య పవిత్రమైన దని యార్షమతము.

శ్రుతి. ఏ తే బ్రహ్మవాదినః పూర్వాభిముఖా స్సన్ధ్యాయాం గాయత్ర్యా భిమన్త్రితా ఆప ఊర్ధ్వం విక్షిపన్తి" యజురారణ్యకము. ద్వితీ. ప్ర. ౨.

(బ్రహ్మవాదులు సంధ్యాసమయమునఁ బూర్వాభిముఖులై గాయత్రిచే నభిమంత్రితము లగునుదకములను పైకిఁ జిమ్ముదురు)

పూర్వాభిముఖులై సూర్యున కర్ఘ్యము నిచ్చుట ప్రాతస్సంధ్యాసమయమునఁ గావున నిచ్చుటఁ బ్రాతస్సంధ్యకే సంధ్యాశబ్దము ప్రాముఖ్యము నిచ్చునని కొందఱమతము. కొందఱ ఆశ్రుతినిబట్టియే సాయంసమయమునఁ గూడఁ బూర్వాభిముఖు లయియే సూర్యదేవున కర్ఘ్యము విడుతురు.

మనసాయంకాలము రాక్షసులకు వేకువ యగును. "వేకువను గలిగినస్వప్నము శీఘ్రఫలదాయకము" అని స్వప్నశాస్త్రము. (కావుననే యనిరుద్ధసమాగమము కొలఁదిదినములలోఁ గలిగినది.) ఇట్టి యభిప్రాయములతో నే కాఁబోలు విజ్ఞానసంపద్విఖ్యాతుఁ డగువ్యాసమహర్షి,

[3]. "వైశాఖే మాసి హర్యక్షాం, ద్వాదశ్యాం త్వాం దినక్షయే
రమయిష్యసి యః స్వప్నే, స తే భర్తా భవిష్యసి." హరి విష్ణు. 117, అధ్యా.

అని మూలమున వ్రాయఁగా, దానిం గ్రహించి సాహిత్యరసపోషణ సంవిధానచక్రవర్తియు, సకలాగమవేదియు నగుసోమనాథమహాకవి 'సాయంసమయ' మని వ్రాసినాఁడు. (ఇచట వక్త వైశంపాయనుఁడు, శ్రోత జనమేజయుఁడు.)

ఈసంవిధాన మెంతయు స్తవనీయ మనియు, ననుసరణీయ మనియు వేఱె చెప్పనేల? ఆక్షే. c. - - - "సోముని చంద్రరేఖ,

"నినుఁ గలలోనఁ బైపడిన నేర్పరి ముచ్చు నెఱుంగుదేని న
య్యనువరిరూపుఁ గైసేసియు నన్వయముం జరితంబుఁ జెప్పుమా
విని ప్రియుఁ దార్చెదన్ - - - - ."

అని యడిగినదఁట! కలలోఁ గన్న రూపును గైసేయుఁ జెప్పుటయే దుర్ఘటము. అట్టియెడ నన్వయముం జరితంబును జెప్పు మని యడుగుట చిత్రరేఖవంటి చతురురాలికిఁ దెలివిమాలినతన మారోపించుట గాక మఱేమి?" అని వ్రాసిరి.

ప్రత్యు. కవికిం బోలె విమర్శకునకును, ఏపాత్రము చెంతకు వచ్చినప్పుడు, ఆపాత్రముగా మాఱుచుండుట విధి. ఆవిధి నతిక్రమించెనేని యాతఁడు కృతార్థుఁడు గాఁజాలఁడు. ఈఘట్టమున విమర్శకుఁడు చిత్రరేఖాభూమికం దాల్పవలయును. (చిత్రరేఖగా మాఱవలయును) అప్పు డాతనిహృదయమునుండి, యంతకుమున్న గ్రంథపరిచయమునఁ బ్రవేశించియున్న యనిరుద్ధుఁడు, వెలుపలికిఁ బోవును. అనిరుద్ధుఁ డాతనిమనంబున నుండెనియప్పుడు పైయాక్షేపమే కల్గనేరదు. ఏమన,

ఉషాకన్యకు స్వప్నమునం దగపడినవాఁ డెవ్వఁడో చిత్రరేఖ యప్పు డెఱుఁగదు. స్వప్నములలోఁ దఱచుగా, ఎఱిఁగినరూపు, చూచినరూపు, తలఁచినరూపు, వానింగూర్చినవిషయములు వచ్చుచుండును. కావున నీకలలోఁ దోఁచిననేర్పరిముచ్చు 'నెఱుంగుదేనియున్' అనుచున్నది' ఎఱిఁగిన— లేక, చూచిన— లేక తలఁచిన— వాఁ డవ్వఁడేని వచ్చెనేమో యని యామెయభిప్రాయము. అది ప్రాపంచికజ్ఞానము కలది.

ఉషకు స్వప్నమునఁ గానవచ్చినవాఁ డనిరుద్ధుఁ డనియు, వానిని చిత్రరేఖయు, నుషయు నెఱుంగ రనియు మన మెఱుంగుదుము గావున నిట్టియాక్షే

పించుచున్నాము గాని, కావ్యము స్వకథ నాయంతకువారి కీశంకయే పొడమదు. ఆలోచించి చూడుఁడు. ఇంక 'తెలివి నాలితనము' చిత్రరేఖదేమో!

సంస్కృతపురాణములును, ఎఱ్ఱనహరివంశమును ఈయభిప్రాయమునే బోధించుచున్నవి.

శ్లో. "విజ్ఞేయో యస్త్వయా దృష్టో నైవ యన్నాహ సా యత్నతః
ఇత్యేవ ముక్తే వచనే చిత్రలేఖా కామమోహితా
ఉవాచ కుమార్యాస్తు నుతాం కథం జానామ్యహం సఖి
త్వమేవ చిన్తయ సఖి నోత్తరం ప్రతిభాతి మే." హరివం. విష్ణు. 117 అ.

ఎఱ్ఱన:-
క. "చాలదు నంకము నింక, గాయము నని నీవు చెప్ప నెఱుఁగఁ జేసిక- - -"

పైవాని భావము లన్నియు సమానములే.

ఆక్షే. [(పిష్టట) "జగన్మోహన గుణరూపవంతుల యాకారముల నెల్లఁ బటమున వ్రాసి తెచ్చెదను అందు నీవతని గుఱుతింపు మని పల్కి చిత్రరేఖ యింటికిఁ బోయినది. ఎఱ్ఱనయు నాయమ్మ(వ్రాసి) వెంటనే వెడలి పోయినాఁడు. సోముఁ డన్ననో యుషాదేవిని (రాచకన్నియను) విడువక గట్టిగఁ బట్టికొనుచున్నాఁడు'"] అని వ్రాసినారు.

(వెనుక వీరు సోముని "సూర్యాదులను లజ్జను బాటించువాఁడు గాఁ" డనియు నీచగుణము గలవాఁ డనియు వ్రాసియున్నారు. ఆవ్రాఁత కిది భిన్నము పెట్టుచున్నది!)

ప్రత్యు. సోముఁడు ఉషాకన్య విరహావస్థను గొంచెము వర్ణించుటచే నేవము పొంది వీరు పైరీతిని వ్రాసినారు. దీనిం బరికింతము.

రెండువేలసంవత్సరములకుఁ బూర్వమునుండియు, మన(హిందూ)దేశమున బయలువెడలిన యనేకసంస్కృతనాటకములయందు నాయికల విరహావస్థలను (వానికి వేఱుగ దశలను నిర్ణయించి) బలురీతుల వర్ణించుసంప్రదాయము కవులలోఁ గలదు; పురాణములయందును విరహిణీవర్ణనము గలదు. భాసకాళిదాసాది మహాకవులనాటకంబులయందును, దేవీ, స్కాందాది పురాణములయందును నానావిధముల విప్రలంభశృంగారవర్ణనము చేయఁబడియున్నయది. సర్వజ్ఞుఁడగు నీకవియుఁ దనగ్రంథమునందలి తక్కినయనేకకథలయందుంబోలె దీనియందును జాలవఱకు నాటకపద్ధతి నవలంబించి దీని నొకనాటకరంగస్థలంబుగ నొనర్చినాఁడు. కావున నమ్మహాకవి నట్లు దూఱుట పాడిగాదు.

xiii. ... ప్రబంధము ... గ్రంథమునకుఁ బ్రోవ ... తెలుఁగు బాసకు ముఖ్యమగు ఔచిత్యమును సూచించినారు.

ప్రత్యు. ఇతఁడు ప్రబంధించినయుషగ్రంథమునకు ద్రోవసూపినమాట సత్యమే. ప్రబంధమార్గ మనఁగా నాటకమునందలి మనోహర మగుప్రస్తుతమార్గము. ఇదియే అతఁడు చూపినది. ఇట్లు చూపుటయే సాహిత్యరసపోషణసంవిధాన చక్రవర్తిత్వము; సుకవియు నవీనగుణసనాథత్వము. అతఁడు సూపినమనోహర మార్గమునఁ బోలేక పెక్కుగ్రంథములం ద్రొక్కిన యితరకవులయపరాధమున కా తఁడు బాధ్యుఁడా? ఇతరప్రబంధములలోని నానావిధవర్ణనములఁ జదివిచదివి విసిగి యున్నాము గావున నాతని నిప్పుడు నిందించుచున్నాము గాని యాతని నాఁటి కాంధ్రమున నది నవీనమార్గమే.

xiv. ఆక్షే. "తనకు వివాహతాపముఁ బరిమార్పవచ్చిన పురంధ్రీమణు లను కన్నచోట నుషాదేవి సైఁపలేక కన్నీరు విడువఁగా, నాకన్నీటిని తుడిచిన వెంటనే చెలికత్తెలు "కన్నీటం జేయి కడిగికొనవలసి"యుండు నఁట! ఏల యుండునో, కామాగ్నిఁ గ్రాఁగిక్రాఁగి పొంగివచ్చు నవిగాన! ఇంతటియుష్ణ మున కాకొమలాంగి కను లెట్లు నిలిచినవో!"

ప్రత్యు. సామాన్యముగా మనుజునకు 106, లేక 107 'డిగ్రీ'లజ్వరము వచ్చినప్పు డాతనిబంధుగు లతిప్రేమమెయి నాతనిశరీరముపైఁ జేయివైచి "ఆహా! మావానియొడలు సలసలఁ గ్రాఁగిపోవుచున్న"దని పలుకుచుందురు. ఇట్లు పలుకుట వాడుకయుండే యున్నది. (గ్రంథములలో నతిశయోక్తు లనేకవిధము లుగ నుండును. అట్టియతిశయోక్త్యలంకారములనే మనము విమర్శింప బోఁగొందుమేని మనభాషాసాహిత్యమునఁ గవిత యనునది యుండదేమో!) శరీరమునుండి వెలువడునుష్ణము నెంతయున్నను గన్నులస్థితికి భంగము గలుగనేరదు. అది భగవత్సృష్టివైచిత్ర్యములలో నొకటి.

xv. ఆక్షే. (౧) "ఎవ్వరిని, చిత్రరేఖ లిఖించి తెచ్చినవారి నెల్ల నుషాదేవి తో విరివిగా వర్ణించి చెప్పుచున్నాఁడు. ఈయప్రస్తుతప్రశంస మనకేల యని వారినెల్ల నొకపద్యములో లిఖించి, భరతఖండమున నున్నవియు లేని వియుఁ బెక్కుదేశముల పేళ్లను సంగ్రహించి యొకసీసమునం దొకదీసమాస ముగఁ గూర్చి, తనసర్వజ్ఞత్వమును సార్థకపఱిచినాఁడు!" అని శోర్ణగా రాక్షేపించిరి. (ఇట్టిశంకలు వాఙ్మయమును దీర్ఘము నొనర్చుటకుఁగాక మఱేల?)

ప్ర ఉపయోగము లేని చోట్ల నైన నెల్లను వర్ణించెనేని యది విరివిగ వర్ణించి చెప్పుట యగును. సోముఁ డుచితమైనచోటుల వర్ణించినను నది యప్రస్తుతప్రశంస యగును.

ఇప్పు డుషాకన్యకుఁ గావలసినది యనిరుద్ధునిపటము. ఇతరరాజులపటములను వర్ణించుచుఁ గూర్చున్నచో నది యప్రస్తుతవర్ణన మగుటయే కాక దానివలనఁ బాఠకులకు విసువు జనించుటయు నగును. తొలుతనే యనిరుద్ధుని పటము నెదుటఁ బెట్టినచో నౌచిత్యభంగ మగును. ఈవిషయములం దలంచి యోణిముత్యములకోవ వలె దేశములన్నెల్ల నన్నిటి నక్లిష్టముగఁ గూర్చి, తదధిపతులపటములఁ జిత్రరేఖ యుషాకన్యకుఁ జూపె నని సోముఁడు ఔచిత్యము మెఱయఁ దనకవనపాటవమును జూపెను. కవిత్రయమున నొకఁ డగుతిక్కనసోమయాజి, భీష్మపర్వప్రథమాశ్వాసమున వ్రాసిన యీదేశములపేరులం గనిన, సోముఁడు భరతఖండమున నున్నవానినే కాని లేనివానిని వ్రాయలే దని తెలియవచ్చును. (తిక్కనవ్రాఁతను వీరు గుఱుతించియున్నచో నిట్లు వ్రాయక పోవుదురు.)

వ.“పాంచాల పాండ్య బర్బర వత్స మత్స్య మగధ మళయాళ కళింగ కుళింగ కుకురు కోంకణ టెంకణ త్రిగర్త సాముద్ర సాళ్వ శూరసేన సుదేష్ణ సుహ్మ కురు కరూశ కాశ కోసల యవన యుగంధ రాంధ్ర సింధు చేది చోళ పుళింద పుండ్రక పాం డ్యాభీర సౌవీర సౌరాష్ట్ర మహారాష్ట్ర విదేహ విదర్భ ద్రవిళ దశార్ణ కర్ణాట గౌ ళాంగ వంగ మరాట లాట బాహ్లిక బహుధాన కిరాత కేక యాశ్మంత కాశ్మీర గాంధార కాంభోజ కేరళ మాళవ నేపాళ ఘూర్జర కుంతల లావంతి కానూపాదిజనపదంబులు.” (40 ప. భీష్మ. ప్ర.)

ఇందుఁ గలదేశములపేళ్లనే సోముఁ డిట్లు సీసమున వ్రాసినాఁడు.

సీ.“పాంచాలపాండ్యబర్బరకిరాతాభీరకురువిదేహవిదర్భకుకురుగౌళ
గాంధారమగధకోంకణకళిందపుళిందసింధుసౌవీరాంధ్రచేదిచోళ
సాముద్రసాల్వకోసలకళింగకుళింగ వత్ససౌరాష్ట్రాంధ్రవంగమత్స్య
శూరసేనసుదేష్ణసుహ్మకాశకరూశలాటకర్ణాటమాళవమరాట
కుంతలావంతికానూపఘూర్జరత్రి, గర్తబహుధానయవనటెంకణదశార్ణ
పుండ్రబాహ్లికద్రవిడకాంభోజహూణ, కేకయాశ్మంతకాశ్మీరకేరళములు.

క.“(మొదలగు ననేకములు జన, పదములు గనుఁగొ నెదదీయపతులను మఱియుక్
హృదయం బేమూర్తులఁ జే, రద రమణిమనంబులోని రమణుఁడు లేమిక్.”)

కవిత్రయములో నింకొకఁడగు నన్నయభట్టారకుఁడు, సభాపర్వము, ప్రథమాశ్వాసమున,

సీ. “సుబలమార్కండేయ శునకవరాంజాయన మాండవ్యశాండిల్య మందపాల
బకదాల్భ్యరైభ్యకభాలుకిజతుకర్ణ గౌతమకౌశికకణ్వకుత్స
సావర్ణిపర్ణాదసత్యగోపతిగోప వేనుమైత్రేయపవిత్రపాణి
ఘటజానుకాత్రేయకఠకలాపసుమిత్రహారీతతిత్తిరియాజ్ఞ్యవల్క్య
వాయుభక్షభార్గవవ్యాసజైమిని, శుకసుమంతుపైలసువ్రతాదు
లయినమునులు - - - - - (20 పద్యము.)

అని మునులనామముల నొకసీసమునఁ గూర్చెఁగా, నక్కవిత్రయమున నే వేఱొకఁడగు నెఱ్ఱన,

సీ. “వ్యాసభరద్వాజవాల్మీకిగౌతమ కాశ్యపజాబాలికణ్వపులహ
యాజ్ఞ్యవల్క్యత్రిరైభ్యాంగిరోభృగుపరాశరధౌమ్యగాలవశంఖలిఖిత
హారితసంవర్తకహయశిరశ్శౌనకభద్రకక్షీవద్విభాండకోగ్ర
బకధాల్భ్యకౌశికాపస్తంబమాండవ్యమంకణరోమశమందపాల
కఠకలాపరోహితకాముకాయనాది,మునులు - - - - - -”

అని తనహరివంశము నుత్తరభాగమునఁ బంచమాశ్వాసమున నొకసీసమున గ్రుచ్చెను. మఱియు సోమన సీసమును మెచ్చుకొని యనేకు లాంధ్రకవు లారీతిని సీసములు వ్రాసినారు. వానివివరణ మిట ననావశ్యకము.

ఈ చిత్రపటములం జూచుటలో నుషాకన్య యనిరుద్ధుని గుర్తుపట్టినరీతిని ప్రబంధపరమేశ్వరుఁ డెంతస్వాభావికముగా వర్ణించెనో కనుండు! అని శ్రద్ధగా నెఱ్ఱనను బొగడి యొకపద్యమును వ్రాసినారు.

సీ. “దేవతలను బూర్వదేవతలను జూచి దేవయోనుల నెల్లఁ దెలియఁ జూచి
- - - - - - - - అనిరుద్ధుఁ జూచి యత్యాదరమున
విగతసంశయమగుచూడ్కి వేఱొకటికిఁ, బోకయాకూతకౌతుకాద్భుతవిలోల
తారకంబయి నిలుకడఁ దలఁగులీల, మనసు తోడ్తోడ మ్రాన్పడ మోదమంద.”

ఇది పొగడఁదగినపద్యమే కాని దీనింబట్టికొని సోమునినిందించుట సరి కాదు. చూడుఁడు:—

ఇందలి ‘దేవయోను’ లనుశబ్ద మేమియుచితముగా నున్నది? “భూతో ఽమీ దేవయోనయః, కృపీటయోని ర్జ్వలనః” ఇత్యాదు లున్నను, ఈ ‘చూచి తెలియఁజూచు’ లనపదము నిది వికారముగ నున్నది. ఎఱ్ఱన సత్యకాలపుబుుషి.

బలరామశ్రీకృష్ణులు నిండుజవ్వనమున విలసిల్లుచున్నకాలమున వారిని గంసుని చెంతకుఁ గొనిపోవచ్చిన యక్రూరమహాశయుఁడు దేవకీదేవిదుఃఖము నుపన్యసించుసందర్భమునందు, (వి. హరి. పూ. భా. ౬. ఆ)

సీ. పా. "....అక్కట పుత్త్రు లలఁకుతోఁ గుడిచిరి, చక్కనే యీతల్లి చన్ను
లకట!" అని ప్రస్తావించినట్లు వ్రాసినాఁడు!

ఆక్షే. (b) "(అనిరుద్ధపటము) చూచి యానందపరవశయై యెట్టినయుష తటాలునఁ జెప్పసంకోచించి ప్రేమపూర్వకముగ నిర్నిమేషదృష్టితో మాటాడక చూచుచున్నది. సోమునియుష తటాలున మొగముపైఁ గొట్టినట్లు "మనసు మ్రుచ్చిలి చొచ్చిన మ్రుచ్చికాఁడు, వీఁడుగో" అని చేసాఁచి చూపె నఁట! అనిరి.

ప్రత్యు. ఉషకుఁ జిత్రరేఖ బహిఃప్రాణము. తనహృదయభావము దానితోఁ జెప్పినను దనమనమున నున్నట్లే యని యామెవిశ్వాసము. ఇంతలోనే మొగముమీఁదఁ గొట్టిన ట్లగునా?

ఆక్షే. (c) "ఎట్టినయుష చాల మానవతి, గంభీరహృదయ, తనమనోభావమును దటాలున వెలివెట్టదు. ఆయమ కామాతిరేక మంతయు మనసుననే రగులుచుండును. బైటికి వచ్చినను గంభీరముగ వచ్చును గాని వచ్చి వచ్చి మాటలతో రాదు - - - ఇఁక సోమునియుష యన్ననో సర్వవిధముల విపరీతస్వభావము గలది."

ప్రత్యు. ఎట్టినయుష గాంభీర్యమును జూడుఁడు!—మఱియు - - - మనసుననే రగులుచుండుటను గనుఁడు.

చ. "అను సఖభాషితంబులకు నంగజరాగరసంబు దోఁడుతోఁ
దనువున నాత్మఁ బిక్కటిలి దండడి వేగిరపాటు నార్తియున్
ఘనముగఁ జేయ నచ్చతెలిగన్నుల జొప్పిలు నశ్రుబిందువుల్
వనరుహకేసరస్థహిమవారిలవంబులమేలు డింపఁగాన్.

వ. "నెచ్చెలి కేలు గేలం గీలించి మాళిం జేర్చికొని."

మ. - - - - మత్ప్రాణంబుతోఁ దుల్యగా
రమణీ యేను దలంతు నిన్నుఁ బ్రియమార న్నీవు న న్నట్టిభా
వమ పాటించి భజించినం గలుగు దైవస్ఫూర్తి నాకోర్కికిన్.

క. "నిక్కము సెప్పెద నాదెస, నక్కటికము నీకు లేనియట్టిద యేనిన్
దిక్కొరు లెవ్వరు ప్రాణము, లిక్కాయముతోడఁ బాయు నింతియ పిదపన్."

ప్రత్యు. గదః, అస్యాస్తీతి గదీ=గదుఁడు=రోగముగలవాఁడు. (జ్వరము సోఁకినవాఁడు.) గదా అస్యాస్తీతి గదీ=గదుఁడు=గదాయుధము దాల్చిన వాఁడు.

("అర్శఆదిభ్యోచ్" అనుసూత్రముచే మత్వర్థమున అకారప్రత్యయము రాఁగా సంస్కృతమున 'గదః' అనియుఁ, దెలుఁగున 'గదుఁడు' అనియు నయ్యెను.

పైయర్థముల నాయాచోటుల ననుసంధించుకొనునది. భాషాభూష ణుఁడు గావున శబ్దచమత్కృతిని జూపెను. బలరామున కాయుధములు రెండు:—ఒకచేత గద. వేఱుచేత హలము. కావుననే యతఁడు గదుఁ డనియు, హలి యనియు వ్యవహరింపఁబడినాఁడు. ఆతఁడు గదతో యుద్ధముచేసినట్లు సోమునిహరివంశమున ననేకప్రయోగములు గలవు. గదుఁ డనుప్రయోగము గలయయ్యాశ్వాసముననే 'చటులగద' యున్నట్లు వ్రాసినాఁడు. (6. ఆ. 151)

ఆక్షే. మఱియుఁ బ్రథమాశ్వాసము—

క. "ఆమురుఁడు రాక్షసకుల, స్వామి సుకృతి
వానిఁ జంపవచ్చుటకుఁ బరంధామపతి పుట్టె" ననుపద్యములో 'పరంధా మపతి' యని ప్రయోగించెను. సంస్కృతమున పరంధామ యని వ్యస్తముగాఁ బ్రయుక్తమైనపదమును సమస్తముగా భ్రమించి యిట్లు వ్రాసె నని తోఁచెడిని. నాయెఱిఁగినంతవఱకు సంస్కృతాంధ్రకవు లెవ్వరును దీని నిట్లు ప్రయోగింపఁ గానను. ఉపపత్తి గల్పించుటయు నసాధ్యమని తోఁచుచున్నది - - - సోముఁడు తెలుఁగునకుఁ బ్రామాణికుఁ డగును గాని సంస్కృతభాష కట్లగుట సందిగ్ధము." అని వ్రాసిరి.

ప్రత్యు. పరం ధామా యస్మిన్ సః పరంధామా పరం=కేవల మగు (దుఃఖామిశ్రమగు) ధామ=సుఖము, యస్మిన్ సః=దేనియందుఁ గలదో అది పరంధామా=వైకుంఠలోకము; పరం ధామ్నః పతిః=పరంధామపతి=వైకుంఠపతి= విష్ణువు.

పరం అనునది కేవలార్థవాచక మగునవ్యయము. స్వరాదిగణములోనిది.

శ్లో. ("పరంజ్యోతిః పరంధామ పరమాణుః పరాత్పరః" బ్రహ్మోత్త. ఉత్తర. ద్వి. ఇవి భగవన్నామములు గావున సమస్తపదము లని కొందఱు.)

దండ - - - పరంజ్యోతిరాకార - - - రాధాకృష్ణసంవాదము. (మం. పార్వ.)

" "శ్రీరామరామరామా త్రిలోకాభిరామా పరంధామ - - -" (సీతారా.)

"పరంధాముయు ద్ధామసామర్థ్యముం జూపవే - - - (ను. హేం. ద్ర.)
స్రగ్విణి. పరంధాము దివ్యప్రభావాభిరామా - - - (శ్రీసీతా. స్తుతి.)

ఇంకను ననేకప్రయోగములు గలవు.

తెనుఁగుభాషకు సోముఁడు ప్రామాణికుఁ డగునుగాని సంస్కృతమున కట్లగుట సందిగ్ధ మనిరి. ఏ తెలుఁగుకవి సంస్కృతభాషకుఁ బ్రామాణికుఁడు?

ఆక్షే. (c) "కంటిం గంటి దయానిధిం గుణనిధిం గారుణ్యపాథోనిధిన్" అని నాలవయాశ్వాసమున జనార్దనువాక్యమునఁ బునరుక్తిదోష మొండు గన్పట్టెడు." అని వ్రాసిరి.

ప్రత్యు. సామాన్యనిఘంటువులలో దయాకారుణ్యశబ్దము లేకార్థకములుగాఁ గన్పట్టుచున్నను వానికి భేదము గలదు. వాచస్పత్యాదినిఘంటువులయందును, రసతరంగిణ్యాద్యలంకారశాస్త్రములయందును వానిభేదము వివరింపఁబడియున్నది. ఈరెంటిభేదము సంగ్రహముగ వివరించెదను.

(a) దయ=(1) దుఃఖము నొందిన ప్రాణులవలనిజాలి, (2) పరులదుఃఖమునకు సైఁపలేమి మొ॥

(b) కారుణ్యము=[కరుణస్య (కరుణాయుక్తస్యవా ,కరుణావిషయస్యవా) భావః]=పరదుఃఖహరణేచ్ఛ=పరులదుఃఖమును బోఁగొట్టవలయు ననుకోరిక - - - కావున నిది కవిత్వవేగమున నైనప్రమాదము గాదు.

ప్రత్యేకవర్ణనములయందును నితఁ డతనికన్న మించినాఁ డని చెప్పవలదు" అని శ్రీశర్మగారు వ్రాసియున్నారు. ఇరువుర గ్రంథములలోని యాయావర్ణనముల నాయాస్థలంబులంబట్టి వానివానిప్రాశస్త్యమును పాఠకులు నిర్ణయించుకొనఁదగినదే కాని యిందుఁ జర్చింప నవుపడదు. ఈయిద్దఱ పొత్తములనుండియు "నేకవిషయకములగుపద్యముల నుదాహరించెద" నని శర్మగా రిచ్చిన యుభయులపద్యములలోని మొదటిపద్యములందలి మొదటిపాదములను మాత్ర మిచ్చుటఁ జర్చించెదను.

శివునివర్ణనము. సోమన:—

సీ. "తొలుకాఱుమెఱుఁగులతోఁటలో నాడెడురాయంచకొదమతోఁ రాయఁజాలి
యిరులబండారంపుటింటికిఁ బెట్టినబొండుమల్లెలకోటఁ బోరఁ గెలిచి
బలుమంచుఁగంబాలబలసిరాఁ జుట్టినక్రొత్తమంజిడిబాగు కొల్లఁతచేసి
పాలపెన్నిగవుగుబ్బలినిరాఁగ నెలకొన్న నిండువెన్నెలప్రొగ్గు నిగ్గు చెఱిచి

జడలఁ గ్రొన్నెల, మెడఁ బాపసరుల, కోపదలఁ,
బాదలతో, త్రినే వెలిఁగుడిప్రాఁత మించఁ
బాదము ప్రేతరేఁ ముంకటఁ బాదవృషాభిఁ,
బాదువులం దెల్లఁబాడువైన బాలు వేల్పు"

ఎత్తు:

సీ. "పొంగలఁ జదువేటి లేఁపంగలు బాలుఁ దగుచందమామ సుధ్యాల లూఁపఁ
దాడపుంతంలఁ జెన్నవసువానికిగుల చాయ దిక్కుల నెఱసంజ నెఱపఁ
దోరంపు జేపకిరోలియేర్డైఱ కప్పుకుత్తుకతోఁ బ్రీతిఁ బొత్తు సేయ
దట్టంపుబూదిపూఁతల బూదిపఱచిన పుడుకలు పేరంబునఁ దలిర్ప
సూర్పుఁలోకంబులను గావ మొనసినట్లు,
చేత ముమ్మొనక్రోవు చెన్నుమీఱ
వేల్పువదువుచూడ్కికిఁ గడు వింతయొప్పు,
నేసె ముక్కంటి యున్నయాచెలువు పేర్మి."

(ఈసాన్పునకవులవర్ణనమునఁ గలపదికములును నించుమించుగ సమానములే.)

కైలాసకుధరతటమున శ్రీకృష్ణభగవానుఁడు తపము సేయుచుండఁ బ్రత్యక్షుఁడైన మహేశ్వరుని నిరువురుకవులును వర్ణించిరి. వారిపద్యములయందలి తొలిపాదములను గనుఁడు. ఇందు నెల్లూరుపద్య(పాద)ము ముద్దులు గులుకు వర్ణనము గలయాంధ్రపద్యములలో నొకటియై యున్నది. సోమునిపద్య(పాద)మో! ఊహాతీతమై, ప్రకరణోచితమై యత్యంతప్రౌఢిగల కవికిఁ దక్క నితరులకు రచింపనలవికానిదై యలరారుచున్నది.

తరంగములు గలనదియందుఁ గాని, సముద్రమునందుఁ గాని ప్రతిఫలించు బాలచంద్రునిఁ జూడఁగలిగిన యేకవియైనను శంభుదాసుని పద్యమునందలి మొదటిపాదము నూహించి వ్రాయఁగలఁడు. ఇట్టిరచన యెల్లూరునకుఁ గ్రొత్తగాదు.

చ. "సురుచిరపానపాత్రమున సుందరి యొక్క తె కేల నిండుచం
దురుఁడు ప్రకంపితాంగములతోఁ దిలకించె - - -" నృసింహపు. తృ. 97.
ఈపద్యములోని భావమునకు మెఱుఁగు పెట్టి పైపాదము నెల్లూర వ్రాసినాఁడు.

సోముని(పద్య)పాదముంగనుఁడు.

ఛాయావిగ్రహప్రదర్శినీ (బయోగ్రాఫ్)యంత్రప్రదర్శనమును గనినవారు, దానియొక్కొకరంగమును బ్రదర్శింపఁబడునప్పుడందలి విద్యుచ్ఛకల

బేఁజెత్తి కెరలు[1]గ్రీయూట తేటల చంద్రకాంతము ల్తాపప్రశాంతి చేసెఁ
జిమ్ముచీఁకటి పేరిచీఁడ యంతయు వీడి బ్రహ్మాండభూజంబు పల్లవించె
నడరె నగవాసచటులాట్టహాసవాస, నకరికరికాండకాండకేవలసఖములు
దీప్రకాంతిప్రసారితదిఙ్ముఖములు, జలజరిపుసింహానఖముల [2]తళుతళుకులు.

ఉ. శీతలవాతపోతముల చేతులు చూఁచుచుఁ గల్వలచ్చి కెం
తేతను పానహిల్లఁ దగుదీవెన లిచ్చుచుఁ బ్రత్యగారముం
బూతముగాఁగఁ బాదతలము ల్పచరించుచు జ్యోతిరాగమ
ఖ్యాతునిలీల శీతకిరణాకృతి ప్రౌఢిమచూపె నేర్పునన్. ౧౫౦

వ. అప్పుడు కకుప్పులం గుప్పలించుచుఁ దప్పుతారి యోలంబుల నణంగిన కాలాంధకారంబు దూరంబుగ వెడలించుచు నుడివోనిరతులం బతుల చేత [3]సదమదమైనమదవతీజనంబులకు ముదంబొదవించుచు నదీతటంబులఁ బుటపాకచటులం బగువియోగవేదనాజాతవేదంబున ఖేదంబునొందు విరహుల కతినిగ్రహాకారి యగుచు నగుమొగంబులం జిగిదొలంకు జీవంజీవంబులకుఁ జేవదెచ్చుచుఁ బచ్చవిల్తునకు నిచ్చకంబును గమ్మతెమ్మెరకు సమ్మతియును గలువకుం జలువయును గైరవంబులకు గౌరవంబును నమృతంబునకు సుముఖత్వంబును సమకొల్పుచు వెలఁదివెన్నెల మిన్నును న్నేలయుం గప్పి కర్పూరపరాగపర్వతంబు లేకీభవించి యుద్రేకించె నన విజృంభించె నత్తఱి మత్తకాశినీచిత్తంబులు సీధురసాస్వాదాయత్తంబు లయ్యెఁ దత్తత్పదార్థసార్థంబులు ప్రబలప్రసారితంబు లయ్యె నయ్యాతుధానుండు మానవతీసహితుండై బహువిధచమత్కారప్రకాశం బగునొక్కవివిక్తప్రదేశంబునందు నాసీనుం డగుటయు. ౧౫౧

గీ. పాటలప్రసూనపల్లవభంగళీ, తలము లైనసీధుధార లాని
శ్రీష్మతాపజనితఖేదంబు నదలించు, సతులఁజూచి విభుఁడు మతిఁజెలంగె.

క. జలరుహకర్ణికమీఁదటఁ, దల మగుపూఁదేనె కరణిఁ దరుణి యొకతె వె
గ్గలమగు మధుపూరము కర, తలమనుచషకమునఁ బట్టి ధవు మెప్పించెన్.

క. మును దా మానఁగ నొకచవి, వెనుక న్విభుఁ డానసాన వేఱొకచవి యా
వెనుక సఖులాని యిచ్చుట, వనితలకుం బెక్కుచవులు వారుణి యొసఁగున్.

చ. కొదలు మృదూక్తులు న్నవవిఘూర్ణితలోచనపంకజంబులుం
బదిలము లేని సిగ్గుమనుపట్లును దొట్రిలుచున్నయానము

[1] గ్రియ్యాట. [2] ధళుధళుకులు. [3] సదమదయైన.

ల్లదనునిఁ బ్రోదివెట్టు మదిమ్రబ్బును గుబ్బటిలంగఁ జంద్రమో
వదనలు పానకేళివిభవంబు లొనర్చిరి వారివారికిన్. ౧౫౫

సీ. ఇదె తేనె పెర చూడు మించుకచవి యంచు నధరబింబఫలంబు నానసిచ్చి
యిదె పుష్పకందుకం బెద నించుకొమ్మంచు నురుతరస్తనకుంభ మురము సేర్చి
యిదె మృణాలపుతల్లి పొదువు కంధరనంచుఁ గరకాండములచేత గళముఁ జుట్టి
యిదె కల్వరేకు నీవిందుచేఁ జెమటవోఁ జిమ్ముకొమ్మని గోరఁ జిరఁజేసి
నాథుఁ బోనీక యొకఁగి నానావికార, చాతురీధాతురీతిప్రసక్తవచన
రచనగల్పించెనొకలేమ ప్రచురపాన, వికృతినో కాకమోహప్రవేశమునసో.

గీ. చంద్రకాంతశకలచషకసంపూరిత, మధువుఁ గ్రోలఁగ్రోల విధుకరములఁ
బానపాత్రగరఁగుపరిపాటియెఱుఁగక, వెలఁదియొక తేనె వెదకెఁ దొడఁగ.

ఉ. నీలకనీనికావిజితనిర్జరనాయకరత్న యొక్కహాం
సాలసయాన సీధురస మానుచుఁ దత్ప్రతిబింబితాస్యప
ద్మాలఘుకాంతివాసనకునై పచరించిన కల్వరేకులం
చాలిక నవ్వఁగా వెఱఁజియాడెఁ దొడంగె నఖాగ్రధారలన్. ౧౫౭

సీ. పవనంబునకు నైనఁ బాయఁదట్టఁగరాని పయ్యెదకప్పులు బయలుపడియె
నధరపల్లవకాంతు లక్షిపద్మములందు వేడ్క నోయొక్కింత విశ్రమించె
మాటాడనేరని మార్గ్వంబు విడనాకి ప్రౌఢిమ తనుదానె గాఢమయ్యెఁ
బరమయోగికి నైన భావింపఁగారాని యానందసంపద యల్లుకొనియె [సియెఁ
మఱపుఘనమయ్యెఁ జేష్టల తెఱఁగువికృతి, గనియెఁ దొలుతటికోపమ్మోక్షిడికొచ
గాపిజాయనమదమత్తకరివరేణ్య, యానలకు నాథకీలితధ్యానలకును. ౧౫౮

వ. వెండియు నమ్మధుపానచేష్టాప్రకటనంబు కుకవికవిత్వంబునుంబోలె వికట
పదబంధవాక్యనైకల్యంబై యవివేకివితరణంబునుంబోలెఁ బాత్రాపాత్ర
వివేకదూరంబై నామజాలానభూమియుంబోలె బహుప్రకారమునచను
తాకరసరసంబై మందానిలుచంచనంబున నానావిధపరిమళసంక్రమణనివాస
యంబును గంధర్వలోకప్రకారంబున బంధురగాంధర్వసంధానగంధిలం
బును నుపవనంబునుంబోలె నుపవసంతసఖశిలీముఖముఖరితంబును నయ్యె
నయ్యెడ నయ్యాతుధానసూనుండు ప్రసూనపరంపరాపరికల్పితంబును
మరునకమందారపల్లవమాకందకిసలయవిసరవిరచితశయ్యాతలంబును గర్పూ
రదర్పసారకాశ్మీరవిస్మేరసౌరభగర్భితంబును నైనశయ్యాతలంబు నధిష్ఠించి.

సీ. పంచతంత్రంబులభావంబు లుబ్బించి యాలింగనంబుల నంటనలమి
సంస్కారముల షోడశస్థానములఁగల్గు కళ లొయ్యనొయ్యనె కరఁగఁజేసి
రాగంబు లెఱిఁగి సంయోగనీచాత్యుచ్చారతులఁగూడ కతుల్యరతులఁగూడి
చక్రధైనుకముఖ్యచతురబంధంబులపాండిత్య మంతయుఁ బరిఢవించి
భావికృష్ణుండు గోపాలపద్మముఖుల, రాసకేళికిఁ దార్చునుల్లాస మొసఁగ
నొక్కఁడయ్యును కోట్కంత్రయుపతిమణులఁ,బరవశలఁ జేసిసంతసపఱచె విభుఁడు. ౧౬౨

వ. అట్టిసమయంబున.

గీ. సతులతోఁగూడిరతిపరిశ్రాంతుఁడైన, ప్రాణనాథుసేవ దేర్పంగఁదలఁచెనొక్క
నపలతాన్తలతాంతగంధములుగొనుచుఁ,బొలిచెఁబ్రాభాతికానిలపోతకములు.

గీ. ఆసవాస్వాదనిర్భరం బైనసురత, సౌఖ్యమధునాథుచే యథేచ్ఛముగఁ గాంచి
వేగఁ గరువలి వీవన వీచుచుండ, నందె నిద్రామహానంద మతివపిండు. ౧౬౪

సీ. ఆకాశలక్ష్మినానాగ్రముక్తాఫలద్యోతంబు చూపెఁ బ్రభాతతార
యెండకాలమునాఁటియేటినీరునుబోలె డొంకి వెన్నెలయు నిఱ్ఱింకులింకెఁ
జలికంపమవఁ జరించు వెలిదామరయుఁబోలె సాధువైరిడాకన్ను మైలవడియె
ఱెక్కలువచ్చి తామెక్కడికేగెనో చుక్కలగమి విచ్చెఁ జూడఁజూడ
జలజకాసారతటభూజకలితనిజకు, లాయకూలంబులందుఁ గోలాహలంబు
చేసెబులుఁగులుజక్కవచింతవాసెఁ, దలఁగెఁగందర్పుఁడానిశాంతంబునందు.

ఉ. తూరుపు తెల్లనయ్యె హిమతుందిలమారుతలూనవృంతమై
జాఱెఁ దరుప్రసూనతతి [1]జారజవారము తట్టువారెఁ గ్రోం
కారముచేసెఁ గుక్కుటనికాయము కల్వలు గన్నుమూసె నం
ఘ్రిరుహ ముల్లసిల్లె నలిపోతము గీతముచేసె నల్లడన్. ౧౬౬

గీ. సమయఖనికుండు ప్రాగ్దిశాశైలతటము, త్రవ్వ నుద్భవ మైనకెందమ్మికెంపు
పట్టునయుఁబోలెఁజీఁకటికుత్రమన్నె, మూఁకవిప్పుచునుదయించెఁగాఁకవెల్గు.

క. త్రిజగజ్జనసేవితుఁ డం,బుజబాంధవుఁ డుదయమైన భూసురముఖ్యుల్
భజియించిరి పాతకములఁ,ద్యజియించిరి దివ్యనవ్యతేజోధికులై. ౧౬౮

వ. ఇట్లు సూర్యోదయం బైనయనంతరంబ యాధైర్యధుర్యుండు భార్యాశతం
బుఁ గృశోదరీసహస్రసేవితం బగుదాని నుచితప్రకారంబున నగరికిఁ బనిచి
ననిచిననిష్ఠాగరిష్ఠత్వంబున గ్రహకులశ్రేష్ఠు నారాధించి పురప్రవేశం బాచ
రించి విరించిసత్యలోకంబును వైకుంఠసంకు వైకుంఠంబును ద్రిలోచనుండు

[1] జాలజకారము.

కైలాసంబును బాలించుకైనడి జానడింపక నిజరాజ్యపరిపాలనం బూజ్యుండై యుండె నయ్యవసరంబున నొక్కనాఁడు సూచీముఖ శూర్పకర్ణ వృశ్చికరోమ వికటశంబర దీర్ఘజిహ్వ మహిషాదు లగుమానుషాదుల యాదేశంబునఁ గావ్యోపదిష్టనయప్రయోగనిపుణుం డగువామనుండు తనకావించు కపటోపాయంబునకు నవ్వేళ యనుకూలం బగుట యెఱింగి సింగంపుగద్దెయం బ్రొద్దుజరపుచున్న యన్నారాయణప్రియుం గూర్చి యిట్లనియె.

వామనుండు దనుదానవుండుకొల్వునకువచ్చుట.

చ. అవినయదూరి సర్వభువనాధిప ధీనిధు లెల్ల మెచ్చ ని
య్యవనితలంబు నీకరతలామలకంబుగఁ జేసి మించి శా
త్రవులను మిత్రుల న్సమపదంబున నిల్పితి విట్టివేరు పా
దివియు రసాతలస్థలము దిట్టడువారల కైనఁ గల్గునే. ౧౭౦

సీ. వృత్రాసురారాతి మిత్రత్వ మొనరింప ధనభర్త పరమబాంధవుఁడు గాఁగఁ
బానీయపతి సుహృద్భావంబు జరపంగ సఖుఁడై కృతాంతుండు సంతసిల్ల
మునువెల్లఁ జుట్టరికమున మించి తిరుగంగ నెనరువాఁడై భానుఁ డనుమతింప
వశుఁడై గురుండు సర్వంబుఁ బరీక్షింపఁ జంద్రుండు ప్రాణమై సవదరిల్ల
దివిజులకు నెల్ల మొదలైన దివిజుఁ డనఁగ,సద్గుణంబులయందు నాచారమహిమఁ
బ్రస్తుతింపంగఁ దొల్లింటి ప్రభువులట్లు,నాకితివి కీర్తి దానవచక్రవర్తి. ౧౭౧

మ. బలసౌభాగ్యవివేకవైభవములం బ్రఖ్యాతదానంబులం
గులవిద్యాగుణరూపశౌర్యమహిమం గోత్రావనస్థానని
శ్చలత న్నిత్యనయావిశేషముల నాచారప్రభావోన్నతిం
గలరే నీ కెన మూఁడులోకముల లోకఖ్యాతతేజోనిధీ. ౧౭౨

ఉ. మొన్నఁటివిన్నపాసఁగ నమోఘపరాక్రమునున్నతాంశునిన్
మున్నిటివారిమున్నులను ¹మ్ము[illegible]నయుండునక [illegible] మున్న నిరా
యుచ్చటి [illegible] నాఁటి [illegible] ము [illegible] బాంధవ[illegible]
సన్నుతిసేయు సద్గుణ[illegible] [illegible] [illegible]. ౧౭౩

గీ. నీవు పుట్టినయట్టి మునీంద్రవర్గ,పుట్టి నసగాదు దాక్షపు పట్టు[illegible]
గుప్తకార్యంబు గలదు వాక్రుచ్చి నొకటి,వినఁగవలె నేని వినుము వివేకనిపుణ.

క. కార్యాకార్యంబులు నిగ, నార్యులతోఁ దలఁపు సేయునట్టిమహాత్ముల్
[illegible]ర్యసమున్నతులయ్యును,శౌర్యమునం గలసి తేని సముదాత్తులఁగ. ౧౭౪

¹ మ్ముగ్లోనవచనము.

ఉ. పెద్దతీకంబునుం బ్రియము పెంపు వహింపఁగ రాజ్యమేలు మీ
పెద్దలు భక్తితోడ మముఁ బేర్కొని పిల్చి సమస్తకార్యముల్
తద్దయు నేము చెప్పినవిధంబున నాచరణంబుచేసి యా
గద్దలు శైనశాత్రవుల కండలుచెండి రుపాయచాతురిన్. ౧౭౬

క. అదిగావున మామాటలు, హృదయంబున కింపుచేసె నేసియు భక్తిం
బొదలుచుఁ దద్వృత్తాంతము, ముదలించెదఁ దేటతెల్లముగ సుగుణసిధీ. ౧౭౭

క. లోకాలోకనగేంద్ర, వ్యాకీర్ణప్రథితగుణలతానీక మహా
భీకరశాత్రవమదద, ర్వీకరవినతాతనూజ విభవబిడౌజా. ౧౭౮

శా. ఉల్లోకామలకోమలేతరకళానుష్ణచ్ఛవిష్ఫుం[1]వాః
కల్లోలస్ఫుట పుండరీకదివిషత్కల్లోలినీమల్లికా
వల్లీపల్లవఖడ్గఖండనశరద్వార్వాహసందోహసం
పల్లాలిత్యమిళద్యశోధవళిమభ్రాజద్దశాశాంతరా. ౧౭౯

మాలిని. శతధృతికులదీపా సత్యభాషాకలాపా
చతురనయధురీణా శౌర్యబాణారిబాణా
వితరణరవిపుత్త్రా విద్వదుద్యానచైత్రా
ప్రతిభటమదశిక్షా బంధురక్షాతిదక్షా. ౧౮౦

గద్యము. ఇది శ్రీహనుమత్కటాక్షలబ్ధవరప్రసాదసహజసారస్వత చంద్రనా
మాంక భారద్వాజసగోత్రపవిత్ర రామవిద్వన్మణికుమార రాష్ట్రఘంటావ
ధానపరమేశ్వర హరిభట్టారకప్రణీతం బైన శ్రీనరసింహపురాణోక్తంబు
నందు నుత్తరభాగంబునందుఁ బ్రహ్లాదగుణవర్ణనంబును ఋతుసమాగ
మంబును నతండు దైత్యకన్యకలం బరిగ్రహించుటయును వనవిహా
రంబును బురప్రవేశంబును ననంబరఁగు ద్వితీయాశ్వాసము.

[1]వాక్కల్లోలస్ఫుట.

౹౦రసు.

# నారసింహపురాణము

## ఉత్తరభాగము

సము.

క. శ్రీమందిర ధృతిమందర, భూమత్క్షేమాభిరామ పుణ్యతరమతీ
ధూమధ్వజభీమద్యుతి, ధామస్ఫుటహేతి రంగదండాధిపతీ. ౧

వ. ఆకర్ణింపు మట్లు శౌనకాదులకు రోమహర్షణుం డిట్లనియెఁ దనసూక్తంబులకు
ననురక్తుం డగుప్రహ్లాదుం గూర్చి వామనుండు, ౨

వామనుఁడు ప్రహ్లాదునకు నీతిం దెల్పుట.

క. జలమునఁ బుట్టిన జలజము, జలము విసర్జించినపుడె సమయువిధమునం
గులబలము విడిచి భూపతి, మలినుండగుఁ దేజ ముడుగు మఱుఁగున్ జరగున్

క. నీనెనరువార మిందఱు, మీనియతిని నిన్ను విడువ నెఱుఁగక శోకం
బేనియు ఫలమూలజలము, లేనియుఁ గొని నవయుచున్కి నీ వెఱుఁగవొకో.

క. ఇదె బుద్ధిమంతుఁ డయ్యెడి, నిదె శాస్త్రవిజయమునకు నేగెడి నీశం
డిదె మమ్ముఁ బ్రోచు నిజమని, యెదురెదురే చూచిచూచి యిటు గానఁబడెన్

క. కరనఖరలూనమగు విరి, పరికింపఁగ నెండిపోవుపగునడి మూలా
స్థిరబలము లేనిభూపతి, పరిభవముం బొందుఁ గాని ప్రబలుఁడు కాఁడన్. ౬

క. దాక్షిణ్యంబున మమ్ముఁ దయ, రక్షింపుము శత్రుపక్షగర్వవిగా క్షీ
వక్షీణాత్మప్రభుజా, శిక్షాయుత శత్రుపుంజ గిమ్ము కుమారా. ౭

క. తరతరమునాఁటి హితులు, న్నరపతి విననాడి యురక నమ్మి యితరులం
బరివారముగా నేలిన, విరివిగఁ గీడెల్ల గాంచు విజయశ్రీలన్. ౮

క. తనవారి మీఱి చేసిన, పని ఫలితముగాదు వంటివడ నిలిచిన భూ
మిని గద్దెకుండు నిశ్చయ, కిన దానం గను నె ఫలము కీర్తిపఁబోలా. ౯

క. తెగటార్పవలయుఁ బగఱం, దెగఁజూచితికి నిష్ఫు డూదితిట్టుఁ బోలెం
బగవాఁ డాక్రమించ సణఁగిన, మగవాఁడు న్నగుసయును సమానుల భీశా. ౧౦

చ. విమలమనస్కులై కపటవృత్తి మెఱుంగనివారితోడ స
త్యము నతిశౌచముం గలిగి ధర్మమెఱింగినవారితోడ ను
త్తము గుణవారితోడ సతతంబును మైత్రి యొనర్పు టొప్పుఁ జి
త్తము లోకకీర్తినైనవిమలప్రకరంబులఁ గూడు టొప్పునే. ౧౧

క. ప్రాణానిలముల కన్న, జ్ఞానము యధికంబు గాఁగ మదిఁ దలఁపని య
జ్ఞానికిఁ గీర్తులు గలవే, దానవకులనాథ మెత్తఁదన మిది తగునే. ౧౨

క. దనుజులకును ననిమిషులకు, నెనయవు డెందములు వైరహేతిమగర్వల్
మొనలెత్తియుండుఁ బాములకును మూషకములకుఁగల దెకూటమియొందున్.

చ ఘనతరదోర్బలోద్ధతి జగత్త్రితయంబును సంహరింప నో
పిన నినుఁ జూచి దేవతలు భీతి నణంగిరి గాక మేము నీ
పనులకు రోసి పోయి తగుపట్లన యుండితి మీని యెంటిగాఁ
డని నిను నేమి సేయుదురొ యారయుమా నయమార్గచాతురిన్. ౧౪

గీ. అన్నశేషమున్న నాఁకలి చెడిపోవు, రోగశేషమున్న రూపు దఱుఁగు
శత్త్రుశేషమున్న ధాత్రికి ముప్పగు, సిరులు విరియు ఋణము శేషమున్న.

క. అదిగావున శాత్త్రవుల, న్మోదలంటం దునుమ లేని మూఢాత్ములకుం
గదనజయము చేకూరునె, పొదలునె సత్కీర్తిలతలు పూఁగొమ్మలతోన్.

సీ. సంగ్రామముఖమహోత్సాహదోహలి యైన విబుధాధినాథుని వెన్ను చఱచి
మంజుఘోష తిలోత్తమయు నాదిగాఁగల సింధురయానలఁ జెఱలునట్టి
నందనవాటికానందప్రదము లైనయమరశాఖుల మొదలంట నఱకి
ముల్లోకములు గిట్టి ముప్పెట్టి గొని శత్త్రు వనుపేరు కలలోననైనఁ గనని
దితివధూగర్భశుక్తిమౌక్తికఫలంబు, కనకకశిపుండు తండ్రిగాఁ గలుగు నీవు
వినుతమర్దనశాలివై వెలయు జేని, పరిమళము బంగరువునకు దొరకినట్లు.

క. ముకలించి చంపనోపక, మదనగురుఁడు నీదుగురుని మానిసిమెకమై
విదళించె నట్టికుహనా, విదుని న్భజియించె దీవు వేల్పనుబుద్ధిన్. ౧౮

మ. కనకాక్షు న్వధియించెఁ బోత్రితనుఁడై కంబంబులోఁబుట్టి శా
తనఖాగ్రంబుల వ్రచ్చె నీజనకునిన్ దండించెఁ జెక్కంత్ర న
ద్దనుజశ్రేష్ఠుల నిష్ఠురాననరుచు ల్దర్పింప నీముందటన్
జనకద్వేషి భజించు టేలు గలఁడే సత్ప్రాణుఁడై యుండియున్. ౧౯

గీ. బలముఁ గులముఁ జలంబును గలఁడ వైన, సకలసౌభాగ్యసంపత్ప్రశస్తుఁ డైనఁ
బూనుకొనితండ్రిపగ యీఁగ లేనివాఁడు, మీసములతోడి యాఁడుదిమిహిరతేజ

అన్న- -మీరు బెంగఁగొని రోగముఁ బెంపక నిశ్చింతగా నుండుఁడు.

తమ్ము—రోగము నేను రమ్మనిన వచ్చినదా?

అన్న—బెంగరోగములు కొన్ని తెచ్చిపెట్టుకొనునవి కలవు.

తమ్ము—నేను రోగము వచ్చు నని యెన్నఁడును దలఁపలేదు.

అన్న—ఈవైద్యుఁడు పదిదినములనుండి చూచుచున్నను—

తమ్ము—నాగ్రహచారమున కెవ్వరు కర్తలు—వీనిచేత నెందఱో బ్రదికిరి. వీనిని మార్పకుఁడు. నాకుఁ గొంచె మాయాసముగ నున్నది. కొంచెము తాళి రండు. ఈకాగితము సావకాశముగఁ జదివికొనుఁడు. (ఇచ్చును.)

అన్న—మంచిది(అని కాగితముం బుచ్చుకొని లేచును.)

తమ్ము—(భార్యతో)నామాటలు వినుచున్నదానవా?

భార్య—వినుచున్నదానను. బావగారితో రెండుమాటలు—

తమ్ము—అన్నయ్యా! మీతో నేమో చెప్పునఁట.

అన్న—ఎంతవెఱ్ఱి! ఆహా చెప్పుమనుము.

భార్య—నాసాహసమునకు క్షమింపవలయును. బిడ్డలకై నేను జీవింపవలయును గాని ప్రాణములకై కాదు. మీరు మాబిడ్డలను బెంపుఁడు; ఏమైనం జేయుఁడు మీకర్పించితిని. పెంచితిరా దేవుఁడు మిమ్ముఁ బెంచును. నమస్కారము. నాకు సెలవిండు. (ప్రక్కకుఁ దిరుగును.)

భర్త—ఎక్కడికి? నేను గూడవత్తును. ఒంటిగాఁ బోకుము. రంగా! రంగా!

(సేవకుఁడు ప్రవేశించును.)

భర్త—రామా! బిడ్డలుభద్రము. అన్నా నమస్కారములు. (కన్నుమూఁత.)

సేవ—(చూచి) హా! యెంతపని జరగుచున్నది. ఒక్కయాము గియ్యక్కముందు. ధన మేమి సుగుణము లేమి యీయుపచెంతకుఁ బోలేదు.

(అని పోవుచున్నాఁడు.)

అన్న—హా! తమ్ముఁడా! అన్నదమ్ములను ద్వంద్వము నేకశేషము చేసితివా. నీబిడ్డలను నీవలెఁ గాపాడఁగలనా.

గీ. అమ్మ యేదని నాయన యాగపడఁ డని, యడుగు బిడ్డల కేమని నుడువువాఁడఁ
గడుపు తఱుగఁగ నేరీతిఁ గడపి పుచ్చి, మిమ్ము నుఱిపింపఁగలనొ నాతమ్ముగుఱ్ఱ.

(పోనిమ్ము అదృష్టసంగతులు)

ఉ. ప్రేమను బెంచి యీకరణి నీవఁడనాడ దొకళ్ళు లేఁబన
ప్లేమఱి యేని బంధుల సుహృత్తుల నాథుల బీవలం గడుగ

గోమున నేకరీతిగనుఁ గొంచును గోరిన దెల్ల నిచ్చుచుం
దామును దించు వచ్చి రది దైవము మెచ్చెను జాలు వీరికిన్.

ఏమిచ్చి యేమి తెచ్చెదను: హా తమ్ముఁడా. అగస్త్యభ్రాత ననిపించుకొని నీయూఁతనే బ్రదికితిని. ఇంకను నీయాధారమే నాకు. నిస్సహాయుఁడ నైతిని! నీ వున్నప్పటి ధైర్యము నాకుండదు గదా!

(పరిక్రమించి ప్రవేశించి)

పసిపాపల నాచేతఁ బెట్టి నాసోదరుఁడు సపత్నీకుఁడై కాలవశము నొందెను. (ఆలోచించి) శ్రీరంగనీతులు గావు. నిజముగా మనుజుఁడు—

మ. తనతో నేమియుఁ దేఁడు వచ్చునెడఁ జేతం గొంచుఁబోఁ డేగుచోఁ
దనయున్నంతకు నాది నాది యని యాస్తం జేర్ప నూహించు నే
నును బొల్లాడితి నూనె రాచికొని యంటు సొంటు లే దాతఁడీ
ధన మెట్లార్జనచేసె నచ్చెరు వగున్ దైవంబు దా ముఖ్యమా.

ఎద్దులపైఁ బెటికించుకొని పోఁదగినంత ధనమున్న నాతమ్ముఁడు ముప్పొద్దు దినియెను. ఆపూఁట కాపూఁటవారము నేనును నాబిడ్డలు నీడ్చుకొని వచ్చుచున్నాము.

గీ. తండ్రి యొసఁగెను నాకును దమ్మునకును, దన గడించినధనము నర్థ మొనరించి
కడలిపొంగుగఁ బెరిఁగెను గాలుఁ జేయి, వచ్చి తమ్మునిసొమ్ము నాసొమ్ము వోయె.

గుణము లేక చెడెదరా కూడు లేక చెడెదరా. ఆతఁడు నన్న న్యాయము చేయలేదు. నే నాతని జెఱుపఁ దలఁపలేదు.

ఉ. ఉండినవాఁడు మెక్కినను నూరక లేనియతండు పస్తుగాఁ
బండినఁ గాల మాఁగదు స్వభావమునం గమనించు విత్తవం
తుండయి తమ్ముఁ డుండె నొ గతుండనొ నిర్ధనుఁడైన నేను దా
నుండును మాట యొక్కటి జనోత్కరదూషణభూషణార్హమై.

ఇపు డొకకష్టమువచ్చినది. నరములేనినాలుక నలుగురు నాలుగు తెన్నులవారు.

గీ. కూఁతు పెండ్లికి నల్లునకును గొమార్త, చేతికిని సారెచీర కిచ్చెను విభాగ
మొనరఁగొడుకున కెల్లయునొసఁగెఁ బెంచు, దానికిని జెప్పె నాకు సార్థక్య మింత.

దీన నేను లోభగుణము చూఁపుట కవసరము లేదు. ఏమో డబ్బు పాపిష్ఠిది. తొల్లింటి చరిత్రము వినమా.

గీ. భోజునిగుఱించి ముంజుని బుద్ధినిన మె,ధనము గుణమును మరలించు ధర్మమార్గ
మన్న నేమనియడిగించు నహహాధనమ,జగమునం దెన్నివిధములసంచరింతు.

నే నీధనముం గాపాడుట యొకయెత్తు. బిడ్డలం బెంచుట యొకయెత్తు. లోకాపవాదము రాకుండ మంచిగంధమునం దొకకాలు నగ్నిహోత్రమునం దొకకాలును బెట్టి చరించుట యొకయెత్తును గా నుండును. నాముందఱలు పలికిన సాహసవాక్యములు! ఓ సనితాముండ!

ఉ. ఎన్నఁడు నీవు నాయెదుట నింపుక పల్కవు కౌసిగారికి
న్నన్నస చూపుదాన నతిమాత్రముగా నిది యేమి యంత్యమం
దిన్నిఱి మర్మభేద లగు నే బళి నీవచనంబు లీశ్వరుం
డెన్నఁడె నీనిసుంగులకు నే నొకపాపము చేయఁ బూనిన౯.

బాగుచేసినను బాడుచేసినను నేన కదా యింక—లోకమునకు భయంప డని క్రూరుఁ డుండునా! అడుగడునకు ధర్మసందేహములతో మరణిం చిన యోదంపతులారా! ఇపుడు చూడుఁడు మీసంతానమును,

చ. చదువను వ్రాయనుం గఱచి సద్గుణముల్ సదసద్వివేకముం
జదురుఁదనంబు గౌరవము శాంతము గాంచను లేనివారికిం
గుదురదు కల్గియుం జదువుకోఁ దగదో యిది పల్లెటూరు చి
క్కదు తగుపాఠశాల యు నొకండును జక్కని యొజ్జయిచ్చట౯.

(దీని కుపాయ మాలోచింపవలయును.)

(పరిక్రమించి యిరువురు బిడ్డలతో నచ్చి)

ఈపదనున మిన్నకున్నఁ జన్నవాండ్రు చెడుదురు. వీరిని రాజమహేంద్రమునఁ బెట్టి చదివింపఁ దలఁచితిని. అక్కడఁ బలువురు బంధుగులు విద్యాసంస్థలు పండితులు పాఠశాలలు పుస్తకకూటములు గలవు. ఇవియంతయు నాభార్యకు నచ్చదు.

క. పాపము! వీరల విన్నవిగ, నోపక నచియించె నెన్నియో ప్రత్యుక్త
వ్యాపృతము లైనవాక్కులు, కోపించె౯ బుజ్జగించెఁ గొంపోకుండ౯.

ముద్దుచే విడువనోప మేని మనముద్దుబిడ్డలవలెనే వీరును జెడెదరు. ఉపపత్తియున్నపుడు నూరుపండ్ల నేల యని నచ్చఁ జెప్పితిని. ఈపాపల కేమి తెలియును. తల్లివల దనిన వల దసిరి. నేను జదివింతు ననినఁ జదువ నొల్ల మనిరి. (బిడ్డలంగాంచి) నాయనా! రంగా! రాముఁ డేఁడి?

రాము—(వచ్చి) ఇదిగో సిద్ధము.

రంగ—పెద్దనాయన! నన్ను రాముఁ డెత్తుకొనును.

తండ్రి—చెల్లెలిని నే నెత్తుకొందును. రంగనాయకి రావమ్మ!

బాలిక—(చంక నెక్కును.)

రాము—(రంగని నెత్తుకొని నడచును.)

రంగనా—పెద్దనాయన! ఇన్నిచె ట్లెందుకు?

తండ్రి—(నడచుచు) అమ్మా! ఇదియే యడవి. ఎక్కువచె ట్లున్నదే యడవి

రంగ—అనఁగా ననఁగా నొకయడవి—అని చెప్పినావే కథ.

తండ్రి—ఆఁ. అదియే యిది.

రంగనా—ఇం దెవ్వరున్నారు. చదువులబడి—

తండ్రి—ఇందు మనుష్యు లుండరు. పెద్దపులులు—

రాము—ఈయడవి నడ్డుపడి మనము మామయ్యగారి యూరికి వెళ్లెదము.

రంగ—పెద్దయ్య! పెద్దయ్య! పెద్దపులి యేమిచేయును?

తండ్రి—ఆవులను మేఁకలను బట్టిచంపును.

రంగనా—అన్నయ్యా! చూచినావా.

రంగ—చెల్లీ! పెద్దపులిని జూచినావా.

రంగనా—బొమ్మచూచితిని. గొల్లపిల్లవాని నెత్తుకొనిపోవుచున్నది.

రంగ—పెద్దనాయన! పులి యావునుమేఁకను జంపక గొల్లపిల్లవానిని జంపెనే.

తండ్రి—ఏదో కథలో నట్లు చెప్పినారు.

రంగ—మనము భయపడకుండఁ జూడవచ్చునా?

రంగనా—పెద్దయ్య! నాకుఁ బెద్దపులిని జూపింపవా.

తండ్రి—పోనుబోను గనఁబడును జూపెదను.

రంగ—ఇంక నెంతదూర మున్నదిబడి.

తండ్రి—ఇదిగో వచ్చినాము. ఎండతీక్ష్ణముగా నున్నఁ రామా! ఇక్కడఁ జెట్టుక్రిందఁ గొంతసేపు కూర్చుందము.

రాము—అటే కానిండు.

(అందఱును గూర్చుందురు)

తండ్రి—రామా! నాకు నిద్రవచ్చుచున్నది. నిన్న మొన్న రాత్రులు పెద్ద యోజనలతో నిద్ర పట్టలేదు. బిడ్డలను జూచుకొము.

రాము—పండుకొనుఁడు. వీరినిగూడ నిద్రపుచ్చెదను.

తండ్రి—(ప్రక్కవైచికొని నిద్రించును.)

రాము—అమ్మా! నీవు పెద్దయ్యగారియొద్దఁ బండుకొనుము. ఎండ వేఁడికి నీమొగము నిద్రకు వచ్చినది. (పండుకొనఁబెట్టి జోకొట్టును.)

రంగ— నేను నీబట్టపఱచుకొని పండుకొందును.

రాము—అట్లే పఱచుకొమ్ము. (అనిపఱచి పరుండఁబెట్టెను.) (తనలో) ఈ ఘోరవనముదారి నేలరావలయును. బండ్లులేవా యేల నడపించుకొని పోవలయును. గుఱ్ఱక్కాఁడు మంచినీళ్లు తెచ్చినాఁడా! చెంబు దెత్తునా యనిన దారిపొడుగున గుంటలే యనియెను. రెండురొట్టెలు చేతఁబట్టుకొందునా యనిన నెక్కడఁజూచినఁ బ్రతివృక్షమునఁ బండ్లే యనియెను. ఏమి తలంచి నాఁడో యెఱుఁగరాదు.

తండ్రి—(గుఱక వెట్టి పలవరింతలుగా) నాతమ్ముఁడు వ్రాసిన కాగితములో నొక్కముక్కయున్నది. పెద్దవారు కాకుండ నాబిడ్డలు మరణించిన యెడల సర్వధనము నీకే చెందునని.

రాము—(విని) ఔర! వీనితలంపు.

తండ్రి—ఈతొడుసు విడుచుట యెట్లు.

రాము—(విని) తొడుసేమి, విడుచుట యేమి, నేనే యీతనికిఁ దోఁచునుగాఁ దోఁచి యుండవచ్చును. ఆహా; దురవస్థ యెట్లు వెలువడుచున్నవి!

తండ్రి—వీనిని గాని వీరిని గాని చీఁకటిగుహలోఁ బడద్రోచి—

రాము—(విని) చంపివేయరాదా.

తండ్రి—రాముని దీసికొనివచ్చుట పొరపాటు.

రాము—నే నిపుడే తప్పుకొందును.

తండ్రి—అన్నిశ్రీరంగసేతులు చెప్పిన నే నేను తలంచుచున్నాఁడను. ధనాశ పట్టిన రాముఁడు చెప్పినట్లు వినఁడా.

రాము—నేనా! కుడిచినయింటికేఁ గ్రంగు దెచ్చెదనా.

తండ్రి—(గుఱ్ఱు వెట్టుచున్నాఁడు.)

రాము—నే నిపుడు తప్పుకొనవలసినదే—మఱియీపిల్లలగతి. ఈదుర్మార్గుఁడు లేనకమున్నె వీరి నెక్కడికైనఁ గొంపోయిన—

రంగనా—నాకు బొబ్బ కావలయును (నిద్ర, లోఁ బలవరించును.)

రాము—ఇది గట్టిచిక్కే! నీటికై యెక్కడికిఁ బోదును.

రంగ—(నిద్రలో) అదిగోఁ బెద్దపులి.

రాము—ఏమియు లేదు పండుకొనుండు.

తండ్రి—(నిద్రలో) నేను లేచి రాముని బందుకొమ్మని వానితలపై బండ యెత్తి వైచెదను.

రాము—దుష్టుఁడా నాకు నిద్రపట్టునా. పదునాల్గేం డ్లయినను లక్ష్మణస్వామివలె.

(అడవిలో నొకయల్లరి)

రాము—(విని ఓహో! ఇది యేమొకవిపత్తు—ఏమి చేయుదును. ఏమైనను మంచిదే-(అని మెల్లఁగ) నాయన రంగ! లెమ్ము: నీకొకమాట చెప్పెదను.

రంగ—(లేచుచున్నాఁడు)

రాము—(రంగనాయకిని లేపును)

రంగనా—(లేచి) యేమి చిత్రము చూపించెదవు.

రాము—మన మీచెట్టుమీఁద నెక్కి చిత్రము చూతము. క్రిందఁ జీమ లున్నవి. పెద్దపులులు వచ్చును.

(అని యిరువురను జెట్టెక్కించును.)

తండ్రి—(గుఱ్ఱు వెట్టుచున్నాఁడు)

రాము—ఈతని గూడ లేపుదునా? వలదు. ఇట్లే యుండనిమ్ము. అడవిలోఁ గలకల మెక్కుడు గా నున్నది. నేనును జెట్టెక్కి బిడ్డలను గట్టిగాఁ బట్టుకొందును. (అనియట్లుచేయును) (ఒక్క తుపాకిధ్వని వినఁబడును)

రంగనా—రామా! ఇదియేనా చిత్రము.

రంగ—రామా! నాకు భయముగా నున్నది.

రంగనా—పెద్దపులి వచ్చును. భయపడకురా అన్నయ్య.

రంగ—నాకుభయము. పెద్దనాయన లేవలేదు.

రంగనా—పెద్దమనుష్యులను గఱవదు.

రంగ—ఏమిటి పులి యేది?

(అంతలో గాండ్రుమనుచు నొక్కపులి వచ్చి నిద్రించువానిగొంతు క్రొల్లఱచితానును వానియొద్దఁ బడును.)

రంగనా— రామా! ఇదియేనా చిత్రము.

రంగ—ఇదియా చాఱలమెకము. నాకుభయము.

రంగనా—పెద్దయ్య చెప్పినాఁడు—మనుష్యులను గఱవదు. భయపడవలదు.

రాము—బాబు! భయము లేదు. పులి చచ్చినది. (తనలో) వీనిపాలిటికి—వీని యూహాలకు వెంటనే ఫలముగదా.

(మనుష్యులధ్వని వినవచ్చును.)

రాము—ఏటువడి పాఱివచ్చిన యీపులిజాడలు దీయుచున్న యెవ్వరో వేఁట కాండ్రు వచ్చుచున్నారు గాఁబోలును. (అని చెట్టుదిగును)

(ఒకరాజును గొందఱును బ్రవేశింతురు.)

రాము—(ఎదురేగి మ్రొక్కును.)

రాజు—(చూచి) కిరాతార్జునీయము జరుగునా యేమి. నేను గొట్టినపులిని నీవెట్లు పట్టుకొంటివి.

రాము—మహారాజు! నేనుగాదు. మీదెబ్బకే వచ్చి యిక్కడఁబడి చచ్చెను.

రాజు—నీవృత్తాంత మేమి. ఈచచ్చినవాఁడు నీ కేమికావలయును.

రాము—మహారాజా!

ఉ. మీపరిపాలనంబున సమిత్రవిభూతి బృహత్పురంబు దా
పున నొకపల్లె విదితంబగుఁ గృష్ణసరస్సునాఁగ నీ
పాపలు దానిలోన ధన పాలుని సంతతి వీరిరక్షకై
యోపిచరింతు నేను బృథులోగ్రవనంబున నప్రమాదినై.

రాజు—ఈయుగ్రవనములోనికి రానేల?

రాము—మహారాజ!

మ. ధనపాలుండు సతీసమేతముగ మ ర్త్యం బుజ్జగించెం దదా
జ్ఞను సంరక్షకుఁ డయ్యె నన్న యితఁ డా సంసారికిం జెప్పి పె
ట్టెను గృత్యంబులు వ్రాఁతమూలమున ముట్టెం గొంతద్రవ్యంబు నే
మనువాఁడ౯ గతబుద్ధి తెచ్చె మము న న్యాయంబుగా భూమిపా.

రాజు—నా కర్థమగునట్లు చెప్పుము.

రాము—ఇది విషమసంధి ప్రకాశముచేయరాదు(అనిమెల్లఁగ) ఇదికారణము.

రాజు—(విని)దైన మెక్కడ లేదు! మంచిది! నీవు వీరని మాతోఁ గొనిరమ్ము. నేను దద్గ్రామాధికారికి నిజవృత్తాంతము వ్రాయించి నీతోఁ బంపించెదను. ఈపాపలను గాపాడుటకై తగినపాలకసంఘమును నిర్ణయించెదను.

రాము—మహారాజ! నాకంతే కావలసినది.

(బిడ్డలను జెట్టునుండి దింపి)ఈసార్వభౌమునకు మ్రొక్కుఁడు (అని మ్రొక్కించును.)

రాజు—(దగ్గఱదీసి చేతఁదట్టును.)

రాము—రండు మనము పోదము.

రంగనా—పెద్దయ్యను లేపుము.

రాము—నిద్ర మేల్కని తానే వచ్చును. మఁ మీప్రభువుగారితోఁ బోవుదము.

రంగ—మమ్మిద్దఱను నీ వొక్కడవే యెత్తుకొందువా.

రాము—ప్రభువుగారిగుఱ్ఱపుబండి యున్నది.

రంగ—చెల్లీ! రా. గుఱ్ఱపుబండి యెక్కుదము

రాము—అజ్ఞానమా! నీవంటిది లేదు. ఈబిడ్డ లేమి చెప్పిన నది నిజ మని నమ్ము నట్లు చేయుచున్నావు. ఓభగవంతుఁడా! గంపెఁడుకన్ను వెట్టుకొని చూడకుండ నీ వూరకుంటివేని ప్రపంచము గతి యే మగును.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

ఇది ప్రభుసందర్శన మనుద్వితీయరంగము.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు.

## రుధిరోద్గారిసంవత్సరము ౧౨-వ సంపుటము.

## విషయసూచిక.

# పరిషత్తా[illegible]
# గ్రంథములు.

1. విప్రనారాయణచరిత్రము—చదలువాడ మల్లయకవి - -
2. జైమినిభారతము—(వచనము) సముఖము వేంకటకృష్ణప్పనాయఁకుఁడు - - - - - - - - - 0 12
3. కవిజనాశ్రయము—వేములవాడ భీమకవి - - - - - 0 10
4. చంపూరామాయణము—ఋగ్వేదికవి వేంకటాచలపతికవి - 1 0
5. నీతిసీసపద్యశతకము—తాళ్లపాక పెదతిరుమలాచార్యుఁడు - - 0 2
6. జ్యోతిశ్శాస్త్రసారము—శ్రీమాన్ కపిస్థలము కృష్ణమాచార్యులుగారు బి. ఏ, యల్. టి. - - - - - - - 0 8
7. జ్ఞానప్రసూనాంబికాశతకము—శిష్టుసర్వశాస్త్రికవి- - - - 0 2
8. సర్వేశ్వరశతకము—యథావాక్కుల అన్నమయ్యగారు - 0 3
9. యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము—జ. రామయ్యపంతులు గారు బి ఏ, బి. ఎల్. - - - - - - - - 0 8
10. కావ్యాలంకారచూడామణి - విన్నకోట పెద్దయకవి - - 0 8
11. చంద్రభానుచరిత్రము—తరిగొప్పుల మల్లనకవి - - - 1 0
12. అకారాద్యముద్రిత గ్రంథసూచిక - - - - - - - - 0 8
13. ప్రా [illegible] ·ంమాన్ మేడేపలి వేంకటరమణాచార్యులుగారు - - - - - - - - - - - 0 12
14. శివతత్త్వసారము-మల్లికార్జున పండితారాధ్యులు - - - 0 12
15. Defence of literary Telugu జయంతి రామయ్యపంతులు గారు బి. ఏ, బి. ఎల్. - - - - - - - - - - 0 8
16. శివరాత్రిమాహాత్మ్యము—శ్రీనాధమహాకవి - - - - - 0 12
17. ఆర్యభాషావిభాగము--శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు - - - - - - - - - - - 0 8
18. దాక్షిణాత్యాంధ్రులు--అక్కిరాజు ఉమాకాంతముగారు - 0 4

ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రికకు చందా సం॥ కు - - - 3 0

కావలసినవారు:-

ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శిగారికి చెన్నపురి వ్రాయవలయును.

# ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటితగ్రంథములు.

## (1) విప్రనారాయణచరిత్రము.

పన్నిద్దఱాళ్వారులలోఁ జేరిన తొండరడిప్పొడియాళ్వారు చరిత్రము. కవిత్రయములోని యెఱ్ఱాప్రెగడ చిన్నినమనుమఁడగు చదలువాడ మల్లయకవిచే రచియింపఁబడిన యపూర్వగ్రంథము. సర్వవిధముల నుత్తమప్రబంధములలో గణింపఁదగినది. వైజయంతీవిలాసముకంటె మిన్న. ౪ ఆశ్వాసములు. ౪౮ పుటలు. సవిమర్శనమైన ౧౮ పుటలపీఠిక. వెల, రూ. ౦-౮-౦.

## (2) జైమినిభారతము (ఆంధ్రవచనము)

రెండువందల సంవత్సరములక్రిందట మధురాపురాధీశ్వరుం డగువిజయరంగ చొక్కనాథుని యాస్థానకవియు, సామాజికుండు నయిన సముఖము వేంకటకృష్ణప్ప నాయఁకునిచే రచింపఁబడినది. భాష సలక్షణము. శైలి మనోహరము. ధార యనర్గళము. అంపజను ముఖ్యముగాఁ జదువవలసినది. ౩౫౮ పుటలు. ఆంధ్రమునను, ఇంగ్లీషునను పీఠికలు గలవు. వెల, రూ. ౦-౧౨-౦.

1917-18 సం॥ ఇంటరుమిడియేటుపరీక్షకుఁ బఠనీయగ్రంథము.

## (3) కవిజనాశ్రయము.

వేములవాడ భీమకవిరచిత మగుఛందశ్శాస్త్రము. ఆంధ్రచ్ఛందోగ్రంథములలో మిక్కిలి పురాతనము. అనేక లిఖితపుస్తక పరిశోధనపూర్వకముగా మూలపాఠము నిర్ణయింపఁబడినది. పాఠభేదములు పుటలయడుగునఁ జూపఁబడినవి. సంస్కృతకర్ణాటాంధ్రఛందస్సుల భేదాభేదము లచటచటఁ బ్రదర్శింపఁబడినవి. కవినిర్ణయము, కాలనిర్ణయము, ఛందస్స్వరూపము మొదలగు విషయము లనేకములుగల విపులమయినపీఠికయు, విషయసూచికయు, ననుక్రమణికయుఁ గలవు. విద్యార్థులకును బండితులకును గూడ నుపయోగకరము. వెల, రూ. ౦-౧౦-౦.

## (4) యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము.

మ-రా-రా-శ్రీ జయంతి రామయ్యపంతులు బి. ఏ. బి. ఎల్. గారిచే రచియింపఁబడిన సవిమర్శ పీఠికాపూర్వకముగాఁ బ్రకటింపఁబడినది. ఈశాసన మాంధ్రపద్యాత్మకము. నన్నయభట్టారకుని కాలముకంటె ముందుఁ బుట్టినది. ఆంధ్రభాషాస్వరూపము తెలియఁగోరువారల కత్యంతోపయోగకరము. 1917-1918 సంవత్సరములు బి. ఏ. పరీక్షకుఁ బఠనీయగ్రంథముగా నిర్ణయింపఁబడినది. వెల, రూ. ౦-౮-౦.

## (5) నీతిసీసపద్యశతకము.

తాళ్లపాక పెదతిరుమలార్య విరచితము. శ్రీవేంకటేశ్వరుల కంకితము. వెల, రూ. ౦-౨-౯.

## (6) జ్యోతిశ్శాస్త్రసారము.

వచనము. శ్రీమాన్ కపిస్థలము కృష్ణమాచార్యులు బి.ఏ. ఎల్.టి. గారిచే రచియింపఁబడినది. ఖగోళవిషయముఁ దెలిసికొనఁ గోరువారి కిది యత్యంతోపకారకము. వెల, రూ. ౦-౮-౦.

## (7) A Defence of Literary Telugu, by J. Ramayya Pantulu Garu 0-8-0.

## (8) జ్ఞానప్రసూనాంబికాశతకము.

శ్రీకాళహస్తీశ్వరుని దేవియగు జ్ఞానప్రసూనాంబను స్తుతించుచు శిష్టు సర్వశాస్త్రి రచియించిన భక్తిరసప్రధానమైన పద్యశతకము. అనర్గళకవితాధార గలది. వెల, రూ. ౦-౨-౦.

## (9) సర్వేశ్వరశతకము.

యథావాక్కుల అన్నమయ్యగారిది. వెల, ౦-౩-౦.

Printed at the British Model Press, Choolai and published at the Telugu Academy Office, 39, Harris Road, Pudupet Madras.